# మదర్ థెరెసా

ఆంగ్లమూలం:

**నవీన్ చావ్లా**

తెలుగు సేత:

**ఆర్వియార్**




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# కృతజ్ఞతలు

మదర్ థెరెసా ఆశీస్సులు లేనట్లయితే నేనీ గ్రంథ రచన తలపెట్టి వుండేవాణ్ణి కాదు. దీన్ని రాయడానికి పరిశోధించడానికి పట్టిన అయిదేళ్ళూ ఆవిడ నాకు తోడ్పాటునీ విశ్వాసాన్నీ అందించారు. అసంఖ్యాకమైన ప్రశ్నలకు జవాబు లిచ్చారు. నేనెప్పుడు కావాలన్నా తీరిక చేసుకునేవారు, మా అభిప్రాయాలు సర్వదా ఏకీభావంతో వుండకపోయినా, యీ అనుభవం వల్ల నాకు చాలా మేలు జరిగింది. యిది యీ పుస్తకం పుటల మధ్య పరిపూర్తి చెందినందుకు ఓ రకంగా బాధగా వుంది. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సిస్టర్లకీ, బ్రదర్లకీ పేర్లు ప్రస్తావించడం యిష్టం వుండదు. నేను పేర్లు ప్రస్తావించకూడదని చాలామంది మరీ మరీ చెప్పారు. నేను వాళ్ళ అభిప్రాయాలని మన్నించాను. సందర్భానికి ముఖ్యం అనుకున్న వాళ్ళు తప్ప. ఫాదర్ వాన్ ఎగ్జిమ్‌కి యెంతో రుణపడివున్నాను. ఆయన సహకారం అమూల్యమైంది. ఎంతోమంది మిత్రులకి నేను రుణపడి వున్నాను. వాళ్లు ఎన్నో రకాలుగా నాకు సాయం చేశారు. దానివల్ల యీ పుస్తకం వన్నె తెచ్చుకుంది అని అనుకుంటున్నాను. ఢిల్లీలో తేజేశ్వర్ సింగ్, సింగపూర్‌లో డా. క్లైవ్ వింగ్ చాలా ఓపిక చూపించి సాయపడ్డారు. మా కుటుంబ సభ్యులకు ముఖ్యంగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. మా ఆవిడ రూపిక మొదటి రాతప్రతిని "తీర్చిదిద్దింది", తన భావాలు అందించి సాయపడింది. ఇక మా అమ్మాయిలు రుక్మిణి, మృణాళిని నిరంతరం ఆలోచనలు రేకెత్తించే ప్రశ్నలతో నన్ను ముందుకుతోశారు. మా మామయ్య డా. శివగాంధి నాకు దివ్యమైన చెయ్యి ఆసరా. అంతేకాదు ఫోటోలని ఎంపిక చెయ్యడంలో సాయపడ్డారు. మా మేనల్లుడు అర్జున్ సూటా టేపుల్ని చాలా శ్రమకోర్చి లిపి చేశాడు. మా దగ్గరి బంధువు మీనాక్షి, ఆవిడ భర్త లియానత్ అహ్మద్ లండన్ నుంచి నా యీ పరిశోధనకు తమవంతు సహకారం అందించారు. చివరగా యితర మిత్రులకీ శ్రేయోభిలాషులకీ తగు సాయం అందించినందుకు అకారాదిక్రమం కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. డా॥ పి.సి. అలెగ్జాండర్, మహారాష్ట్ర గవర్నర్, మంజిత్ బావా, జయాచాలిహా, డా. చరత్‌రామ్, ఆడ్రియన్ డెక్కర్, జాక్వెలిన్ డి డెక్కర్ దంపతులు, మౌడ్ ఫ్రాంకెన్ స్పెన్స్, గోపాల్‌గాంధి, లేడీ మోర్వెన్నా గుడాల్, బన్నీగుప్తా, పశ్చిమబెంగాల్ మాజీ గవర్నర్ కీ.శే. ప్రొఫెసర్ నూరుల్‌హసన్, ఓ.పి. జైన్, సునీతా, నరేష్‌కుమార్, సర్ మైఖేల్, లేడీ మార్షల్, అమిత మిట్టర్, సునీల్‌సేథీ, చాందా అవినిందర్‌సింగ్, డా. కరణ్‌సింగ్, డా. పర్విందర్ సింగ్, డా. అనిల్‌విల్సన్. కొన్ని అంశాల గురించి అవసరం అయిన వివరాలు చర్చించడానికి శ్రీమతి సోనియాగాంధీ తీరికచేసుకుని నాకు సమయం

కేటాయించారు. ఆవిడకు నా కృతజ్ఞతలు. ఫోటోలు వీరి సౌజన్యంతో నాకు అందాయి: రఘురాయ్, ఎస్. తరఫ్‌దార్ అండ్ అసోసియేట్స్, ఇ.ఎమ్.ఆర్.సి. చిత్రవాణి, సినీ ఇండియా ఇంటర్నేషనల్ అమర్‌జీత్. రఘురాయ్ తీసిన మదర్ థెరెసా ఫోటోలు సున్నితత్వానికి ప్రసిద్ధి చెందాయి. వాటిని మొదటిసారిగా వాడుకుందుకు అనుమతించిన ఆయన ఔదార్యం గొప్పది. అరుదైన ఫోటోలు కొన్నింటిని మదర్ థెరెసాయే స్వయంగా నాకు అందించారు. జాక్వెలిన్ డి డెక్కర్, మైఖేల్ గోమ్స్, బ్రదర్ మరియాదాస్ ప్రభృతులు కూడా అందించారు. వలసల విజయన్, సురేంద్రకుమార్‌లు వాళ్ళ తీరిక సమయంలో అభిమానంగా టైప్ చేసి పెట్టారు. అలాగే న్యూఢిల్లీ ఇండియా ఇంటర్నేషనల్ సెంటర్ లైబ్రేరియన్, సిబ్బంది నాకు యెన్నో సౌకర్యాలు కలిగించారు. ఆది నుంచీ నేను వాటిని వినియోగించుకున్నాను. అంచేత వీళ్లందరికీ నేను కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

నవీన్ చావ్లా

Dear Navin,

All you do, all you write do it all for the Glory of God and the good of all People.

Let your book be Love for God in action.

God bless you

M. Teresa MC

24-2-91



1992 లో మంజీత్ బావా గీసిన చిత్రం
మదర్ థెరెసా చేతులు

# ఉపోద్ఘాతం

పదిహేడు సంవత్సరాలనాడు ఢిల్లీ "నిర్మల్ హృదయ్" లో జరిగిన ఒక ఉత్సవంలో మొదటిసారి మదర్ థెరెసాని కలుసుకున్నాను. వృద్ధుల పునరావాస కేంద్రాన్ని ప్రారంభించవలసిందిగా ఆవిడ ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ని ఆహ్వానించేరు. అక్కడ రెండుగదుల్లో చిన్న పరిశ్రమగా హాస్పిటళ్లకి పనికివచ్చే దుప్పట్లు, బేండేజీలు లాంటి వాటిని తయారు చేస్తారు. నగరపాలకసంస్థ అనుమతి వుంటే ఢిల్లీ హాస్పిటళ్లు వాటిని కొంటాయి. దానివల్ల అక్కడ పనిచేసే ఓ డజను మంది వృద్ధులకు ఉపాధి లభిస్తుంది. అదీ ఆవిడ ఆశ. సాధారణంగా యిలాంటి ఉత్సవాలకు నేను వెళ్లను. కాని మదర్ థెరెసాను కలుసుకోవాలని నాకు కుతూహలం. అందుకని నేనూ వెళ్లాను.

అలాంటి సందర్భాల్లో లెఫ్టినెంట్ గవర్నర్ కోసం ఉపన్యాసాలు తయారు చెయ్యడం నా అధికార విధుల్లో భాగం. కాని అక్కడి పునరావాస కేంద్రాన్ని, నిరాధారులైన వృద్ధుల ఆశ్రమాన్ని చూశాం. ఆ వృద్ధులు మంచాల మీద కూర్చునే యెంత ఆర్ద్రంగా ఉత్సాహంగా మాకు నమస్కారాలు పెట్టేరో అది చూశాక గవర్నరు ఆ ప్రసంగ వ్యాసాన్ని జేబులోనుంచి తియ్యకపోవడం మంచిదనే అనిపించింది.

ఏమంటే తయారుచేసుకున్న ప్రసంగపాఠాలకు అది సందర్భంకాదు. మదర్ థెరెసా సరళమైన విషయాలగురించి మాట్లాడేరు: ప్రేమగురించి, సంరక్షణగురించి, కష్టసుఖాలు పంచుకోవడంగురించి, చిన్నచిన్నబిందువులే కడకు ఓమహాసముద్రం అవడం గురించి, ఆ నూతన కేంద్రం గురించి మాట్లాడేరు. లెఫ్టినెంట్ గవర్నర్ కూడా ఆమె విజ్ఞాపనలకు అంతే నిరాడంబరంగా బదులు చెప్పేరు. అక్కడ తయారయే ప్రతి దుప్పటినీ, తువ్వాలునీ, బేండేజీనీ హాస్పిటళ్లు కొంటాయని ఆయన మదర్ థెరెసాకు భరోసా యిచ్చేరు. మదర్ థెరెసా, అక్కడి సిస్టర్లు యెప్పుడు కావాలంటే అప్పుడు, ముందుగా అనుమతి తీసుకోకుండా కూడా, తనని కలుసుకోవచ్చుని ఆయన చెప్పేరు.

ఆవిడ ఆ ఆహ్వానాన్ని వెంటనే అందుకున్నారు. నిండా రెండు వారాలు గడిచేయో లేదో, ఓ రోజు పొద్దున్నే మా ఆఫీసులోకి వచ్చేరావిడ. నాకు ఒక్కసారి సంభ్రమ ఆశ్చర్యం కలిగేయి. తేరుకోవడానికి రెండుమూడుక్షణాలు పట్టింది. అచ్చం భారతీయ సంప్రదాయ పద్ధతిలో రెండు చేతులూ జోడించి నమస్తే అంటూవున్న చీరధారి "నన్"కి ప్రతినమస్కారం చేశానప్పుడు. కలకత్తానుంచి ఆవిడ రాకకు కారణమైన సమస్య, వూహలో అనుకోవడానికి కూడా యెవళ్లకేనా గగుర్పాటు కలిగించేదే–కుష్ఠు. అలా ఆవిడ చేస్తున్న కార్యక్రమాలలో నిమగ్నం అవడానికి నాకు ఆ సమావేశమే నాంది.

మదర్ థెరెసా యెకాయెకీ విషయం ప్రస్తావించేరు. ఆవిడ పద్ధతి అంతేనట. నాకు త్వరలోనే తెలిసింది. ఆవిడ మాటలు నాకు బాగా గుర్తున్నాయి. "చాలామంది కుష్ఠువ్యాధిగ్రస్తులవుతున్నారు. పనికోసమనో, వైద్యంకోసమనో వాళ్లు మహానగరాలకు వలస వస్తున్నారు. చాలామందికి సాయం అందడం లేదు, ముష్టెత్తుకోవడం తప్ప వేరే ఆధారం వుండడంలేదు. నాలుగైదెకరాల భూమిని మీరు యివ్వగలిగితే గనక వాళ్లకో చికిత్సా, పునరావాస కేంద్రాన్నీ ప్రారంభించగలం." ఆవిడ్ని కొంచెంసేపు వుండమనిచెప్పి, లెఫ్టినెంట్ గవర్నర్‌కి ఆవిడ రాక గురించి తెలియజేశాను. ఆయన వెంటనే ఆవిడను రమ్మనమన్నారు. ఆవిడతోబాటు యిద్దరు సిస్టర్లు కూడా వచ్చేరు. మామూలుగా అతిధులకు యిచ్చే టీ వచ్చింది. ఆవిడ మర్యాదగానే వద్దన్నారు. సిస్టర్లు యెవళ్లనుంచీ ఫలహారాలు తీసుకోరని చెప్పేరు – ఆ యిచ్చేవాళ్లు సంపన్నులైనా, పేదలైనా సరే. కుష్ఠువ్యాధిగ్రస్తులైన వాళ్లు అనుభవించే సమస్యల గురించి లెఫ్టినెంట్ గవర్నర్‌కి వివరించి చెప్పేరు. "పెద్ద బాధయేమిటంటే వాళ్లని ప్రతివాళ్లూ అసహ్యించుకునేవాళ్లే కానీ, చేరదీసేవాళ్లు ఒక్కళ్లూ వుండరు. మా సిస్టర్లు, నేనూ వాళ్లకి కొత్త జీవితం, చెప్పాలంటే రెండవ జీవితం యివ్వాలని సంకల్పించేం. భారతదేశంలో యెన్నో చికిత్సా, పునరావాస కేంద్రాలు స్థాపించేం. వాళ్లక్కడ గౌరవప్రదంగా పనిచేసుకుంటున్నారు. బిచ్చమెత్తే అవసరంలేదు. మేం వాళ్లకి బాగా సన్నిహితంగా వుంటాం, ఆప్యాయానురాగాలతో చూసుకుంటాం. తమని కూడా ప్రేమగా చూస్తారు – అన్నభావం వాళ్లకి కలిగించాలని మా తాపత్రయం." లెఫ్టినెంట్ గవర్నర్ బాగా చలించిపోయేరు. యెంత భూమి కావాల్సివుంటుందని ఆవిడను అడిగేరు. మదర్ థెరెసా పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చి కొలతలనేకం మనిషి కానేకారనుకోండి. అయితే తను అనుకున్నది సాధించబోతున్నానని వెంటనే గ్రహించేరు. మురిసిపోతూ, చిన్నపిల్లలా చిరునవ్వునవ్వుతూ తన అభ్యర్థనను తక్షణం రెండింతలు చేసేరు. పదెకరాలు కావాలన్నారు. ఢిల్లీలో కుష్ఠుకేంద్రానికిగాను మిషనరీస్ ఆఫ్ చారిటీకి పదెకరాల భూమిని యిచ్చేటట్టు చూడమని లెఫ్టినెంట్ గవర్నర్ నాకు సూచన లిచ్చేరు.

లెఫ్టినెంట్ గవర్నర్ గారి దగ్గర మదర్ థెరెసా కూర్చున్న ఆ అరగంటలోనూ ఆవిడని దగ్గరగా పరిశీలించ గలిగేను. ఇప్పుడున్నట్టుగానే అప్పుడూ చిన్నఆకారమే. ఆవిడ ముఖం ముడతలు పడివుంది. కొంచెం కుంచించుకుపోయినట్టూ కనిపించింది. ఆవిడ తేనె కళ్లు మిలమిలా మెరుస్తూనే వున్నాయి. గ్రహింపుశక్తి గల మనిషిగా, గొప్ప ఆచరణ శీలిగా కనిపించేరు. ఇతరుల మీద తను కలిగించే ప్రభావం యెలాంటిదో ఆవిడకు ఎరుకలేదని చెప్పలేం, కాని ఆవిడమాత్రం రాగద్వేషరహిత ఉల్లాసంతో వుంటారు. ఆవిడ మాటలూ తక్కువే. చాలాసార్లు "దేవుడి దయ" అంటూనే వుంటారు. అలా అనడంలో మళ్లీ యే మతపరమైన భావమూ గర్భితమైవుండదు, ఒకరకమైన విరామచిహ్నంగా అలా అంటూవుంటారు: "ఇవాళ వేడిగా వుంది, దేవుడి దయ" "వచ్చినందుకు సంతోషంగా వుంది, దేవుడి దయ." ఆవిడ చీరని హుందాగా కట్టుకుంటారు. యూరప్ మహిళలలో ఆ ఒడుపు వుండదు. మదర్ థెరెసాలో అల్బేనియా లక్షణాలు యిక యెంతమాత్రమూ లేనేలేవు. 1947లో

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించేక ఆవిడ భారతదేశ పౌరసత్వం తీసుకున్నారు. బెంగాలీ ధారాళంగా మాట్లాడతారు. చాలాకాలం కలకత్తా మురికివాడల్లో యితర ప్రాంతాల్లో పనిచెయ్యడంవల్ల ఆమె తను కోరుకుని వచ్చిన భారతదేశంలో, భారతీయురాలు అయేరు. ఆమె శ్రమపూరితజీవితం యెలాంటిదో ఆవిడ పాదాలు చేతులు తెలియచేస్తాయి. ఆవిడ వేళ్లు చివికి, వంకరపోయినట్టు వున్నాయి. ముతక, కరుకు చెప్పల్లో ఆవిడ పాదాలు వంకరపోయేయి.

ఆ ఉదయం సంఘటన గురించి ఆ తర్వాత చాలాసార్లు గుర్తుకు తెచ్చుకునేవాణ్ణి. యీవిడకు అంత ప్రత్యేకత యెలా వచ్చింది? మేం వున్న ఆ శోభాయమాన మందిరం ఆవిడ నిరాడంబర సన్నిధితో సాదాగా మారిపోవడం వల్లనా? చాలాచోట్ల మాసికలు వేసిన ఆ చీరవల్లనా? ఆమె అణకువతనానికి కర్ర చేతిపిడి వున్న పాత గుడ్డసంచీ తోడవడంవల్లనా? బహుశా యివన్నీ అయివుండచ్చు. భగవంతునితో అంత సన్నిహితంగా నిత్యం వుండడంవల్ల ఆమెకి అందిన వశీకరణ శక్తి కూడా అయివుండవచ్చు.

ఆవిడకు క్రీస్తుపట్ల వున్న విశ్వాసం యెంత గాఢమైందీ, మనస్ఫూర్తిగా వున్నదీ నాకు క్రమేపీ అర్థం అయింది. తను సేవచేసే ప్రతివ్యక్తిలోనూ ఆమె క్రీస్తుని దర్శిస్తారు. చాలాయేళ్లక్రితం కలకత్తాలోని ఓ వీధిలో ఆమె ఓ స్త్రీని రక్షించారు. ఆ స్త్రీ ముఖాన్ని యెలకలు, చీమలు సగం కొరికేశాయి. మదర్‌కి ఆ స్త్రీలో పరిత్యక్త క్రీస్తే దర్శనమిచ్చి వుంటాడు. నిర్యాణగృహంలో శుష్కించిపోయివున్న ప్రతి శరీరంలోనూ బాధాతప్త క్రీస్తు లేదా మృత్యువు ఒడిలోకిపోతున్న క్రీస్తు ఆమెకి కనిపిస్తారు. మదర్‌కీ ఆవిడ బృందానికీ తాము కడిగి శుభ్రం చేస్తున్న ప్రతి కుష్ఠుపుండులోనూ, అన్నం తినిపిస్తూ వున్న ప్రతి శిశువులోనూ, స్నానం చేయిస్తూవున్న ప్రతి మూత్రకలుషిత శరీరంలోనూ క్రీస్తే దర్శనమిస్తూ వుంటాడు. ఆవిడే యిలా అన్నారు: "లేకపోయినట్లయితే నేను యే కొద్దిమంది ఆప్తులకు మాత్రమే సేవ చెయ్యగలిగేదాన్ని మహాఅయితే. దుర్వాసనతో వుండే కుష్ఠురోగి పుండును యెలా కడిగి శుభ్రం చెయ్యగలగుతున్నావు అని నన్ను అప్పుడప్పుడు అడుగుతూ వుంటారు. 'నిలువెత్తు ధనరాశులు కుమ్మరించినా మేం ఆ పని చెయ్యలేం' అంటూ వుంటారు. 'మేమూ చెయ్యలేం అలా. ప్రభువు మీద భక్తి కొద్దీ మేము చేస్తున్నాం' అని జవాబు చెబుతూ వుంటాను."

సిస్టర్లు చిరునవ్వుతో పరిస్థితులకి తలవొగ్గడం, సునాయాసంగా తీసుకోవడం యీ పరిపూర్ణత వల్లనే అని నేను గ్రహించేను. వాళ్ళ ప్రమాణాల గాఢత్వాన్ని క్రమేపీ నేను అవగాహన చేసుకున్నాను. ప్రభువుకు తమ హృదయాలను అంకితం చెయ్యడంలో పవిత్రతా ప్రమాణం వుంది. "మీరు మీ భార్యని వివాహం చేసుకున్నట్లే నేను ప్రభువుని పాణిగ్రహణం చేసుకున్నాను" అని మదర్ ఒకసారి యధాలాపంగా అన్నారు. విధేయతా ప్రమాణంలో సిస్టర్లు తమ స్వతంత్ర యిచ్ఛని ప్రభువుకు అంకితం చెయ్యడం వుంది. పేదరిక ప్రమాణంలో తాము పేదవాళ్ళలాగే బతుకుతూ

వాళ్లని సమానస్థాయిలో అర్థం చేసుకునే భావం వుంది. వాళ్ళు ప్రతిఫలంగా పైసాకూడా తీసుకోరు, ఐనప్పటికూడా - ఈశ్వరునికి ఈశ్వరుని నిమిత్తం ఈశ్వరుని కోసం చేసే సేవలో ప్రతిఫలం పాదార్థికమైందిగా యెలా వుంటుంది? వాళ్ల నాల్గవ ప్రమాణం వాళ్ల పీఠానికి తగ్గట్టు అద్వితీయంగా వుంటుంది: పేదలలో నిరుపేదలకే సేవలందించడం. ఇందుగ్గాను సంపన్నులు, వున్నవాళ్లు భాగం పంచుకుందుకు మదర్ సంతోషంగా అవకాశం యిస్తారు. ఓసారి యిద్దరు అమెరికన్ సెనేటర్లూ, నైజీరియాకు చెందిన సంపన్న గృహిణి మోకాళ్లమీద అనుకుని కాళిఘాట్ నిర్యాణగృహంలో నేలని కడగడం చూసాను. "ఇది దేవుని సృష్టిలోని అందం. ఎంతమందిని యీ పనిలో నిమగ్నం చేసిందో" అని తలపంకిస్తూ అన్నారామె. "పేదవాళ్లను తాకే అవకాశం వాళ్లకి యిస్తున్నాను" అని మృదువుగా అన్నారు.

పేదరికమే మీ శక్తికదా అని ఓసారి మదర్‌తో అన్నాను. పేదరికం నిజంగా తన స్వేచ్ఛ అన్నారావిడ. ఎన్‌టల్లీ దగ్గిర కలకత్తా లొరెటో కాన్వెంట్ నుంచి బయటకు అడుగు పెట్టినప్పుడు ఆవిడకువున్న ఐహికసంపదల్లా మూడు చీరలూ, ఒక అయిదురూపాయల నోటూనూ. ఆమెకి పుష్కలంగా వున్నదల్లా ఆత్మ విశ్వాసం. తన జీవిత ధ్యేయంలో విశ్వాసం, ప్రభువే తనను నడిపిస్తాడు. ప్రభువే అన్నీ సమకూరుస్తాడు అన్న విశ్వాసం. మోతీఝీల్‌లో ఆవిడ అడుగుపెట్టేప్పుడు ఒక సర్వే నిర్వహణగాని, ఒక ప్రణాళిక వేసుకోవడంగాని, నిధులు సమకూర్చుకోవడంగాని అవసరంగా కనిపించలేదు. అక్కడ ఒక పాఠశాల అవసరం అనే ఆవిడ గమనించారు. ఓ భవనం లేదు, కుర్చీలు లేవు, బల్లలు లేవు. యివేవీ ఆవిడను వెనక్కు దిగ లాగలేదు. ఆ పూరిగుడిసెల్లో వెల్లడిగావున్న నేల మీద, కర్రముక్కతో బెంగాలీ అక్షరాలు గిలికేరు. కొంతమంది పిల్లలు వచ్చారు. రోజులు గడిచేకొద్దీ యింకా యింకా యెక్కువమంది వచ్చి చేరేరు. తలా ఒక చెయ్యి వెయ్యాలన్న భావంతో ఒకళ్లు ఓ బల్ల యిచ్చారు, మరొకళ్లు రెండు,మూడు కుర్చీలు యిచ్చారు, యింకొకళ్లు బ్లాక్‌బోర్డ్ యిచ్చారు. చూస్తూవుండగానే ఆ చిన్నబడి సాకారం అయింది.

పేద మోతీఝీల్‌కి వైద్యసహాయమూ అవసరం అయింది. మదర్‌థెరెసాకు కొంత శిక్షణ వుందిగాని మందులు లేవు. వుండనే వుందిగా యేనాటినుంచో ఓ సంప్రదాయం: యాచించడం. ఆవిడ జోలె పట్టేరు. ఆవిడ సంపాదించగలిగిన మందులు యిట్టే అయిపోయేయి. యింకా యెక్కువ అవసరం అయేయి. చాలామందిని తక్షణం హాస్పిటల్‌లో చేర్పించాల్సివచ్చింది. ఖాళీలేదని చెప్పి ఓ హాస్పిటల్ ప్రాణావసాన స్థితిలోవున్న ఓ ఆడమనిషిని చేర్చుకోలేదు. ఆవిడ హఠంవేసి హాస్పిటల్ గుమ్మం దగ్గరే బైఠాయించారు. యిక తప్పదు నాయనా అనుకుని వాళ్లు ఆ ఆడమనిషిని చేర్చుకున్నారు. వాళ్లు క్రమేపీ ఆవిడ అడిగిన దానికి 'సరే' అనడమే కాకుండా, ఆవిడకు అవసరం పడినపుడల్లా అంబులెన్స్‌నీ పంపించేవాళ్లు. కొన్నిరోజుల్లోనే ఆవిడ తొలి చికిత్సా కేంద్రాన్ని స్థాపించారు. ఆ తర్వాతి నలభైమూడు ఏళ్లల్లోనూ మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వారి సంస్థల్లో ఒక్క బళ్లు, చికిత్సాలయాలు మాత్రమే కాక, అనాధ శిశువుల శరణాలయాలు, కుష్ఠవ్యాధిగ్రస్తుల ఆశ్రమాలు, నిరాధారులైనవాళ్ళ

హోమ్‌లు యెన్నో వున్నాయి. యిటీవలే ఎయిడ్స్‌వ్యాధిగ్రస్తుల కోసం కేంద్రాల్ని తెరిచారు.

1990 నాటి నూటికి పైబడ్డ దేశాల్లో 456 కేంద్రాల్ని స్థాపించేరు. ఆ ఏడాదే 5 లక్షల కుటుంబాలకి ఆహారం అందించేరు. 124 పాఠశాలల్లో 20 వేలమంది మురికివాడల పిల్లలకు చదువు చెప్పేరు. 90 వేలమంది కుష్ఠురోగులకు చికిత్స చేశారు. 17,048 మంది వికలాంగులకు సేవలందించేరు. ఆరు ఎయిడ్స్ కేంద్రాలలో 661 మంది చేరారు. వాళ్ళల్లో 88 మంది ఆ ఏడాది చనిపోయేరు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్ ప్రశ్నోత్తర పఠన తరగతులనుంచి జైళ్ల సందర్శనదాకా, అనాధ శిశుశరణాలయాల నుంచి, మద్యపానమత్తుల్నీ, మాదకద్రవ్యగ్రస్తుల్నీ నయంచేసే ఆశ్రమాల దాకా – నిరాధారులకీ, పేదలకీ ప్రపంచవ్యాప్తంగా సేవలందించే సంస్థల్ని స్థాపించేరు. భూఖండంలో యెవళ్ళూ వెళ్లడానికి యిష్టపడని ప్రదేశాల్లో సిస్టర్లు సేవలు చేస్తూ కనిపిస్తారు. తను వెళ్లని తావు యేదన్నా వుందా అని ఓసారి మదర్ థెరెసాని అడిగేను. "పేదలు చంద్రమండలంలో వున్నట్టయితే, అక్కడికూడా మేం వెడతాం" అన్నారావిడ నవ్వుతూ.

చర్చిల్లో భక్తులరాక తగ్గిపోతూవున్న సమయంలో చర్చి ఆందోళన చెందుతూ వుండింది. అలాంటి సందర్భంలో మిషనరీస్ ఆఫ్ ఛారిటీలో 4 వేల మంది దాకా వున్నారు. ఎంతోమంది అమ్మాయిలు పరమ కఠోర జీవితపథం మీదకు రావాలని ఆతృతగా వున్నారు. ఉల్లాసం, లోకజ్ఞానం, దృఢమైన ఆరోగ్యం యిందుకు అర్హతలు. సిస్టర్లకు శిక్షణ, యీ ప్రపంచ వ్యాప్త సంస్థల నిర్వహణ మదర్‌హౌస్ (మాతృగృహం) నుంచే జరుగుతాయి. ఇదే మదర్ థెరెసా కేంద్రకార్యస్థానం. 54A లోయర్‌సర్క్యులర్‌రోడ్‌లో వుందీ కార్యాలయం. అది చిన్న కార్యాలయం. ముగ్గురు సిస్టర్లు పగటిపూట పనిచేస్తూ వుంటారు. అవుకు టైప్‌రైటర్లు వాళ్ల పనికి సాయం. రాత్రి పదిగంటలు దాటాక మదర్ థెరెసా అక్కడకు వెడతారు. వర్తమానాలు, అర్జీలు చూస్తారు. ఉత్తరాలు ప్రత్యుత్తరాలు నిర్వహిస్తూ వుంటారు. తెల్లవారకట్ల వరకూ చేస్తారాపని.

నాకు వచ్చిన చాలా ఉత్తరాలూ, పత్రాలూ అలా ఆ ఏకాంత ఘడియల్లో రాసినవే. ఆవిడ కనురెప్పలు భారంగా వుండడం చూసి, కనీసం ఆరుగంటలైనా రాత్రి పడుకోలేకపోయేరా అని ఒకోసారి నేను అడిగేవాణ్ణి. అందుకు చాలినంత సమయం యికముందు వుంటుంది లెమ్మని ఆవిడ నవ్వుతూ బదులు చెప్పేవారు.

మాకు పరిచయం కలిగిన కొత్తల్లో ఆవిడ యెప్పుడు ఢిల్లీ వచ్చినా కలుసుకుంటూ వుండేవాణ్ణి. ఢిల్లీ 'ఆశ్రమాన్ని' యెక్కువగా సందర్శిస్తూ వుండేవాణ్ణి.

ఒకోసారి ఆవిడ నాకు ఆశ్చర్యం కలిగించేవారు మొట్టమొదటిసారికిలాగా. తలుపుతీసి, అదే వశీకరణ మందహాసంతో 'లోపలికి రావచ్చా' అనేవారు. కొన్ని సందర్భాల్లో ఆవిడ ఢిల్లీ మీదుగా వెళ్లేటప్పుడు ఆవిడ్ని కలుసుకుందుకు నేను ఎయిర్‌పోర్ట్‌కు వెళ్లేవాణ్ణి. ఆవిడ విమానాలు ఆలస్యం అవడం నాకు మంచిదనిపించేది, యేమంటే ఆవిడతో యెక్కువసేపు మాట్లాడుకునే అవకాశం లభించేది.

Dear Rukmini,
May God's blessing
be with you during
this time of examina-
tions. God bless you
23-2-91 M Teresa mc




See! I will not forget you . . . I have carved you on the palm of My hand . . . I have called you by your name . . . You are mine . . . You are precious to Me . . . I love you.

Isaiah

నేను స్వహస్తాలతో యేమన్నా సాయం చెయ్యగలనా అని ఓ రోజున ఆవిడను అడిగేను. నా అవసరం ఆవిడ గుర్తించేరు. శుక్రవారం మధ్యాహ్నం పూట ఆఫీసుకు రానక్కర్లేదని లెఫ్టినెంట్ గవర్నరూ అనుమతి యిచ్చేరు. ఆ సమయాల్లో నేను కుష్ఠువ్యాధిగ్రస్తులతోనూ, "నిర్మల్ హృదయ్" నిరాధార వృద్ధులతోనూ గడిపేవాణ్ణి.

క్రమేణా మదర్ థెరెసా, ఆవిడ సిస్టర్ల బృందం మా కుటుంబ జీవితంలో ప్రత్యేకస్థానం అందుకున్నారు. అది సహజమే. ఆవిడ మా యింటికి వచ్చేవారు. మా కుటుంబాన్నీ, మిత్రుల్నీ, యిరుగుపొరుగువాళ్లనీ ఆశీర్వదించేవారు. మొదట్లో ఆవిడ వస్తుందన్న వార్త చుట్టుపక్కల యిట్టే పాకిపోయేది. అంతట్లోకే మా యిల్లు కిటకిటలాడిపోయేది. యేదన్నా మాట్లాడమని ఆవిడను అడిగేవాణ్ణి. ఆవిడ కుటుంబాలు కలిసివుండడం గురించి, కలిసి ప్రార్థన చెయ్యడం గురించి మనస్ఫూర్తిగా మాట్లాడేవారు.

అప్పట్లో మదర్ థెరెసా మాకు ఉత్తరాలు రాశేవారు. ప్రోత్సాహకరంగా నాలుగు మాటలు రాశేవారు. ఆశీస్సులు అందించేవారు. ఒకోసారి లిఖితప్రార్థన మాత్రమే పంపించేవారు. మేం కష్టాల్లో వున్నపుడు మమ్మల్ని ఆదుకున్నారు. పరీక్షల ముందు మా పిల్లలు కంగారుపడుతూ వుండేవారు. అప్పుడావిడ వాళ్లకోసం ప్రార్థించేవారు. ఆవిడ తనకు అవసరం అని తోచినప్పుడు మాకోసం ప్రత్యేక ప్రార్థనలు జరిపించేవారు. జీవిత పెనుతుఫాన్ ఒకటి గడిచేక ఓసారి ఆవిడ యెలా వున్నావని నన్ను అడిగేరు. బాగానే వున్నానని చెప్పేను. "అయితే నేను మీకోసం ప్రార్థనలు చెయ్యడం మానెయ్యవచ్చన్నమాట" అన్నారు నవ్వుతూ.

"భారతదేశంలో కుష్ఠువ్యాధి" అన్న నివేదికను ఒకదాన్ని తయారుచేశాను. 1988 డిసెంబరుల్లో దాని ఆవిష్కరణకు ఆవిడ పనిగట్టుకుని ఢిల్లీ వచ్చేరు. ఆవిడ సమ్మోహకశక్తి యెంతటిదంటే ఆ ఉత్సవసభ జరిగిన పచ్చిక బయలంతా కిక్కిరిసిపోయింది. అదీ యెంతో ముందుగానే. ఆవిడ మాట్లాడినప్పుడు శాంతి కోసం సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసి ప్రార్థనసుతనతోబాటు కలిసి పైకి చదవమని ప్రేక్షకుల్ని అడిగేరు. ఆ ప్రార్థన ప్రతుల్ని ముందుగానే వాళ్ళకి అందజెయ్యమని నాకు చెప్పేరు. ఆవిడ సరళంగా మాట్లాడేరు. యే పదాడంబరమూ లేదు. కుష్ఠువ్యాధి చికిత్సకోసం మిషనరీస్ ఆఫ్ ఛారిటీ చేస్తున్న కృషి గురించి చెప్పేరు. ఉదారా భక్తిగా సాయం చెయ్యమని వాళ్లని కోరేరు. "పశ్చిమదేశాల కుష్ఠు" గురించి చెప్పేరు. మనుషుల్ని నిరాధారులుగా యెలా వదిలేస్తున్నారో చెప్పేరు. వాళ్ళు బంధిత 'అవిటివాళ్ళ'ని ఆవిడ ప్రస్తావించేరు. కుటుంబాలు మళ్ళీ దైవప్రార్థనలు చేస్తూ వుండాల్సిన అవసరం గురించి చెప్పేరు. సాయం అర్థించే పక్కవాళ్లకు స్నేహహస్తం అందించాల్సిన అవసరం గురించి చెప్పేరు. కలకత్తాలో ఆరుగురున్న ఓ కుటుంబం గురించి చెప్పేరు. ఆవిడ వాళ్లని కలుసుకోవడం తటస్థించింది. అప్పటికి వాళ్లకి రెండురోజులుగా తిండి లేదు. పిల్లల కళ్లు ఆకలితో అలమటిస్తున్నాయి. ఆవిడ వాళ్లకోసం అన్నెప్పి కొంచెం అన్నం తీసుకువెళ్లేరు. ఆ కుటుంబం దాన్ని రెండు భాగాలు చేసిందట. పొరుగునే వున్న మరో కుటుంబంలోను యిదే ఆకలి పరిస్థితి

వుంది. ఆ రెండోభాగాన్ని వాళ్లకివ్వాలని, తమకి పెట్టిందాన్ని రెండుగా చేసుకుందీ కుటుంబం. పేదవాళ్లు సర్వదా ఒకళ్లకొకళ్లు భాగస్వాములుగా వుంటారన్నారామె. తమ అవసరం లాంటిదే యితరులదీనీ అన్న విషయం వాళ్లకు తెలుసు. అదే ఆవిడకు వింతగా కనిపించింది. ఆవిడ రోజూ యెదురయే అంశాల గురించే చెప్పారు. కుటుంబం దగ్గర్నే ప్రేమ వుండాలి. సుఖసంతోషాలు పంచుకోవాలి. ముఖ్యంగా యితర కుటుంబసభ్యులతో, అనే లాంటి విషయాలే.

మదర్ థెరెసా యెప్పుడూ వాగ్ధాటిగా మాట్లాడేవక్తకాదు. ఆరోజు సాయంత్రం కూడా అంతకుముందు యెన్నోసార్లు చెప్పిన సంగతులేతప్ప కొత్తగా కల్పించినవి యేమీలేవు. కాని ఆవిడ మాట్లాడేక ఒక నిశ్శబ్దం అందరినీ అలముకుంది. కనికట్టు కట్టినట్టున్న నిశ్శబ్దం. దాన్ని భంగపరచాలని ముందుగా యెవరూ అనుకోలేదు. కొన్ని క్షణాలు గడిచేయి. నా పక్కనే కూర్చున్న ఒకావిడ నోరుమెదపడం నాకు వినిపించింది. ఆవిడ ఐశ్వర్యవంతురాలు, తను గొప్పదాన్ననుకునే వ్యక్తీనీ. ఆమె హృదంతరాళంలో యెక్కడో మదర్ థెరెసా మాటలు ఆమెని కదిలించేయి. ఆమె యేడ్చింది. ఇంతట్లోకీ ఒక చిన్నపాప పరిగెత్తుకుంటూ వెళ్లి మదర్ థెరెసాని ఆటోగ్రాఫ్ అడిగింది. ఆ పిల్ల వెనకాలే తల్లీ వెళ్లింది. దాంతో మిగిలినవాళ్లకీ వేడిపుట్టుకొచ్చింది. మదర్ థెరెసాని దాదాపు ప్రేక్షకులందరూ చుట్టుముట్టేశారు. దాదాపు అందరి చేతుల్లోనూ ఆ నివేదిక ప్రతులు వున్నాయి. వాటిని వాళ్లకి పంచిపెట్టేంకదా. వాటి మీద ఆవిడ యీ యిరవై అక్షరాలనీ మెల్లిగా కష్టంతో రాశేరు: "దేవుడి ఆశీస్సులు లభించుగాక, ఎమ్. థెరెసా ఎమ్.సి." అందరూ వెళ్లిపోయేవేళకు చీకటిపడింది. ఆవిడ అలసిపోయేరు. వెనక్కివాలి కూర్చున్నారు. పెదవుల మీద అలసిన చిరునవ్వు. చేతులు చాచి, నా చేతులు పట్టుకున్నారు. తనలోతానే మెల్లిగా "జీసస్. నీ కోసం యిది చేస్తున్నాను. యీ యిరవై ఉత్తరాలు నీకోసం" అన్నారు.

ఆ సభ తర్వాత నేను ఆవిడను అడిగేను, తన మీద పుస్తకం యేదన్నా రాసే ప్రయత్నం చెయ్యనా అని. ఆవిడ తక్షణ ప్రతిస్పందన యేమిటంటే జీవితచరిత్ర రూపంలో మరోసారి తన గురించిన జీవిత సంగ్రహం తనకిష్టం లేదు అని. మళ్ళీ ఓ క్షణం ఆలోచించుకుని "చేస్తున్న కృషి గురించి రాయండి" అని తలవూపేరు. ఆవిడ విశ్వాసాలని నేను మన్నించడంలేదన్న చింత ఆవిడకు యేమాత్రం వున్నట్టులేదు.

ఆ తర్వాత నాలుగేళ్లూ ఆవిడ నా మీద నమ్మకం వుంచేరు. సిస్టర్స్‌కి ఒక ఉత్తరం రాసి యిచ్చేరు. వాళ్ళు చేసే పనిని యెరుక చెయ్యమనీ, నేనడిగిన వాటికి జవాబులు యివ్వమని అందులో రాశేరు. నేను వెళ్లినప్పుడల్లా యీ ఉత్తరం తీసుకువెళ్ళేవాణ్ణి. యెక్కువసార్లు కలకత్తా వెళ్లేవాణ్ణి. ఆవిడ అక్కడ నన్ను చూసినప్పుడల్లా "పుస్తకం పూర్తయిందా" అని అడిగేవారు. మూడేళ్ళు గడిచేయి. యేవో పనుల ఒత్తిడివల్లా, బెదురువల్లా నేనప్పటికీ ఒక్క అక్షరం రాయలేకపోయేను. ప్రభుత్వ యంత్రాంగంలో ఉద్యోగినవడం వల్ల, నేను చేతిలోకి తీసుకున్న విషయాన్ని ఆమూలాగ్రం శోధించా లనుకుంటున్నాని మదర్‌కి చెప్పేను. ఆవిడ సరేనన్నారు. యిక మళ్లీ నన్నాప్రశ్న అడగలేదు. అప్పట్నుంచీ నేను యెప్పుడు మదర్ హౌస్‌కి

SDM.

11-12-87

My dear Sisters,

Mr. + Mrs. Chawla - are coming to your place, allow them to take photos of the work and the Poor you serve - and also if they put any questions regarding the work answer.

God bless you
M Teresa MC.

(మాతృగృహం) వెళ్లినా, "అచ్ఛా వచ్చేరన్నమాట" అనేవారు. నాకేదో పరిచయలేఖ రాసి యివ్వడం, నేనడిగే ప్రశ్నల పరంపరలకు జవాబు చెప్పడం సాగించేవారు. ఆవిడ ముభావంగా యేం మాట్లాడకుండా వున్న అంశం తన వైయక్తిక జీవితం గురించి. అదేమంత ముఖ్యవిషయం కానట్టుగా తోసిపారేశేవారు.

తన జీవితచరిత్ర రాయాలనుకున్నవాళ్లకి ఆవిడ ఓ పట్టాన లొంగరు. ఆవిడ యెప్పుడూ జపించే మంత్రం యేమంటే తను యేమీ కాదు, దేవుని చేతిలో ఒట్టి నిమిత్తమాత్రురాలిని అని. యేమైనా మదర్ థెరెసా బాల్యజీవితం వివరాలు చాలాస్వల్పం, అందరికీ తెలిసినవీ. స్కోప్జేలో తను గడిపిన రోజుల గురించీ, తల్లి ప్రభావం గురించీ, 18 యేళ్ల వయసప్పుడే కుటుంబం నుంచి దూరం అయిపోవడం గురించీ వివరాలు అడిగినప్పుడల్లా ఆవిడ యేదో నిర్లిప్తంగా చెప్పడం తప్ప ఆ సంభాషణల మీద మనసు పెట్టేవారుకాదు. ఆమె చిరునవ్వే జవాబు. సంస్థ పని మీదకీ, ప్రస్తుతం చేతిలో వున్న పనుల మీదకీ మాట మళ్లేది. ఇరవై ఏళ్లు లొరేటో నన్‌గా వున్న సందర్భం గురించి అడిగితే తోటివాళ్లకేసి చూపించేవారు. వాళ్లు ఆవిడ సహాధ్యాయుల్లుగా, ఉపాధ్యాయులుగా గడిపిన రోజుల గురించి చెప్పేవారు. ఫాదర్ సెలెస్టేవాన్ ఎగ్జెమ్ క్లిష్టసమయంలో, ఆవిడ ప్రభువు పిలుపునందుకునే సందర్భంలో, ఆ తర్వాత కాలంలో ఆవిడ ఆధ్యాత్మిక బోధకులుగా వున్నారు. ఆయన ఆ ముఖ్యమైన రోజులనాటి సమాచారం నాకు అందించేరు. తన కృషి గురించి మాట్లాడేటప్పుడే ఆవిడ ఉత్సాహం కనబరుస్తారు. ఆ ఉత్సాహం మనకీ సోకుతుంది. ఆవిడ తన భగవదారాధన గురించి, అవతారమెత్తిన క్రీస్తు గురించీ, తనని పదిలంగా వుంచిన ప్రార్థన గురించీ చెప్పేటప్పుడు ఆవిడ ఉత్సాహం చూసి తీరాల్సిందే.

"తన కృషి" గురించి రాయమని మదర్ థెరెసా అడిగేరన్న విషయం నాకు ఎరుకలో వుంది. అయితే ఆవిడ స్థాపించిన సంస్థ నుంచి ఆవిడను వేరు చేసి చూడ్డం అంత సులభం కాదుకదా. ఆవిడ ప్రోత్సాహం, వినయ సంపన్నత, కృప అనేవన్నీ యీ యావత్‌కృషినీ బంధించి వుంచే అగోచర సూత్రాలు. నేను వెళ్లినచోటల్లా సిస్టర్స్‌ని యేవేవో అడుగుతూ వుండేవాణ్ణి. యెక్కువసార్లు "మదర్‌ని అడగండి" అనే జవాబు వచ్చేది. ఆ బృందం వారి కార్యకలాపాల్లో ఆవిడ బోధలు, దైనందిన ప్రవర్తన, విశ్వాసం ప్రతిఫలించేవి. భారతదేశానికి బయట సుదూరదేశాల్లో సిస్టర్స్‌తో నేను మాట్లాడినప్పుడు కూడా సర్వదా "మదర్" "మదర్" అనే అన్నిటికి సంబంధించీ వినవచ్చేది. ఆవిడ యేదో పక్కగదిలో వున్నట్టే, యే క్షణంలోనేనా మేం వున్న చోటుకు రావచ్చేమో నన్నట్టే, వాళ్లని నా ప్రశ్నల శరాఘాతాల నుంచి కాపాడబోతున్నట్టే, వాళ్లని తిరిగి "వాళ్ల పనిలో" నిమగ్నం అయేట్టు చేయబోతున్నట్టే అనిపించేది.

వూహించని ప్రదేశాల్లో తరచూ ఉన్నతస్థాయుల్లో ఆవిడ కృషి గాఢమైన ముద్ర వేసేది. ఒక కాన్వెంట్ ప్రారంభించమని సోవియట్ యూనియన్‌ని కోరేరు. కాని యే జవాబూ లేదు. అప్పుడావిడ సెయింట్ మైఖేల్ దివసం నాడు

అధ్యక్షుడు గొర్బచేవ్‌కి శుభాకాంక్షలు పంపడం ద్వారా యీ విషయం గుర్తుచేసారు! లక్షలాదిమంది అమాయకుల్ని బలిగొంటున్న యుద్ధం నివారించవలసిందిగా అధ్యక్షులు బుష్‌కీ, అధ్యక్షులు సద్దాంహుస్సేన్‌కీ విజ్ఞప్తి చేశారావిడ. పోరు ఆగిన తర్వాత యుద్ధంతో శిధిలమైన ఆ గడ్డ మీద ఆరు కేంద్రాలు స్థాపించడానికి ఇరాక్ అధ్యక్షుడి అనుమతి సంపాదించేరు. ఎన్ని దేశాలో ఆవిడను తమ దేశం అత్యున్నత పురస్కారాలతో ముంచెత్తేయి. యే శక్తీలేని బీదాబిక్కీ తప్ప ఆవిడకు నియోజకవర్గమంటూ లేకపోయినా అధికార అత్యున్నత మందిరాలలోకి ఆవిడకు ప్రవేశం వుండేది. తను వొప్పుకున్నా, వొప్పుకోకపోయినా యీ ఎనభైరెండేళ్ల నన్–చర్చికి సంబంధించి అనన్యమైన శక్తిసంపన్నురాలు. కలకత్తా ప్రధానబిషప్‌ని వాటికన్‌లో "మదర్ థెరెసా ఆర్చ్‌బిషప్" అంటారన్న ముక్క బహుశా ఆవిడను హడలింపచేస్తుందేమో. కార్డినల్స్ ఆవిడ పక్కన నుంచోవడానికి పోటీపడతారు. ఆవిడ రోమ్ సందర్శించినపుడు పోప్ తన బిడ్డలాగా ఆదరిస్తాడు. అయినా ఆవిడ అణకువతనమే తను అన్నట్టు వుంటారు.

మదర్ థెరెసాని ఒక పుస్తకం హద్దుల్లో బిగించడం కష్టం. సాదాసీదాగా కనిపించే యీవిడను కలుసుకున్న ప్రతిసారీ యేదో అపూర్వమైంది గోచరమవుతూనే వుండేది. విదేశాల నుంచి తిరిగివస్తూ సంతోషంగా ఆవిడ విమానం దిగడం నా కళ్లకు కట్టినట్టు గుర్తుంటుంది. రెండు చేతుల్లోనూ ప్లాస్టిక్‌సంచీలు, వాటిలో కేప్టెన్ యిచ్చిన బిస్కట్లు, సబ్బులు, యితర పదార్థాలూనూ. అవన్నీ శిశుభవన్ పిల్లలకి. కుష్ఠువ్యాధి పీడితురాలైన ఒకామెని, కన్నపిల్లలు వదిలేసిన ఆవిడను, మదర్ ఓదారుస్తూ కూర్చోవడం చూశాను నేను. ఒకసారి ఆరేళ్లపిల్లవాణ్ణి అక్కున చేర్చుకుని ఫోటో దిగేరు. ఆ కుర్రవాడికి నయంకాని దుర్భరవ్యాధి యేదోనట. కలకత్తా డాక్టర్లు యిక ఆశ వదిలేసుకున్నారట. ఆ కుర్రవాడు మృత్యువు ఒడిలోకి జారిపోతున్నాడు. అలావుండగా ఓ రోజున యేమీ చెప్పాపెట్టకుండా మదర్ వచ్చేరు. ఆ హిందూ మధ్యతరగతి యింట్లో ఆవిడ ప్రార్థన చేసేందుకు మోకరిల్లేరు. మరి యేం అద్భుతం జరిగిందో యేమో ఆ కుర్రవాడు గత రెండేళ్ళుగా బాగున్నాడు. బరువు పెరిగేడు. ఓసారి నేనూ, మా ఆవిడా ఆవిడ్ని విమానాశ్రయం దగ్గర కలుసుకోలేకపోయేం. మాకు తెలియకుండానే ఓ కారు విమానం దాకా వెళ్లి ఆవిడ్ని యెక్కించుకొని వెళ్లిపోయింది. మరి మదర్ థెరెసా అయినందుకు ఆమాత్రం సౌకర్యం వుండాలి కదా అని ఆవిడ పరిహాసంగా అన్నారు. మరోసంఘటన: నిన్నగాక మొన్న జరిగినట్టుగా వుంది. ఆవిడ వాకిలి దగ్గర నెలలు తక్కువ బిడ్డ పడివుంది. ఆవిడ ఆ పసిగుడ్డును చేతుల్లోకి తీసుకుని ఆశ్చర్యం, సంతోషం పెనవేసుకురాగా "యీ బిడ్డ యింకా వూపిరితో వుంది! దేవుడి దయవల్ల గండం గట్టెక్కుతుంది" అన్నారు. తొలిరోజుల్లో, తన పనికి శ్రీకారం చుట్టడానికి ఒక గదికోసం మైళ్ల తరబడి నడిచిన సందర్భాల గురించి ఆవిడకు గుర్తు చేశాను. అది కూడా ఒక త్యాగమే అన్నారావిడ. దేవునిసేవలో యే సందేహంగాని, మరోటిగాని యెన్నడూ లేవు, ఒక ప్రత్యేక ఆనందం తప్ప.

నేను హిందువుని. విభిన్న సంప్రదాయాల నుంచి మంచిని స్వీకరించే ధోరణి మతంవాణ్ణి. అలాంటి నాకు మదర్ థెరెసా ప్రార్థనా సమావేశంలో వున్నప్పుడుగాని, తను సేవచేస్తున్న వాళ్లతో గాని వున్నప్పుడు అనుక్షణమూ క్రీస్తుతోనే వుంటారన్న విషయం బోధపడ్డానికి చాలామందికంటె యెక్కువ వ్యవధే పట్టింది. ఆవిడ శిలువ మీదవున్న క్రీస్తు, కాళీఘాట్‌లో మృత్యుశయ్య మీదవున్న వ్యక్తీ వేర్వేరు కాదు, భిన్నం కాదు. ఒకళ్లు లేకపోతే రెండోవాళ్లూ లేరు. యిద్దరూ అభిన్నమే. ప్రతివాళ్లూ పొరుగువాళ్లకి హస్తం అందించాలి అని ఆవిడ తరుచూ వల్లించే మాటల్లో వైరుధ్యం యేమీ లేదు. ఆవిడకు క్రీస్తుని ప్రేమించడం అంటే పొరుగున వున్నవాళ్లని ప్రేమించడమే. పొరుగువాళ్లని ప్రేమించలేనివాళ్ళు దేవుణ్ణీ ప్రేమించలేరు. ఇదే ఆవిడకు ముఖ్యం, మతం యెంత పెద్దదైందీ అన్నది కాదు, పైవాళ్లు ఆవిడలో చూసే శక్తే కాదు. ఇటీవల జరిగిన ఓ సమావేశంలో ఆవిడ యీ విషయాన్ని సరళంగా, కాని అర్థవంతంగా వివరించేరు. విజయవంతంగా వుండమని కాదు మనకి అందిన పిలుపు విశ్వాసపాత్రంగా వుండాలని. తన జీవితంలో ఆవిడ ఆ విశ్వాసాన్ని ఉదాహరణప్రాయంగా చూపించేరు. ప్రార్థనలో, ప్రేమలో, సేవలో, శాంతిలో విశ్వాసం.

నవీన్ చావ్లా

Dear Navin + Family
Keep the joy of
loving God in
your heart and
in the Poor + share
this joy with all you
meet
God bless you
M Teresa mc

# విషయసూచిక



మదర్ థెరెసా, ఓ చిత్రం.

# 1 బాల్యం

మదర్ థెరెసా దౌత్య పాస్‌పోర్ట్‌లో నమోదైన ప్రకారం మేరీథెరెసా బొజాక్సియొ 1910 ఆగష్టు 26వ తేదీన యుగోస్లావియాలోని స్కోప్‌జీలో జన్మించేరు. 1910లో స్కోప్‌జి చిన్న బస్తీ. ఓ పాతికవేల జనాభా వుంటుంది. అప్పట్లో అది అల్బేనియా రాజ్యంలో వుండేది. అల్బేనియాయే ఒట్టొమాన్ సామ్రాజ్యంలో భాగంగా వుండేది. టర్కీ అధిపత్యంలో అల్బేనియా యెన్నో శతాబ్దాలు ఇస్లామ్ పాలనలో వుంది. కేథలికులు జనాభాలో వేళ్లమీద లెక్కపెట్టే సంఖ్యలో వుండేవారు. అల్బేనియా అప్పట్లో విభిన్న సాంస్కృతిక మతశక్తుల కూడలిలో వుండేది.

ఆవిడ కుటుంబం బస్తీవాసులు. వ్యాపారం చేసుకునేవారు. రైతువర్గానికి చెందినవాళ్లు కారు. చాలామంది అనుకున్నట్టు. ఆవిడ తండ్రి నికలస్ బొజాక్సియొ భవన నిర్మాణ కాంట్రాక్టరు. ఆయన సంస్థకు గొప్ప పేరు వుండేది. తొలి స్కోప్‌జి థియేటర్ కట్టింది వాళ్లే. ఆయన పట్టణమండలిలో సభ్యుడు. ఆయనకు చాలా భాషలు వచ్చు. మాతృభాష అల్బేనియన్‌తోబాటు సెర్బో–క్రొయేషను, టర్కీ భాషలు వచ్చు. మదర్ థెరెసాకు తొలిరోజుల్లో ఆధ్యాత్మిక గురువైన ఫాదర్ సెలెస్టైవాన్ ఎగ్జెమ్ ఆవిడ తన తండ్రి గురించి అన్న మాటలను నాకు చెప్పేరు. తండ్రి దయాగుణం వున్న మనిషి అనీ, అడిగిన పేదలకు యెప్పుడూ లేదనేవాడుకాదనీ ఆవిడ చెప్పేరు. అమె తల్లి డ్రానా ఫైల్ బెర్నమ్ వెనిస్ ప్రాంతం ఆవిడ. వాళ్లది పెద్ద ఇల్లు. చుట్టూతా పెద్దతోట. యెన్నో పళ్లచెట్లు వుండేవి. థెరెసాకు తోడబుట్టినవాళ్లు యిద్దరున్నారు. ఏజ్ ఆవిడ అక్కయ్య, 1904లో పుట్టేరు. అన్న లాజర్, 1907 లో పుట్టేడు.

కుటుంబం సంతోషంగా వుండేదవి మదర్ థెరెసా చాలాసార్లు చెప్పేరు. "చాలా కలిసిమెలిసి వుండేవాళ్లం. మా నాన్నగారు పోయేక మరీనీ." పిల్లల బడిచదువు సెక్రెడ్‌హార్ట్ చర్చిలో సాగింది. తర్వాత కేథలిక్ కాని ప్రభుత్వపాఠశాలలకు వెళ్లేరు. అక్కడ నిర్బంధంగా సెర్బో–క్రొయేషియన్ భాషలో బోధన సాగేది. అయితే వాళ్ళ మతపర శిక్షణ కొనసాగింది చర్చి దగ్గరా, యింటి దగ్గరా కూడా. కుటుంబం గురించి యెప్పుడోగాని ఆవిడ చెప్పేవారుకాదు. అ చెప్పిన సందర్భాలలో "నాకు మా అమ్మ దగ్గర చేరిక" అనేవారు. "ఆవిడ చాలా పవిత్రురాలు" అని చెప్పేవారు.

పసి ఆగ్నెస్ (ఆవిడ పుట్టిన తర్వాత నామకరణంనాడు పెట్టిన పేరు) మీద తల్లి ప్రభావం చాలా వుందని ఫాదర్ వాన్‌ఎక్సెమ్ అంటారు. ముఖ్యంగా మదర్ ఆధ్యాత్మిక జీవితం మీద. యేమంటే ఆవిడ తల్లి మామూలుగా చెప్పుకునే భక్తురాలు మాత్రమే కాదు. ఆవిడ నిబద్ధత ఆచరణశీలం అయింది. దానివల్ల ఆవిడ అర్తులసేవను యెప్పుడూ దాటవెయ్యలేదు. 'అమ్మా' అంటూ తన గడప తొక్కిన యెవర్నీ "లేదు" పొమ్మనలేదు. వాళ్లు అన్నం కోసం వచ్చినవాళ్లు కాని, ఆశ్రయం అర్థించి వచ్చినవాళ్లుకాని, బట్టలు యిమ్మని అడిగేవాళ్లు కాని, ఆఖరికి డబ్బు అర్థించేవాళ్లైనా గానీ. "ఆమె దేవుణ్ణి ప్రేమించడం, పొరుగువాళ్లని ప్రేమించడం మాకు నేర్పేరు" అని మదర్ థెరెసా అంటారు.

1979 డిసెంబర్ ఓస్లోలో ఆవిడకు నోబెల్ బహుమతీప్రదానం చేసినప్పుడు ఉత్సవం జరిగింది. అప్పుడు అక్కడికి వచ్చిన ఆవిడ అన్న లాజర్ ఆవిడ బాల్యజీవితం గురించి చెప్పేరు. చిన్నపిల్లగా వున్నప్పుడు ఆమెని ఆగ్నెస్ అని పిలిచేవారుకాదట. గోన్జ అని పిలిచేవారట. అల్బేనియా భాషలో ఆ మాటకు "పువ్వుమొగ్గ" అని అర్థం. ఏమంటే ఆవిడ ఎర్రగా, బొద్దుగా వుండేవారట. పరిశుభ్రంగా పువ్వులా వుండేవారట. యే సాయం కావాల్సివచ్చినా చెయ్యడానికి సిద్ధంగా వుండేవారట. తను చిన్నపిల్లవాడిగా వున్నప్పుడు చాక్‌లెట్లు, మిఠాయిలు అంటే తెగ యిష్టపడేవాడట. యెవళ్లకీ తెలియకుండా రాత్రిపూట వంటింట్లోకి దూరేవాడట. ఆవిడ మాత్రం యెప్పుడూ జామ్ దొంగతనంగా తీసుకోలేదట. అలా అని లాజర్ చెప్పేడు. పొద్దున్నే ప్రార్థనకు వెళ్లవలసివస్తే అర్ధరాత్రి తినుబండారాలని యెప్పుడూ తాకవద్దు అని ఆవిడ అన్నకు చెపుతూ వుండేవారట. అయితే యీ దొంగపన్ల గురించి తల్లికి యెన్నడూ చాడీలు చెప్పేవారుకాదట.

గోన్జ తల్లికి గట్టి నమ్మకాలు వుండేవి. పిల్లలు వాళ్లమ్మని 'నానాలొకె' అని పిలిచేవారట. నానా అంటే తల్లి, లొకె అంటే ఆత్మ, 'నా ఆత్మకు తల్లి' అని అర్థం వచ్చేటట్టు. ఆవిడ దేన్నీ వృధా చెయ్యడం అన్నా అసహ్యించుకునేవారట. యీ పొదుపరితనం గురించి ఓసారి యెక్కడో చదివేను. అది నిజమేనని మదర్ ధ్రువపరిచేరు. ఓ రోజు సాయంత్రం పిల్లలందరూ తల్లి దగ్గర చేరేరట. యేవో పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకుంటున్నారు. చాలాసేపు అలా గడిచిందట. చివర్న ఆవిడ లేచేరట, దీపం స్విచ్ ఆర్పడానికి! యిల్లంతా చీకటి. ఉబుసుపోక కబుర్లు చెప్పుకోవడం కోసం విద్యుత్‌ని దండగ చెయ్యడం యెందుకని ఆమె అన్నారట.

1917లో భర్త అకాలమరణం దెబ్బని తట్టుకోగలిగిందీ అంటే ఆమెకున్న ప్రబలవిశ్వాసమే కారణం అని చెప్పాలి. ఆ తర్వాత చాలా నెలలు ఆమె నిశ్చేష్టితంగా వుండిపోయిందట. తేరుకున్నాక, మళ్లీ కంకణం కట్టుకుని చిన్న వ్యాపారం సొంతంగా ప్రారంభించింది. లేసుబట్టల అమ్మకం వ్యాపారం. ప్రతికూలపరిస్థితిని పరిశ్రమ వేపు మళ్లించుకుంది. ఆ సంపాదనతో ముగ్గురుపిల్లల్నీ పెంచి పెద్దచేసింది. నికలస్ బొజాక్సియొ భాగస్వామి– వాళ్ల సంస్థ నిధులు మోసంచేసి, ఆమెకి, పిల్లలకీ నెత్తిమీద ఆస్తరణ తప్ప మరేమీ మిగలకుండా చెయ్యడంతో– ఆమె యిలా నడుంబిగించక తప్పలేదు. కష్టకాలంలో యిలా సొంతకాళ్లమీద నిలబడడం ఆగ్నెస్ మీద గట్టి ముద్రవేసి వుంటుంది. తండ్రిపోయేనాటికి ఆవిడకు ఏడేళ్లు.

అంతకు ముందటికంటే చర్చ్ఆఫ్‌దిసేక్రెడ్‌హార్ట్ కుటుంబ జీవితంలో ముఖ్యభాగం అయింది. ఆగ్నెస్, ఆవిడ అక్కడ చర్చికార్యకలాపాలు చాలా వాటిలో పాల్గొనేవారు. ఆగ్నెస్ తరచూ చర్చి లైబ్రరీకి వెళ్లేవారు. ఆవిడకు పుస్తకాలంటే యిష్టం.

"నన్ కావాలి అని మొదటిసారి నాకు అనిపించినప్పుడు నాకు పన్నెండేళ్లే. మా అమ్మా వాళ్లతో స్కోప్‌జీలో యింటి దగ్గర వుండేదాన్ని," అని మదర్ థెరెసా గుర్తుచేసుకున్నారు. సహజంగా తల్లినే ముందు అడుగుతారు కదా, అయితే ఆమె అబ్బే వద్దు అంది. ఆగ్నెస్ అప్పటికి యింకా చిన్నపిల్ల కదా. అయితే యీ ప్రేరణ ఆగ్నెస్‌కి యెంతోకాలం నిలవలేదు. కాని యేదో విధికృతం అయిన పథం మీద నిర్నిరోధంగా సాగుతూనే వున్నారు. తల్లీకూతురూ చర్చిలో చాలాసమయం గడిపేవారు. స్కోప్‌జీలోని లేడీ ఆఫ్‌దిలెట్నిస్ పాదాల దగ్గర జపించే పవిత్ర జపమాలిక వాళ్లకి చాలా యిష్టమైన ప్రార్థన; రాత్రి పొద్దుపోయేక యింటి దగ్గర ఆ ప్రార్థనలోనే గడిపేవారు. బడి అయిపోయేక ఆగ్నెస్ చర్చిపనుల్లో మునిగిపోయేవారు. ఆ సందర్భంలోనే వాళ్లకు ఫాదర్ జాంబ్రెన్‌కోవిచ్‌తో పరిచయం అయింది. ఆయన 1925లో పాస్టర్ అయేరు. అయన "పావన కన్య మేరీ క్రైస్తవ సోదర సంఘం" (Sodality of the blessed virgin Mary) స్థాపించేరు. ఆ సంఘం ఆగ్నెస్ మీద చాలా గాఢమైన ప్రభావం కలిగించింది. యీ సొడాలిటియే కొన్నేళ్ల తర్వాత కలకత్తాలోని ఎంటల్లీ కాన్వెంట్‌లో కలిసింది.

యీ సంఘంలో సెయింట్ల జీవితాల గురించీ, మిషనరీల జీవితాల గురించీ తెలుసుకునేవాళ్లు. ఫాదర్ జాంబ్రెన్‌కోవిచ్ వాళ్లకు యుగోస్లావ్‌జెసూట్‌ల గురించి చెప్పేవాడు. 1924 లో వాళ్లు బెంగాల్‌రాష్ట్రాన్ని సందర్శించేరు. యీ మిషనరీల ఉత్సాహపూరిత కార్యకలాపాల గురించి సంఘం సభ్యులకు చెప్పేరు. ఆగ్నెస్ మీద ఆ ముద్ర బాగా పడింది. "ప్రజలతో వాళ్ల అనుభవాల గురించి చక్కగా కళ్లకు కట్టినట్టు వర్ణించి చెప్పేరు, ముఖ్యంగా భారతదేశంలోని బాలల గురించి" అని మదర్ థెరెసా గుర్తు చేసుకుంటారు. బెంగాల్‌లో ఒక నన్‌ల మఠం వుందనీ, దాని ప్రధానకార్యకలాపం విద్యారంగంలోననీ ఆవిడకు తెలిసింది. యీ లొరెటో నన్‌లు ఓ అంతర్జాతీయ మఠంలో సభ్యులు. బెంగాల్‌లో ఐరిస్‌శాఖ సభ్యులు సేవలు అందిస్తున్నారు.

అప్పటికి యువతి అయిన ఆగ్నెస్ కొన్ని ముఖ్యమైన లక్షణాలను పెంపొందించుకున్నారు. ఆవిడ బాగా చదివేదనీ, ముచ్చటగా కనిపించేదనీ, కంజాయింపుగా వుండేదనీ లాజర్ చెప్పేడు. పిల్లలకు భక్తి బోధించేవారు, బోధన అంటే యిష్టంగా వుండేవారు. ఆ తొలిరోజుల్లో కూడా యెవళ్లనుంచీ సాయంగాని తోడుగాని కాదనేవారుకారు, తన మీద ఆధారపడవచ్చన్నట్టు అన్ని భక్తిబోధలకీ సానుకూలురాలుగా వున్నట్టు ప్రవర్తించేవారు.

తొలి సంవేదనల తర్వాత ఆరేళ్లకు మదర్ థెరెసా "పిలుపు" అందుకున్నారు. కుటుంబాన్ని అప్పుల్ని వదలి, మిషనరీ కావాలన్న పిలుపు అది. నిజంగానే తనకి పిలుపు అందిందా అన్న శంకలు ఆవిడకే కలిగాయి. అప్పుడావిడ ఫాదర్ జాంబ్రెన్‌కోవిచ్ దగ్గరకు వెళ్లేరు. భగవంతుని పిలుపు అందుకున్నట్టయితే గనక, దాన్ననుసరించి విధాయకంగా ఒక గాఢమైన ఆనందానుభూతి కలుగుతుందని,

జీవితలక్ష్య సూచకమైందైతే మరీ ముఖ్యంగా అలా వుంటుందని ఆవిడకు వివరించి చెప్పినవారు ఆయనే.

ఇటీవలనే 'మాతృగృహం' దగ్గరి చర్చి బయట బల్లమీద కూర్చున్నపుడు మదర్ థెరెసా నాతో చెప్పేరు. "నా పద్దెనిమిదో యేట నన్ కావడంకోసం యిల్లువదలి వచ్చేశాను. నా జీవితలక్ష్యం పేదల సేవేనని అప్పటికే నాకు అవగతం అయింది. అప్పట్నుంచి యిప్పటిదాకా నేను తీసుకున్న నిర్ణయం గురించి నాకు పిసరంత శంక లేదు." పైకి ఓ వేలుయెత్తి చూపిస్తూ "ఆయనే యీ ఎంపిక చేశారు" అన్నారు. యిప్పుడూ ఆవిడ మనస్సులో యే శంకాలేశమూ వున్నట్టు లేదు. గోన్జ తల్లికి యీ విషయం చెప్పినప్పుడు 'నానాలొకె' తన గదిలోకి వెళ్లిపోయి ఓ రోజంతా అక్కడే వుండిపోయింది. ఆవిడ బయటకి వచ్చేటప్పటికి లక్ష్యపథం యేమిటైందీ తల్లీకూతుళ్లిద్దరికీ బోధపడింది. "నీ చేతిని ప్రభువు చేతిలో పెట్టు. ఆయనతోనే కడకంటా నడు" అని తల్లి ఆవిడకు చెప్పింది.

స్పష్టంగా అది భగవంతుని పిలుపే. దాన్ని ఆవిడ శిరోధార్యంగా భావించేరు. అపుడు ఆగ్నెస్ బెంగాల్‌లోని లొరేటో మఠానికి అర్జీ పంపేరు. బెంగాల్ మఠానికి ఐర్లండ్ పట్టణం రాత్‌ఫార్మన్‌లో వున్న లొరెటో అబ్బె ద్వారా వచ్చి చేరాలని ఆవిడకు వర్తమానం పంపేరు. మొదటగా తను అక్కడికి వెళ్లాలి. కొంత ఇంగ్లీషు నేర్చుకోవాలి. 1928 సెప్టెంబర్ 28న తల్లితో, అక్కతో కలిసి ఆగ్నెస్ స్కోప్జి నుంచి జాగ్రెబ్‌కి రైల్లో బయల్దేరారు. స్కోప్జి రైల్వేస్టేషన్లో ఆవిడకు బంధువులు, మిత్రులు, సొడాలిటి సభ్యులు కళ్లల్లో నీళ్లు తిరుగుతూ వుంటే వీడ్కోలు చెప్పారు. జాగ్రెబ్‌లో ప్రియమైన తల్లితో, అక్కతో గడిపిన ఆ కొద్దిరోజులూ రెప్పపాటులో గడిచిపోయేయి. ఆఖర్ని జాగ్రెబ్ స్టేషన్లో తల్లికి "అమ్మా, వెళ్లొస్తా" అని చెప్పిన సందర్భమే ఆవిడ తల్లిని కడసారి చూడడం.

* * *

# 2 బెంగాలీ థెరెసా

మదర్ థెరెసా రాథ్‌ఫార్మన్‌లో మతదీక్ష నిమిత్తం నిండా రెండునెలలు వుండకపోయినా తనకి ఇంగ్లీషు నేర్పిన మదర్‌బోర్గియాఇర్విన్ ఆ చర్చి, సామూహిక మందిరం ఆవిడ స్మృతిపథంలో మిగిలిపోయేయి. అప్పట్నుంచీ ఆవిడ మాట్లాడే భాష అయింది ఇంగ్లీషు. 1928 నవంబర్లో ఆవిడ భారతదేశానికి ఓడలో ప్రయాణమయ్యేరు. ఏడువారాల తర్వాత కలకత్తా చేరుకున్నారు.

కలకత్తా గురించి ఆవిడకు మొదట కలిగిన అభిప్రాయాలు యేమిటో మనకి తెలియదు. కాని హౌరా రైల్వేస్టేషన్లో "బొంబాయి మెయిల్" దిగేటప్పటికి వింత రంగులు, ధ్వనులు, వాసనలు గోచరమైవుంటాయి. గుంపులుగా వున్న జనంలో ప్రయాణీకుల సామాన్లకోసం కూలీల తోపులాటలు, బంధువులని పలకరించడానికి వచ్చిన ఆ జనం తగిలే వుండచ్చు. ఆవిడ కలకత్తాలో కొన్ని రోజులే వున్నారు. ఏమంటే 1929 జనవరి 16న ఆవిడ్ని డార్జిలింగ్‌లో వున్న 'లొరేటో నోవోటియే'కి పంపేరు. డార్జిలింగ్ పర్వతమయ విశ్రాంతి కేంద్రం, కలకత్తాకు 400మైళ్ల దూరంలో వుంది. హిమ ఆచ్ఛాదిత కాంచనగంగ శిఖరం దిగువన. యిక్కడే ఆవిడ శిక్షణార్థి నన్ జీవితానికి శ్రీకారం చుట్టేరు.

డార్జిలింగ్ షోకైన పర్వత విడిదిప్రాంతం. 1911లో కలకత్తా నుంచి ఢిల్లీకి బ్రిటిష్‌పాలన రాజధాని మారకముందు, వైస్రాయ్ తన మందీ మార్బలంతో "వేసవివేడి" సోకేటప్పుడు డార్జిలింగ్ మకాం వెళ్లేవాడు. నాలుగు నెలలబాటు యీ చిన్నపట్టణంలో యెడతెగకుండా విందులు, నాట్యాలు, వినోదాలు సాగేవి. మెరిసిపోయే పచ్చికబయళ్లమీద విందులు జరిగేవి. గవర్నమెంట్ హౌస్ లాన్స్ అవి. రీవి తొణికిసలాడే బట్టలు వేసుకున్న బ్రిటిష్ అధికారగణం, వైస్రాయి సలహామండలి సభ్యులు, సైన్యాధ్యక్షులు, న్యాయాధీశులు, మెరిసిపోయే మహారాజులు, ఒంటినిండా ధగధగలాడిపోయే నగలతో మహారాణులు ఆ విందు నాట్యాలకి విచ్చేస్తూ వుండేవాళ్లు.

భారతదేశ వేసవి రాజధాని సిమ్లాకు తరలిపోయినపుడు కూడా డార్జిలింగ్‌లో జీవితం యథాపూర్వస్థితిలోనే కొనసాగింది. తేడా అల్లా యిప్పుడు అధిదేవత బెంగాల్ గవర్నర్ అవడం. అప్పట్లో డార్జిలింగ్ భారతదేశంలో బ్రిటిష్ విద్యకు

ముఖ్యకేంద్రంగా వెలిగింది. మిషనరీలు యెన్నో పాఠశాలల్ని నడిపేవాళ్లు. ముఖ్యంగా బ్రిటిష్ వాళ్ల పిల్లలే ఆ బళ్లలో చేరేవారు, కొద్దిమంది భారతీయ సంపన్న కుటుంబీకుల పిల్లలూ వుండేవాళ్లు. అగ్నేస్‌ని పంపించిన లొరేటో కాన్వెంట్ అలాటి వాటిల్లో ఒకటి.

డార్జిలింగ్ 'నొవిషియేట్'లో సిస్టర్ మారీ–థెరెసెబ్రేన్ అనే ఆవిడ మదర్ థెరెసా సమకాలికురాలు. అక్కడ అరవైయేళ్లనాడు వున్న జీవితం "మరోయుగం" బాపతుదిగా వుండేది. శిక్షణ పొందే నన్‌లకి సిస్టర్ మర్ఫీ అజమాయిషీదారు. ప్రార్థనలకి సంబంధించీ, పుణ్యమూర్తుల బోధల అధ్యయనం గురించీ శిక్షణార్థి నన్‌లకి నిద్రలో తట్టిలేపినా గడగడ వల్లించేటట్టు చెప్పాలని ఆవిడ భావన. రోజూ రెండుగంటలపాటు యీ శిక్షణ నన్‌లు కూడా పేదపిల్లలకు చదువు చెప్పేవారు. ఓ రకంగా అది పనిచేస్తూనే శిక్షణ పొందడంలాంటిది. వారానికోసారి వాళ్లు కన్‌ఫెసర్ (రోమన్ కాథలిక్ ఫాదర్) దగ్గరకు వెళ్లేవాళ్లు. అగ్నెస్ మొదటినుంచీ ఇంగ్లీషు పాఠాలలో మునిగిపోయి వుండేవారని సిస్టర్ బ్రేన్ నాకు చెప్పింది. వాళ్లు ఓ భారతీయ భాష కూడా నేర్చుకోవాలి. అగ్నెస్ బెంగాలీ నేర్చుకోవడం మొదలెట్టేరు. యే కొంచెమో హిందీ కూడా పట్టుబడింది. కాన్వెంట్ గోడలవెనక దైనందిన కార్యకలాపాల్లో వాళ్లు యెంతలా నిమగ్నం అయివుండేవాళ్లంటే ఆ రెండేళ్లూ యిట్టే గడిచిపోయేయి.

1931 మార్చి 24న అగ్నెస్ తన తొలి ప్రమాణాలని లొరేటో సిస్టర్‌గా చేశారు. పేదరికం, పవిత్రత, విధేయత అనేవే ఆ మూడు నియమాలూనూ. ఫ్రెంచి నన్ థెరెసె మార్టిన్ అన్న ఆవిడ పేరుని తన మత జీవిత నామంగా స్వీకరించాలని ఆవిడకు ప్రేరణ కలిగింది. ఆ ఫ్రెంచినన్ మిషనరీల కోసం, వాళ్ల విజయం కోసం ప్రార్థించేది. యిరవైనాలుగేళ్ల చిన్నవయసులోనే క్షయవ్యాధిగ్రస్తురాలై మరణించింది. ఆమె అతి సాధారణమైన, అణకువ అయిన విధుల్ని నిర్వహించడంలో కనిపింపచేసిన అద్వితీయ దయాగుణం ప్రపంచంలోని కాథలిక్‌లందర్నీ ఆకట్టుకుంది. 1927లో ఆమెని సిద్ధస్త్రీగా వాటికన్ ప్రకటించి, సెయింట్ థెరెసె ఆఫ్ లిసోహ్ అన్న బిరుదునిచ్చింది.

అయితే ఆ పేరుతో ఒక చిన్న చిక్కు వచ్చింది. ఏమంటే అంతకు ముందు లేడు నొవిటియేట్ పూర్తిచేసిన సిస్టర్ బ్రేన్ "మేరీ–థెరెసె" అని అప్పటికే పేరు పెట్టుకుంది. యీ చిక్కు లేకుండా చూడాలని అగ్నెస్ తన నూతన నామాన్ని స్పానిష్ వర్ణక్రమ పద్ధతిలో 'దెరెస' అని పెట్టుకుంది. దీనివల్ల ఆవిడ స్పానిష్ మహాకార్మెలైట్ నన్ పేరును స్వీకరించారా అని విధిగా అడిగేవాళ్లు. "అవిలకు చెందిన పెద్ద సెయింట్ థెరెసా కాదు, చిన్న సెయింట్‌కి సంబంధించి" అంటే లిసోహ్‌కి చెందిన సెయింట్ థెరెసె అని స్ఫురింపచేస్తూ అని ఆవిడ నాకు ఓపిగ్గా వివరించేరు. అంతకుముందు వందలాదిమందికి అలానే వివరించి వుంటారు. ఏమైనా లొరెటో ఎంటల్లీలో ఆ యిద్దరకీ తేడా కనిపింపచేసే నూతనశైలి ఆ పభ్యులకు కనిపించింది. యెంతో కాలం గడవకుండానే ఆవిడని బెంగాలీ థెరెసా అని పిలవడం మొదలుపెట్టేరు, బహుశా ఆవిడ బెంగాలీని ధారాళంగా మాట్లాడ్డం వల్లనేనేమో.

☆ ☆ ☆

అవిడ శిక్షణ పూర్తయింది. అవిడను సిస్టర్ థెరెసా అని పిలవడం మొదలెట్టేరు. కలకత్తా శివారు ఎంటల్లోని సెయింట్ మేరీ స్కూల్లో టీచర్‌గా పంపించారు. యీ పాఠశాల లొరెటో కాన్వెంట్‌లో భాగం. అవిడ అక్కడ పదిహేడేళ్లు ఆనందంగా గడిపేరు. మొదట్లో టీచర్‌గా, తర్వాత 1937 నుంచీ ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. అవి గాఢమైన ఆధ్యాత్మిక పునాది యేర్పడ్డానికి నడిపించిన సంవత్సరాలు. ఆ కాలం గురించి అవిడ కృతజ్ఞతాసూచకంగా ముచ్చటిస్తారు. "నా అంతరంగంలో నేను లొరేటోని" అంటారు.

సాధారణ లొరేటో నన్‌గా "బెంగాలి థెరెసా" గడిపిన సంవత్సరాల గురించిన నా పరిశోధన కలకత్తాలోని 54 ఎ లోయర్ సర్క్యులర్ రోడ్‌లో వున్న వాళ్ల కేంద్రస్థానంలో మొదలైంది. అయితే అవిడ తన గురించి ముచ్చటించడానికి చాలా అయిష్టంగా వుంటారని రానురాను నాకు అర్థమైంది. "నేనేమంత ముఖ్యం కాదు" అని యెక్కువసార్లు అనేవారు. "నా కృషి గురించి రాయండి" అని ముక్తాయింపుగా జోడించేవారు. దాంతో సిస్టర్ జోసెఫ్ మైఖేల్‌తో మాట్లాడాలనుకున్నాను. సెయింట్ మేరీ స్కూల్లో తను గడిపిన జీవితం గురించి నాకు సమాచారం అందించమనీ, సహాయపడమనీ అవిడే సిస్టర్ జోసెఫ్ మైఖేల్‌కి చెప్పేరు. యీామె కూడా కలకత్తాకు చెందిన వ్యక్తే. మొదటిచర్యగా ఆమె నన్ను ఫాదర్ వాన్‌ఎగ్జెమ్‌కు పరిచయం చేయించింది.

ఫాదర్ సెలెస్టీవాన్ ఎగ్జెమ్ కలకత్తా సెయింట్ గ్జావీర్ కళాశాలలో పనిచేసి రిటైరై జీవితం గడుపుతున్నారు. ఎనభై యేళ్లు పైబడి వుంటాయి. తోడు లేకుండా నడవలేరు. యెప్పుడోగాని బయటకు రావడంలేదు. ఆయన "సొసైటీ ఆఫ్ జీసస్" సంస్థ సభ్యులు. రెండవ ప్రపంచయుద్ధకాలంలో స్వదేశమైన బెల్జియమ్‌ని వదలి కలకత్తా వచ్చేరు. అంతకుముందు చాలాకాలం మధ్యప్రాచ్యంలో గడిపేరు. అరబ్‌భాష మంచినీళ్లప్రాయంగా మాట్లాడగలరు. కలకత్తాలో ఆయనకి త్వరలోనే చాలామంది ముస్లిం స్నేహితులు దొరికేరు.

యుద్ధసమయంలో సెయింట్ మేరీ స్కూల్ తాత్కాలికంగా కాన్వెంట్ వీధిలో వుండేది. అప్పుడు ఆయన్ని అక్కడ ప్రార్థనా కార్యక్రమం నిర్వహించమన్నారు. అక్కడ్నే తొలిసారి ఆయన 1944 జూలై 12న మదర్ థెరెసాను కలుసుకున్నారు. తర్వాత కొద్దిరోజులకే ఆయన అవిడకు ఆధ్యాత్మిక గురువు అయేరు. అవిడ జీవితంలో మహాక్లిష్టమైన దశలో అవిడకు సలహాలిచ్చి నడిపించేరు.

ఆయన నన్ను సాదరంగా ఆహ్వానించేరు. ఆయన మదర్ థెరెసాతో తనకున్న సాహచర్యాన్ని చాలా గొప్పగా భావించుకుంటారు. నా ఉద్దేశ్యమేమైందీ తనకు నమ్మకం కుదిరినప్పుడే, అవిడ తొలిరోజుల జీవితం గురించిన అద్భుత జ్ఞాపకాల వెల్లువను విడుదల చేశారు. "అవిడకు ప్రచారం యెన్నడూ కిట్టదు. అది అవసరమమ్మా అని నేను అంటూ వుండేవాణ్ణి. మదర్ థెరెసా తను చేస్తూవున్న పని గురించి టముకు వేసుకోలేదు. అవిడకా శక్తీ లేదు, వ్యవధీ లేదు" అన్నారాయన. "మదర్ థెరెసా గురించి పుస్తకం రావడం చాలామంచిది" అని కొంచెంసేపు ఆగి జోడించేరు.

"మీరు ఎంటల్లీ వెళ్లేరా?" అని ఓ రోజు మధ్యాహ్నం ఆయన నన్ను అడిగేరు. "వాళ్ల దగ్గర కొంత లిఖిత సమాచారం వుంది. అందులో కొన్ని విశేషాలు తెలుస్తాయి. దాదాపు ఇరవైయేళ్లు మదర్ థెరెసాతో కలిసి గడిపిన సిస్టర్లు ఆ సమాచారం తయారుచేశారు. మొదట డార్జిలింగ్‌లో ఆవిడ నన్ శిక్షణ పొందిన రోజులకు సంబంధించిన వివరాలు, తర్వాత ఎంటల్లీ కాన్వెంట్‌లో దీక్ష పొందిన అమ్మాయి నన్‌గా గడిపిన రోజులవి. మదర్ థెరెసా దగ్గర్నుంచి ఉత్తరం తీసుకువెళ్లి చూపించండి. ఆవిడ ఆశీస్సులు వున్నట్టు చూపించండి. మీరు నన్ను యిక్కడ కలుసుకున్నట్టూ చెప్పండి. నేనే మిమ్మల్ని ఎంటల్లీ కాన్వెంట్‌కు పంపించేననీ చెప్పండి. అక్కడ మీకు యెక్కువ విశేషాలు తెలుస్తాయి" అన్నారాయన.

ఆ రకంగా దారి చూపించేక, నేను ఎంటల్లీ వెళ్లేను. కలకత్తా షోకైన పార్క్‌స్ట్రీట్‌లో పెద్ద హోటళ్లు, విమానాల ఆఫీసులు, సౌందర్యశాలలు చాలా వున్నాయి. అక్కడినుంచి ఆ కాన్వెంట్‌కు దూరం కొన్నిమైళ్లే. అయితే దారిలో మురికివాడలు, దిక్కు, దివాణం లేని ప్రదేశాలు తగిలి అదంతా మరో లోకం అనిపించింది.

అప్పుడు భారీగేటులో నుంచి లోపలికి వున్నదారి కొంత సంతోషవిస్మయాలు కలిగించింది. ఆటస్థలాలు పరిశుభ్రంగా వున్నాయి. చక్కగా కత్తిరించిన పచ్చికబయలు. అక్కడ చాలా భవనాలు వున్నాయి. గతవైభవాన్ని ప్రతిఫలించే భవనాలు అవి. శతాబ్దం ఆరంభం నాటి వలస ప్రాసాదాలు. స్తంభాలు, చెక్కతలుపులు రాజసం ప్రతిబింబిస్తున్నాయి. తర్వాత వెలిబూదిరంగు పొందికైన తరగతిగదులు వున్నాయి. బహుశా యివి యిటీవలివే అయివుంటాయి. ఆ ప్రదేశంలో భాగంగా వుంది సెయింట్ మేరీస్ పాఠశాల. అది విడిగావున్న భవనం. వసారాలకి పసుపుపచ్చ వెల్ల వుంది. తర్వాత కాన్వెంట్‌గది. అక్కడ టేకు నగిషీ కుర్చీలు వగైరా వున్నాయి. మొదట అక్కడకు వెళ్లి మదర్ సుపీరియర్‌కి చీటీ పంపించేను. కొన్నిక్షణాల తర్వాత చలాకీగా వుండే ఒక ఐరిష్ నన్ లోపలికి వచ్చింది. మదర్ థెరెసా వెళ్లిపోయిన కొన్ని నెలల తర్వాతే తనా ఎంటల్లీ కాన్వెంట్‌కి వచ్చేనని ఆమె వున్నదున్నట్టు చెపుతున్నట్టుగా అంది. అంచేత తనకి ఆవిడ గురించిన ప్రత్యక్ష సమాచారం తెలియదు. యేదో లిఖిత సమాచారం ప్రతులు ఆవిడ దగ్గర వున్నట్టు, సంతోషంగా ఒక కాపీని నాకివ్వగలనన్నట్టూ చెప్పింది. యీలోపున నేను కాన్వెంట్‌ని సందర్శించవచ్చుకదా.

ఎంటల్లీలోని లొరేటో కాన్వెంట్ అన్నిరకాల అనాథలకీ ఆశ్రమంగా ఆరంభమైంది. యివాల్టికి కూడా యిక్కడవున్న పిల్లల్లో 300 మంది అనాథలో, యిల్లూ వాకిలి లేనివాళ్లో. అంతేమంది మధ్యతరగతి బెంగాలీ కుటుంబాల పిల్లలు. వాళ్లు చదువుకుందుకే అక్కడకు వస్తారు. మరో 200 మంది పేదపిల్లలు సెయింట్ మేరీస్ స్కూల్లో చదువుకుంటున్నారు. వాళ్లకి నన్‌లు బెంగాలీ భాష నేర్పుతారు.

డార్జిలింగ్‌లో తన వృత్తి గురించి తొలి ప్రమాణాలు, చేశాక సిస్టర్ థెరెసాని సెయింట్ మేరీస్ స్కూల్‌కే పంపించేరు. అక్కడ సిస్టర్లు సెయింట్ ఆన్నీడాటర్స్‌తో కలిసి పనిచేస్తారు. యీ సంస్థ 1898లో లొరేటోలో స్థాపితమైన బిషప్ భక్తుల బృందం.

నన్‌లలో బెంగాలీ వనితలున్నారు. వాళ్లు బెంగాలీలోనే బోధన చేస్తారు. వాళ్ల అలవాట్లు యూరప్ ఖండానివి కావు. వాళ్లు చీరలు కట్టుకునేవాళ్లు. తర్వాత కొన్నేళ్లు సిస్టర్ థెరెసా భూగోళశాస్త్రం, చరిత్ర, ప్రశ్నోత్తర ఖండం బోధించేరు. బోధనతో బాటు అనేక యితర కార్యకలాపాలూ నిర్వహించేరు. సెయింట్ మేరీస్‌లో మదర్ దుసెనాకిల్ సుపీరియర్‌గా వున్నారు. (అబ్బెస్ హెడ్). త్వరలోనే సిస్టర్ థెరెసా మదర్ దుసెనాకిల్‌కి కుడిభుజం అయేరు. "నేను మంచి టీచర్‌ని అవునోకాదో నాకు తెలియదు. నాకు టీచింగ్ అంటే యిష్టం అనే నాకు తెలుసు" అన్నారావిడ ఓసారి, నవ్వుతూ.

ఇపుడు సిస్టర్ మేరీ థెరెసె బ్రేన్ 'మిడిల్‌టన్‌రో'లో వున్న లొరేటో కాలేజిలో పదవికి సంబంధించి అర్ధవిరమణలో వున్నారు. భారతదేశంలో ఆ మఠం స్థాపించిన మొదటి మహిళాకళాశాల అదే. అవిడకు 84 యేళ్లు వున్నాయి. డెబ్బైయేళ్లకు పైబడి వుండవు మీకని నేను అన్నాను. ఆమె కిలకిలా నవ్వింది. ఆ నవ్వుకు ముచ్చటైన గిలిగింత శబ్దం ఆ హాలంతా మోగింది. భారతదేశంలోని మండుటెండల ప్రభావంవున్నా అవిడ శరీరఛాయ సామెత చెప్పినట్టు దబ్బపండు రంగుతోనే వుంది. తను 1928లో రాథ్‌పార్న్మన్ శిక్షణ పూర్తిచేసుకుని వచ్చేనని మృదువుగా చెప్పింది. మదర్ థెరెసా కంటే ఓ యేడు ముందన్నమాట. దాదాపు జీవితమంతా ఎంటల్లీలోనే గడిపింది. మూడేళ్లనాడే 'మిడిలెటన్‌రో'లోని పై వర్గాల పరిసరాలకి మారింది. నడవడం కష్టంగా వున్నా క్రసాయంతో నడుస్తూ కాలేజీ పూలతోటలను పర్యవేక్షిస్తూ వుంటుందావిడ. ఓ మాదిరి దగ్గర్లోనే వున్న రాజభవన్, గవర్నర్ నివాసం, కంటే యివే బాగున్నట్టు కనిపిస్తాయి.

"మదర్ థెరెసా చాలా సాదాగా, ముచ్చటగా వుండేది. చెప్పేనుగా, 1929 నుంచీ అవిడ్ని యెరుగుదును. అవిడలో అసామాన్యమైందేమీ లేదు. నిరాడంబరంగా, సామాన్యంగా వుండే మామూలు అమ్మాయి. చాలా సౌమ్యంగా హుషారుగా వుండేది. యేం కనిపించినా సంతోషించేది. అవిడ లొరేటో వదలి వెళ్లిపోతుందని ఆ రోజుల్లో చూచాయగా కూడా యేమీ తెలిసేది కాదు యేమాత్రం. ఆమె యింత గొప్ప అవుతారని అణుమాత్రం మేం అనుకోలేదు" అంది సిస్టర్ బ్రేన్.

"మేం యిద్దరం డార్జిలింగ్ నొవాషియేట్‌లో కలిసేవున్నాం. ఆ తర్వాత నేను కలకత్తా వెళ్లిపోయేను. అవిడ అక్కడే వుండిపోయేరు. ఆమె చదువు యింకా పూర్తవలేదు. 1931లో పూర్తయింది. అప్పుడామె ఎంటల్లీకి వచ్చింది. నేనక్కడ వున్నాను. అక్కడ మళ్లీ పదిహేనేళ్లు కలిసి వున్నాం. అయితే పూర్తికాలం నేను అక్కడ అవిడతోనే లేను. యేమంటే ఆమె పక్కనేవున్న సెయింట్ మేరీస్‌లోనూ అనాథాశ్రమంలోనూ వుండేది. దాంతో భోజనాల దగ్గర కలుసుకునేవాళ్లం, సంఘ సభ్యులందరూ ఒకచోట చేరినప్పుడు ఆ రోజుల్లో బయటకు వెళ్లేవాళ్లం కాదు, చెప్పాలంటే గువ్వపిట్టల్లా గూళ్లల్లో వుండేవాళ్లం" అని చెప్పసాగేరు ఆమె.

మామూలుగా సెయింట్‌మేరీస్‌లో సగటు పనిదినం దీర్ఘంగానే వుండేది. క్లాసులు నిర్విరామంగా ఉదయం 9 నుంచి మధ్యాహ్నం 3 దాకా సాగేవి. పొద్దున్నా

సాయంత్రం "సంరక్షించడం" వుండేది, పిల్లల్ని జాగ్రత్తగా కనిపెట్టి వుండడానికి లొరేటోలో అలా అనేవారు. క్లాసులో రాసిన వాటిని దిద్దడం, తర్వాత బళ్లోపని, చిన్నపిల్లల ఆటపాటల్ని ఓ కంట కనిపెట్టి చూడ్డం వుండేవి. "కొంత క్రమశిక్షణ వుంచాలికదా. మాస్ టైమ్‌టేబుల్ వుండేది. దాన్ని మేం అమలు జరిపేవాళ్లం. మామీద యే బలవంతమూ లేదనుకోండి. కాని దాన్ని అనుసరించలేకపోతే యీ వృత్తికి పనికిరామన్నమాట."

"మదర్ థెరెసా లొరేటోలో యెలా యిమడగలిగేరు?" అనడిగేను. "ఆమె చాలా కష్టపడి పని చేసేవారు. చాలా. యింతసేపు యీ పనిలో, అంతసేపు ఆ పనిలో మునిగిపోయేవారు. యే పనీ తప్పించుకునేవారుకాదు. యెప్పుడూ వూ అనడమే. చాలా భక్తిభావంతో వుండేది. తన పద్ధతిలో తను వుండేది. తనధోరణిని యెవళ్లమీద రుద్దేదికాదు. తను యెలా వుండాలనుకుంటోందో అలా వుండేది అనచ్చు" అని చెప్పిందామె. కొంచెం ఆగి, "చాలా బాగా యిమడగలిగింది. చాలా సంతోషంగా వుండేవాళ్లం, సంతోషంగా."

30లలో కాన్వెంట్ జీవితం గురించిన చిత్రాన్ని ఓ నన్ గుర్తు చేసుకుంటూ చెప్పింది. ఆమె పేరు సిస్టర్ ఫాన్‌సెస్కా. యిప్పుడామెకి డెబ్బైయేళ్లు. యింకా సెయింట్ మేరీస్ కార్యదర్శిగానే పనిచేస్తోంది, యెప్పుడో 1983లో రిటైరైనా కానీ. సెయింట్ మేరీ స్కూల్లో ఆమె చదువుకునేటప్పుడు మదర్ థెరెసా ఆమె టీచర్. అప్పట్లో కూడా మదర్ థెరెసా వ్యక్తిగత పరిశుభ్రతకు పెద్దపీట వేసేవారని ఆమె గుర్తుచేసుకుంది.

"1936 జనవరి 13న నేనిక్కడకు వచ్చేనాటికి ఆవిడ యింకా సిస్టర్ థెరెసాగానే వున్నారు. ఆవిడ అప్పటికి పూర్తి దీక్ష పొందలేదు. పొద్దున్నే మమ్మల్ని స్నానాలకు తీసుకువెళ్లేవారు. ఆవిడ అక్కడనుంచుని మేం వొంటిమీద నీళ్లు పోసుకోవాలన్న గంట మోగించేవారు. నీళ్లు ఒకసారి పోసుకున్నాక ఆపవలసిన గంట. మళ్లీ పోసుకోవాలన్న గంట. తర్వాత స్నానం చేసి యివతలకు రావాలన్న గంట. గుమ్మం దగ్గర పొటాషియం పెర్మాంగనేట్ సీసాతో నుంచునేవారు. మేం యివతలకు రాగానే దాన్ని మా నోళ్లల్లో పోసేవారు. మేం పుక్కిలించి ఉమ్మెయ్యాలన్నమాట.

"1936, 37 సంవత్సరాలల్లో సెయింట్ థెరెసా ప్రాథమిక పాఠశాల అజమాయిషీ దారుగా ఆవిడ్ని నియమించేరు. అది లోయర్ సర్క్యులర్ రోడ్‌లో వున్న బెంగాలీ మాధ్యమం బడి. పొద్దున్న వెళ్లిపోయేటప్పుడు ప్రశ్నోత్తరఖండం పాఠం చెప్పేవారు. నాలుగు గంటలకు తిరిగిరాగానే మమ్మల్ని చదువుకుందుకు తీసుకువెళ్లేవారు. ఒకసారి సాయంత్రం ప్రార్థనలకు తీసుకువెళ్లేవారు.

"చిన్నపిల్లగా వున్నప్పుడు నాకు బాగా యిష్టంగా వుండేది ఆదివారం బడి," అంటూ కొంచెం చిరునవ్వు నవ్వుతూ సిస్టర్ ఫ్రాన్సిస్కా చెప్పసాగింది. "సిస్టర్ థెరెసా అక్కడ ప్రాథమిక పాఠశాల పిల్లలకు పాఠాలు చెప్పేవారు. నాలుగ్గోడలనుంచి బయటకు వెళ్లడం మా అందరికీ యిష్టంగా వుండేది. ఎంతోమంది పేదపిల్లలు బడికి వచ్చేవాళ్లు. బడి అయేక అందరూ స్నానాలు చేసేవాళ్లు. ఆఖర్న బహుమతులు యిచ్చేవారు. యెంతమంది జనం పోగయేవాళ్లనుకున్నారు!"

1939–1945 మధ్య యుద్ధకాలంలో చాలా కుటుంబాలు కలకత్తా వదిలిపెట్టి వెళ్లిపోయేయి. తమ కుటుంబం చిట్టగాంగ్‌కి వెళ్లిందని సిస్టర్ ఫ్రాన్సిస్కా చెప్పింది. ఏడేళ్ల తర్వాత కలకత్తా తిరిగి వచ్చింది. అప్పటికి ఎంటల్లీలో చాలా మార్పులు జరిగేయి. సిస్టర్ థెరెసా డార్జిలింగ్‌లో 1929 మే 24న ముగింపు దీక్షాప్రమాణాలు స్వీకరించేరు. సుపీరియర్ హోదాలో సెయింట్ మేరీస్‌కి తిరిగివచ్చేరు. అప్పట్నుంచీ ఆవిడ్ని మదర్ థెరెసా అని పిలిచేవారు. ఓ యేడాది తర్వాత మదర్ దుసెనకిల్‌కి జబ్బుచేసింది. దాంతో మదర్ థెరెసా ప్రిన్సిపాల్ అయేరు. కాని యెప్పటిలాగే క్లాసులు తీసుకునేవారు.

మదర్ థెరెసా చాలా ఆసక్తికరంగా పాఠాలు చెప్పేవారని చాలామంది విద్యార్థులు చెప్పేరు. "ప్రశ్నోత్తరఖండం భలే చెప్పేవారు. తన జీవిత సంఘటనల్నుంచే ఉదాహరణలు యిస్తూ చెప్పేవారు," అని సిస్టర్ ఫ్రాన్సిస్కా చెప్పింది. మదర్ థెరెసా పాఠ్యాంశాన్ని సజీవంగా వుండేట్టు చేశారని మాగ్డలెనగోమ్స్ అనే విద్యార్థిని చెప్పింది. తర్వాత యీమె సిస్టర్ గెర్‌ట్రూడ్ అయింది. పదిహేడేళ్లు ప్రపంచ భౌగోళికశాస్త్రం బోధించిన మదర్ థెరెసా ముప్ఫైయేళ్లు గడిచినా బెంగాల్‌రాష్ట్రం దాటి బయటకు వెళ్లకపోవడం చిత్రం. 1965లో వెనిజులాలో మొట్టమొదటగా విదేశంలో ఆవిడ తన సేవాగృహం ప్రారంభించేరు. ఏదో ఒకరోజున తను స్థాపించిన మిషన్ భూగోళంలో వందదేశాల్లో పైగా శాఖలు స్థాపించుకుంటుందని అప్పట్లో కలలో కూడా అనుకుని వుండేవాళ్లుకాదు.

లొరేటో ఎంటల్లీ గురించిన మరో రహస్యాన్ని వెల్లడించిన వారు ఫాదర్ వాన్ ఎక్జెమ్. సిస్టర్ రోజరియొ ఓ రెయిలీ అక్కడ వున్నారని. ఆమె బిడియస్థురాలు. నలుగురిలోకీ రాదు. ఆమె యెక్కడ వుందో పట్టుకోవడం కష్టం. కొన్నిసార్లు విఫలమయేక ఆఖరికి ఆవిడని కలుసుకోగలిగేను. ఆమె వదనం దయాపూరితంగా వుంది. బాగా ముడతలుపడింది. కలకత్తా ఎండలకు కమిలింది. ఇది ఆమెని చూడగానే నాకు మొదట అనిపించింది. ఆమె ఉచ్చారణలో ఐరిష్ యాస కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. ఆమె రాత్‌ఫార్మన్ అమ్మాయి అని స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఆమెకి ఎనభైదాటేయుట. అయితే అలా కనిపించదు. కనీసం పదేళ్లు అసలు వయస్సుకంటే చిన్నగా కనిపించేటట్టు చేసేదేదో యీ నన్‌లలో వుంది. సిస్టర్ రొజారియొ అందుకు మినహాయింపుకాదు.

1938లో సిస్టర్ రొజారియొ వచ్చేసరికి మదర్ థెరెసా భారతదేశంలో పదేళ్లు గడిపేరు. "1931 నుంచి 1944 దాకా మదర్ థెరెసా టీచర్‌గా పనిచేసింది. 1944లో మదర్ దుసెనకిల్ జబ్బుపడ్డారు. అప్పుడు మదర్ థెరెసా ప్రిన్సిపాల్ అయేరు. ఆమె చాలా సబ్జక్టులు చెప్పేవారు. భోజనాల దగ్గర అగ్రస్థానంలో కూర్చోనేవారు. పొద్దుట ప్రార్థనలప్పుడూనూ.

"తెల్లవారకట్ల అయిదున్నర గంటలకు మా దినచర్య మొదలయేది. మదర్ థెరెసా యెప్పుడూ వేళకి వుండేవారు. మొదట ధ్యానం చేసేవాళ్లం. పొద్దున్న ఆరు గంటలకు సామూహిక ఆరాధన. ఆ ప్రార్థనల తర్వాత పిల్లల కాలకృత్యాలు వగైరా. ఆమె పొద్దున పిల్లల భోజనం చూసేదనుకుంటాను. ఆవిడ క్లాసులు

తీసుకునేది. దీనికి తోడు ఆఫీసు పనీ వుండేది. ఆమె మదర్ దుసెనకిల్‌కి సాయం చేసేది. వాళ్లిద్దరూ బాగా కలిసిమెలిసి పనిచేసేవారు. మధ్యాహ్నం మూడింటిదాకా క్లాసులు వుండేవి. అప్పుడు టీ. సాయంత్రం ప్రార్థనలు అయ్యేక హోమ్‌వర్క్ దిద్దడం. అక్కడే వుండిపోయే పిల్లల్ని ఆవిడ సూపర్వైజ్ చేసేది. సాయంత్రం భోజనాలప్పుడు ఖాయంగా దగ్గరే వుండేది," అని సిస్టర్ రొజారియొ చెప్పింది.

"ఆవిడకు తనది అనేదేమీ వున్నట్టే లేదు. త్యాగబుద్ధిలో ఆవిడకు యెవరూ సాటిరారు. దేవుని భక్తికోసం యేమైనా చేస్తుంది, కష్టాలు, కడగండ్లు అనుభవిస్తుంది. స్వపక్షపాతం అనేది లేనేలేదు. తప్పు జరిగిందీ అని తోచినప్పుడు చెప్పడానికి పిసరు సంకోచించేది కాదు," అని సిస్టర్ ఫ్రాన్‌సెస్కా చెప్పింది.

ఆవిడ వ్యక్తిత్వంలో యితర పార్శ్వాలూ వున్నాయి. ఆవిడ సహవాసులు చెప్పినదాన్నిబట్టి అవి స్ఫుటంగా తెలుస్తున్నాయి. యేమాత్రం అలసత్వం చూపించని అంకిత వ్యక్తి ఆవిడ. ఆమెకి దాతృత్వం వుంది, యితరుల్లో అది లేకపోతే సహించేవారుకాదు. అప్పట్లో కూడా హాస్యచతురత వుండేది యిప్పుడున్నట్టుగానే. పరిహాసోక్తులు, తమాషా సంగతులు అంటే యిష్టపడేవారు. నడుంమీద రెండు చేతులూ పెట్టుకుని పకపకానవ్వేవారు.

వినయ సంపన్నత ఆవిడ సొత్తు. యిప్పటిలాగానే. ఆమె యేమాత్రం వినయం చూపించనిది పేదల డాక్టర్లంటే. తనకి బోలెడు పని వుంది, వాళ్లు చెబితే వినే వ్యవధి ఆమెకు లేదు అని సిస్టర్ మేరీ థెరెసెజీన్ చెప్పింది. "ఎప్పుడూ చాలా నిబ్బరంగా వుండేది. చాలా అణుకువ. ఆ వినయసౌశీల్యం మాత్రం యెప్పుడూ పోగొట్టుకోలేదు. సర్వదా నిరాడంబరంగా, అణకువగానే వుండేది. తన స్వభావమే అంత" అన్నారామె.

లొరేటోలో వున్న కాలంలో ఆవిడ మీద యే ప్రభావాలు పడివుంటాయి అని సిస్టర్ బ్రీన్‌ని అడిగేను. "ఆవిడ ప్రార్థనలు, దేవుని సాన్నిధ్యం" అని సిస్టర్ బ్రీన్ తడుముకోకుండా చెప్పింది. "చాలా సాదాగా వుండేది. మా సిస్టర్లలో ఒక్కళ్లలాగానే చూసేవాళ్లం. చాలా అంకితభావం, భక్తిభావం వున్నామె. అయితే ప్రపంచవ్యాప్తంగా యింత మహాసంస్థ వస్తుందని మేం వూహించలేదు. ఎవళ్లమూ వూహించలేదు" అని చెప్పారామె.

మదర్ థెరెసా వున్న కలకత్తా




Belur Temple
Sinthi
Titagarh →
Dum Dum
Dum Dum Airport →
5 →
Jalia Para Lane
Ultadanga
Howrah Bridge
Maniktala
Howrah
Howrah Station
9
High Court
Sealdah Station
10
Creek Lane
Hooghly River
Fort William
Entally
Motijhil
Maidan
St. Xavier's College
8
Tangra
Garden Reach
Victoria Memorial
6
Park Circus
11
Kidderpore
12
Mansatala Row
Dhapa
Ballygunj
Alipur
7
Kali Temple
Tollygunge
Jadavpur

1 Loreto Convent, Entally
2 St Mary's School
3 Mother House
4 Nirmala Shishu Bhawan
5 Nirmala Kennedy Centre
6 Little Sisters of the Poor
7 Nirmal Hriday
8 Archbishop's House
9 Balthakkhana Church
10 St. Teresa's Church
11 Prem Dan
12 Brother's House
13 Shanti Dan

Not to Scale

# 3 అంతరాత్మ ప్రబోధం

సిస్టర్ల జీవితాలు ఆటుపోటుల్లేకుండా సాగిపోతూవున్న సమయంలో చుట్టూ వున్న పరిస్థితులు వాటిని కలచివేశాయి. తూర్పురంగంలో యుద్ధం తీవ్రమైంది. జపాన్ రెండవ ప్రపంచ యుద్ధంలో ప్రవేశించింది. పొరుగున వున్న బర్మాని ఆక్రమించుకుంది. దాంతో యుద్ధం మరింత తీవ్రం అయింది. అడపాదడపా కలకత్తామీద దాడులు జరిగేయి. తూర్పురంగ యుద్ధానికి కలకత్తా కార్యరంగం అయింది. మిలటరీ అధికారులు తమ అవసరాలకోసం యెలాపడితే అలా భవనాలని తీసేసుకుంటున్నారు. వాటిని ఖాళీ చేయిస్తున్నారు. 1942లో లొరేటో సముదాయాన్ని తాత్కాలిక సైనికహాస్పిటల్ కోసం తీసేసుకున్నారు. సెయింట్ మేరీ బిల్డింగ్ ని కాన్వెంట్ రోడ్ లోకి మార్చేరు.

యుద్ధం విరుచుకుపడింది. దాని వెనకాలే వచ్చిపడింది 1942–43 మహాకాటకం. యుద్ధంవల్ల దాపురించిన అస్తవ్యస్థ పరిస్థితికి యిప్పుడు మరింత మృత్యుహేల తోడయింది. రవాణా వ్యవస్థని సైన్యం అప్పటికే గుప్పిట్లోకి తీసేసుకుంది. కలకత్తాకు ఎగువ భాగం నుంచి ధాన్యం రవాణా పడవలమీద జరగాలి. దాన్ని సైన్యం చేజిక్కించుకుంది. జపాన్ దాడివల్ల బర్మానుంచి వచ్చే బియ్యమూ రావడం లేదు. మొత్తం ఆహార సేకరణలో నష్టం ఒక్కదీనివల్లే పదిశాతందాకా వుంది. ధరలు రెక్కలు విప్పుకున్నాయి. నల్లబజారు వర్తకులు, రుణాలు యిచ్చేవాళ్లు కుక్కగొడుగుల్లా పుట్టుకొచ్చేరు. వెనక తట్టు గ్రామాల్లో రైతులు కూడపెట్టుకున్న అర్దా, రూపాయి హారతికర్పూరంలా హరించుకుపోయేయి. వాళ్లు భూములు అమ్ముకోవడం మొదలెట్టేరు. ఆకలిబాధలకు ఆహుతి కాకుండా వుండాలన్న తెగింపులో కలకత్తాకు ముసురుకురావడం మొదలెట్టేరు. బెంగాల్ ప్రభుత్వం బాధ్యత నిర్వర్తించ లేక పోయింది. మహా శోచనీయం అది. ఆకలిచావులు యెన్నో ఖచ్చితంగా తెలియజేసే లెక్కలు లేకపోయేయి. 20,00,000 మంది ఆహుతై వుండవచ్చని బెంగాల్ ప్రభుత్వం అంగీకరించింది. అనధికార గణాంకాల ప్రకారం ఆ సంఖ్య అంతకు రెట్టింపేనని అన్నారు. ఆ మహావిపత్తు యెంత దారుణమైనదంటే దాని ప్రభావం స్మృతిపథంనుంచి మాసిపోలేదు. యేమైనా వందల, వేల సంఖ్యలో జనం కలకత్తాలో పోగయేరు. రోడ్డుపక్క బాటలు తప్ప, వుండడానికి జాగా లేకపోయింది. దయాధర్మంగా పోసే గంజి కేంద్రాలు తప్ప వేరే దిక్కూ దివాణంలేని జనం వీధుల్లోనే చనిపోయేరు.

యుద్ధం సాగుతూనే వుంది. ఆ సమయంలో బ్రిటిష్‌పాలన నుంచి స్వాతంత్ర్యంకోసం భారతజాతీయకాంగ్రెస్ దేశాన్ని సన్నద్ధం చేస్తోంది. ఉద్యమాన్ని మోహన్‌దాస్‌కరంచంద్ గాంధీ సారథ్యం వహించి నడిపిస్తున్నారు. ఉద్యమం చాలావరకు శాంతియుతంగానే వుంది. గాంధీ అహింసా సిద్ధాంత ప్రవక్త కావడంతో ఉద్యమం ఆ పథం మీదనే సాగుతూవుంది. కాంగ్రెస్ పార్టీతోపాటుగా పక్కనే మహమ్మదాలీజిన్నా నేతృత్వంలో ముస్లింలీగ్ కూడా పెరుగుతూవుంది. జిన్నా కూడా బారిస్టర్. దేశాన్ని విభజించమని లీగ్ బ్రిటన్‌ని కోరుతోంది. ముస్లిమ్‌లకు ప్రత్యేకంగా ఒక దేశం వుండాలి. దానికి పాకిస్థాన్ అన్న పేరు వుండాలి. 1946 అగస్టు 16న కలకత్తా మైదానంలో* ముస్లింలీగ్ పెద్ద బహిరంగసభ జరిపింది. అప్పటికే ఆవేశకావేషాలు తారాస్థాయిలో వున్నాయి. దాంతో ముస్లిమ్‌లకీ, హిందువులకీ మధ్య రక్తసిక్తమైన ఘర్షణలు చెలరేగేయి. నాలుగు పగళ్లు, రాత్రుళ్లు మతవిద్వేషం ఉన్మాదస్థాయిలో పెచ్చరిల్లి, అతలాకుతలం అయి అలమటిస్తూవున్న నగరాన్ని మరీ విషాద నరక ప్రాయం చేశాయి. యీలోపున, అప్పటికే అంతంతమాత్రంగా వున్న ఆహారధాన్యాల సరఫరా మరింత దిగజారింది. కంటికి కనిపించకుండా మాయమైంది. మొట్టమొదటిసారి మదర్ థెరెసాకు దిక్కుతోచని పరిస్థితి యెదురైంది. రెండువందలమంది పిల్లలు నకనకలాడే కడుపులు చేత్తోపట్టుకుని ఆవిడముందు వున్నారు.

స్వాతంత్ర్యం వచ్చింది. విభజన జరిగింది రెండు ప్రాంతాలుగా. ముస్లిం రాజ్యం యేర్పడింది. అదే పాకిస్థాన్. చరిత్రలో అంతకుముందు యెన్నడూ కనీవినీ యెరగనిరీతిలో మనుషుల వలస ప్రారంభమైంది. ప్రతిరోజూ 60,00,000 మంది అటూ యిటూ వలసపోతూనేవున్నారు. 10,00,000 మంది పైబడే తూర్పుపాకిస్థాన్ నుంచి పశ్చిమబెంగాల్‌కు తరలివచ్చేరు. యీ దుర్భర పరిస్థితికి హత్యాకాండలు తోడయేయి. మతవిద్వేష ఉన్మాదం వాటికి ప్రేరణ అయింది. తూర్పుపాకిస్థాన్ నుంచి అలలుఅలలుగా వలస వచ్చే శరణార్థులతో కలకత్తా కంతదఘ్నంగా వుంది. యిక కాలు కదిపే సందులేదు అన్నంతగా కిక్కిరిసిపోయింది. యెటుచూసినా పూరిపాకల మురికివాడలు ప్రత్యక్షమయేయి. మునిసిపాలిటీ కార్యకలాపాలు ఛిద్రం అయిపోయేయి. యెంతటి గుండె నిబ్బరంవున్న సాంఘిక కార్యకర్తలూ ఆ బీభత్స పరిస్థితి చూసి నిశ్చేష్టులైపోయేరు. కలకత్తా నిజంగా భీకర రాత్రి నగరం అని కిప్లింగ్ చెప్పినట్టు అయింది.

యీ దారుణసంఘటనలు మదర్ థెరెసా ఆశ్రమంలోకి చొచ్చుకుపోయి యేమేరకు ప్రభావం కలిగించేయి? సెయింట్ మేరీస్ పాఠశాలలో ఆవిడ గదినుంచి చూస్తే కనిపించే మోతీఝీల్ మురికివాడ క్షణాలమీద పీడకలలా విస్తరించుకుంటూ వుందనీ, ఆవిడ బాగా చలించిపోయేరనీ చెప్పే విషయాలు సత్యదూరం అనే అనాలి. యిప్పుడా ప్రాంతం బాగా మెరుగుపడింది. అది తరగతి గదుల దగ్గర్నుంచే కనిపిస్తుంది. ఆవిడ గది ఆ భవన సముదాయం అటువేపు వుంది. అక్కడికి మురికి వాడలు కనిపించవు.

ఏమైనా కలకత్తా నగరంలోని దారిద్ర్యం ఆమెకి యేమాత్రం కొత్తకాదు. ఆవిడ దగ్గర చదువుకునే విద్యార్థుల్లో చాలామంది కటిక పేదరికం అనుభవించే

---

* కలకత్తాలో రాజభవన్ దగ్గర వున్న గ్రేట్‌పార్క్ మైదానం.

కుటుంబాలవాళ్లే. అదీగాక సెయింట్ మేరీస్‌లోని సొడాలిటీ ధర్మసంస్థలో ఆవిడకు యింతకంటే యెక్కువ గర్భదరిద్రబాధితులు తగిలేరు. ఫాదర్ హెన్రీ మురికివాడల్లో చాలా సన్నిహితంగా పనిచేశాడు. కార్యాచరణలేని భగవదారాధన వ్యర్థం అని ఆయన నమ్మకం. అలాంటి ఫాదర్ ప్రభావం ఆవిడమీద యెక్కువగా వుందని చెప్పవచ్చు. నిజం చెప్పాలంటే ఆవిడకీ యిలాంటి దృష్టేవుందని చెప్పవచ్చు. అదీగాక లొరేటోలో నన్‌గా ఆవిడ అన్నివిధాలా తృప్తిగానే వుంది. మొదట్లో టీచర్‌గా, తర్వాత ప్రిన్సిపాల్‌గా ఆవిడ సంతుష్టిచెందేరు. లొరేటోని వదిలిపెట్టవలసి రావడానికి వెనక యే ప్రభావం వుందని ఆవిడ్ని అడిగేను.

"అంతరాత్మప్రబోధం. నాకు సంతుష్టిగా వున్న లొరేటోని వదిలిపెట్టి, వీధుల్లోవున్న పేదలకు సేవ చెద్దామని వెళ్లడానికి అదే కారణం" అన్నారావిడ. 1946 సెప్టెంబరు 10న ఆవిడకు పిలుపు అందింది. అప్పుడావిడ మఠానికి డార్జిలింగ్ వెళ్లే రైల్లో వున్నారు. డార్జిలింగ్ మఠంలో వున్నంతకాలమూ ఆ పిలుపు అందుతూనేవుంది. "ఆ సందేశం స్పష్టంగా వుంది. అదొక ఆజ్ఞ. నేను కాన్వెంట్‌ని వదిలిపెట్టెయ్యాలి. పరాత్పరుడు నా నుంచి యింకా యెక్కువ దేన్నో కోరుతున్నాడు. నేను పేదరాలిగానే వుండాలి, ఆయనను ఆరాధించాలి, ఆయన కడుపేదలలో నిరుపేదగా దాగివున్నాడు" అని ఆవిడ వివరించేరు.

దీన్ని గురించి ఫాదర్ వాన్ ఎగ్జెమ్ మరింతగా వివరించేరు. "మదర్‌కి అదొక దివ్యదర్శనం మాత్రమే కాదు, ఒక ప్రేరణ రూపంలో అందిన వర్తమానం. లొరేటో వదిలిపెట్టాలనీ, తన స్వంత కార్యకలాపాన్ని ఆరంభించాలనీ ఆవిడ స్పష్టంగా అనుభూతి చెందింది. ఆవిడకు యీషణ్మాత్రం అనుమానంలేదు, ఒక్కక్షణం కూడా. యిదే తన జీవితమార్గం అని ఆవిడకు నిరాటంకంగా నమ్మకం కుదిరింది, అదే తన జీవితధ్యేయమని".

మైఖేల్ గోమ్స్ అన్న మాటలూ నాకు గుర్తున్నాయి. ఎంటల్లీ కాన్వెంట్ వదిలిపెట్టేక మదర్ 14 క్రీక్‌లేన్‌లో వాళ్ల కుటుంబంతో వున్నారు. ఒకసారి మదర్ థెరెసా ఆయనతో అన్నారట– "వీధిలో యే గూడూ లేకుండా అంతమంది గడుపుతూ వుంటే నేను పరుపుమీద సుఖంగా ముడుచుకు పడుకోవడం నాకు యెంతో బాధ కలిగిస్తుంది. వాళ్ల బతుకులతో నా బతుకు పంచుకో లేకపోవడం తప్పు అనిపిస్తుంది."

యీ విషయాన్ని ఫాదర్ వాన్ ఎగ్జెమ్ మరోలా వ్యాఖ్యానించేరు. 1946కు ముందే యెప్పుడో మదర్ పేదరికాన్ని చూశేరు. ముఖ్యంగా 1942, 1943 సంవత్సరాల్లో మహా బెంగాల్‌క్షామం గజగజలాడించిన రోజులు. జనం ఆకలితో నకనకలాడిపోతున్నారు. రోడ్డుమీద పడిపోతున్నారు. ఎంటల్లీలో వున్న అమ్మాయిలు పేదపిల్లలే. అయితే పిలుపు అప్పట్లో రాలేదు. అంచేత మదర్ కాన్వెంట్ వదిలిపెట్టి వెళ్లిపోవాలనే ఆలోచన చెయ్యలేదు. కలకత్తా ప్రజలూ, పేదరికం ఆవిడకు తెలుసు, వాళ్లకోసం పనిచేద్దామనుకున్నారు. అయితే లొరేటో నన్‌గా కాన్వెంట్ ద్వారానే పని చేద్దామనుకున్నారు. అదే ఆశయం.

"కాన్వెంట్ గోడల వెనకవున్న ఆవిడ జీవితానికీ ఆ రోజుల్లో కలకత్తాలో వున్న పేదరికానికీ, మత హత్యాకాండలకీ యేదో సంబంధం కల్పించ చూసే ప్రయత్నాలు కొన్ని జరిగేయి అని కొంతమంది అంటారు. అయితే అదంతా అబద్ధం. ఒట్టి కల్పన మాత్రమే. ఆవిడకా ప్రేరణ పైనుంచి వచ్చింది. ఆ విషయం గురించి ఆదినుంచీ ఆవిడ నిశ్చయంగానే వుంది. నేనూ అంత నిశ్చయంగానూ వున్నానని చెప్పాలి."

ఇది పిలుపులో పిలుపు అని మదర్ థెరెసా యెక్కువసార్లు అంటూ వుంటారు. రెండవ లక్ష్యం అది తను నన్‌గానే వుంటుంది. పనిమాత్రం మారుతుంది. "దేన్నీ వదులుకోవాల్సిన అవసరంలేదు. నా ధ్యేయం, నేను క్రీస్తుకి చెందిన దానిని అన్న విషయాల్లో యేమార్పు లేకుండా అలానే వున్నాయి. పేదల్లో నిరుపేదలకు సేవచేసే మార్గాలు మాత్రం మారుతున్నాయంతే" అయినా లొరేటో వదలి పెట్టడం గొప్ప త్యాగమే. "చాలా కష్టమనిపించింది. నా కుటుంబాన్ని, దేశాన్ని మఠం జీవితంకోసం త్యజించిన దానికంటే గొప్పత్యాగం" అంటారావిడ.

ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ నాకో రహస్యం చెప్పేరు. 1946 అక్టోబరులో మదర్ థెరెసా ఆయన్ని చూడ్డానికి వెళ్లేరు. అదో సంచలనాత్మకదినం. ఆ సంగతి చెబుతూవుంటే ఆయనలో ఉత్సాహం పొంగులువారింది. "డార్జిలింగ్ నుంచి తిరిగివచ్చిన రోజున నాకు ఆమె రెండుకాగితాలు చూపించింది. వాటిమీద ఈశ్వరస్వావిర్భావం గురించి రాసింది. వాటిని నేను బైఠక్‌ఖాన చర్చికి తీసుకువెళ్లేను. నా హృదయానికి యెంతో హత్తుకుంది. మొదటినుంచీ నాకు అనిపిస్తూనేవుంది అది నిజమైన ధ్యేయం అని, నిజమైన పిలుపు అని. యిక ఆ తర్వాత జరిగిన వాటినన్నిట్నీ సహజధోరణిలో వివరించడం చాలా కష్టం. మదర్ అతిలోక వ్యక్తి యేమీకాదు. సామాన్య లొరేటో నన్. చాలా సామాన్యవ్యక్తి. అయితే భగవంతుని పట్ల భక్తి అపారం. ద్వితీయ త్యాగం చెయ్యడం ఆవిడకు చాలా ఆనందదాయకంగా వుంది. తల్లిని వదిలిరావడం తొలిత్యాగం. యిక లొరేటోలో రెండవత్యాగం చేసింది, బహుశా యిదీ మొదటిదానిఅంత గొప్పదీనీ."

"సందేశం తేటతెల్లంగా వుంది. నా చోటు యెక్కడో నాకు తెలిసింది. కాని అక్కడికి యెలా చేరుకోవాలో నాకు తెలియదు," అన్నారు మదర్. ఎన్నోరకాల అనుమతిపత్రాలు కావాలి. అదేమంత సాఫీ వ్యవహారం కాదు. ఆవిడ చూస్తే చాలా నిరాడంబరంగా వుంటారు. అవడానికి ఓ స్కూల్ ప్రిన్సిపాలే అయినా చర్చి సోపానశ్రేణిలో చిరు ఉద్యోగమే. అదీగాక సాక్షాత్తూ వాటికన్ నుంచే అనుమతి తీసుకోవాలి, పేదప్రజలతో నేరుగా కలిసి పనిచెయ్యడానికి తనేమీ సామాన్య లౌకిక వ్యక్తి కాదు, దీక్ష స్వీకరించిన నన్.

"నాకు భవ్యత ఆశీర్వాదం వుంది" అన్నారావిడ ఒకసారి. ఆవిడ ఆ సద్గుణంతోనే సలహాసంప్రదింపుల కోసం ఆధ్యాత్మికగురువును సమీపించేరు. ఆయన ఆవిడకు యేయే అవకాశాలు వున్నాయో సూచించేడు. తనే యెకాయెకీ రోమ్‌లో పోప్‌కి రాయొచ్చు, వాటికన్ అనుశాసనం అర్థించవచ్చు. యిక దాన్ని లొరేటో మన్నించి తీరాల్సిందే. లేదా కలకత్తా ఆర్చ్‌బిషప్‌ని అర్థించవచ్చు. ఆయనే అక్కడ సర్వాధికారి. యివిగాక రాత్ ఫర్మన్‌లో వున్న మదర్ జనరల్ అనుమతి కూడా కావాలి. ఈమె లొరేటో మఠం అధినేత్రి. రెండవ అవకాశాన్ని చూడ్డం మంచిదని తన

విజ్ఞతతో ఫాదర్ వాన్ఎగ్జెమ్ సలహా యిచ్చేరు. సర్వదా విధేయంగా వుండేవారావిడ. సరేనన్నారు. యీలోపున వీలునుబట్టి తను ఆర్చిబిషప్ పెరియర్‌తో యీ విషయం కదలేస్తానని ఆయన చెప్పేరు.

ఆర్చ్‌బిషప్ యిలా అడగ్గానే అలా అనుమతి యిచ్చేస్తాడని ఫాదర్ ఎగ్జెమ్ భావించివుంటే అది పొరపాటే. రెండునెలలు తర్వాత ఫాదర్ వాన్ ఎగ్జెమ్ ఆర్చ్‌బిషప్‌తో యీ విషయం కదిలేశారు. ఆమాట విని ఆర్చ్‌బిషప్ నిజానికి కళవళపడ్డారు. ఆయన హెచ్చరికవున్న మనిషి. ఒంటరి యూరపియన్ నన్ కలకత్తా వీధుల్లో పనిచెయ్యడం, అదీ రాజకీయ, మత విద్వేషాగ్నులు రగులుతూవున్న సమయంలో– ఆయనకు భయం కలిగించింది. ఫాదర్ ఎగ్జెమ్ ఆయనతో మాట్లాడిన కొన్నిరోజుల్లోనే మదర్ థెరెసాను అసన్‌సోల్‌కి బదిలీచేశారు. ఆ వూరు కలకత్తాకు 175 కిలోమీటర్లు దూరంలో వుంటుంది.

మదర్ థెరెసా పరోక్షంలో ఆర్చ్‌బిషప్ పెరియర్ తెలివిగా ఆవిడ విషయం వాకబు చేశాడు. ఆవిడ పేరూవూరూ యేమీ చెప్పకుండానే, ఒక అద్భుత విశేషం అంటూ వాకబు చేశాడు. సెయింట్ థెరెసా చర్చికి చెందిన ఫాదర్ జూలియన్ హెన్రీని, ఫాదర్ శాండర్స్‌ని వాళ్ల అభిప్రాయాలు యేమిటైందీ అడిగేడు. ఫాదర్ శాండర్స్ సెయింట్ మేరీస్ కాలేజి థియాలజీ, కానన్ లా శాఖలో ప్రొఫెసరు. ఆ కాలేజీ కుర్సెంగ్‌లో వుంది. తివ్వరు డార్జిలింగ్‌కి ఓ మాదిరి సమీపంలోవున్న వేసవివిడిది. ఫాదర్ వాన్ ఎగ్జెమ్ చెప్పినట్టు ఫాదర్ శాండర్స్ అవతలి గుమ్మం దగ్గరి మనిషి. ఆయన అభిప్రాయం యేమిటంటే అలాంటి మత విశ్వాస కూటమి యేర్పాటు సిద్ధాంతరీత్యా సాధ్యమేనని. ఫాదర్ హెన్రీ ఒక పేటలో చర్చికి చెందిన గురువు. అదీ సహాయక గురువు మాత్రమే. ఆర్చ్‌బిషప్ అతన్ని సంప్రదించడానికి కారణం వుంది. ఏమంటే ఫాదర్ హెన్రీకి కలకత్తా మురికవాడల గురించి క్షుణ్ణంగా తెలుసు. ఫాదర్ హెన్రీ నిజానికి భవిష్యత్ గురించి వూహించి యెంతో పొంగిపోయి తన పేటవాసుల్ని ప్రత్యేక అనుగ్రహం కోసం ప్రార్థనలు చెయ్యమని అడిగేడు.

ఫాదర్ వాన్ ఎగ్జెమ్‌లాగానే ఫాదర్ హెన్రీ కూడా బెల్జియం దేశస్థుడు. ఓరోజున యువకుడుగా వున్నప్పుడు డాంప్రెమిలో ప్రార్థనకు వెడుతూవున్నాడు. ఆ సమయంలో ఆయనకు పిలుపు అందింది. ఆయన ఆ వూరు వదిలి భారతదేశానికి వచ్చేడు. మళ్లీ తిరిగి యింటికి వెళ్లలేదు. 1938 అక్టోబర్లో కలకత్తా చేరేడు. 1941 నుంచి 1947 దాకా సెయింట్ మేరీస్‌లో మదర్ థెరెసాతో కలిసి పనిచేశాడు. అప్పుడు మదర్ ఆ స్కూలుని నిర్వహించేవారు. ఫాదర్‌హెన్రీ కొన్నిక్లాసులకు ప్రశ్నోత్తరఖండం బోధించేవారు. యదార్థానికి కాన్వెంట్ చర్చిలో ప్రీస్ట్ ఆయనే. మదర్ థెరెసాకి ఆయనంటే గొప్ప నమ్మకం. వాళ్లు సెయింట్ మేరీస్‌లోని సొడాలిటీలో కూడా కలిసే పనిచేశారు.

"ఫాదర్ హెన్రీ ఆదినుంచీ అనుకూలంగానే వున్నారు. నా దగ్గర రుజువులున్నాయి. ఫాదర్ హెన్రీ నా గురువు. నాకంటే కొంచెం పెద్ద. యిద్దరమూ ఒకే నౌకలో వచ్చేం బెల్జియం నుంచి. ప్రతిరోజూ ఎంటల్లీనుంచి తిరిగివెళ్లేటపుడు సెయింట్ థెరెసా చర్చిలో ఆయన్ని కలుసుకునేవాణ్ణి. ఓరోజున ఆయన చాలా ఉద్వేగంగా వున్నాడు. పెద్దవార్త వుందన్నాడు. ఓ మదర్ పేదల సేవకోసం వస్తూ వున్నట్టు ఆయన వాణి

నమ్మకంగా చెప్పిందట. ఆవిడ కాన్వెంట్‌లోగాని, పెద్దపాఠశాలల్లోగాని, కాలేజీల్లోగాని, హాస్పిటల్‌లోగాని పనిచేయదు– వీధుల్లో, మురికవాడల ప్రజల్లో పనిచేస్తుంది. ఆ వ్యక్తి యెవరై వుంటారో తెలుసా అని ఫాదర్ హెన్రీ నన్ను అడిగేడు," అని చెప్పేడు ఫాదర్ వాన్ ఎగ్జిమ్.

"ఫాదర్ హెన్రీకి ఆ రహస్యం చెప్పలేకపోయేను. కాని ఆ మర్నాడే పేదల తల్లికోసం ప్రార్థనలు చేశాడు. కలకత్తాలో అలాంటి వ్యక్తి పనిచెయ్యడం చాలా అవసరం. ఆ వ్యక్తి మదర్ థెరెసాయే అవుతుందని తను కలలో కూడా వూహించలేదట." చాలా సంతోషంగా ఫాదర్ వాన్ చెప్పసాగేడు. కొంచెంసేపు ఆగి, మళ్లీ మొదలుపెట్టేడు ఫాదర్ వాన్‌ఎగ్జిమ్. దిగులుగావుండే చిరునవ్వు ఆయనలో కనిపించింది. "ఇదిగో యీ పక్కగదిలోనే ఆయన తుదిశ్వాస విడిచేరు, తెలుసా? ఆయన నా గురువు మాత్రమే కాదు, నాకు అన్నలాంటివాడు" అన్నాడు ఫాదర్ వాన్‌ఎగ్జిమ్.

మదర్ థెరెసా ఉద్దేశం ఆచరణ యోగ్యం అవుతుందా అన్న శంక ఆర్చిబిషప్ పెరియర్‌ని వదల్లేదు. ఆవిడ మరికొంతకాలం నిరీక్షించాలని ఆయన యూరప్ వెళ్లేముందు ఫాదర్ వాన్‌ఎగ్జిమ్‌కి చెప్పేడు. అయన మరో యిద్దరు విజ్ఞుల్ని సంప్రదించా లనుకున్నాడు. సొసైటీ ఆఫ్ జీసస్‌కు చెందిన ఫాదర్ జనరల్ ఫాదర్ జాన్‌బాప్టిస్టు జాన్‌సెన్ ఒకరు, ఫాదర్ జోసఫ్‌క్రూజెన్ రెండవ వ్యక్తి. యీయన నన్‌ల మతధర్మాలకి సంబంధించి నిపుణుడు. వాళ్లిద్దరూ తనకు బాగా తెలుసని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ అన్నాడు. ఆర్చ్‌బిషప్ బెదిరిపోయేడు. "వాళ్లకి మీరు ఉత్తరం రాయవద్దు" అని ఆంక్షపెట్టేడు.

యిలా చెపుతూ ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ పెద్దగా నవ్వేడు. ఆర్చిబిషప్ కఠినంగా వున్నాడు. అయినా పిలుపు ఈశ్వరేచ్ఛగా వెల్లడి అయిందని ఆయనకు చెప్ప సాహసించేడు. "మహానుభావా, యిది ఈశ్వరేచ్ఛ. దాన్ని మీరు మార్చలేరు," అని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ న్యాయపక్షంగా వాదించేడు. వెంటనే ఆర్చ్‌బిషప్ తుంచేస్తూ అన్నాడు, "నేను ఆర్చ్‌బిషప్‌ని. ఈశ్వరేచ్ఛ యేమిటో నాకు తెలీదు. మీరేమో కలకత్తాలో చిన్న పురోహితులు. మరి మీకు ఈశ్వరేచ్ఛ యేమిటో సర్వకాలాల్లోనూ తెలుస్తూనే వుంటుంది." యీసంగతి చెబుతూ "చిన్న పురోహితుడు" దిండు మీదకు వెనక్కివాలి నవ్వేడు.

ఆర్చ్‌బిషప్ పెరియర్ తీర్పు గురించి ఫాదర్ వాన్‌ఎగ్జిమ్‌కున్న విశ్వాసం యెన్నడూ వూగిసలాడలేదు. తనపై అధికారి చాలా విజ్ఞత కలవాడని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్‌కు తెలుసు. అప్పట్లో ఆర్చ్‌బిషప్పే చాలా ముఖ్యమైన ప్రధానగురువు అనీ తెలుసు. పాలనానుభవం, ప్రజలతో వ్యవహరించే నేర్పూ కల వ్యక్తి అనీ తెలుసు. ఆర్చిబిషప్ గనక యీ వ్యవహారాన్ని రోమ్ నగరంలో వున్న కేంద్రకార్యాలయానికి నివేదిస్తే అనుకూలమైన ఫలితం వచ్చే అవకాశాలే యెక్కువ అని తన ఉద్దేశ్యంగా ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ భావించినట్టు నాకు అర్థమైంది. అది చాలా ముఖ్యమైన నిర్ణయమనీ, చర్చికి సంబంధించి చాలా పరిణామకారక నిర్ణయమనీ, ఆర్చిబిషప్‌ని హడావుడి పెట్టకూడదనీ ఫాదర్ గ్రహించేడు. "భారతదేశం స్వాతంత్ర్యం పొందిన యేడాది అంతా మదర్ థెరెసా నిరీక్షించేరు. యీ లోపున మహాగురువులు యీ వ్యవహారంలోని చిక్కులన్నిట్నీ పరిశీలించేరు. మదర్ థెరెసాతో యెప్పుడోగాని మాట్లాడనేలేదు"

తన ఉద్దేశ్యం గోప్యంగా వుంచాలని, తనపై అధికార్లతో కూడా యీ విషయం ముచ్చటించకూడదని ఆర్చ్‌బిషప్ ఆవిడకు తెలియజేశాడు.

మదర్ థెరెసా తన సుపీరియర్, రాత్‌ఫార్మ్‌న్‌లో వున్న మదర్ జనరల్ ఆఫ్ లొరేటోకి, తనను లొరేటో మఠం నుంచి విడుదల చెయ్యవలసిందిగా అర్థిస్తూ రాయవచ్చునని ఆఖరికి 1947 చివర్లో ఆర్చ్‌బిషప్ పెరియర్ అనుమతి యిచ్చేడు. అయితే ఆ లేఖను తనకు ముందుగా చూపించి తీరాలన్నాడు. మదర్ థెరెసా తన సరళధోరణిలో లేఖ రాశేరు. ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ దాన్ని టైప్‌చేసి పెట్టాడు. మదర్ జనరల్‌కు తన కందిన పిలుపు గురించి ఆవిడ వివరించి రాశేరు. మఠం బయట నన్‌గా మురికివాడల్లో పనిచేసేందుకు అనుమతి అర్థించేరు. ఆర్చ్‌బిషప్ "మఠం బయట" అనేమాట వద్దనీ దాని బదులు లౌకికమైన అని పెట్టమనీ అన్నాడు. ఆ ముక్క మదర్ థెరెసాకీ, ఫాదర్ వాన్‌ఎగ్జెమ్‌కీ అదురుపాటు కలిగించింది. ఏమంటే లౌకికమైందనగానే మదర్ థెరెసా దీక్షపొందిన నన్ కాకుండాపోతారు. ఆమెకూడా మామూలు మహిళ అవుతారు. క్రియకి ఒక సంఘసేవకురాలు, అంతే. ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ మరోసారి ఆలోచించమని ఆర్చ్‌బిషప్‌ని అర్థించేడు. కాని నెగ్గలేకపోయేడు.

ఆర్చ్‌బిషప్ కోరినట్టే ఆవిడ ఆ మాటలు మార్చేరు. లౌకికపత్రం కోసమే అర్జీచేసుకున్నారు. మదర్ జనరల్ గెర్‌ట్రూడ్ ఆర్చ్‌బిషప్ ద్వారా వెంటనే జవాబు పంపేరు. అందులోని మాటలని పొల్లుపోకుండా ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ వల్లించేరు.

"ప్రియమైన మదర్ థెరెసా,

ఇది ఈశ్వరేచ్ఛగా వెల్లడి అయింది కాబట్టి మీరు అనుమతికోసం రోమ్ కేంద్రాన్ని అర్థించవచ్చని తెలియచేస్తున్నాను. మీ సుపీరియర్‌తో మాట్లాడవద్దు. మీ ప్రావిన్షియల్*తో మాట్లాడవద్దు. నా సలహాదారులతో నేనూ మాట్లాడను. నా అనుమతి చాలు. అయితే రోమ్‌కి రాసినప్పుడు లౌకికపత్రం కోసం అడగద్దు. మఠేతర పత్రం అని అడగండి."

లొరేటో మదర్ జనరల్ అంతకంటే గట్టితోడ్పాటు యివ్వగలిగివుండేదికాదు. తమ ప్రార్థనలు ఫలించేయని ఫాదర్ వాన్‌ఎగ్జెమ్, మదర్ థెరెసాలు చాలా సంతోషపడిపోయేరు. యిపుడిక రోమ్‌కు ఉత్తరం రాసేందుకు అనుమతి కావాలి. ఆవిడ దరఖాస్తు వ్యక్తిగతంగానే రాశేరు. కాని తన అత్యున్నత అధికారిణి సూచనమేరకు మఠేతర పత్రం యిమ్మనమని కోరేరు. రోమ్ కేంద్రానికి నేరుగా ఉత్తరం రాయమని మదర్ జనరల్ గెర్‌ట్రూడ్ అనుమతి యిచ్చినా, మదర్ థెరెసా ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ సలహా పాటించి ఆర్చ్‌బిషప్ పెరియర్ దగ్గరకు తీసుకు వెళ్లమంటూ ఉత్తరం యిచ్చేరు.

ఆర్చ్‌బిషప్ పెరియర్ ఆ లేఖను చూస్తూనే మఠేతర అన్నమాట దగ్గర అభ్యంతరం పెట్టేడు. లౌకికపత్రం అని రాయమని మదర్ థెరెసాను శాసించేరు. ఆ మార్పు లేకుండా ఉత్తరాన్ని పైకి పంపించలేనని అన్నాడు. అయితే మదర్ థెరెసాకు ఆవిడ సుపీరియర్ రోమ్ కేంద్రానికి రాయమని అనుమతి యిచ్చింది కాబట్టి ఆమె

---

* ఒక హోదా గురువు (అను.)

అలా చెయ్యవచ్చనీ, మరేతర పత్రం అర్ధిస్తూ నేరుగా వాటికన్‌కే రాసుకోవచ్చనీ ఫాదర్ వాన్ఎగ్జెమ్‌తో ఆర్చ్‌బిషప్ చెప్పేడు. యేమిటి చెయ్యాల్సిందీ తన నిర్ణయానికే వదిలిపెట్టినా మదర్ థెరెసా సహజ విధేయతవల్ల అర్చ్‌బిషప్ అడిగిన మార్పుచేసి, పైకి పంపించవలసిందిగా అర్చ్‌బిషప్‌కు అందచెయ్యమని ఫాదర్ వాన్ఎగ్జెమ్‌కి యిచ్చేరు.

"తను రాయవలసిన ముక్కలు రాసి అర్చ్‌బిషప్ ఆ లేఖను రోమ్‌కి పంపించేడు. ఆయనేం రాశాడో నాకు తెలియదు. అది అర్చ్‌బిషప్ రహస్యం. ఆవిడ తనే నేరుగా హోలీ కాంగ్రగేషన్ (రోమ్‌లో)కు పంపించవచ్చు. కాని అర్చ్‌బిషప్‌కు పంపించమని నేనే మదర్‌కు చెప్పాను," అని ఫాదర్ వాన్ఎగ్జెమ్ చెప్పేడు. 1948 ఫిబ్రవరిలో ఆ లేఖను ఢిల్లీలోని గురుత్వ నన్షియోకూ (Apostolic Nincio) మొదట పంపించేరు. వారాలు గడిచేయి. వారాలు నెలలు అయ్యాయి. మదర్ థెరెసా యెదురు చూస్తూ దేవుణ్ణి ప్రార్థించేరు. జవాబు యేమన్నా వచ్చిందా అని ఫాదర్ వాన్ఎగ్జెమ్‌ని ఒకటికి రెండుసార్లు అడిగేవారు. కాని యే జవాబూ రాలేదు.

ఆఖరికి 1948 జూలై చివర్లో అర్చ్‌బిషప్ పెరియర్, ఫాదర్ వాన్ఎగ్జెమ్‌ని పిలిపించేడు. వాటికన్ నుంచి ఆ పూట మధ్యాహ్నమే పత్రం వచ్చిందట. న్యూఢిల్లీలోని నన్షియో పీఠంనుంచి వర్తమానం వచ్చిందట. మరేతర కార్యకలాప నిర్వహణకు అనుమతి పత్రం వచ్చిందట మదర్ థెరెసాకి! ఆవిడ నన్‌గానే కొనసాగుతుంది. అయితే కాన్వెంట్ బయట పనిచెయ్యొచ్చు. అదీ ఆ అనుజ్ఞ. మూడు వందల యేళ్ల నాడు మేరీవార్డుకి* అలాంటి అనుమతిని నిరాకరించేరు. యిపుడు అలాంటి అనుమతిని మదర్ థెరెసాకు యిచ్చేరు. అయితే యిందులో ఒక మెలిక ఆవిడ మఠం బయట ఒక ఏడాదిపాటే వుండాలి. అపుడు ఆవిడ చేసేపని కొనసాగాలా, లొరేటోకి తిరిగి రావాలా అన్న విషయాన్ని అర్చ్‌బిషప్ పెరియర్ నిర్ణయిస్తారు. ఆమేరకు ఆయనకు అధికారం యివ్వడం జరిగింది.

1948 ఆగస్టు 8న ఫాదర్ వాన్ఎగ్జెమ్ ఆ వార్తను మదర్ థెరెసాకు వెల్లడించ వచ్చని అర్చ్‌బిషప్ అనుమతించేరు. ఆయన యెప్పటిలాగానే ఆదివారం ఆరాధనకు వెళ్లేరు. ప్రార్థన అయ్యేక మదర్ థెరెసాను వుండమన్నారు. ఆవిడకు ఓ సంగతి చెప్పాలిట. రోమ్ నుంచి జవాబు వచ్చి వుంటుందని మదర్ థెరెసా పసికట్టేరు. ఓ క్షణంసేపు ఆవిడ బిగుసుకుపోయేరు. కొంచెంసేపట్లోనే కూడ దీసుకున్నారు. "మన్నించండి, ఫాదర్! మొదట భగవంతుని ధ్యానం చేసుకుంటాను" అన్నారు. ఆ వార్త విన్నాక ఆవిడ అడిగిన మొదటిప్రశ్న "ఫాదర్, నేను యిపుడే మురికివాడలకు వెళ్లొచ్చా" అని. ఫాదర్ వాన్ఎగ్జెమ్ మిగిలిన లాంఛనాలు పూర్తిచేశారు. వాటికన్ అనుమతి పత్రాలు మూడు ప్రతులపైన ఆవిడ సంతకాలు తీసుకున్నారు. ఒకదాన్ని రోమ్‌కు పంపుతారు. రెండవది అర్చ్‌బిషప్ దగ్గర వుంటుంది. మూడవది మదర్ థెరెసా వుంచుకుంటారు.

---

* 17వ శతాబ్దంనాటి ఇంగ్లీషు వనిత. పేదసాదలతో కలిసిమెలిసి జీవించాలన్నది ఆవిడ జీవితాశయం. మేరీ ఇన్‌స్టిట్యూట్ అనే సంస్థను ఆవిడ స్థాపించేరు. ఆ సంస్థ వారసులే లొరేటో సిస్టర్లు. 1690లో ఆ సంస్థ కార్యకలాపాల్ని వాటికన్ బయటకు పోరాదన్న నియమ పాలన విధించి అణచివేసింది.

ఆ ముక్క దాగలేదు. ఆ వార్త చకచకా పాకిపోయింది. ఎంటల్లీలోనే కాదు, కలకత్తాలో వున్న కాథలిక్ మిషనరీ లన్నిటికీ తెలిసింది. "ఆ వార్త వినగానే మేం నిశ్చేష్టులయే మనుకోండి. యేమంటే మా మాటల్లో యెప్పుడూ యీ ప్రస్తావనే రాలేదు. యివి గోప్యంగా వుండే విషయాలే ననుకోండి. దాంతో ఆవిడ అక్కడి నుంచి వెళ్లేదాకా మాకు తెలియనే తెలియదు" అని సిస్టర్ మేరీ థెరెసె్బ్రీన్ అన్నారు.

అగస్టు 17న మదర్ థెరెసా ఎంటల్లీ వదిలి పెట్టి వెళ్లారు. అంతకుముందు కొద్ది రోజులదాకా సిస్టర్ రోజారియొకు కూడా తెలియదు. "ఏదో జరగబోతోంది అని పసికట్టగలిగేం. కాని అసలు విషయం యేమిటీ అన్నది మాకు తెలియదు. గోప్యంగానే వుండిపోయింది. ఆవిడ దీక్షా గురువు ఫాదర్ వాన్ఎగ్జిమ్ యేడాది వరకూ ఆ విషయం గురించి యెవళ్లతోనూ మాట్లాడవద్దని ఆమెని కట్టడిచేశారు. ఆవిడ మనసులోనే దానికో రూపం రావాలి, అంతేకదా మరి! ఏడాది తర్వాత (1947) ఆవిడకా ఆలోచన అలానే వున్నట్టయితే, అది అసలైందన్నమాట. మదర్ థెరెసా మఠం వదలి పెడుతున్నారన్న వార్త ఆఖరికి అందగానే నాకు సంతోషం కలిగింది. 'బాగుంది. ఇదొక పరీక్ష, ఆవిడకా శక్తిసామర్థ్యాలు వుండాలని నా కోరిక' అన్నాను. యీలోపున భారతదేశంలో వున్న లొరేటో మఠాలన్నిటికీ ఉత్తరాలు వెళ్లేయి. అవేవీ యీ అంశం గురించి విమర్శించనూ కూడదు, శ్లాఘించనూ కూడదు. ఆవిడ కోసం ప్రార్థనలు చెయ్యాలంతే. యిదీ వాటి సారాంశం" అని గట్టిగా నవ్వుతూ చెప్పిందామె.

ఆ సాయంత్రం మదర్ థెరెసా కాన్వెంట్ చర్చిలో ప్రార్థనా సామాగ్రి పెట్టే గదికి వెళ్లేరు. అప్పట్నుంచీ తను ధరించబోయే వేషధారణను ఆశీర్వదించమని ఫాదర్ వాన్ఎగ్జిమ్‌ను కోరేరు. ఆ గదిలో నీలం అంచు తెల్లచీరలు మూడు వున్నాయి. వాటి మీద చిన్న శిలువ, జపమాల వున్నాయి. ఫాదర్ వాన్ఎగ్జిమ్‌కి ఆ సన్నివేశం గుర్తుంది. "మదర్ థెరెసా నా వెనక నుంచున్నారు. ఆమె పక్కనే మదర్ దుసెనాకిల్ వున్నారు, ఆవిడ సుపీరియర్. ఆమె వెక్కుతూ వున్నారు. నేను ఆ చీరల్ని ఆశీర్వదించేను. అవి ఆవిడకు మతాచారం అవుతున్నాయి" అని ఆయన చెప్పేరు.

ఫాదర్ వాన్ఎగ్జిమ్ అప్పటికే ఆవిడకు గట్టిగా హితబోధ చేశారు. తను మురికివాడల్లో పనిచెయ్య బోతోంది. అంచేత కొంత వైద్య శిక్షణ అవసరం. అందుకావిడ వెంటనే సరేనన్నారు. అప్పుడాయన పాట్నాలో వున్న మెడికల్ మిషన్ సిస్టర్స్ సంస్థకు రాశేరు. వాళ్లు వెంటనే తమ హాస్పిటళ్లలో ఆవిడకు శిక్షణ యివ్వడానికి ఒప్పుకున్నారు.

ఒక సున్నితమైన పని జరిపించాల్సి వుంది. మదర్ థెరెసా ఫాదర్ వాన్ఎగ్జిమ్‌ని అడిగేరు. తను లొరేటో వదిలిపెట్టి వెళ్లిపోతున్నట్టు స్కోప్‌చెంలో వున్న తల్లికి అంతకుముందే రాశేరావిడ. ఆమె మనసులో యే విచికిత్సా వుండకూడదన్న ఆలోచనతో తను దీక్షాగురువును కూడా తల్లికి రాయమని ఆయన్ని అడిగేరు. తన పిలుపునందుకుని యెలా ఉద్యమించిందీ, వాటికన్ అనుమతి యెలా యిచ్చిందీ, తను లొరేటో నుంచి వెళ్లిపోవడం గురించీ, తన మతదీక్ష యేమాత్రం భగ్నం కాకుండా వున్నది తెలియజేస్తూ ఆయన రాయాలి.

అగస్టు 17వ తేదీన మదర్ థెరెసా మొట్టమొదటసారి ఫాదర్ వాన్ఎగ్జెమ్ ఆశీస్సులు పొందిన చీరల్లో ఒకదాన్ని కట్టుకున్నారు. ఆవిడ శిష్యురాండ్రు ఆవిడను చూడాలని కుతూహలపడ్డారు. రేఖామాత్రంగానైనా ఆవిడ దర్శనం కలుగుతుందే మోనని విఫల ప్రయత్నం చేశారు. ఏమంటే అప్పటికే చీకటి పడింది. ఆవిడ ఎంటల్లీ కాన్వెంట్ నుంచి యెవళ్లకీ కనిపించకుండా జారుకున్నారు. "బెంగాలీథెరెస" తన "చిన్న మార్గం"లో అడుగువేసేరు.

☆ ☆ ☆

ఆ తర్వాత కొన్నియేళ్లపాటు లొరేటో సుపీరియర్ల ఆదరణ, దైవబలం ఆవిడను కాపాడుతూనే వున్నాయి. "లొరేటో ఆవిడకు కొంత భరణం యిచ్చింది. కచ్చితంగా యెంత మొత్తమో నాకు తెలీదు. మత నిబంధనల ప్రకారం అలా యివ్వాలి. ఆవిడకు కుర్చీలు, బల్లలు వగైరా అందించేరు. పడకలూనూ. వంటపాత్రలు కూడా యిచ్చేరు," అని సిస్టర్ రొజారియొ చెప్పింది.

ఆవిడ కొంతసొమ్ము యేమన్నా తీసుకువెడితే, అది ఆవిడ యిష్టం. ఆవిడ తోటి సిస్టర్లు ఆవిడ వెళ్లిపోయినప్పుడు అవసరాలకోసం కొంత సమకూర్చాలి, అది చర్చి నియమం. వాళ్లు సాయం చేశేరు. ఆవిడ మొదట చికిత్సాలయాన్ని సెయింట్ థెరిసా స్కూలులో ప్రారంభించేరు. కుట్టుపని నేర్పే తరగతుల్ని వరండాలో ప్రారంభించేరు. ఆదివారాల్లో సోడలిస్టు సంఘసభ్యుల సమావేశం నిర్వహించేవారు. వాళ్లల్లో చాలామంది సెయింట్ మేరీస్‌లో పగలు చదువుకుంటూ వున్నవాళ్లే. వాళ్లల్లో కొంతమంది యెప్పుడో మతదీక్ష స్వీకరించినవాళ్లు, యిప్పుడు ఆవిడ కూటమి స్తంభాలు. 1950 అక్టోబరు 7న మత నియమానుసారం కూటమిని స్థాపించినపుడు మదర్ దుసెనాకిల్ లొరేటో ప్రతినిధిగా హాజరయేరు. ఆ స్థాపన 14 క్రీక్‌వీధిలో నిరాడంబరంగా జరిగింది.

లొరేటోతో ఆవిడ సంబంధాలు కొనసాగేయి. మొదట్లో ఆవిడ దగ్గరవుండే చిన్న సిస్టర్లకి లొరేటో బళ్లల్లో ఉచితవిద్య అందేది. "ఆవిడకు నలుగురు సిస్టర్లని యిచ్చేం. నలుగురు ఆణిముత్యాల్లాంటి వాళ్ళు" అని సిస్టర్ రొజారియొ నాతో అన్నారు. వాళ్ళల్లో మదర్ బెర్నార్డ్ వున్నారు. ఆమె 1950లో ఆవిడతో చేరారు. సిస్టర్ ఫ్రాన్సిస్ గ్జావియెర్ అనే పేరు పెట్టుకున్నారు. ఆవిడ యెన్నో కుష్ఠువ్యాధి ఆశ్రమాల్లో పనిచెయ్యవలసి వచ్చింది. మిగిలినవాళ్లు తర్వాత వచ్చేరు. యివాళ చాలామంది లొరేటో పూర్వ విద్యార్థినులు మిషనరీస్ ఆఫ్ ఛారిటీలో పనిచేస్తున్నారు. యీవాళ మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ప్రచార బృందం, మొట్టమొదట 1891లో రాత్‌ఫర్మన్ నుంచి భారతదేశానికి తొలిబృందం సిస్టర్లని పంపించిన మదర్ థెరెసా బాల్‌కి మనస్ఫూర్తిగా సంతోషాన్ని కలిగించి వుండాలి. మదర్ థెరెసా లొరేటోకి ఘనకీర్తిని తెచ్చేరని నేను లొరేటోలో మదర్ థెరెసా నేస్తం, సహవాసి అయిన సిస్టర్ లొరేటోతో అన్నాను. "లొరేటోకి మాత్రమే కాదు, దేవునికే" అన్నారు మెల్లిగా సిస్టర్ రొజారియొ.

❋ ❋ ❋

# 4 మోతీఝీల్

1991 ఫిబ్రవరి నెలలో ఓ రోజు ఉదయం "మదర్‌హౌస్" ఆఫీసు ముందు మదర్ థెరెసా, నేనూ ఒక బెంచీ మీద కూర్చున్నాం. ఆవిడ అంతకుముందు రోజే విదేశీ యాత్ర నుంచి అనుకోకుండా తిరిగి వచ్చేరు. ఆవిడ తిరిగి వచ్చేరని తెలియకపోవడంవల్ల యెక్కువమంది అక్కడలేరు. ప్రయాణాలు తగ్గించుకొమ్మని యెంత చెప్పినా యిక యీవిడ వినరులే అని ఆవిడ డాక్టర్లు అలాంటి సలహాలు యివ్వడం మానుకుని వుంటారని నా అనుమానం. ఆ పొద్దుటిపూట ఆవిడ యెంత కులాసాగా వున్నారో చూస్తే ముక్కుమీద వేలేసుకుని వుంటారు. ఆవిడతో మాట్లాడుతూ వున్నప్పుడు తొలిరోజుల గురించి నేను చదివిన విషయాలు గుర్తువచ్చేయి. ఆవిడ పాట్నాలో మెడికల్ మిషన్ సిస్టర్స్‌లో శిక్షణ పూర్తిచేసుకుని కలకత్తా తిరిగివచ్చేరు. వీధిలో ఒకతను బొటనవేలిమీద కుళ్లినపుండుతో బాధపడుతూ వున్నాడు. ఆ వేలుని శస్త్రచికిత్స చేసి తక్షణం తీసివెయ్యాలి. ఆవిడ అతన్ని చూసి, దైవ ప్రార్థన చేసి, కత్తెర తీసుకుని ఆ బొటనవేలుని కత్తిరించి వేశారు. వెంటనే ఆ మనిషి సొమ్మసిల్లి పోయేడు. అతనోపక్కకు పడిపోయేడు, మదర్ థెరెసా మరోపక్కకు పడిపోయేరు. యిదీ నేను చదివిన విషయం. యీ కొసమెరుపు నేను అందించగానే మదర్ థెరెసా పగలబడి నవ్వేరు. "పొట్టికల్పన" అన్నారావిడ. కాని ఆ పరిహాసోక్తి ఆవిడకు వినోదం కలిగించింది. ఆవిడ్నాపూట అంతలా నవ్వించగలిగేనని నాకు బాగా తృప్తికలిగింది.

ఒకదాన్నుంచి మరోదానికి మళ్లడం సహజం. పాట్నాలో ఆవిడ గడిపిన రోజుల గురించి మాట్లాడుకున్నాం. అక్కడ ఆవిడ కొన్ని నెలలు నర్స్‌శిక్షణ పొందేరు. చికిత్స, వైద్యసేవల శిక్షణ పొందేరు. యిదంతా యెప్పుడో 1948లో జరిగింది. మంత్రసానికి సాయపడ్డంలాంటి పనులు చేశానని ఆవిడ చెప్పేరు. అయా సందర్భాల్లో దగ్గర వుండమని ముందు పిలిచేవారట. తర్వాత సాయం అడిగేవారట. యెన్ని అత్యవసర సహాయాలకి, ఆపరేషన్లకి, కాన్పులకి అవసరమైతే అన్నిటికీ రమ్మనమనే వారట. ఇంజక్షన్లు యివ్వడం, మందుల చీటీలు రాయడం ఆవిడ నేర్చుకున్నారు. హాస్పిటల్ వార్డు నిర్వహణ యెలావుండాలో ఆవిడ నేర్చుకున్నారు. మొత్తంమీద అంత ఆసక్తికరమైన విద్యార్థిని దొరకడం అపురూపం అనిపించేటట్టు ఆవిడ వున్నారు.

'యిరుగో' అనుకోవడం తరవాయి, ఆవిడ ప్రత్యక్షమయే వారని ఆనాడు పాట్నాలో వున్న ఆవిడ సహచరులు అంటారు. ఆ శిక్షణ చాలా ఉపయోగకర మైందని మదర్ అన్నారు. సిస్టర్ల ఔదార్యం గురించి మెచ్చుకునేవారు.

ఆవిడ వైద్యం నేర్చుకున్నారు, అనుభవం గడించేరు. యింతేకాదు, విశ్రాంతి సమయాల్లో ఆవిడ సిస్టర్లతో తన పథకాల గురించి చర్చించేవారు. వాళ్లు ఆవిడను యేదో తన మాటలు చెప్పుకునే వేదికగా మాత్రమే అనుకుంటూ వుండేవాళ్లుకాదు. యెన్నో ఆచరణశీలమైన సలహాలు యిచ్చేవాళ్లు. అలా వాళ్లతో సంభాషణలు జరపడం ఆవిడకు లాభించింది. ఆవిడకు అంతకుముందేవున్న కొన్ని అభిప్రాయాలు పోవడానికి అవి దోహదపడ్డాయి. పేదలు యేం తింటున్నారో అదే తన మఠం వాళ్లు తినాలని ఆవిడ అనుకునేవారు. ఆ నన్‌లు ఆవిడ అభిప్రాయం తప్పని నచ్చచెప్పేరు. వాళ్లకి ఆరోగ్యం గురించీ, రోగుల గురించీ బాగా తెలుసుకదా. పేదలు పొట్టి అన్నం ఉప్పుచల్లుకొని తిని వూరుకుంటారు. తనూ, సిస్టర్లు అలాంటి భోజనమే తిని వూరుకుంటే గనక యే రోగాల్ని నయం చెయ్యాలను కుంటున్నారో, వాటి బారినే తాము పడతారు. తమకు పుష్టికరమైన సమతుల ఆహారం అవసరం, యెంత సాదా ఆహారమైనా గానీ. అదీగాక వాళ్లకి తగినంత విశ్రాంతి కూడా కావాలి. తెల్లవారకట్లే 5 గంటలకు లేచి, ఎనిమిది పదిగంటలు పైన పని చెయ్యాలంటే మధ్యాహ్నంపూట కొంత విశ్రాంతి అవసరం. వారంలో ఓ రోజు సెలవు వుండాలి. సాలుకోసారి యేదన్నా పై వూరు వెళ్లడం మంచిది. వీధుల్లో పనిచెయ్యాలీ అని తలబెట్టిన వాళ్లు వ్యక్తిగత పరిశుభ్రతకు పెద్దపీట వెయ్యాలి. అందుగ్గాను ప్రతివాళ్లకీ మూడేసి చీరలు వుండాలి. ఒకటి కట్టుకుంటే, యింకోదాన్ని ఉతికి ఆరేసుకోవచ్చు. మూడవది యేదన్నా అవసరం మీదపడితే వుంటుంది; తలమీద అచ్ఛాదనంగా కప్పుకోవడం అవసరం అని వాళ్లు చెప్పేరు. యెండ తగలదు. యీ దేశంలో వేసవికాలం నీడలోనే 40° సెల్సియస్ వుంటుంది.

పాట్నాలో కొన్ని వారాలు గడిచాయో లేదో కలకత్తా తిరిగి రావాలని మదర్ థెరెసా ఆతృతపడ్డారు. "అసలైనపని" తను ప్రారంభించేందుకు అనుమతి యివ్వవలసిందిగా అర్థిస్తూ ఆవిడ ఫాదర్ వాన్‌ఎగ్జిమ్‌కి ఉత్తరం మీద ఉత్తరం రాశారు. "ఆవిడకు యెప్పుడూ కలకత్తా తిరిగి వచ్చెయ్యాలనే. తను నేర్చుకున్నది చాలనీ, అన్నిరకాల వ్యాధుల గురించీ తెలుసుకున్నాననీ, కలకత్తాలో కనిపించే జబ్బులు పాట్నాలో వున్నవాటికంటే వేరనీ, అవి హాస్పిటళ్లలో కనిపించవనీ రాశేది" అంటూ ఆయన అలవోకగా నాతో చెప్పేరు.

1948 నవంబర్లో ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ పాట్నా వెళ్లేరు. దిగీదిగగానే యెకాయెకీ హాస్పిటల్‌కు వెళ్లేరు. "అక్కడ కొంతమంది సిస్టర్లు, నర్సులు కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. వాళ్లదగ్గరకు వెళ్లాను. 'సిస్టర్ థెరిసాని చూడాలని వచ్చేను. ఆవిడ యెక్కడ వున్నారు?' అని అడిగేను. 'ఫాదర్, యిక్కడ' అంటూ ఓ గొంతు వెనకనుంచి వినిపించింది. కాని నేను గుర్తుపట్టలేకపోయేను. ఆవిడ అక్కడే అంతసేపూ నుంచుంది. ఆవిడ తీసుకున్న మూడు చీరలకీ నేనే ఆశీస్సులందించేను. అయినా యెపుడూ ఆవిడ్ని చీర కట్టుకోగా చూడలేదు. అదే మొదటిసారి."

హాస్పిటల్లో ఆయన ఆవిడ సుపీరియర్‌తో మాట్లాడేరు. ఆవిడ పేరు 'సిస్టర్ స్టెఫానీ. అమెరికన్. సిస్టర్ థెరెసా కలకత్తా తిరిగి వెళ్లి పోవాలను కుంటున్నారని చెప్పేరు. అంత తక్కువ వ్యవధిలో ఆవిడ మందుల గురించిగాని, నర్సింగ్ గురించిగాని తగినంత నేర్చుకుని వుంటుందా అన్న అనుమానమూ వెల్లడించేరు. తగినంత నేర్చుకోకుండా వ్యవధికి ముందే తిరిగి వెళ్లిపోతే యేమన్నా పొరపాట్లు దొర్లుతాయేమోననీ అన్నారు. "అలా అయితే గనక యిక అంతటితో సరి" అని చెప్పినట్టూ గుర్తుచేసుకున్నారు. "ఆఁ, ఫాదర్! సిస్టర్ థెరెసా కలకత్తా తిరిగి వెళ్లిపోవచ్చు. ఆవిడ చాలా తెలివైంది. యే పొరపాట్లు చెయ్యదు. ఆవిడకు బోలెడుమంది సాయం చేస్తారు, తోడు వుంటారు. పనిలో ఆసరా వుండడం ద్వారా తమ బాధ్యతలేమోసుకుంటారు" అని ఆయనకు ఆశ్చర్యం కలిగేటట్టు సిస్టర్ స్టెఫానీ చెప్పేరు. అక్కడి డాక్టర్ ఒక డచ్ వనిత. ఆవిడ పేరు ఎలిజె. "సిస్టర్ థెరెసా శిక్షణ పూర్తిచేసింది. ఆమె యివాళ తిరిగివెళ్లచ్చు" అని ధ్రువపరిచేరు.

"ఆర్చిబిషప్ ఆవిడ తిరిగివచ్చేందుకు అనుమతి యిచ్చేరని కలకత్తా నుంచి ఆవిడకు రాశేను. లిటిల్ సిస్టర్స్ ఆఫ్ ది పూర్‌లో ఆవిడ వుండేందుకు యేర్పాటు చేశాననీ రాశేను. వాళ్లు యెక్కడికేనా యే సెలవుల్లో వెళ్లినపుడు వస్తే చిక్కు, డిసెంబరు 1 నుంచి 8 దాకా వాళ్లు వుండరు. ఆవిడ 9 ఉదయం వచ్చింది, పాట్నాలో దాదాపు నాలుగునెలలు గడిపింది," అన్నారాయన. ఎంటల్లీలోని లొరేటో కాన్వెంట్‌కే యెకాయెకీ వెళ్లకపోవడం ఆవిడకు చిత్రంగానే వుండి వుండవచ్చు. లిటిల్ సిస్టర్స్ ది సెయింట్ జోసెఫ్స్ హోమ్‌ని నిర్వహిస్తున్నారు. 200మంది వృద్ధులకి అది ఆశ్రమంగా వుంది. యే సహాయమూ అందడంలేదు అంది. ఏదో నామకః మాత్రమే వుంటుందది. అది 2 లోయర్ సర్క్యులర్ రోడ్‌లో వుంది, యికా అక్కడే కొనసాగుతుంది. అయిదేళ్లు గడవకుండానే మదర్ థెరెసా తన కేంద్ర కార్యస్థానాన్ని స్థాపించుకోబోయే రోడ్డు అదే.

అనేక విధాలుగా సెయింట్ జోసెఫ్స్ హోమ్ నమూనా ఆశ్రమం. లిటిల్‌సిస్టర్స్ ఆఫ్ ది పూర్ పేదరికానికి అంకితం అయిపోయేరు. వాళ్లు యీ సంస్థ ద్వారా తమ కార్యకలాపాలు నిర్వహించినా వాళ్లకి నిలకడైన ఆదాయం లేదు, అంతా దేవునిదే భారం. మొదట్లో కొన్ని రోజులు మదర్ థెరెసా సిస్టర్లకి చేదోడుగా పనిచేశారు. రోజూ కొన్నిగంటలు. డిసెంబరు 10 నుంచి 18 దాకా విశ్రాంతి తీసుకోవాల్సిందిగా ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ ఆవిడ్ని ఆదేశించారు. డిసెంబరు 19 ఉదయమే ఆవిడ మళ్లీ పనిలో దిగడానికి తయారయేరు. "తను మొదట తల్‌తలా వెళ్లాలని సూచించేను. యీ మధ్యతరగతి శివారుప్రాంతంలో చాలామంది ఎంటల్లీలో ఆవిడ విద్యార్థినులే. కొత్త వేషధారణలో మదర్ థెరెసాని మళ్లీ చూస్తే మంచిదని నాకనిపించింది. ఆవిడ తన రంగంలో కృషి ప్రారంభించడమూ వాళ్లకు తెలుస్తుంది." మురికివాడల్లో, వీధుల్లో కష్టతరమైన పనులకి ఆవిడ్ని అలవాటుపడేట్టు చేసేందుకు ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ అనుసరించిన పద్ధతి అదీ. కాని తను తిరిగి తలతలానికి వెళ్తునని ఆవిడ ఫాదర్ వాన్‌ఎగ్జిమ్‌తో ఆరోజు సాయంత్రమే చెప్పేరు. "అసలైన పని" అక్కడ లేదు. డిసెంబరు 20 పొద్దున్న ఆవిడ మొట్టమొదటిసారిగా మోతీఝీల్ మురికివాడకు వెళ్లేరు అని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ చెప్పేరు.

"మోతీఝీల్" అంటే ముత్యాలసరస్సు అని ముక్కస్యముక్క అనువాదం చెప్తోంది. నిజానికి అలాంటి ఛాయలే అక్కడ లేవు. ఆ ప్రాంతం మధ్యలో ఓ పెద్ద చెరువు వుందంతే. యివాళ ఆ నివాసప్రాంతాన్ని 'బస్తీ'(మురికివాడ) అంటే అక్కడివాళ్లు గుడ్లురుముతారు. యివాళ మోతీఝీల్‌కి చక్కని రోడ్లు వున్నాయి. విద్యుత్ సరఫరా వుంది. శుభ్రమైన తాగునీరు సౌకర్యం వుంది. పారిశుద్ధ్యం యేర్పాట్లు వున్నాయి. యిళ్లు చిన్నవే అయితేనేం చాలామట్టుకు చక్కగా కట్టినవే. చాలా యిళ్లకప్పుల నుంచి టి.వి. ఏరియల్స్ పైకి కనిపిస్తూ వుంటాయి. అయితే మదర్ థెరెసా మొట్ట మొదటిసారి అక్కడకు అడుగుపెట్టినపుడు అంటే నలభైయేళ్లనాడు, బాగా వుండడం అనేమాట నీడే ఆ బస్తీమీద లేదు. తాగడానికి, బట్టలు ఉతుక్కోవడానికీ తొట్టినీళ్లే ఆధారం, వున్నదల్లా అదొక్కటే. మురికికాల్వలు రోడ్డుమీదనే పారేవి. రోజుల తరబడి చెత్త పేరుకుపోయేది. ఓ క్లినిక్ లేదు, డిస్పెన్సరీ లేదు, బడి సంగతి చెప్పనే అక్కర్లేదు.

మదర్ థెరెసా తన కార్యక్రమానికి మోతీఝీల్‌లో శ్రీకారం చుట్టడం అనూహ్యమైందేమీ కాదు. ఎంటల్లీ కాన్వెంట్‌లోని క్లాస్‌రూమ్ కిటికీ నుంచి అది కనిపిస్తూనే వుండేది. అంచేత అదంతా కొత్త ప్రాంతమేం కాదు. అదీగాక సెయింట్ మేరీ సొడాలిటీ సభ్యులు అక్కడ పనిచేసిన వాళ్లే. అక్కడి చర్చి ప్రీస్ట్ ఫాదర్ హెన్రీకి ఆ 'బస్తీ' బాగానే తెలుసు. ఆవిడకు సాయం చెయ్యాలని ఆసక్తిగా వున్నారు. ఆ బస్తీలో వుంటున్న చాలా పేద కుటుంబాలవాళ్ల చిరునామాలు ఆయన దగ్గర్నుంచే ఆవిడ తీసుకున్నారు. ఆ కుటుంబాల పిల్లలు సెయింట్ థెరెసా చర్చి పాఠశాలకు హాజరయినవాళ్లే.

మొట్టమొదటి రోజునే మదర్ థెరెసా ఆ పిల్లల తల్లిదండ్రుల్ని కలుసుకున్నారు. తమ నివాస ప్రాంతంలోనే చిన్నబడి వెలుస్తోందని వాళ్లు మహా సంబర పడి పోయేరు. తమ పిల్లల్ని ఆ బడికే పంపిస్తామని అన్నారు. అందుబాటులో ఓ బిల్డింగూ లేదు, కనీసం గది కూడా లేదు. అయినా నిరుత్సాహం కలగలేదు. ఆవిడ దగ్గర చిల్లిగవ్వ లేదు. ఓ బ్లాక్‌బోర్డ్ లేదు, ఓ సుద్దముక్క లేదు. పలకాబలపాలు కూడా లేవు. రెండోరోజున ఆవిడ వెళ్లేటప్పటికి అయిదుగురు పిల్లలు ఆవిడకోసం కనిపెట్టుకుని వున్నారు. వున్న ఖాళీ జాగాఅల్లా నీటితొట్టి దగ్గర వున్న ఓ చెట్టుక్రింద నీడ. "ఓ పుల్ల తీసుకుని నేల మీద గుర్తులు గీశేను. పిల్లలు అక్కడ కూర్చున్నారు. నిజంగా నేల మీదే మేం ప్రారంభించేం" అన్నారావిడ.

తను వుంటూవున్న లిటిల్‌సిస్టర్స్ కాన్వెంట్‌కీ యీ స్థలానికీ సుమారైన దూరమే. అయినా ఆవిడ దాన్ని గురించి యేమీ పట్టించుకోలేదు. ఆవిడ టిఫిన్ కూడా తీసుకువెళ్లేవారు. అప్పట్లో చర్చిస్కూల్ ప్రిన్సిపాల్‌గా సిస్టర్ రొజారియో వున్నారు. ఆవిడకు ఆ రోజులు బాగా గుర్తున్నాయి. "పాట్నా నుంచి డిసెంబరు మధ్యలో తిరిగి వచ్చేక, మొదట నా దగ్గరకే వచ్చిందామె. మేం మంచి స్నేహితులం. రోజా పొద్దున్నే పని మొదలెట్టేది. 12.30కి యింకా మోతీఝీల్‌లోనే వుండేది. వెనక్కి తిరిగి వస్తూ బడి దగ్గర ఆగి భోజనం చేసేది. సాయంత్రం ట్రామ్‌లోనో, బస్‌లోనో కాన్వెంట్‌కి తిరిగివచ్చేది. ట్రామ్ టిక్కెట్టు డబ్బుల్ని చెయ్యిచాచిన

వాళ్లెవళ్లకో యిచ్చెయ్యడమూ అప్పుడప్పుడు జరుగుతూ వుండేది. కొన్ని సందర్భాల్లో ఆవిడ దగ్గరున్న పైసలల్లా ఆ కాసినే. అలాంటపుడు ఆ మూలనుంచి యీ మూల దాకా నడిచివచ్చేది. గంట పట్టేది."

సిస్టర్ థెరెసా పాట్నా నుంచి తిరిగి వచ్చిందనీ, మోతీఝిల్‌లో బడిపెట్టిందనీ నలుగురికీ తెలియడానికి యెంతోసేపు పట్టలేదు. ఓ రోజు మధ్యాహ్నం ఆవిడ దగ్గర చదువుకున్న పిల్లలు ఆవిడ్ని కలుసుకుందుకు అక్కడకు వెళ్లేరు. ఆవిడ్ని నన్ వేషంలోనే చూడ్డానికి అలవాటు పడ్డవాళ్లేమో, పరమ ముతక చీర కట్టులో చూసి ఆశ్చర్యపోయేరు. 1948నాటి కలకత్తాలో ఆవిడ వింతగా కనిపించి వుండాలి. అవడానికేమో యూరపియన్, చూడ్డానికేమోకాదు. చాలామంది యూరోప్ మహిళలు భారతీయుల్ని పెళ్లి చేసుకున్న సంఘటనలు చాలావున్నమాట నిజమే. అయితే వాళ్లు ధగధగ మెరిసిపోయే పట్టుచీరలు, ఖరీదైన నూలు చీరలు కట్టుకుంటారు. వాళ్లపాదాలు అనాచ్ఛాదితంగా కనిపించేవీ కాదు. మదర్ థెరెసా కాళ్లకు తోలుచెప్పులు వుండేవి. పాట్నా సిస్టర్లు వీడ్కోలు కానుక అవి. యిదంతా చాలవన్నట్టు ఆ బృందానికి ఆవిడ "బడి"తో సర్దుకుపోవడం కష్టమైంది. అంతకుముందు కొన్ని నెలలదాకా ఆవిడ వాళ్ల స్కూల్‌కి ప్రిన్సిపాల్‌గా వున్నారాయె. యిపుడావిడ నెత్తిమీద ఆస్తరణ లేదు. ఓ బల్లలు లేవు, కుర్చీలు లేవు, పుస్తకాలు, పెన్సిళ్లు ముందే లేవు. అయినా ఆవిడ చింకిపాతల పిల్లలకు కంపుకొట్టే గుంటల పక్క "క్లాసు" నడిపేస్తున్నారు.

☆ ☆ ☆

మదర్ థెరెసా 1948 డిసెంబరు 25 నుంచి 1949 జూన్ 13 దాకా తన పని గురించిన 'పుస్తకం' లాంటి సంక్షిప్త రికార్డు వుంచుకున్నారు. ఆ వూహ ఆర్చ్‌బిషప్ పెరియర్‌ది. తన కార్యకలాపం గురించి మదర్ థెరెసాకీ, ఫాదర్ వాన్ఎగ్జిమ్‌కి తనకీ మధ్యన సాగి, తిప్పి పంపిన ఉత్తరాలు కొంత భేదాభిప్రాయ కారకం అయివుండవచ్చు. దాన్ని సరిదిద్దుకోవాలన్న ప్రయత్నంలో యీ సూచన ఒకటి అయి వుండచ్చు. ఆవిడ ఆ ఉత్తరాల్ని తిరిగి యిమ్మన్నారు. కాని ఆయన వాటిని ఆవిడ కూటమి పుట్టు పూర్వోత్తరాలని తెలియజేసే పత్రాలుగా వుంచుకుందా మనుకున్నారు. ఆ పద్ధతి ఆమోదయోగ్యమైన ప్రత్యామ్నాయంగానే కనిపించింది.

ఆవిడ ఉత్తరప్రత్యుత్తరాలు యెక్కువగానే సాగిస్తారు. కాని తనకి వచ్చిన వేలాది ఉత్తరాలని జాగ్రత్తచేసే వ్యవధీ, జాగా ఆవిడకు లేవు. అదీగాక యెలాంటి లిఖిత ఆధారాలూ దగ్గర వుంచుకున్నట్టూ లేదు. అంచేత ఆ "పుస్తకం" విశిష్టమైంది. అందులో వున్న ఉల్లేఖనలన్నిట్నీ ఆవిడ రాసినట్టే నమోదు చెయ్యడం జరిగింది. "ఆవిడ ఆ రోజు పని పూర్తయ్యేక రాత్రిపూట దాన్ని రాసేవారు" అని ఫాదర్ వాన్ఎగ్జిమ్ నాతో అన్నారు. "అప్పటికి తెగ అలిసి పోయి వుంటారావిడ. అలా రాస్తూ మధ్యలో యెన్నోసార్లు జోగే వుంటారు. ఆవిడ రాతపనిలో నెగ్గుకు రాలేరు యెక్కువకాలం. దీన్ని దినచర్య అని చెప్పే గ్రంథాలు వున్నాయి." అది డైరీ యేమాత్రం కాదు, అంతరాత్మకి సంబంధించిందీ కాదు. అదొక రికార్డు, ఆర్చ్‌బిషప్ కోసం రాసింది. రోజువారీ అనుభవాలని తెలియచేస్తుంది.

ఇరవైయేళ్ల నాడెప్పుడో ఒకసారి ఆ "పుస్తకాన్ని" చూశేరు. దానిలో ప్రస్తావితమైన

కొన్ని అంశాల్ని యింతకు ముందే కొన్ని గ్రంథాల్లో పేర్కొన్నారు. కాని అధికభాగం తొలిసారిగా ప్రచురణ పొందుతున్నాయి. కొన్ని తేడాలు అందులో కనిపిస్తూ వున్నాయి. కొన్నిచోట్ల తేదీలు సరిపోవడం లేదు. తెలిపిన సంఘటనలకీ తేదీలకీ వార కనిపిస్తోంది. చాలా సందర్భాల్లో క్లుప్తంగా వున్నాయి. ఆవిడ తొలి అడుగులని నమోదు చెయ్యడంలోనే దాని అపారమైన విలువ అంతా వుంది. ఆమెకు కలిగిన శంకలు, ఆవిడకు యెదురైన పరాజయాలు అందులో వున్నాయి. ఆవిడకు పనిలో యెదురైన ప్రతికూలాలు, ఆవిడకు కలిగిన ఆనందానుభూతులు అందులో వున్నాయి. ఓ విషయం స్పష్టంగా తగుల్తుంది. ఆవిడ పథకాలలో, తన ధ్యేయంకోసం చేస్తూవున్న కృషిలో ముందే వ్యూహించుకున్న "బృహత్తర ప్రణాళిక" అనేది యేదీ లేదు. ఆవిడకు మురికివాడల్లో సమస్యలు యెదురయేయి. అయినా మామూలు పాలనాపరమైన పంథాలో ఆవిడ యెన్నడూ వెళ్లలేదు. అంటే సర్వేలు జరిపించడం, పథకాలు తయారు చెయ్యడం, వనరుల్ని సమకూర్చుకోవడం, జనాలకి శిక్షణ లాంటివన్నమాట. ఫలానావ్యక్తి తక్షణ అవసరం యేమిటోననే ఆవిడ చూశారు. అక్కడ్నే అప్పుడే దాన్ని పరిష్కరించ ప్రయత్నించేరు. పౌష్టికాహారం లేని పిల్లవాడు తగుల్తాడు. అలాగని పౌష్టికాహార పథకం తయారు చెయ్యడం ఆవిడ పని కాదు. ఆ పిల్లాడికి తిండిపెట్టే అతి దగ్గరి మార్గమే ఆవిడ వెదికేరు. యీ పంథా యిన్ని యేళ్లయినా మారలేదు.

గుర్తించదగ్గ అంశం మరోటి వుంది. పనిలో మరో పార్శ్వం అది. మదర్ థెరెసా ఏకకాలంలో రెండు, మూడు పనులు చేపట్టారన్న విషయం. మాటకు మోతీఝీల్ బడి మోతీఝీల్‌కే మేలు చేస్తుంది. తిల్‌జాల పిల్లలకు దానివల్ల ఒరిగేది యేమీలేదు. అంచేత ఆ మురికివాడలోనూ బడి వుండాలి.మోతీఝీల్‌లో యింకా పరిష్కరించవలసిన సమస్యలున్నాయన్నమాట నిజమే. అయితే ఆ విషయం ఆవిడకు బాధకం కాలేదు. అదేవిధంగా డిస్పెన్సరీలకి, మృత్యుముఖంలోవున్న వాళ్ల ఆశ్రమాలకి, యింకా అలాంటి వాటికి సంబంధించింది యిదంతా. ఈశ్వరుని సేవ, అవన్నీ సాగేటట్టు ఆయనే చూసుకుంటాడు. బహుశా అన్నిటికీ మించి ఆవిడ రాసుకున్న విషయాలు ఆవిడ అందుకున్న పిలుపు గురించి తెలియచేసే సాక్ష్యాలు. ఆవిడ సంపూర్తిగా అంకితమైన దానికి సాక్ష్యాలు. తను నిమిత్తమాత్రురాలిని అన్న ఆవిడ విశ్వాసానికి సాక్ష్యాలు.

మోతీఝీల్‌లో పనిలో దూకేటప్పటికి ఆవిడ దగ్గర డబ్బులేదు. ఆవిడ గనక అడిగివున్నట్టయితే లొరేటో మఠం ఖర్చుల నిమిత్తం ఓ మాదిరిగా సర్దుబాటు చేసే వుండేది. పాట్నా ప్రయాణానికి అయిదు రూపాయలు యిచ్చేరు. తిరుగు ప్రయాణం ఖర్చులు యిచ్చే వుంటారు. ఆవిడ కలకత్తాకు తిరిగివచ్చేక లిటిల్‌సిస్టర్స్ ట్రామ్ చార్జీలేనా యిచ్చివుంటారు.

సరిగ్గా ఓ వారం తర్వాత ఆవిడకు కొంత సొమ్ము అనుకోకుండా వచ్చింది. ఆ రోజుల్నిబట్టి చూస్తే ఓ మాదిరిగా చెప్పకోదగ్గ మొత్తమే. ఆ రోజు ఉదయం చర్చి ప్రీస్టుని కలుసుకుందామని ఆవిడ సియాల్దా వెళ్లేరు. తను చేస్తూవున్న పనిపట్ల ఆయన సంతోషం వెల్లడించేడని అన్నా, ఆయన సాయం లేదు, ప్రోత్సాహం యివ్వలేదు. ఆవిడ ప్రక్కనేవున్న పార్క్ ప్రీస్టు దగ్గరకు వెళ్లేరు. ఆవిడకు తేడా కొట్టవచ్చినట్టు కనిపించింది. ఆయన "వూరికే ఉత్సాహపడ్డాడు," తన సంతోషాన్ని

తెలియచేసేటట్టు వందరూపాయలు యిచ్చేడు. అది తొలివిడత, అంతే. యిక బడికో యిల్లు వెతకడం మొదలెట్టేరు ఆవిడ. "రెండు గదులు అద్దెకు తీసుకున్నారు. ఒక్కొక్కోదానికీ నెలకు అయిదు రూపాయలు అద్దె. అవి స్కూల్ కోసమూ, డిస్పెన్సరీకీని. అవి పెద్ద చెరువు యెదురుగ్గా వున్నాయి" అని రాశారు. ఆవిడ డిసెంబరు 27న వాటిని అద్దెకు తీసుకున్నారు. అంటే ఆ సొమ్ము ఆవిడ చేతికి వచ్చి నిండా యిరవై నాలుగు గంటలైనా కాలేదన్నమాట.

ఆ గదులకి మరమ్మత్తులు జరగాలి. శుభ్రం చెయ్యాలి. అంచేత మరికొంతకాలం బడి ఆరుబయటే వుంది. కలకత్తాలో డిసెంబరు, జనవరి, ఫిబ్రవరి నెలల్లో కొంచెం చలిగా వుంటుంది. ఆరుబయట యేమాత్రం సౌకర్యంగా వుండదు. యిక వానలు మొదలయ్యే జూన్ నెలలో ఆరుబయట వుండటం అసలే కుదరదు. యీలోపున ఆరుబయట పాఠశాల పెరుగుతోంది. డిసెంబరు 28 నాటికే బళ్లో యిరవైఒక్కమంది పిల్లలు వున్నారు. సెయింట్ మేరీస్‌లో పనిచేసే ఓ టీచర్ యిష్టాపత్తిగా పనిచేస్తానని ముందుకు వచ్చింది. "పిల్లలు మురిగ్గా, ఎడ్డిగా వున్నారు. కాని చాలా సంతోషంగానే వున్నారు" అని ఆవిడ రాశారు. బడికి వచ్చేక వాళ్లకి పాఠాలు ఒకటే కాదు, పరిశుభ్రంగా వుండడం గురించీ నేర్పేరు. సెయింట్ మేరీస్‌లో రోజుల్ని గుర్తు చేసేటట్టు ఆవిడ ప్రతి ఒక్కళ్లకీ స్నానం చేయించేవారు. హాజరీకి, పరిశుభ్రతకూ బహూమానంగా తలా ఒక సబ్బుబిళ్ల యిచ్చేవారు. "పిల్లలు ముందటికంటే బాగా పరిశుభ్రంగా వున్నారు" అని ఆవిడ రాశేరు. "శుభ్రంగా లేని వాళ్లని చెరువు దగ్గర బాగా స్నానం చేయించాను." పారిశుద్ధ్యం గురించిన పాఠంతో బడి మొదలయేది. తర్వాత పఠనం వుండేది. "చాలాసార్లు హాయిగా నవ్వుకునేదాన్ని. నేను అంతకుముందు యెప్పుడూ చిన్నపిల్లలకు పాఠాలు చెప్పి యెరగను. క,ఖ,గ (బెంగాల్ అక్షరమాలలోనివి) పట్టుబడలేదు. బ్లాక్‌బోర్డుమీద కంటే నేలమీద రాయడమే మంచిదనిపించింది. అందరికీ సంతోషంగా వుంది."

అ, ఆ లు వల్లెవేస్తూ వుండడం మోతీఝీల్‌లో అలవాటుగా వినిపించేది. పిల్లలు కూర్చోవడం నేలమీదే అయినా, "మంచితనం" కనిపించినప్పుడు "బస్తీ" జనం గుర్తించేరు. సంఘ సేవాభావంతో పుస్తకాలు, పలకలు సమకూరాయి. ప్రజలు కొంచెం డబ్బు సాయం చేశారు. ఓ బల్ల, ముక్కాలు పీటలాంటి వాటిని యివ్వగలిగినప్పుడు యిచ్చేరు. వాళ్లు సంతోషిస్తూ వున్నారని చెప్పగలిగేందుకు యివి చిన్న గుర్తులు మాత్రమే. జనవరి 4వ తేదీనాటికి మదర్ థెరెసాకి ముగ్గురుటీచర్లు తోడువచ్చేరు. అప్పటికి పిల్లసంఖ్య 56కు పెరగడంతో వాళ్ల అవసరం యెంతైనా వుంది. బెంగాలీ భాషనీ, లెక్కల్నీ కూడా బోధించడం మొదలుపెట్టేరు. అల్లికపని ఆడపిల్లలకి చాలా ఆకర్షణీయంగా వుంది. జనవరి 14 నాటికి తరగతిగది తయారైంది. ఆ మర్నాడు ఆ బడికి ఆశీస్సులు అందించడానికి ఫాదర్ నికైసె వస్తున్నారు. ఆయన గౌరవార్థం పాడడానికి మదర్ థెరెసా పిల్లలకి బెంగాలీ పాట నొకదాన్ని నేర్పేరు. "ఒక్కగొంతు కూడా తిన్నగా వున్నట్టు లేదు" అన్నారావిడ సరదాగా. ఆ బడికి మదర్ థెరెసా "నిర్మల్‌హృదయ్" అని పేరు పెట్టారు. (ఆవిడ ఆ తర్వాత ఆ పేరుని చావుబ్రతుకుల్లో వున్న నిరాశ్రయుల ఆవాసానికి మార్చేరు) లొరేటో కాన్వెంట్ నీడలో ఆ బడి సాకారం అయింది.

"మురికివాడల్లో యెన్ని సంతోషకరమైనవి వున్నాయో. రోజూ పిల్లల్తో సరదాగా గడిచేది. చాలా ముందే కొంతమంది వచ్చేవారు. మా దగ్గరికి పరిగెత్తుకుంటూ వచ్చేవాళ్లు," అన్నారొకసారి ఆవిడ. "పిల్లలు ముందటికంటే మెరుగవు తున్నారు. ఒక సుగుణం అబ్బింది, పాడు భాష వదిలిపోయింది. వాళ్లోసారి చెత్తభాష మాట్లాడే పిల్లాణ్ణి తీసుకువచ్చేరు, ఆ కుర్రాడు తల్లితోనూ ఆ మాదిరి మాటలే అంటూ వుంటాడట. తల్లిని తిట్టే పిల్లల్ని నిర్మల్ హృదయ్‌లో చేర్చుకోం అని చెప్పేను. ఆ కుర్రాడు చాలా బాధపడ్డాడు" అని కొన్నిరోజుల తర్వాత ఆవిడ చెప్పేరు.

ఓ కొత్త కుటుంబం మోతీఝిల్‌లో వుండడానికి వచ్చిందని ఆవిడ 1949 జనవరి 14న రాసుకున్నారు. ఒక బెంగాలీ అమె, యిద్దరు పిల్లలు, ఆవిడ చెల్లెలు. ఆ చెల్లెలు ఓ నర్సు. వాళ్లు ఒకప్పుడు బాగా బతికినవాళ్లే యిప్పుడు బాగా చితికిపోయేరు. మదర్ థెరెసా క్లాసులో పాఠం చెబుతూవుంటే, ఒకళ్లు అన్నారట "మీకు తెలుసా సిస్టర్? జెనా, అమె తమ్ముడు నిన్న పొద్దుటినుంచి యేమీ తినలేదట, యీరాత్రికి్కూడా యేమీ వుండదట" అని. పాపం ఆ పిల్లలు తమ పరిస్థితి గురించి చెప్పలేకపోయేరు. నా దగ్గర మూడు అణాలు వున్నాయి. నేను సెయింట్ థెరెసా నుంచి సునాయాసంగా నడిచి వెళ్లగల ననుకోండి. అందుకని ఆ డబ్బుపెట్టి వాళ్లకి బొరుగులు, రెండు గుడ్లు కొన్నాను, ఆ పిల్లలకు పెట్టేను."

ఆ రోజునే యింటికి నడిచి వెడుతూ వుండగా ఆవిడకు "మొదటి కర్కశాఘాతం" తగిలింది. దారిలో ఆవిడ వో చర్చి దగ్గర ఆగేరు, మా పనికోసం యెవరో దానం యిస్తామన్నారు. "ఇంటికి వస్తూ యెంత త్వరగా పార్క్‌స్ట్రీట్‌కి చేరేను అని ఆశ్చర్యపోయేను. ప్రీస్ట్ ఔదార్యం యెంతటిదోనని వెళ్లేను. చిత్రం! నేనేదో తప్పుడుపని చేస్తూవున్నట్టు చూశేరు. నాకు సాయం చెయ్యమని ఆ ప్రాంతం ప్రీస్ట్‌ని అడగమన్నారు. జోలెపట్టి డబ్బులు పోగుచేస్తానని నేను అన్నాను. దాంతో అయన మరీ విస్తుపోయేడు. తనకేం బుర్రకు యెక్కడంలేదని వెళ్లిపోయేడు. (సెలవు అని చెప్పకుండానే.) అదే మొదటి దెబ్బ, గట్టి దెబ్బ, కనుక వీధిలోకి వచ్చేటప్పటికి నాకు కళ్లల్లో నీళ్లు తిరిగేయి," అని రాశేరు. ఆవిడ అలసిపోయి వుండడంవల్లగాని, ఒక్కత్తీ వుండడంవల్లగాని, లేదా యీ రెండింటి వల్లాకాని యేడుపు వచ్చి వుంటుంది. యింతకీ విషయం యేమంటే ఆ ప్రీస్ట్ తిరస్కారంవల్ల ఆవిడ దృఢనిర్ణయం వీసమెత్తు తగ్గలేదు, అవిడ్ని ఆ దారినుంచి మళ్లించలేదు. అలా జరక్కపోగా హృదయాంతర్గత లఘిమ ముందుకు వచ్చింది. యిక గత్యంతరం లేక జోలెపట్టడమే తప్పకపోతే, సరే, అలాగే జరగనీ.

భారతదేశంలో భిక్షాటన ప్రాచీన సంప్రదాయంలోనే వుంది, గౌరవప్రదంగానూ వుంది. యెన్నో యుగాలుగా మునులు, సన్యాసులు, ఆచార్యులు తమ జీవనాన్ని రాజుల మీద, సంసారుల మీద ఆధారపడి కొనసాగించేరు. మదర్ థెరెసా యీ మూసలో అనాయాసంగా యిమిడిపోయేరు. యెన్నోరోజులు గడవకుండానే ఆహారం కోసం, మందుల కోసం, పాతబట్టల కోసం "అర్థిస్తూ ఉత్తరాలు", "అర్థిస్తూ పర్యటనలూ" వచ్చేయి. అన్నిటికీ దేవుడే వున్నాడని చూడ్డంవల్లా, పేదరికం తన దీక్ష అని ఆవిడ భావించడంవల్లా తేలిన ఫలితం అది. అందుకనే కలకత్తాలో వుండే ధనిక ప్రముఖ భార్యాభర్తా మోతీఝిల్ బడికి వచ్చి అన్నివిధాలా సాయంచేస్తామని

చెప్పడం ఆవిడను ఒక వింత యిబ్బందికి గురిచేశాయి. "మా పూర్ణ పేదరికాన్ని, ఆ ప్రభువుతో సాన్నిహిత్యాన్ని యేదీ నాశనం చెయ్యకుండా వుండుగాక అని మనస్ఫూర్తిగా ప్రార్థించేను. నేనిపుడు అవగతం చేసుకున్నాను యెంత నిమిత్తమాత్రురాలినైందీ."

తన బడికి ప్రభుత్వసహాయాన్ని తీసుకోవడం ఆవిడకు సరిపడలేదు. క్రమేపీ ఆ నిర్ణయం దృఢతరం అయింది. మోతీఝీల్‌లో బడి ప్రారంభించగానే ఆవిడ ఆర్థిక సాయం కోసం అక్కడి స్కూళ్ల పర్యవేక్షక అధికారి దగ్గరకు వెళ్లేరు. బడి యేడాదిపాటు జరిగితేకాని యే ప్రభుత్వ సాయమూ అందదనీ, అదీ మామూలుగా వుండే పరిస్థితి అనీ ఆ అధికారిణి ద్వారా తెలిసింది. "సావిత్రితో కలిసి మిస్ రాయ్‌ని కలుసుకుందుకు వెళ్ళేను. పిల్లలకు బాగా అవసరం అయిన అంశాలనే బోధించా లనుకుంటున్నట్టు చెప్పేను. నేను స్వేచ్ఛగా వుండా లనుకుంటున్నట్టూ చెప్పేను," అని కొన్నివారాల తర్వాత ఆవిడ రాసుకున్నారు. అయితే క్రీక్ వీధి లేన్‌లోకి మారేకగాని ఆవిడ తుది నిర్ణయం తీసుకోలేదు. ప్రభుత్వం నుంచి గాని, చర్చి నుంచి గాని క్రమం తప్పకుండా వచ్చే సాయం వల్ల పూర్ణపేదరికం అనే తన ప్రమాణం భంగపడడమే కాదు, తన స్వేచ్ఛకు గుదిబండలుగా తయారయే షరతులూ కుప్పలు తెప్పలుగా వుంటాయి.

మదర్ థెరెసా బడిని పట్టాల మీద పెట్టగలిగేరు. అంతలోనే ఒక డిస్పెన్సరీని ప్రారంభించే పనిమీద దృష్టి లగ్నం చేసేరు. అప్పటికే ఆవిడ రోగగ్రస్తులకి సేవలందిస్తూ వున్నారు. క్షయ, కుష్ఠు బాగా వ్యాపించివున్న వ్యాధులు. "ఓ కుష్ఠువ్యాధిగ్రస్తురాలు తగిలింది. ఎంత దారుణంగా వుందనుకున్నారు. ఆ వ్యాధివల్ల కావలసినవాళ్లే ఆమెను బయటకు గెంటేశారు. వేళ్లు అన్నీ కొరుక్కుపోవడంలో వంట వండుకోవడం ఆమెకి కష్టమైపోయింది. పిల్లని చేరదీసి కాలక్షేపం చేసుకుంటోంది" అని మదర్ థెరెసా జనవరి 14న రాశేరు.

ఆవిడ ఒక వృద్ధ ముస్లిమ్ వనితకు యేదో మందు యిచ్చేరు. అది అద్భుతంగా పనిచేసిందని ఆ ముస్లింవనితకు అనిపించింది. "యెన్నేళ్లనుంచి బాధపడుతున్నానో చెప్పలేను. యిప్పుడే మొదటిసారిగా నాకు నొప్పి అని అనిపించనిరోజు. అల్లాయే మిమ్మల్ని నాదగ్గరకు పంపించేడు" అని ఆమె మదర్ థెరెసాతో అంది. "మోతీఝీల్‌లో ఒక వృద్ధ ముస్లిం మహిళ నాదగ్గరకు వచ్చింది. 'మీరు నాకోమాట యివ్వాలి' అంది. 'నాకు ఒంట్లో బాగాలేక ఆఖరి గడియల్లో వున్నా ననిపించి నప్పుడు మీరు నాదగ్గరకు రావాలి. దేవుని సన్నిధిలో తనువు చాలించాలని నా కోరిక' అందామె" అని మార్చి చివర్లో మదర్ థెరెసా రాసుకున్నారు.

"మోతీఝీల్‌లో పిల్లలూ, జనాలూ బోలెడు రోగగ్రస్తులై వున్నారు. యెటు చూసినా వాళ్లు పిలుస్తూనే వున్నారు. దేవుడి దయవల్ల నేను పంపించే ప్రతిరోగినీ కాంప్‌బెల్ (హాస్పిటల్) వాళ్లు చేర్చుకుంటున్నారు. అన్నిరకాలవాళ్లనీ. యిలా కబురు పంపితేచాలు అంబులెన్స్ పంపిస్తారు," అని రాశేరు. ప్రతివాళ్లనీ హాస్పిటల్‌లో చేర్చుకునేటంత అవసరం వుండదు. తనదగ్గరకే వచ్చేవాళ్లు యెక్కువ అవుతూ వుండడంతో ఆవిడకు మరిన్ని మందులు అవసరం అయేయి. దాంతో ఆవిడ మందులకొట్ల చుట్టూ తిరగడం యెక్కువైంది. యేం యివ్వగలిగితే వాటిని తనకిమ్మని ఆవిడ వాళ్లని అడిగేవారు. అలా మందుల కొట్లకు యెన్నోసార్లు వెళ్లడం గురించి

ఆవిడ తను రాసుకున్న పుస్తకంలో ప్రస్తావించేరు. "స్మిత్ స్ట్రీట్ వీధికి జోలెపట్టుకుని వెళ్లేను. వాళ్లు నాకు కొన్ని మందులు యిచ్చేరు," అని వో ప్రస్తావన వుంది. బహుశా అలా వెళ్లిన సందర్భాల్లోనే ఆవిడకు మందులుకాక, తెగ తిట్లు యెదురయి వుంటాయి. అయినా ఆవిడ జావగారి పోలేదు. "తిల్ జాలలో నాకు ఒక రకం 'గాలి' (తిట్లు) తగిలేయి. పాపం, ఆ మానవుడు తనన్న మాటలకు సిగ్గుతో కుమిలి వుంటాడు, నేను క్షమించేను. నిజంగా మనస్ఫూర్తిగానే క్షమించేను" అని ఆవిడ రాశేరు.

చిత్రంగా, ఆవిడ మొదటి డిస్పెన్సరీని మోతీఝీల్‌లో ప్రారంభించలేదు. ఆ ప్రాంతపు చర్చి బళ్లో సిస్టర్ రొజారియొ యిచ్చిన క్లాస్‌రూమ్‌లో ప్రారంభించేరు. ఆ గది వరండావేపు వుంది. బడి అయిపోయేక దాన్ని క్షయవ్యాధిగ్రస్తుల పరీక్షా కేంద్రంగా మార్చేశారు. యెన్నో రోజులు తిరక్కుండానే, పరీక్షాకేంద్రం తెరవడానికి చాలాముందే చాలామంది క్యూలో వుండడం మొదలైంది. వాళ్లల్లో చాలామంది రిక్షాలాగేవాళ్లు, కూలీలూనూ. బజార్లో వాళ్లు యెంతో బరువును నెత్తిమీద మోసేవాళ్లు. పరీక్షాపరికరాల్ని మదర్ థెరెసా సమకూర్చుకోగలిగేరు. యీ సమకూర్చు కోవడం కూడా "అర్థించేలేఖల" ద్వారానా, యెవళ్లేనా పుణ్యాత్ములు దానం యివ్వడం ద్వారానా అన్న విషయాన్ని ఆవిడ చెప్పలేదు.

ఓ బడినీ, ఓ డిస్పెన్సరీని యెంతో గబగబా, ఓ పక్షం రోజుల్లోనే ప్రారంభించ గలగడం ఆవిడ నిర్వహణా సామర్థ్యాన్ని తెలియచేస్తుంది. 1949 జనవరి 4న తిల్ జాలలో రెండవ పాఠశాలని ప్రారంభించాలని ఆవిడ అనుకున్నారు. "పిల్లల్ని బడికి పంపించమని తల్లిదండ్రుల్ని అర్థించేను. ఆ నిర్భాగ్యుల సేవ కోసం నా శక్తివంచన లేకుండా కృషిచేస్తాను. వీళ్లు మోతీఝీల్ లో కంటే యెక్కువ దుర్భర పరిస్థితుల్లో వున్నారు" అన్నారావిడ. "తిల్ జాలలో పిల్లలు బడికి వెళ్లడానికి యెగిరి గంతేశారు. మగపిల్లలకైతే అంతా సిద్ధంగానే వుంది. ఆడపిల్లలకీ బాగానే వుండచ్చు. భగవంతుడా, వాళ్లు బడికి రావాలని చూస్తున్నాను" అని జనవరి 19న ఆవిడ రాశేరు. "పిల్లలు బాగా వున్నారు. తిల్ జాలలో ఆరుగురు మాత్రమే వచ్చేరు. సోమరితనం, తుంటరితనం పోయి కనీసం ఆ ఆరుగురైనా వుండడం గొప్పేకదా. ఆ చోటు సరిపడేట్టులేదు. వేరే యేర్పాట్లు చెయ్యాలని అనుకున్నాను. చిన్నగదికి ఆ ముసలావిడ అయిదు రూపాయలు అడుగుతోంది. బయట వున్న స్థలం మరింత అనుకూలంగా వుండచ్చు, అంచేత దాన్ని తీసుకుంటాను" అని ఓ వారం తర్వాత ఆవిడ రాశేరు. "తిల్ జాలలో నెలకి నాలుగు రూపాయల అద్దెకు ఓ గది దొరికింది. అక్కడివాళ్లే ముందుకు వచ్చేరు. వాళ్లపిల్లలకు ఓ చోటు దొరికిందని సంబర పడ్డారు. పిల్లలకు క్లాసులు బయట పెట్టవచ్చు కాబట్టి ఆ గదే డిస్పెన్సరీకి కూడా ఉపయోగపడుతుంది" అని ఆవిడ మూడురోజుల తర్వాత రాశేరు.

ఆ చిన్నబడిని సవ్యంగా నడిపించడానికి యెక్కువ వ్యవధి పట్టలేదు. "యివాళ మేరీమాత దినం. కిందటేడు యిదేరోజున మదర్ జనరల్ రాసిన ఉత్తరం వచ్చింది.... తిల్ జాలలో యిరవైముగ్గురు పిల్లలు వున్నారు. ముచ్చటైన, పిల్లలు యెంత మన్ననగా వుంటారు. ఆటలంటే యేం యిష్టం. నిర్మల్ హృదయ్ పెరుగుతోంది. దేవుడిదయ" అని ఫిబ్రవరి 2న రాశేరు. తను ఒక్కత్తెనీ అయి పోయానన్న విషయానికి తీవ్రంగా

ఉద్దేశిస్తున్నట్లూ ఆవిడ రాశేరు. "నా సొంత బిడ్డలుండాలని మేరీమాత ఉచితంగా భావిస్తే, అపుడే నిర్మల్‌హృదయ్ కలకత్తా నలుమూలలకీ తన ప్రేమామృతాన్ని పంచగలదు. 'నాకు పిల్లలు లేరు' అని నేనావిడకు చెబుతూ వుంటాను, ఆవిడ యెన్నో యేళ్లనాడు 'వాళ్లకు ద్రాక్షలేదు' అని జీసస్‌కు చెప్పినట్టు. ఆవిడ హృదయాన్నే నమ్ముకుని వున్నాను. ఆవిడ తన పద్ధతిలోనే నాకూ యిస్తుంది" అని రాసుకున్నారు.

మదర్ థెరెసాలో స్వభావతః వున్న విశిష్ట లక్షణం యేమంటే– ఆవిడ ఆచరణశీలత. అది నుంచీ కూడా ఆవిడకు ఉబుసుపోక కబుర్లతో కాలక్షేపంచేసే ఆసక్తిలేదు, వ్యవధీ లేదు. అయినా ఆవిడకు చురుగ్గా, సరదాగా వుండే పరిహాస స్వభావం వుంది. 1949 ఫిబ్రవరి చివర్లో ఆవిడ విద్యాధికారిని కలుసుకున్న సందర్భం ఒకటుంది. మోతీఝీల్ బడికి సంబంధించిన విషయం అది. అవిడ ఆ సంఘటన గురించి కొంత ఆలోచించినట్లుంది. 'సిస్టర్, మీరంటే నాకు గొప్పగానూ వుంది, యీర్ష్యగానూ వుంది. యీ దిక్కులేని ప్రజలపట్ల మీకున్న ఆదరాభిమానాలు గొప్పవి. యిక్కడ మేమూ వున్నాం, (మా)దేశప్రజలకీ యేమీ చెయ్యలేక. ప్రధానమంత్రి దగ్గరకు వెళ్లండి, మీరేం చేస్తున్నారో తెలియజెప్పండి. తన ప్రభుత్వం అంతా వుంది, ఆయన చెయ్యాలీ పని, మీరుకాదు. చిన్న సిస్టరయి వుండీ మీరు యింతపని చెయ్యాలన్న సంకల్పంతో వున్నారు. మీరు నెగ్గుకు వస్తారు లెండి' అన్నాడతను. యీ పోచికోలు కబుర్లకంటే స్థిర మైందేమన్నా అతను యిచ్చివుంటే బాగుండేదనిపించింది అని రాశేరు.

పాట్నా సిస్టర్లు వూహించినట్టే మదర్ థెరెసాకు ఓం ప్రథమం నుంచీ సహాయకులు సమకూడేరు. "సెయింట్ మేరీస్ నుంచి యిద్దరు టీచర్లు వచ్చేరు. సాయపడాలని వాళ్ల ఆతృత. హిందూ కుటుంబం అయిన దాస్‌గుప్తా వచ్చేరు. వాళ్లల్లో చిన్నది సావిత్రి. అన్నివిధాలా సాయపడాలని ఆమె ఉత్సాహం. విన్సెంట్‌గారు, గాస్టర్‌గారు వచ్చేరు. వాళ్లిద్దరూ బెంగాలీ కాథలిక్కులు. మా కృషి సఫలం కావడానికి తమ శాయశక్తులా సాయం చేస్తామని వాళ్లు అన్నారు," అని ఆవిడ మురికివాడల్లో పనిచెయ్యడానికి వెళ్లిన తొలిరోజునే రాసుకున్నారు. అయితే వాలంటీర్లు రాలేకపోయిన రోజులూ వుండేవి. ఆవిడ రాసుకున్న కాగితాల్లో టీచర్లు, డాక్టర్లు అనుకున్నట్టు రాలేకపోయిన సందర్భాల గురించి కొన్నిసార్లు ప్రస్తావించడం కనిపిస్తుంది. అలాంటప్పుడు యేర్పాట్లన్నీ తలకిందులైపోతాయి. సామాన్య కుటుంబీకులు మరో వ్యాపకం లేకుండా తమాంయీ పనికే అంకితమై పనిచెయ్యడం కష్టం అని మదర్ థెరెసా త్వరలోనే గుర్తించేరు.

"రోగుల్ని చూద్దామని వెళ్లేను. వ్యవధి చాలా తక్కువగా వుంది. టీచర్‌కి తన పిల్లల గురించిన ఆందోళన. మనం చేసే పనికి యెంత దీక్షగా అంకితమైపోవాల్సివుందో యీ సందర్భం తెలియజేస్తోంది" అని జనవరి 14న ఆవిడ రాసుకున్నారు. రోజులు గడిచేకొద్దీ యీ భావన యెక్కువ అవసాగింది. "యీ కృషిని దీర్ఘకాలం సడలకుండా నిర్వహించాలీ అంటే వెనకనుంచి తొయ్యడానికి మరింత శక్తి కావాలన్నమాట. ధార్మికజీవితమే యీ శక్తిని యిస్తుంది" అని జనవరి 22న ఆవిడ తన మనోభావాన్ని నమోదు చేశారు.

మోతీఝీల్‌లో తన కార్యకలాపాల్ని మొదలుపెట్టిన కొన్నివారాల్లోనే ఆవిడ పనుల గురించి జనం శంకలు వెల్లడించసాగేరు. ఆవిడ చూస్తే ఒంటరి నన్. పనులు చూస్తే మురికివాడల్లో, పద్ధతా సదాచారపూరితంగా లేదు. దాంతో కొంతమంది మతాధికారులు పెదవి విరిచేరు. టీచర్‌గా బాగానే వుండేదావిడ అన్నారు. ఆ మంచి పనికి ముప్పు వచ్చింది, యీ చేస్తూవున్న పని యేం ఒరగ బెడుతుందో యేమో చెప్పలేం. యీ చెవులు కొరుక్కోవడం ఎంటల్లీలోని మదర్ ప్రావిన్షియల్ దృష్టికి వెళ్లకుండా వుంటాయా? ఆవిడకు మదర్ థెరెసా అంటే ప్రాణం. ఆవిడ మదర్ థెరెసాను లొరేటోకు తిరిగి రమ్మని నచ్చచెప్పసాగింది. "మదర్ ప్రావిన్షియల్‌ను దర్శించడానికి వెళ్లేను. నేను లొరేటోకు తిరిగి వెళ్లి పోవాలన్నదే ఆవిడ ఏకైక కోరిక. కాని భగవంతునికి నేను చేస్తూవున్న పని కావాలని నాకు తెలుసు" అని ఆవిడ రాసుకున్నారు. యీ ప్రలోభం తప్పించు కుందుకని ఆవిడ దాదాపు ఎంటల్లీ వెళ్లడమే మానుకున్నారు. యీ గుసగుసలు మదర్ థెరెసా చెవినపడ్డాయి. "నిరుపేదలలో పనిచెయ్యడం యేం లాభమనీ, గొప్పవాళ్లు, సంపన్నులూ పనికి నడుం బిగించడానికి సిద్ధంగా వున్నారని, వాళ్లకి పూర్తి తోడ్పాటు యివ్వడం మంచిదనీ కొందరు అంటున్నారు. సరే, వాళ్లందర్నీ అలానే చెయ్యనీయండి. ధనవంతులకి అంతమంది నన్‌ల, ప్రీస్ట్‌ల సేవలు, భక్తిభావం వుంటే, కడుపేదలకీ నిరుపేదలకీ మా కొద్దిమంది ప్రేమా, భక్తీ వుంటాయి –– నన్ను వాళ్లు 'మురికివాడల సిస్టర్' అని పిలుస్తున్నారు. ఈశ్వరానుగ్రహం కోసం, ఆదరం కోసం సరిగ్గా అలానే వుండడం నాకు సంతోషమే" అని ఆవిడ రాసుకున్నారు.

* * *



# 14 క్రీక్ లేన్

ఇదంతా మొదలైన యింటిని చూడాలని వుందని ఓసారి మదర్ థెరెసాతో అన్నాను. ఆ యిల్లు క్రీక్‌లేన్‌లో వుంది. "ఎందుకని? దానిబదులు వెళ్లి జరుగుతూవున్న అసలు పనిని చూడండి" అన్నారావిడ. అసలలా అడక్కుండా వుండాల్సింది నేను.

అయినా, యీ మతసంస్థ పుట్టుపూర్వోత్తరాలు గురించి శోధించాలన్న కోరిక సడలలేదు. కలకత్తాలోని వెనకతట్టులో ఒక యిరుకు గదిలో ప్రారంభమైన యిది యింత వేగంగా ఒక అంతర్జాతీయ సంస్థగా యెదిగిందంటే ఆ క్రమం గురించి తెలుసుకోవాలన్న కోరిక సహజంగా వుంటుంది. యీ శోధనాయాత్రలో క్రీక్‌లేన్ అన్నదొకటి వుందన్న విషయం తెలిసి నాకు ఆశ్చర్యం కలిగింది. యింతా చేసి మదర్ థెరెసా బయటకు కదిలి వెళ్లిందే 1953లో. అప్పట్నుంచీ యేది జరగడానికేనా తగినంతకాలం గడిచిపోయింది కదా. ఆ వీధి పేరు కూడా రెండుసార్లు మారివుండచ్చు, పరిసరాలు మారి పోయి వుండచ్చు. యింకా చెప్పాలంటే 14నంబరు యిల్లు మాయమై అపార్ట్‌మెంట్లు పుట్టుకొనివచ్చి వుండచ్చు. గోమ్స్ కుటుంబం మరోచోటుకు మారి వుండచ్చు. అది వింత యేమీ కాదు. మైఖేల్ గోమ్స్ వలసపోయి వుండచ్చు. అతని కుటుంబంలో కొందరు అలా వెళ్లి పోయిన వాళ్లే. అయితే వీటిలో యేఒక్కటీ జరగలేదు. బొమ్మపటం అమర్చేటప్పుడు ముఖ్యమైనభాగం సరిగ్గా అవసరమైనచోట్లో పడ్డట్టు పెద్దప్రయత్నం లేకుండానే క్రీక్‌లేన్‌లో అడుగుపెట్టేను.

పేరుకు తగ్గట్టే క్రీక్‌లేన్ ఓ పద్ధతీ పాడూ లేకుండా మెలికలు తిరిగిపోయి వుంటుంది. కలకత్తాలో వుండే యితర వీధుల్లో లాగానే గుమిగూడిన యిళ్లు, షాపులు, చిల్లరమల్లర వ్యాపారాలు వగైరాలువున్న వీధే. అక్కడ ఒకళ్ల నొకళ్లు అంతా యెరిగిన వాళ్ల లాగానే కనిపిస్తారు. యేమంటే, యిళ్లకు నంబర్లు గింబర్లు యేమీ వుండవు. అంటే ఫలానా అని చెప్పకోదగ్గట్టు. యెటు వెళ్లాలీ అని ఓ షాపాయన్ని అడిగేను. "గోమ్స్ బాబు 14వ నంబరు యింట్లో వుంటారు" అని చెప్పేడు. వీధికి అటుగా మసకబారిన కమాన్ కట్టడాన్ని చూపించేడు. ఎంతో దూరం లేదు.

ఎత్తైనగోడ మీద బోగన్‌విల్లా తీగలు ముసురుకుని పాకేయి. 'ది రిట్రీట్' అని చాటే పాలకరాతి పలకని అవి కమ్మేస్తున్నాయి. కిందిభాగంలో కుటుంబంవాళ్లే వుంటున్నారు. ఒకరు పైనవున్న రెండో అంతస్తు చూపించేరు. మైఖేల్ గోమ్స్,

ఆయన భార్య అక్కడ వుంటున్నారు. కొయ్య మెట్ల దారి వుంది పైకి. దానికి పోత యినుము గ్రాది వుంది. యీ మెట్లనే మదర్ థెరెసా, ఆవిడ చిన్నబృందం ప్రతిరోజూ ఊడ్చివుంటారు. మరి నాలుగేళ్లు అది వాళ్ల స్థానం కదా.

1948 డిసెంబరు 9న మదర్ థెరెసా పాట్నానుంచి తిరిగివచ్చేరు. అప్పుడు లిటిల్‌సిస్టర్స్ ఆఫ్ ది పూర్ దగ్గర వుండేవారు. ఆవిడ మోతీఝీల్‌కు దగ్గర్లో వుండాలని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ త్వరలోనే గ్రహించేరు. దాంతో ఫాదర్ హెన్రీ, ఆయనా మరింత సౌకర్యంగా వుండే చోటుకోసం వెతికేరు. "మదర్ థెరెసా విషయం యేం చెయ్యాలో నాకు తోచలేదు. ఫాదర్ హెన్రీ, నేనూ సైకిళ్లు వేసుకుని తూర్పు కలకత్తాలోనూ యితరచోటుల్లోనూ వెతికేం, మంచి యిల్లు దొరుకుతుందా అని. అప్పుడు నాకు తట్టింది యీ యింటి గురించి. ఆల్ఫ్రెడ్ గోమ్స్, మైఖేల్ గోమ్స్ అన్నదమ్ములు. వాళ్లు మూడంతస్తుల భవనంలో వుండేవాళ్లు. పై అంతస్తులో భాగం ఖాళీగా వుందని నాకు తెలుసు. ఆ అన్నదమ్ముల్ని నేను బాగా యెరుగుదును. మదర్ అక్కడ వుండవచ్చు. తన పని మొదలెట్టవచ్చు. క్రమేణా పరిస్థితులు మెరుగవుతాయి," అని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ చెప్పేరు.

ఆ పొద్దున్నే ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ ఆల్ఫ్రెడ్ గోమ్స్‌ని కలుసుకున్నారు. ఆల్ఫ్రెడ్ ఆయనకు కొంత పనిసాయం చేసేవాడు. "యెప్పటిలాగానే బైతక్ ఖానా చర్చిలో కనిపించేడు. అప్పటికే అతనికి మదర్ థెరెసా చేస్తున్నపని గురించి తెలుసు. ఆవిడ యెక్కడ పడితే అక్కడ కనిపిస్తూనే వుండేదాయిరి. 'మీకో యిల్లు వుందికదా. పైవాటాలో యెవళ్లూ వుండడం లేదు కదా. దాన్ని మదర్ థెరెసాకు యివ్వచ్చునేమో' అన్నానతనితో. ఆల్ఫ్రెడ్ అలాగేనన్నాడు. అయితే తనవాళ్లనీ అడగాలన్నాడు. యేమంటే ఆ యిల్లు ఉమ్మడిగా వుంది. వాళ్లూ సరేననడం యెంతో వ్యవధి తీసుకోలేదు. 1949 ఫిబ్రవరి 28న మదర్ థెరెసా ఆ యింటి పై అంతస్తు గదికి మకాం మార్చేరు."

అంతా అనుకున్నట్టు సవ్యంగా సాగడం లేదని ఆవిడ రాసుకున్న పుస్తకం బట్టి తెలుస్తోంది. పాట్నా నుంచి రాగానే కాన్వెంట్‌కు జాగా యెలాగా అని వెతికేరు. కాని ఆఖరిక్షణంలో యేర్పాట్లు బెడిసి పోయేయి. అలా ఒకటికి రెండుసార్లు జరిగింది. ఆవిడకు, "ప్రపంచానికి దూరంగా, కాని ప్రతిదానికీ దగ్గరగా వుండే ఆదర్శవంతమైనచోటు మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్‌కు దొరికింది." అది 46, పార్క్‌సర్కస్ అవెన్యూ. అన్నీ దాదాపు స్థిరమయేక యజమాని మనసు మార్చుకున్నట్టుంది. ఆవిడ ఫిబ్రవరి 16న యిలా రాసుకున్నారు:

"46 పార్క్ సర్కస్ యజమానిని కలుసుకుందామని వెళ్లేను. ఆయన యెంతకీ రాలేదు. ఆ చోటు అంటే మరీ యిష్టపడి నట్టున్నాను. ప్రభువు నన్ను "స్వేచ్ఛాయిత నన్"గా, శిలువ పేదరిక ఆచ్ఛాదనతో వుండమని ఉద్దేశిస్తున్నట్టుంది. కాని యివాళ నాకు మంచి గుణపాఠం వచ్చింది. పేదల పేదరికం వాళ్లకి మహాభారం. యింటికోసం వెతుకుతూ నడిచీనడిచీ నా కాళ్లు, చేతులు నొప్పిపుట్టేయి. కూటి కోసం, గూటి కోసం, సాయం కోసం వెతికేవాళ్ల ఒళ్లూ, మనసూ యింకెంత నొప్పిపుట్టి వుంటాయో ననుకున్నాను. దాంతో యీ ప్రలోభం మరీ

యెక్కువైంది. లొరేటోలో వున్న పెద్దభవనాలు నా బుర్రలో వడిగా మెదిలేయి. అన్ని సోయగాలూ, సౌకర్యాలూ ఒక్కుమ్మక్కలో ప్రతిదీనీ "నువ్వు వూఁ అను, అదంతా నీకే దక్కుతుంది" అని ప్రలోభకారి. 'పరమేశ్వరా, నా యిష్టాపత్తిగా, నీమీద భక్తితో నేను యేం చెయ్యాలని నీ సంకల్పమో అలాగే వుంటాను, చేస్తాను, యిప్పటికంటే యెక్కువ కష్టాలు పడవలసివచ్చినా సరే. భగవదేచ్ఛను పరిపూర్తి చెయ్యాలనే నా కోరిక. సొసైటీ పుట్టుకనుంచి యిదే చీకటి రాత్రి. యిప్పుడు నాకు ఈశ్వరుడు ధైర్యాన్ని ప్రసాదించుగాక, యీక్షణంలో. భగవదేచ్ఛను అనుసరించడంలో పట్టు సడలకుండా వుండేందుకు అనుగ్రహించుగాక."

ఫిబ్రవరి 21న రాసుకున్న విషయం చూస్తే ఆవిడ తన ఉత్సాహాన్ని అదుపు చేసుకో లేక పోయేరనిపిస్తుంది.

"క్రీక్ లేన్ యింటి గురించిన శుభవార్త. దేవుని లీలలు యెంత చిత్రంగా వుంటాయి. అంత పేదరికంలోనూ, ఆ తావు సంపన్నంగా వుంది. నువ్వు యిచ్చిందాన్ని నేను గ్రహించాలి, నాకిష్టమైందాన్ని కాదు." ఫిబ్రవరి 25న అదే ఉత్సాహం కనిపించింది.

"కొత్తచోటు తయారవుతూ వుంది. అక్కడికి వెళ్లాలని తహతహగా వుంది."

అయితే ఆవిడ క్రీక్ లేన్ కి మారిన రోజున ఆవిడను ఒంటరితనం కమ్ముకుంది. యేమంటే, ఆవిడ ఒక్కత్తీనే వున్నారు. అంతకుముందు ఆ రోజులన్నీ లిటిల్ సిస్టర్స్ ఆఫ్ ది పూర్ తోడు వున్నారు. వాళ్లంతా కలిసి ప్రార్థనలు చేశారు, కలిసి రాత్రిళ్లు భోజనాలు చేశారు. ఆ తొలిరోజుల గురించి యెప్పుడోగాని ఆవిడ ముచ్చటించరన్న విషయం తెలిసిందేకదా. అలా ముచ్చటించే ఓ సందర్భంలో ఆవిడ నాతో అన్నారు– "యెవరూ తోడు లేరు, నేను వీధిలో వున్నాను. ఓ సాయం చేసేవాళ్లు లేరు. చేతిలో డబ్బు లేదు. ఓ రక్షణ లేదు, భద్రత లేదు." క్రీక్ లేన్ లో ఓం ప్రథమంగా అడుగుపెట్టిన సందర్భం గురించి మనసు కదిలించి వేసేట్టు రాసుకున్న వాక్యాలన్నీ యిప్పుడు అనుకున్న మాటలు వివరిస్తాయి. ఆవిడ రాసుకున్నది యిదీ:

"ఫిబ్రవరి 28 –– యివాళ, ఈశ్వరా, ఒంటరితనం యెంత దుర్భరం. యెంతకాలం నా హృదయం యీ వేదన అనుభవించాలో మరి. కళ్లమ్మట నీళ్లు ధారాపాతంగా కారుతూనే వున్నాయి. నా దౌర్బల్యాన్ని ప్రతివాళ్లు చూస్తున్నారు. యీ ఒంటరితనాన్ని మనస్థితినీ యెదిరించి పోరాడే ధైర్యాన్ని ప్రభువు నాకు ప్రసాదించుగాక. నేను చేసిన త్యాగంనుంచి వెనక్కి మళ్లిపోయేటట్టు వుండకూడదు నేను. ఆ త్యాగాన్ని నా యిష్టాపత్తిగా, ఆత్మప్రబోధంతో చేశాను. పరిశుద్ధ హృదయంవున్న మాతా, యీ నీ పేదప్రాణిమీద కరుణ చూపించు. నీమీద భక్తితో మిషనరీ ఆఫ్ ఛారిటీ సభ్యురాలిగా బతికి తనువు చాలించాలని వుంది నాకు."

ఆ ప్రాంతం చర్చి పురోహితుడు ఆశీస్సులు అందచేసిన ఆ గదిలోకే మైఖేల్ గోమ్స్ యిప్పుడో పరాయి వ్యక్తిని ఆహ్వానించేడు. ఆ వ్యక్తి నోటుపుస్తకాలు, కెమేరా, టేప్‌రికార్డు పట్టుకుని ప్రత్యక్షమయేరు. అయన్ని "పుణ్యాత్ముడు" అని మదర్ థెరెసా పిలవడం గుర్తుకొచ్చింది. ఆయన సౌమ్యుడు, బిడియస్థుడు. యీ గుణాలు నన్ను ఆకర్షించేయి. ఆయన అరవయ్యోవడిలో వున్నాడు. మనిషి బక్కపలచగా

వున్నాడు. నేవెళ్లిన పని యేమిటో చెప్పాను. ఆయన కూర్చుని విన్నాడు. నేనడిగిన కొన్ని ప్రశ్నలకి యథాలాపంగా జవాబులు చెప్పేడు. కొంత అనిష్టంగా నేనేమో అనిపించింది. కొంచెంసేపయేక అమర్నాడు మళ్లీ రమ్మని అన్నాడు. బహుశా ఆయన దగ్గరకు నే వెడుతూవున్న విషయం గురించిగాని, నా ఉద్దేశం గురించిగాని సిస్టర్ జోసెఫ్ మైఖేల్ వర్తమానం పంపలేదేమో. ఆ మర్నాడు సాయంత్రం మైఖేల్ గోమ్స్ ముందు రోజు కంటే యెక్కువ కలుపుగోలుగా మాట్లాడేడు. మదర్ థెరెసా వర్తమానం పంపించే పద్ధతి మంత్రంలా పనిచేసి వుంటుంది.

మదర్ థెరెసా సింగిల్ రూమ్‌లోకి మారేరు అని ఆయన చెప్పేడు. "ఓ నల్లపెట్టె తప్ప యేమీలేవు ఆవిడ దగ్గర. దాన్ని అక్కడ పెట్టింది" అంటూ గుమ్మం దగ్గర చూపించేడు. "అదే ఆవిడ బెంచీ, డెస్కు కూడానూ." ఫాదర్ వాన్ఎగ్జెమ్ గోడమీద పరిశుద్ధ మేరీమాత బొమ్మను తగిలించేరు. అది ఆవిడకు ఆయన యిచ్చిన కానుక. మదర్ థెరెసా నిజం చెప్పాలంటే ఒక్కత్తీ లేరు. చారుమా అనే ఆవిడ కూడా వుంది. చారుమా సెయింట్ మేరీస్‌లో వంటమనిషి. వితంతువు. బెంగాలీ సంప్రదాయం ప్రకారం కొడుకు పేరుతో ఆమెని వ్యవహరించేవారు. చారుమా చారు అనే అబ్బాయి తల్లి. ఆమెకి మదర్ థెరెసా అంటే నిండైన అభిమానం. అందుచేత ఆవిడకు వంటా వార్పూ చూసి పెట్టేందుకు కాన్వెంట్ నుంచి వచ్చేసింది. కొన్ని బల్లలు, కుర్చీలు కావాలంటే తీసుకొమ్మని మైఖేల్ ఆవిడతో చెప్పేరు. "మా తమ్ముడి కుర్చీలు, బల్లలు పక్కగదిలోనే వున్నాయి. యెవళ్లూ వాడడం లేదు వాటిని. కాని ఆమె వద్దన్నారు. ఒక్క కుర్చీ మాత్రం తీసుకున్నారు, కొన్ని అట్టపెట్టెల్ని తీసుకున్నారు. అవే బల్లలుగా, కుర్చీలుగా ఉపయోగపడ్డాయి.

"యిదంతా పెరిగిన తీరు చూస్తే సంతోషంగా వుంది" అని యేదో ఆలోచిస్తున్నట్టుగా మైఖేల్ అన్నాడు. "యెలా సాధించిందబ్బా?" అన్నాడు, తననే ఆ ప్రశ్న అడుగుతున్నట్టు. "మాకు వీలు కుదిరినప్పుడల్లా ఆమెతో కలిసి భోజనం చేసేవాళ్లం. ఆవిడ తన దగ్గరున్న నాలుగుమెతుకులూ దానం చేసేసి తను పస్తు పడుకున్న రోజులూ వున్నాయి. "మైఖేల్! ఆరు తవ్వల బియ్యం యిప్పించండి బదులు. మళ్లీ యిచ్చేస్తా" అంటూ అప్పుడప్పుడు చీటీలు పంపించేది. అవి తనకోసం కాదు, యెవళ్లో గుమ్మం దగ్గర 'అమ్మా' అని బొచ్చె పట్టుకుని వుండేవాళ్లు. దానం చెయ్యడానికి. బదులు తీర్చడానికి యెప్పుడూ ప్రయత్నించ లేదు, యేమంటే, మేం కష్టపెట్టుకుంటాం అని ఆవిడకు తెలుసు." అయితే సిస్టర్స్ వెల్లడి చేసిందీ, మైఖేల్ గోమ్స్ వెల్లడి చెయ్యందీ ఒకటుంది. ఆ రోజుల్లో తాము యిచ్చిన బియ్యంగాని యితర వస్తువుల్ని గాని ఆవిడ తిరిగి యిస్తే వాళ్లు తీసుకునే వారు కాదట, అద్దె కూడా తీసుకునే వారు కాదట. "ఆవిడకు మేం యేమీ యివ్వలేదు. వూరికే తీసుకునే వాళ్లమంతే" అన్నాడు మైఖేల్ గోమ్స్.

మేం మాట్లాడుకుంటూనే వున్నాం. అంతసేపూ నాకు స్మృతిపథంలో మెదులుతూనే వుంది, యీ గదిలోనే మదర్ థెరెసా నలభై రెండేళ్లనాడు తన కార్యకలాపాలకి శ్రీకారం చుట్టేరు అని. గది ఓ మాదిరిగా పెద్దే. రెండువేపుల్లో సౌకర్యంగా వుండే వరండాలు వున్నాయి. నేల మీద తివాసీ గివాసీ లేమీ లేవు. ఓ సాదా కలప సోఫా లాంటిది వుంది. దాని మీదే నేను కూర్చున్నాను. దానితో

జత అయ్యే కుర్చీలు వున్నాయి. ఓ కుర్చీ మీద మైఖేల్ కూర్చున్నాడు. ఓ చివర పెద్ద డెస్క్ వుంది. యీ ఫర్నిచర్‌నేనా వాడనందావిడ? గోడలకి కొన్ని ఫోటోలు వున్నాయి. మైఖేల్ గోమ్స్ మేనకోడలు ఫోటో కూడా ఒకటుంది వాటిల్లో. ఆమె మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్‌లో చేరాలనుకుంది. పాపం, అకాలంగా చిన్న వయసులోనే పోయింది. గోమ్స్ దంపతుల కూతురు పెళ్లి ఫోటో వుంది. మేబెల్, ఆమె యిప్పుడు అమెరికాలో వుంటోంది. మదర్ థెరెసా యిక్కడికి మారేటప్పటికి యేడెనిమిదేళ్ల పిల్ల. మదర్ థెరెసాతో కూడా చాలాసార్లు మురికివాడల్లోకి వెళ్లేది. చెప్పాకోవాలంటే ఆమె అన్నివిధాలా మదర్ థెరెసా తొలి సహ కార్యకర్తల్లో ఒకరు.

ఫాదర్ హెన్రీ ఆవిడకు చక్కని విగ్రహాన్నొకదాన్ని యిచ్చినట్టు మదర్ థెరెసా రాసుకున్నారు. అది బలివితర్ది మీది లేడి ఫాతిమా విగ్రహం. బహూశా అది పక్కగదిలో చోటు సంపాదించుకుని వుంటుందనిపించింది. తర్వాత ఆ గదే చిన్న దైవమందిరం అయివుంటుంది. నాకు కుతూహలం హెచ్చింది. లోపలికి వెళ్లి ఓసారి అలా చూడచ్చా అని అడిగేను. "అప్పట్లో యిక్కడ కుర్చీలు బల్లలు లేవు" అని మైఖేల్ చెప్పేడు, ఆ చిన్న గదిని ఆక్రమించుకున్న నాలుగు పట్టీల మంచాన్ని, బీరువానీ చూపిస్తూ. "ఓ చిన్న బలిపీఠం మాత్రం వుండేది. మఠం స్థాపించేక యిది చిన్న మందిరం అయింది. కొన్నేళ్లల్లోనే దాదాపు ముప్పైమంది అమ్మాయిలు చేరేరు. మెల్లిమెల్లిగా అదీ యిదీ అడుగుతూనో, మందులకోసమో జనం రావడం మొదలైంది. క్షయవ్యాధిగ్రస్తులూ వుండేవాళ్లు అప్పట్లోనే. ఓ రోజున ఆవిడ నా దగ్గరకు వచ్చి, "మైఖేల్! భిక్షాటనార్థం బయల్దేరుతున్నాను, వస్తారా?" అంది. మాకు తెలిసిన ఒకళ్ల యింటికి వెళ్లాం. ఆమె స్కూళ్ల ఇన్‌స్పెక్టరెస్. తను చేస్తూ వున్న పని గురించీ, మందులూ సాయం అవసరం అయిన వాళ్ల గురించీ మదర్ థెరెసా ఆమెకు చెప్పేరు. ఆవిడ అలా చెబుతూనే వున్నారు. ఆ ఇన్‌స్పెక్టరెస్ వింటూనే వుంది కాని యేం విదపలేదు. కాని ఆమె అక్క అనుకుంటాను, చూపు బాగా ఆనడంలేనట్టుంది, లేచి మాకు అయిదు రూపాయలు యిచ్చింది. "మైఖేల్ కొంచెంసేపు మౌనంగా వుండిపోయేడు. "ఆమె జీవితంలో నిరుత్సాహం చాలా చవిచూసింది," అన్నాడు. తర్వాత చాలాసేపు యేం మాట్లాడలేదు. అప్పుడు ఓ చిరునవ్వు నవ్వి మెల్లిగా చెప్పేడు "యీ గదులన్నీ ఆవిడే రోజూ కడిగేది."

మదర్ థెరెసా క్రమపద్ధతిలో, తీరువగా ఆ తొలిరోజుల నుంచీ పనిచేసేవారని మైఖేల్ గోమ్స్ చెప్పేడు. "యెలా పనిచేసుకుంటూ పోవాలన్న విషయంలో ఆవిడకు స్పష్టమైన అవగాహన వుంది. వాళ్ల నియమావళి ప్రకారం సిస్టర్లు జీసస్ శిష్యుల్లాగా వుండాలి. యిద్దరు యిద్దరు కలిసి హాస్పిటల్స్‌కి, కుష్ఠురోగుల దగ్గరకు వెళ్లాలి. అలాగే వీధుల్లో అనాథలుగా పడివున్న వాళ్లని తీసుకురావడానికి వెళ్లాలి, వాళ్లు తాగి పడివున్నా సరే. మొదట్లో ఆమె పిల్లల్ని కూడా తీసుకువెళ్లేది. లేకపోతే నేనో మా ఆవిడో వెళ్లేవాళ్లం కూడా. ఓ రోజున మదర్ థెరెసా మా చిన్నమ్మాయిని కూడా తీసుకువెళ్లింది. మామూలుగా మధ్యాహ్నం వేళకు తిరిగి వచ్చేసే వాళ్లు. కాని ఆవేళ ఒంటి గంటన్నర దాటిపోయింది, రాలేదు. మా ఆవిడకు కాళ్లూ,చేతులూ ఆడ్డంలేదు. ఏమంటే, ఆ పూట ఒకటే కుండపోత. రెండు ఆ ప్రాంతంలో ఓ రిక్షా వచ్చింది. మదర్ థెరెసా, మేబెల్ దిగేరు. పూరా తడిసి ముద్దయి

పోయేరు. పాపం మేబెల్ తడిసిపోయింది, చాలా బాధగా వుందని మా ఆవిడతో అంది. అప్పుడు మోతీఝీల్‌లో యేం జరిగిందో వివరించేరు. వాళ్లక్కడ వో యింటికి వెళ్లేరట. దాని ప్రహారీగోడ కురచ. ఇంట్లో నీరు నిండిపోయింది. ఒకావిడ చంటిపిల్లను యెత్తుకుని నుంచుంది. చంటిపిల్ల తడవకుండా వో పింగాణీ కంచాన్ని పైన పట్టుకుంది. నీళ్లు ఆమె మోకాలి దాకా వున్నాయి. చంటిపిల్లకి జ్వరంతో వొళ్లు కాలిపోతుంది. రెండు నెలల అద్దె కట్టాలట. నెలకు నాలుగు రూపాయలే. ఆ యజమాని వచ్చి యింటికప్పు పీకెయ్యమని తన మనుషుల్ని పంపించేడు. ముష్టి ఎనిమిది రూపాయల కోసం, చూడండి! మేబెల్ యింటి దగ్గర దించేక మళ్లీ తిరిగి అక్కడికి వెళ్లేరావిడ. యే సాయం చెయ్యగలనో అని వెళ్లేరు. ఆవిడ చాలా బాధపడ్డారు. అయితే ఆవిడ నిర్ణయం గట్టిపడింది. ఆ అభాగ్యురాలికి యేదో ఒకటి చెయ్యాలని తీర్మానించుకుంది. ఒక్క మహిలకు, చంటిబిడ్డకూ సాయం చేసినా చాలు అనిపించిం దావిడకు. కొండంత వేదనలో గోరంత మేరకేనా తరుగుదల వుంటుందిగా!

ఆవిడ తనకి పరాయిది, వేషభాషలూ మామూలు పద్ధతిలో లేవు. అలాంటి మనిషి యాచనార్థం వెడుతూ వుంటే కూడా వెళ్లడానికి మైఖేల్ గోమ్స్ ఒకో అప్పుడు యిబ్బందిపడి వుండచ్చు. అయినా దాన్ని సూచనప్రాయంగానేనా పైకి తేలనియ్యలేదు. ఓ రోజున వాళ్లు ఓ ఫార్మాస్యూటికల్ ఫర్మ్‌కు వెళ్లేరు. మేనేజర్ దగ్గరకు వెళ్లారు. ఆ మేనేజర్ మైఖేల్ గోమ్స్‌కు కొంచెం పరిచయం. కొన్ని మందులు యిప్పిస్తానని మేనేజర్ మాట యిచ్చేడు. వర్షాకాలం రోజులు. కురిస్తే వాన కుంభవృష్టిగా కురిసేస్తుంది. జంతువులు కూడా తల దాచుకుందుకు పరిగెత్తిపోతాయి. వాళ్లు ట్రామ్‌లో వెడుతున్నారు. ఆ సమయంలో మదర్ థెరెసా ఒకతన్ని ఓ చెట్టు కింద పడివుండడం చూసింది. అతను తడిసి ముద్దయి పోయివున్నాడు. ఆవిడ అతన్ని మైఖేల్‌కు చూపించింది. ట్రామ్ స్టాప్ దూరంలో వుంది. దాంతో వాళ్లు దిగలేకపోయేరు. వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు అతని సంగతి చూద్దాం అనుకున్నారు. మందులు తీసుకుని గబగబా వెనక్కి వచ్చేరు. అతన్ని అక్కడ చూద్దామనుకున్నారు. కాని అతని తల నీటి మడుగులో పడివుంది. చనిపోయేడు. మదర్ ఆందోళనపడ్డారు. అంత విషాదకరంగా, ఒంటరిగా చనిపోతూ యెవళ్లకన్నా యేమన్నా చెప్పాలను కున్నాడేమో. అతని కడసారి మాటలు వినడానికి యెవళ్లు కూడా దగ్గర లేకపోయేరు. "యిలా కాకుండా గౌరవంగా చనిపోయే చోటు చూడగలిగితే" అన్నారు మదర్. "అదీ కాళీఘాట్ రావడానికి నాంది" అన్నాడు మైఖేల్.

అలా గతం నెమరువేసుకుంటూ, మైఖేల్ నేను అక్కడ వున్నాను అనే విషయాన్నే మరచిపోయినట్టుంది. కళ్లు అరమోడ్పుగా మూసుకుని, తనలో తనే మెల్లిగా మాట్లాడుకుంటూ వున్నట్టు కనిపించేడు. నేను ఆ సోఫాలోనుంచి లేచేను. మెల్లిగా ఆయన పక్కన చేరేను, నా కదలికలు ఆయన్ని భంగపరచకూడదని. "ఆ రోజుల్లో ఓసారి ఉదయం పూటే మేం ట్రామ్‌లో హౌరా వెడుతున్నాం. చీర కట్టుకన్న యీ తెల్ల ఆవిడను చూసి కొంతమంది యేవేవో వాగడం మొదలెట్టేరు. హిందువుల్ని క్రైస్తవమతంలోకి మార్చేస్తున్న నన్ ఆవిడ అని ఒకరన్నారు. యీ విదేశీయురాలు ఆ

పనంతా డబ్బుకోసం చెయ్యడం లేదనీ మరింతమందిని క్రైస్తవమతంలోకి మార్చేందుకు చేస్తున్నారనీ యింకొకరన్నారు. వాళ్లనుకునే మాటలన్నీ ఆవిడకు అర్థమవుతూనే వున్నాయని వాళ్లు యెరగరు. ఆవిడ సెయింట్ మేరీస్‌లో బెంగాలీలోనే బోధించింది, గుర్తుందా? చాలాసేపు ఆవిడ యేమీ మాట్లాడకుండా వాళ్లు అంటున్నదంతా వింది. ఆఖరికి ఆవిడ వాళ్ల వేపు తిరిగింది. మెల్లిగానే అయినా నిబ్బరంగా, "అమి భారతార్ భారత్ అమర్" అంది. నేనూ భారతీయురాల్ని, భారతదేశం నాదీనీ అని. వాళ్ల నోటమ్మట మాట పెగల్లేదు. తాము అనుకున్న మాటలన్నీ ఆవిడకు అర్థమైపోయేయని తెలుస్తూనే వుంది. మేం హౌరా వెళ్లే దాకా కిమ్మన్నాస్తి."

ఈ సంఘటన గుర్తుచేసుకుని మైఖేల్ గోమ్స్ మళ్లీ మౌనముద్రలో పడ్డాడు. గదిలో గడియారం టిక్కుటిక్కుమంటోంది. కింద రోడ్డుమీద సాయంత్రం పూట రద్దీ యేం తగ్గలేదు. చప్పుళ్లు వినిపిస్తూనే వున్నాయి. నేను అక్కడికి వెళ్లి దగ్గర దగ్గర రెండు గంటలవుతోంది. యేదో రమ్మన్నారు కదా అని వెళ్లి అలా తిష్టవెయ్యడమే అనిపించింది. సెలవు తీసుకుందామని లేచేను. "ఆవిడ్ని కేథలిక్ దృష్టితోగాని, హైందవ దృష్టితోగాని చూడలేం. మానవ నేత్రంతో చూడాలి. యేమంటే, ఆవిడ అలా పక్షపాతం చూపించదు. అన్ని మతాలనీ, అందరు మనుషుల్నీ ఆవిడ గౌరవిస్తారు. అలా అని ఆవిడ శిష్టకాథలిక్ కాదనుకునేరు. ఆవిడ శిష్టకాథలిక్ అయితే అదే సర్వస్వం అని భావించరు. ఆవిడ చేసే కృషిలో గొప్పదనం అక్కడే వుంది. మనం అనుకున్న కొలమానాలకు లొంగదు" అన్నాడు మైఖేల్. దీని భావం యేమిటైందీ నా బుర్రకెక్కలేదు. అది యేదో నిగూఢంగా తోచడం వల్ల ఆ మాటలు నా మనసులో నిలిచిపోయేయి. తన మతాన్నే 'సర్వస్వం' చేసుకోకపోవడం అంటే బహుశా, మదర్ అన్ని మతబోధనల సారాన్ని తన కరుణలో యిముడ్చుకుందని మైఖేల్ ఉద్దేశించి వుండచ్చు. యిందులో మతానుయాయులు, మతేతరులు అందరూ కలిసి వుండచ్చు. యీ సందర్భం గురించి ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ నాకు రాసిన ఉత్తరంలోని విషయాలు గుర్తు వచ్చేయి. "మదర్ థెరెసాకు తన మతమే ముఖ్యంకాదు. ప్రతి మనిషినీ తను ప్రేమించేటట్టు చేసిందా మతం. దైవభక్తే ఆవిడ జీవితం. ఆమెకు పేదలలో దేవుడు దర్శనమిస్తాడు."

క్రీక్‌లేన్‌లోకి మారిన మూడువారాలలో ఆవిడకు తోడు వచ్చింది. సుభాషిణి దాస్ అని ఆమె పేరు. ఆమే ఆ తర్వాత సిస్టర్ అగ్నెస్ అయింది. బహుశా సెయింట్ మేరీస్‌లో మదర్ థెరెసా దగ్గర చదువుకున్న పిల్లలల్లో సుభాషిణి ఒకరు. తమ ప్రిన్సిపాల్ తన సొంతమతం ప్రారంభిస్తారని పసికట్టిన వాళ్లల్లో ఒకరు. ఆమె ఏడవతరగతినుంచీ మదర్ థెరెసా దగ్గర చదువుకుంది. పేదప్రజలకు నిజంగా ఉపయోగపడే సాయం చెయ్యమని ప్రేరణ యిచ్చేరు మదర్. ముఖ్యంగా బడి అయిపోయేక శనివారం మధ్యాహ్నం పూట అలా పనిచెయ్యచ్చు అని బోధించేరు. తనే కాన్వెంట్ వదలి వెళ్లలేకపోయేరుకదా, అంచేత సెయింట్ మేరీస్‌లో వున్న పై తరగతుల పిల్లల్ని హాస్పిటళ్లలో వున్న పేదరోగుల్ని సందర్శించమనీ, మురికివాడల్లో పిల్లలికి చదువు చెప్పమనీ ప్రోత్సహించేరు. "వాళ్లని పోగుచేసి ఓనమాలు నేర్పమనీ, కొన్నిపాటలు నేర్పమనీ, వాళ్లు సంతోషంగా వుండేటట్టు చూడమనీ మాకు ఆవిడ చెప్పేవారు" అని సిస్టర్ అగ్నెస్ చెప్పింది.

"నేను మదర్‌తో అన్నాను 'యిలాంటి పనికి శ్రీకారం చుట్టవలసిన అవసరం వుందని మీరు అంటున్నారు. మేం సాయం చెయ్యడానికి సిద్ధంగా వున్నాం. అయితే మాకు నాయకత్వం వుండాలి. మీరే మాకు నాయకులుగా వుండాలి కదా?' అని." సిస్టర్ అగ్నెస్ అంది. "మాట అనడం ఏమిటి అలా జరిగిపోవడం యేమిటి క్షణాల మీద జరిగిపోయేయి. మదర్ మందహాసం చేశారు. నన్ను గమ్మున వుండమని సైగచేశారు. ఆవిడ మనసులో యేదో మెదులుతోందని అప్పుడే పసిగట్టేను. నిజానికి ఆవిడ లొరేటో వదలి వెళ్లిపోయినప్పుడు నాకు ఆశ్చర్యమే కలగలేదు. ఆవిడ క్రీక్‌లేన్‌లోకి మారేక, వచ్చి తనను కలవమని నాకో చీటీ పంపేరు. నాకు బాగా గుర్తుంది. మార్చి 1వ తేదీన వెళ్లి ఆవిడ్ని కలుసుకున్నాను. నేను సిద్ధంగా వున్నట్టేనా అని అడిగేరు. ఆ శుభసందర్భం కోసమే చూస్తూ వున్నానని చెప్పేను. మార్చి 19 అని ఆవిడ సూచించేరు. ఆరోజు సెయింట్ జోసెఫ్ విందు దినం. నేను నిరీక్షిస్తూ వుండలేకపోయేను. ఆరోజున కొత్త జీవితంలో అడుగుపెట్టేను. ఈశ్వరుని సేవ నాకు ఆనందాన్నే ప్రసాదించింది" అని చెప్పింది సిస్టర్ అగ్నెస్.

మదర్ తాను రాసుకున్న పుస్తకం లో యిలా నమోదు చేసుకున్నారు:

"మార్చి 19 సుదినం. సుభాషిణిదాస్ మా చిన్న సంఘంలో చేరింది. మేరీమాత పవిత్ర దీక్ష యిప్పించేందుకు మేం బైఠక్‌ఖానా వెళ్లేం. ఆ పవిత్రహృదయం మాకు సంతోషాన్ని ప్రసాదించుగాక. ఆవిడ నామం మీద స్థాపించిన యీ చిన్న సంఘాన్ని నడిపించుగాక. దీనికి సాయపడి, ఆశీర్వదించి గట్టి పునాదు లేర్పాటు చెయ్యాలి. యెంత కమనీయమైన నిరాడంబరత్వం. దేవుడామెని కాపాడుగాక".

కొన్నిరోజుల తర్వాత మాగ్దలెనా గోమ్స్ అనే సెయింట్ మేరీస్ పూర్వవిద్యార్థిని ఆ గడప తొక్కింది. సుభాషిణి పొట్టి, నెమ్మది. మాగ్దలెనా పొడుగు, అలా మాట్లాడుతూనే వుంటుంది. ఆమె రెండవ దీక్షార్థి, ఆమె సిస్టర్ గెర్‌ట్రూడ్ అనే పేరు పెట్టుకుంది. మార్చి 26న మదర్ థెరెసా పొంగిపోతూ యిలా రాసుకున్నారు:

"గొప్పరోజు. మాగ్దలెనా పాటిన్ (గోమ్స్) సంఘంలో చేరింది. చక్కని మనిషి. దృఢమైంది. పేదలకు బాగా సేవ చేస్తుంది. దీక్షకోసం బైఠక్‌ఖానా వెళ్లేం. మా దేవికి ప్రేమానురాగాలు అర్పించే మమ్మల్ని చూసి ఆవిడ అనుగ్రహం చూపించుగాక."

రెండురోజుల తర్వాత:

"మా కాన్వెంట్. యెంత సంతోషంగా వున్నామో. బాగా మౌనం పాటిస్తున్నాం. పడుచు దీక్షార్థులు యెంత ఉత్సుకతతో వున్నారంటే నేనూ వాళ్లలాగా తయారవాల్సి వస్తోంది".

సుభాషిణి టీచర్ ట్రెయినింగ్ కోర్సు కొన్ని నెలల్లో పూర్తి చెయ్యాల్సి వుంది. ఆమెకి ఆ ప్రోత్సాహం యిచ్చేరు. మాగ్దలెన్‌ను యింకా పై చదువులు చదవమన్నారు. చేతిలో డాక్టరు వుండడం చాలా అవసరం. అంచేత మాగ్దలేన్‌ని వైద్యశాస్త్రం చదవమన్నారు. మైఖేల్ గోమ్స్‌ని (మాగ్దలెన్‌కి బంధువు కాదు) మాగ్దలెన్‌కి లెక్కలు చెప్పమని మదర్ థెరెసా అడిగేరు. "పెద్ద పరీక్షలు బాగా రాసింది. మంచి ఉత్సాహంగా యింటికి వచ్చింది. మూడవ స్థానం సాధించింది. అందుగ్గాను బంగారు పతకం యిచ్చేరు. దాన్ని మదర్ థెరెసాకు చూపించింది. దాన్ని యేం చేస్తావు

అని అడిగి మదర్ థెరెసా ఆమెకు ఆశ్చర్యం కలిగించేరు. ఆ విషయం గురించి ఆలోచించలేదని మాగ్దలెన్ అంది. చాలా బాగా పాసైనందుకు సంతోషంగా వుందనీ, పేద ప్రజలసేవకు బంగారు పతకాలు అవసరం లేదనీ, మదర్ థెరెసా అన్నారు. మాగ్దలెన్‌కి బదులుగా నాలుగోస్థానం సాధించిన వాళ్లకి దాన్ని యివ్వవచ్చుని ఆవిడ అన్నారు. నిజానికి అలానే జరిగింది."

ఆ తొలిరోజులు గడ్డుగా వుండేవా అని సిస్టర్ ఆగ్నెస్‌ని అడిగేను. ఆమె తల వూపుతూ చిరునవ్వు నవ్వింది. "పడుచువాళ్లం యెంతో ఉత్సాహంగా వుంటాం. కష్టాల గురించీ నష్టాల గురించీ ఆలోచించేమా? దేవుడే అన్నీ సమకూరుస్తాడని అనుకునేవాళ్లం. మాకు యే కొద్దో గొప్పో వుండేవి, అవే సరిపోయేవి. బహుశా మదర్ థెరెసా మధ్యమధ్యలో మా భోజనం గురించి చింత పడేవారేమో, మా మట్టుకు మాకు యే చింతా వుండేది కాదు. ఒకోసారి బియ్యం నిండుకునేవి. మదర్ థెరెసా మైఖేల్‌కి చీటీ పంపేవారు. ఆయన కొనిపెట్టేవారు. మాకంటే యెక్కువ మా క్షయరోగులకి పోషణ కావాలి. ఫాదర్ వాన్‌ఎక్సెమ్, ఫాదర్ హెన్రీ ఆదివారం ప్రార్థనాసమావేశంలో "ముష్టిభిక్ష" కోసం విన్నపం చేసేరు. అదో బెంగాలీ ఆచారం. తూగగలిగిన ప్రతి బెంగాలీ కుటుంబం "భిక్షకులకు గుప్పెడు బియ్యం" తీసి వుంచడం ఆ ఆచారం. 'మేరీ వాహిని' అన్న మత బృందం యింటింటికీ వెళ్లి ఆ అన్నం పోగుచేసుకువచ్చేది. ఒకోసారి అన్నీ కలగా పులగం అయితేనేం ఖాళీ కడుపులకు అదే పరమాన్నం. మా అన్నదాన కార్యక్రమంలో యిదీ తొలి అడుగు."

తర్వాత కొన్నినెలల్లోనే యింకా యింకా యెక్కువమంది యువతులు మదర్ థెరెసాతో వచ్చి కలిసేరు. వాళ్లల్లో చాలామంది సెయింట్ మేరీస్‌లో ఆవిడ దగ్గర చదువుకున్నవాళ్లే. వాళ్లల్లో సిస్టర్ డరోతి, సిస్టర్ మార్గరెట్ మేరీ అని ముందు ముందు పేర్లు పెట్టుకోబోయేవాళ్లూ వున్నారు. కొన్నినెలల్లోనే అలా చేరినవాళ్ల సంఖ్య నాలుగు నుంచి పదికి చేరుకుంది. ఆ గదీ, వరండా కిక్కిరిసి పోయేయి. "ఓ రోజున మదర్ నాకో చీటీ పంపించేరు. ఒకమ్మాయికి ఆటలమ్మ వచ్చిందట. ఆమెని విడిగా వుంచాలి. యింకో గదిని యివ్వగలరా అని వుంది దాంట్లో" అంటూ మైఖేల్ గోమ్స్ సాలోచనగా అన్నాడు. తర్వాత యిదనీ, అదనీ మొత్తం అంతస్తంతా ఆక్రమించుకున్నారు. వాళ్లకి ఓ గంటకొట్టడం పద్ధతి వుండేది, వేళకు యే పని చెయ్యాలో తెలిపేందుకు. యేవేళప్పుడు భోజనాలు చెయ్యాలి, బయటకు వెళ్లాలి, ప్రార్థించుకోవాలి, పడుకోవాలి దానితో జరిపించేవాళ్లు. విరామ సమయంలో ఆటలు ఆడుకునేవాళ్లు, టగ్ ఆఫ్ వార్ లాంటివి. వాళ్ల కేరింతలు కిందకి వినిపించేవి. చదువుకోవడమూ వుండేదనుకోండి. వాళ్లు చదువులు మానుకోవద్దని మదర్ చెప్పింది. నిజానికి ఆవిడ సాయంత్రాలప్పుడు తనే పాఠాలు చెప్పేది. "మేం నన్స్‌లాగానే వున్నాం. అయితే ప్రత్యేక మఠంగా యింకా గుర్తింపు రాలేదు. మా పద్ధతిని ఆర్చ్‌బిషప్ అంగీకరించాలి. దానికి యింకా ఓ నియమావళి అంటూ లేదు. అయితే ఆమోదం వస్తుందన్న నమ్మకం మాకు వుండేది," అని సిస్టర్ ఆగ్నెస్ అంది.

మదర్ థెరెసా గురించి వచ్చే విమర్శలు మైఖేల్ గోమ్స్‌కి తెలుసు. చూచాయగా ప్రస్తావించాడంతే. "ఆవిడ జోలె పట్టుకువెళ్లిన సందర్భం ఒకటి వుంది. తెల్లవారుతూనే

బయల్దేరింది. యింకా ఎనిమిదన్నా అవలేదు. సాయంత్రం అయిదూ అలా తిరిగి వచ్చింది. ఆవిడ ఓ ట్రక్కులో మూటల మీద కూర్చుంది. గోధుమపిండి, బియ్యం మూటలు అవి. యీ సరుకు తీసుకుందుకు రైల్వేస్టేషన్‌కి వెళ్లింది. ఆవిడ తరఫున వాటిని తీసుకుని వచ్చే మనిషెవళ్లు లేరు కదా, తనే స్వయానా వెళ్లింది. పొద్దున్నుంచీ పచ్చి మంచినీళ్లు కూడా యెరగదు. ఆవిడ తన కార్యకలాపాల్ని క్రమబద్ధంగా జరిపించడం లేదన్న విమర్శలు నేను ఒకటికి రెండుసార్లు విన్నాను. ఉత్తరాలకు జవాబులు వెంటనే రాయదనీ, దాతలకు తక్షణం కృతజ్ఞతలు తెలియజెయ్యదనీ, వ్యవహారం తీరు బొత్తిగా తెలీదనీ అంటూ వుండేవాళ్లు. అలాంటి విమర్శలు వినిపించినప్పుడు ఆవిడ ఆ బియ్యం మూటలమీద కూర్చుని రావడమే నా మనసులో మెదిలేది. యెవళ్లూ వాటిలో యేమీ తస్కరించకుండా, అక్కడున్నా అమ్మాయిలు యేదో యింత తినడానికి వుంటుందని చేరవెయ్యడమే నాకు గుర్తువస్తుంది.

నీలం అంచు తెల్లచీరలు కట్టుకున్న అమ్మాయిలు, ఆ ప్రత్యేక వేషధారణతో, క్రీక్‌లేన్‌లోనే కాక వాళ్లు పనిచేసే ప్రాంతాల్లో కూడా బాగా తెలిసినట్లే తయారయేరు. మోతీఝీల్‌లో యితర మురికివాడల్లో వాళ్లని యిట్టే గుర్తుపట్టేవారు. అక్కడ వాళ్లని "ఆదరంగా రమ్మని పిలిచేవారు" అని సిస్టర్ ఆగ్నెస్ గుర్తుచేసుకుంది. సిస్టర్లు పొద్దుటిపూట బడి నడిపేవారు. మధ్యాహ్నం డిస్పెన్సరీ చూసుకొనేవాళ్లు. ఒక్క ఆదివారాల్లో తప్ప ప్రతిరోజూ అంతే. జబ్బుపడ్డవాళ్లని యిళ్లకివెళ్లి చూసేవాళ్లు. సిటీ హాస్పిటళ్లలో వాళ్లని చేర్పించేందుకు శాయశక్తులా కృషిచేసేవాళ్లు. చాలాసార్లు మృత్యుశయ్యమీద వున్న వాళ్లని అలానే వీధుల్లో కనిపెట్టుకుని వుండేవాళ్లు, వేరే గత్యంతరం లేక.

ఆర్చ్‌బిషప్ పెరియర్ యీలోపున మదర్ థెరెసా కార్యకలాపాల గురించి యెప్పటికపుడు తెలుసుకుంటూనే వుండేవారు. ఆ బృందాన్ని యిక దుకాణం కట్టేసి లొరేటో మఠానికి తిరిగిరండని మదర్ థెరెసాకు చెప్పాలా, లేక వాళ్లని కలకత్తా బిషప్ అధికార పరిధిలో ఒక మఠబృందంగా గుర్తించాలా అన్న విషయాన్ని ఆయన తేల్చాల్సివుంది. ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ మదర్ థెరెసా దీక్షా గురువుగానే వున్నారింకా. ఆయన ఆర్చ్‌బిషప్‌తో నిరంతరం సంబంధాలు కొనసాగిస్తూనే వున్నాడు.

"మీకు చెప్పానా 'ది స్టేట్స్‌మన్'లో నేనో ప్రకటన యిచ్చేనని?" అన్నాడాయన ఒకరోజున. "మదర్ థెరెసా కార్యకలాపాలకి మా చర్చినిధుల నుంచిగాని, అనాథ శరణాలయం నిధులనుంచి గాని ఆదుకోలేదు. యేమంటే, అవి వాటి ఖర్చులకు గాను కేటాయింపు అయిపోయేయి. మోతీఝీల్‌లో ఆవిడ చేస్తూవున్న కృషి గురించి నలుగురికి బాగానే తెలిసింది. అయితేనేం విత్తం సున్నా. సిస్టర్లు ఒట్టి చప్పిడి కూడులతో మాత్రమే గడుపుకోవలసిన రోజులూ వున్నాయి. అందుకని మోతీఝీల్‌లో మదర్ థెరెసా చేస్తూవున్న కృషికి తోడ్పాటు నందించవలసిందిగా ఒక ప్రకటనను "ది స్టేట్స్‌మన్‌లో" యిచ్చేను. వెంటనే చక్కని ప్రతిస్పందన కనిపించింది. మదర్ థెరెసా చేస్తూవున్న పనిని బాగా మెచ్చుకుంటున్నట్టు తమ పత్రికలో దాని గురించి రాయదలచుకున్నట్టూ తెలియజేశారు. "14 క్రీక్ అని మదర్ థెరెసా చిరునామా యివ్వకండి, జనంలో పెద్ద నమ్మకం కలిగించదు. దాని బదులు మీ చర్చి అడ్రస్ యివ్వండి" అన్నారు వాళ్లు.

"ప్రకటన వచ్చిన రెండోరోజునో మూడోరోజునో ఖచ్చితంగా గుర్తులేదు కాని, ఓ కారు మా చర్చి దగ్గరికి వచ్చింది. ఓ ఆఫీసరు యెవరో దిగారు. ఆయన్ని బెంగాల్ ముఖ్యమంత్రి బి.సి.రాయ్ పంపించేరు. మదర్ థెరెసాకి యేదన్నా దానం చెయ్యమని అదే తొలి ప్రతిస్పందన. ఆ ప్రకటనకు డబ్బు యేమన్నా యిచ్చానో లేదో గుర్తులేదు" అని ఆయన సాలోచనగా అన్నాడు.

మదర్ థెరెసా మోతీఝీల్‌లో తన కార్యకలాపాన్ని ప్రారంభించిన కొన్ని నెలల్లోనే, బహుశా 1950 మొదట్లో ఆర్చ్‌బిషప్ పెరియర్ తుదినిర్ణయం తీసుకున్నారు. ఆవిడ అడుగువేసిన దారికి అనుకూలంగా వుందా నిర్ణయం. వాస్తవానికి ఒకే ఒక నిబంధన పెట్టేరు. ఏప్రిల్ 1వ తేదీలోగా ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ యీ కొత్తనురం నియమావళిని తయారుచేసి పంపాలి! ఆయన ఏప్రిల్‌లో రోమ్ నగరం వెడుతూ వున్నారు. అంచేత ఆ నియమావళి అయిదు కాపీలు తీసుకుని కార్డినల్ పెట్రుస్ ఫమాస్ని బియోండికి యివ్వాలని ఆయన సంకల్పం. ఆ కార్డినల్ ఆఫీస్ ఫర్ ది ప్రోపగేషన్ ఆఫ్ ఫెయిత్ సంస్థకు అధిపతి. తుది గుర్తింపు యివ్వవలసింది ఆయనే.

మదర్ థెరెసా పురోగతిలో అనేకవిధాలుగా ముఖ్యపాత్ర వహించిన ఆయన ఆర్చ్‌బిషప్ పెరియరే. అయితే యీ విషయం అంతగా నలుగురి దృష్టిలోనూ పడలేదు. ఆయన బెల్జియంలోని ఆంటివర్ప్‌కు చెందినవాడు. 1906లోనే యువప్రీస్ట్‌గా భారతదేశం వచ్చాడు. ఆయన మొదట్లో చేసిన కృషివల్లనే యుగోస్లావ్ జెసూట్ అనుయాయులు బెంగాల్ రావడానికి మొగ్గు చూపించేరు. వాళ్లు యిళ్లకు రాసిన ఉత్తరాలే చిన్న ఆగ్నెస్ బెంగాల్‌లో మిషనరీ కావడానికి ప్రేరకం అయేయి. ఆర్చ్‌బిషప్ పెరియర్ ఆచితూచి అడుగువేసినా, అన్ని విషయాలనీ కొంచెం చాదస్తంగా చూసినా, ఈశ్వరేచ్ఛతో మదర్ థెరెసా కృషి ప్రేరితం అయిందని నమ్మకం కుదరగానే తన శేషజీవితమంతా ఆవిడకు సొడ్డులేని తోడ్పాటు యిచ్చేరు.

నియమావళి తయారుచెయ్యమని ఫాదర్ వాన్‌ఎగ్జెమ్‌ని ఆర్చ్‌బిషప్ ఆదేశించారు. అందులో యిప్పుడు 275 నియమాలు వున్నాయి. 'కాన్‌స్టిట్యూషన్స్* ఆఫ్ ది మిషనరీస్ ఆఫ్ ఛారిటీ' అనీ దానిపేరు. "అప్పటికివున్న ధర్మశాస్త్ర నియమాలని, కొన్ని యితర మతాల నియమావళుల్నీ పరిగణనలోకి తీసుకున్నారు. అన్నింటిలోకి ముఖ్యం అయింది డార్జిలింగ్ ప్రయాణంలో మదర్‌కి అందిన ఈశ్వరావిర్భావం. ఆవిడకు అది పునారావర్తంగా వుంటూనే వుంది. ఆ పిలుపు గురించి రాసుకున్న కాగితాల్ని ఒక్కసారే చూశాను నేను. కాని అందులో వున్న విషయం గుర్తుంది. తను కాన్వెంట్ వదిలిపెట్టాలి, పేదవాళ్లల్లాగా బతకాలి, తన కార్యకలాపాలు వుండవలసింది మురికివాడల్లో, కలకత్తా వీధుల్లో. పెద్ద పెద్దభవనాలు, సంస్థలూ వాళ్లు సంపాదించినా అది నిస్సహాయుల కోసమే. దిక్కులేక వదిలేసిన పసిగుడ్డులు, పిల్లలు, కుష్ఠువ్యాధిగ్రస్తులూ, మరణసన్నిధిలో వున్న అభాగ్యులూ లాంటి వాళ్లకోసమే. అది ఒక మతసంస్థగా వుండబోతోంది, యేదో సామాజిక సేవాకార్యకలాపంగా కాదు. పేదలలో క్రీస్తు కృషకోసం."

---

* తప్పనిసరిగా బహువచనంలోనే వుందాప్రస్తావన. ర.

మదర్ థెరెసా దృష్టిలో యీ మఠం గురించిన భావం యేమిటో రెండుమాటల్లో సంగ్రహించి చెప్పాలంటే "నా ఆర్తి" అని ఆ మాటల్ని చెప్పచ్చు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కేంద్రంలో ప్రతి ప్రార్థనాలయంలోని శిలువ మీద చెక్కిన యీ మాటలు క్రీస్తు ఆత్మికప్రేమ కోసం, ఆదరం కోసం సంకేతాత్మకంగా వేసిన కేకను ప్రతిబింబిస్తాయి. ఛారిటీ మిషన్‌లోని ప్రతి ఒక్కరికీ సమాజ సాధారణ లక్ష్యం యేమిటైందీ గుర్తుచేస్తూ వుంటాయి. జీసస్ శిలువ మీద అంతులేని ఆర్తితో వున్నాడు. దాన్ని ప్రార్థనాయుత జీవితం ద్వారా, ధ్యానం ద్వారా, పశ్చాత్తాపం ద్వారా తీర్చాలి. "దుఃఖభాజకమైన పేదల ప్రచ్ఛన్న రూపంలో వున్న క్రీస్తును ఆరాధించి, కొలువు చెయ్యాలన్న" ప్రత్యేక ప్రబోధాన్ని మరింత బాగా అర్థం చేసుకుందుకు సాధనంగా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సభ్యులు బాధపడడానికి; పరిత్యాగానికి, కడకు మృత్యువుకు కూడా సన్నిద్ధమై వుంటారు.

మదర్ థెరెసా ధార్మికంగా ముందుకు వెళ్లేరు, తన పరిసరాలకు ప్రతిస్పందించేరు. అలాంటి ఆవిడకు "పవిత్రత, పేదరికం, విధేయత" అనే మూడు ప్రమాణాలు పాటించడం మాత్రమే చాలదు. యివి యీ సంస్థలోని వాళ్లందరికీ వర్తించేవే. యీ మూడింటినీ మనస్ఫూర్తిగా ప్రతిపాదిస్తూనే ఆవిడ నాలుగో ప్రమాణాన్ని అదనంగా తీసుకున్నారు. "నిరుపేదలకు మనస్ఫూర్తిగా, స్వచ్ఛంద సేవ" చెయ్యడం అది. దీనివల్ల మృత్యుముఖంలో వున్న వాళ్లకి నిరాదరణకు గురైన వాళ్లకి, సంఘ బహిష్కృతులకు, కుష్ఠువ్యాధిగ్రస్తులకు, జీవితంలో సకల విశ్వాసాన్ని, ఆశనీ పోగొట్టుకున్న వాళ్లకి భౌతికంగా, ఆధ్యాత్మికంగా ఆహారం, వస్త్రం, రక్షణ, సేవ కల్పించే కర్తవ్యం మిషనరీస్ మీద పడుతుంది. అందులో యెంత కఠోరశ్రమ వున్నా, సంతోషంగా యేమీ ఆశించకుండా యీ కర్తవ్య నిర్వహణ చెయ్యాలి. తాము వీధుల్లో పడివుండే దిక్కులేనివాళ్లకు అందుబాటులో వుండాలన్న విషయాన్ని ఆ పిలుపు, ఈశ్వరేచ్ఛ నమోదు చేసుకున్న కాగితాలు మినహాయింపు లేకుండా స్పష్టం చేస్తున్నాయి. మరి అలా పనిచెయ్యడం కాన్వెంట్ నాలుగ్గోడల మధ్యనుంచీ సాధ్యం కాదు. సిస్టర్లు నాలుగో ప్రమాణం గురించి "మా దారి" అని విధాయకంగా చెబుతూ వుంటారు.

1950 అక్టోబరు 7న రోమ్‌లో పవిత్రమఠం యీ మఠం నియమావళిని ఆమోదించింది. ఆర్చ్‌బిషప్ పెరియర్ స్వయంగా నిర్వహించిన సామూహిక ప్రార్థనలో ఆ స్థాపనా శాసనాన్ని (Decree of Erection) ఫాదర్ వాన్ఎక్సెమ్ చదివి వినిపించేరు. అది యిలా వుంది.

"ఇప్పటికి రెండు సంవత్సరాలుగా కొంతమంది యువతుల బృందం, పావన కన్యమేరీ సంస్థకు చెంది, ధర్మానుసారంగా మరేతర మతపర* సిస్టర్ థెరెసా నేతృత్వం కింద యీ మన మహానగరంలోని పేదలకు, పిల్లలకు, పెద్దలకు, వృద్ధులకు, రోగులకు సేవ చెయ్యడానికి... అంకితం అయింది".

నాలుగో ప్రమాణాన్ని మరింత వివరంగా ఆ శాసనం చెప్పింది.

"లేమి వల్ల, లేమిడి వల్ల అణారిపోయి మానవ గౌరవానికి అర్థంకాని పరిస్థితుల్లో బతుకుతూవున్న పేదసాదల సేవకోసం ఆత్మత్యాగంతో వాళ్లు అంకితమవుతూ

---

* శాసనంలో నామవాచకంగానే ప్రయుక్తం.

వున్నారు. అంచేత యీ సంస్థలో చేరేవాళ్లు పట్టణాలలో, గ్రామాలలో, కశ్మల భూయిష్టమైన పరిసరాలలో కూడా, పేదలని, పరిచ్యుతుల్ని, వ్యాధిగ్రస్తుల్ని, అవిటివాళ్లని, మృత్యుముఖంలో వున్నవాళ్లని నిరంతరంగా చూస్తూ గడపాలని తీర్మానించుకున్నారు..."

అంటూ అదనంగా అవసరం అయిన అంశాన్ని గురించి చెప్పింది.

ఛారిటీ మిషనరీస్‌కి మాత్రమే ప్రత్యేకంగా వున్నదీ నాలుగో ప్రమాణం. భగవంతుని ప్రేమనీ, కరుణనీ యీ "వేదనాభరిత ప్రచ్ఛన్నవేష"రూపంలో వున్న ఆయన పట్ల ప్రేమ ద్వారా బదులు తీర్చుకోవాలన్న దృఢసంకల్పాన్ని అది ప్రతిబింబిస్తుంది. న్యూయార్క్ నడిబొడ్డున ఎయిడ్స్‌వ్యాధితో వెలి అయి చనిపోతూవున్న వ్యక్తిరూపంలో వుండనివ్వండి, కలకత్తాలోని ధావ మురికివాడల్లో వేలాదిమందిగా పోగయిన కుష్ఠు వ్యాధిగ్రస్తుల రూపంలో వుండనివ్వండి. "క్రీస్తురూపమే యిది అని మేం విశ్వసించ లేక పోయినట్లయితే, యీ పనిని చచ్చినా చెయ్యలేం. నిలువెత్తు డబ్బు కుమ్మరించినా యీ పనిచెయ్యగలిగి వుండేవాళ్లం కాదు. పేదాతిపేదలకు చేసే మనఃపూర్వక స్వచ్ఛంద సేవలో, క్షుధార్తుల, అనాథల శిథిల శరీరాల్ని స్పృశిస్తున్నామంటే, క్రీస్తును స్పృశిస్తున్నట్టే భావిస్తాం. "నా సోదరులలో కనీసస్థానంలో వున్న వాళ్లకి మీరు చేస్తున్నది నాకు చేస్తున్నట్టే" అని ప్రభువు అన్నారు." అంటూ ఆవిడ నాతో కొన్నిసార్లు అన్నారు. తర్వాత నా చేతిని తనచేతిలోకి తీసుకుని బొటనవేలిని, తర్వాత ఒకోవేలిని నా అరచేతిలోకి నొక్కేరు. అలా లెక్కపెడుతూ 'మీరు చేస్తున్నది నాకు చే-స్తు-న్న-ట్టే' అని పైకి గట్టిగా అన్నారు.

ఆ తర్వాత రెండేళ్లల్లోనూ దగ్గర దగ్గర ముప్పైమంది యీ మఠంలో చేరేరని మైఖేల్ గోమ్స్ అన్నారు. పై అంతస్తు మొత్తం నిండిపోయింది. అది చాలక మదర్ థెరెసా పైన మిద్దె మీద యేదో తాత్కాలిక యేర్పాటుగా ఒక గది వేశారు. మరి కొంచెం పెద్ద జాగా అవసరం అయింది. రెక్కలు విప్పుకుంటూ వున్న యీ మఠంపట్ల ఫాదర్ హెన్రీ, ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ యెప్పుడూ ఆసక్తి చూపిస్తూనే వున్నారు. వాళ్లు మళ్లీ సైకిళ్లు వేసుకుని మరింత పెద్ద జాగాకోసం వెతకడం ప్రారంభించేరు. యీలోపున సిస్టర్లు ప్రత్యేక ప్రార్థనలు చెయ్యడం మొదలుపెట్టేరు. ఓ రోజున యెవరో ఒకాయన క్రీక్‌లేన్‌కి వచ్చి అనుకూలమైన భవనం ఒకటి అమ్మకానికి వుందని చెప్పేడని సిస్టర్ ఆగ్నెస్ అంది. అది 54 ఎ, లోయర్ సర్క్యులర్‌రోడ్‌లో వుంది. మదర్ థెరెసా వెళ్లిచూడచ్చు. తను ఆవిడ్ని ఆ యజమాని దగ్గరకు తీసుకువెడతానని అతను అన్నాడు. మదర్ థెరెసా వెళ్లేరు. ఆయన పేరు డాక్టర్ ఇస్లామ్. ఆయనో మేజిస్ట్రేట్. అసలు తనకు ఆ బిల్డింగ్ అమ్మే ఉద్దేశం వుందన్న విషయం యెలా తెలిసిందా అని ఆశ్చర్యపోయేడు. తన ఉద్దేశం గురించి వాళ్లావిడతో మాత్రమే ముచ్చటించేడు. యీ లోపున మదర్ థెరెసాను అక్కడకు తీసుకువెళ్లిన పెద్దమనిషి మాయమైపోయేడు. ఆవిడ చేస్తూవున్న కృషి గురించి ఇస్లామ్ విని స్పందించేడు, అని సిస్టర్ ఆగ్నెస్ చెప్పింది. "డబ్బే సర్వస్వం కాదు" అన్నాడాయన.

ఆ భవనం అన్నిటికీ అందుబాటులో వుంది. చక్కగా సరిపోతుంది. అంచేత దాన్ని కొనడం గురించి మదర్ ఫాదర్ ఎగ్జిమ్‌తో, ఆర్చ్‌బిషప్‌తో మాట్లాడేరు.

"నే వెళ్లి చూసేను. ఇస్లామ్ ఆ యింటి ముందు నుంచున్నారు. దానికేసి అలా చూసేరు. మనిషి బాగా చలించిపోయినట్టు కనిపించేరు. కొంచెంసేపయేక తను దగ్గర్లోవున్న మౌలా ఆలీ మసీదుకు వెళ్లి ప్రార్థన చేసి వస్తానన్నారు. నేను అక్కడే ఆయనకోసం యెదురు చూస్తూ వుంటానని చెప్పేను. ఆ గదే తర్వాత కచేరీగది అయింది. తిరిగివచ్చేక మళ్లీ ముంగిట్లో నుంచున్నారు. ఆయన కళ్లల్లో నీళ్లు తిరిగేయి. "దేవుడే నాకీ యిల్లు యిచ్చేరు. తిరిగి ఆయనకే ధారపోస్తున్నాను" అన్నారు. ఆ తర్వాత మేం సెలవు తీసుకున్నాం. మళ్లీ ఆయన్ని చూడలేదు. ఆ యింటిని ఆర్చ్‌బిషప్‌కి అమ్మేరు. పెద్ద మొత్తం కాదనుకుంటాను" అని ఫాదర్ వాన్‌ఎక్సిమ్ అన్నారు.

మదర్ థెరెసా ఆర్చ్‌బిషప్ దగ్గరకు వెళ్లేరు. ఆయన ఆ పరిధిలో వున్న వికార్ మాన్సినెర్ ఎరిక్ బార్బర్‌ని వెళ్లి ఆ యిల్లు అనూహానలా పరిశీలించి రమ్మని పంపేరు. అసలు యెంత ఆ యింటికి చెల్లించేరో యెవళ్లకీ తెలీదు. అందుకని నేనే ఓ సాయంత్రం బార్బర్ దగ్గరకు వెళ్లేను. చర్చి మదర్ థెరెసాకు వడ్డీలేని అప్పుగా 1,25,000 రూపాయలు (1953 లెక్కల్లో పదివేల పౌండ్లు) యిచ్చిందని చెప్పేడు. ఆ డబ్బుని మదర్ థెరెసా తిరిగి చెల్లించిందా అని అడిగేను. పక్కనే వున్న షెల్ఫ్‌లో నుంచి అప్పటి రిజిస్టర్ తీశేడతను. ఆ తర్వాత పదేళ్లు తనే స్వహస్తాలతో రాసిన అంకెల్ని చూపించేడు. నెలకు వెయ్యి నుంచి మూడువేల రూపాయల దాకా వుంటూ వున్నట్టు తేలింది. "అప్పుడో కొంత, అప్పుడో కొంత యిలా చిన్నమొత్తాల్లో వున్న ఆవిడ అణాపైసల్తో సహా అప్పంతా తీర్చేశారు" అని చెబుతూ నవ్వేడు బార్బర్.

1953 ఫిబ్రవరిలో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సిస్టర్స్ యిరవై యేడుమందితో, లోయర్ సర్క్యులర్‌రోడ్‌కి మారింది. అది ఛారిటీ మిషనరీస్ కేంద్రస్థానం అయింది. అప్పట్లో అక్కడ దానికి మూడు చిన్న బిల్డింగులు వుండేవి. చుట్టూతా ప్రహారీగోడ. క్రీక్‌లేన్‌లోని యిరుకుగదుల్తో చూస్తే యిది మహావిశాలంగా కనిపించి వుంటుంది ఆ సిస్టర్లకి. దానికి మదర్‌హౌస్ అని పేరు పెట్టేరు. నలభైయేళ్లల్లో అది యావత్ క్రైస్తవకూటమిలో మహావైభవోపేతంగా వెలిగిపోయే మతశాఖ అయిపుట్టు అవుతుందని వాళ్లానాడు యే మాత్రం వూహించి వుండరు. యివాల్టి కార్పొరేట్ భాషలో చెప్పుకోవాలంటే, ఖండ ఖండాంతరాల సభ్యులతో అదో అంతర్జాతీయ సంస్థగా యెదిగి వుండేదనీ వూహించివుండరు. ప్రపంచంలోని పరమ నిరుపేదలకు తగ్గ విశాలప్రాంతగా యెదుగుతుందనీ వాళ్లానాడు వూహించివుండరు. మందలు మందలుగా ఎక్సిక్యూటివ్ అధికారులూ లేరు. కంప్యూటర్ల సముదాయమూ లేదు. టెలెక్స్ లేదు, ఫాక్సిమిలీ యంత్రాలు లేవు. (ఒక్క టెలిఫోన్ తప్ప. ఖర్చులు పెరుగుతాయని మదర్ థెరెసా దాన్ని పెట్టుకోవడానికీ యిష్టపడలేదు తెలుసా) యివేమీ లేకుండానే మదర్ థెరెసా అక్షరాలా భారతదేశంలోని ప్రతి నగరంలోనూ పునాదులు వేసుకున్నారు. ప్రతి టౌన్లోనూ పునాదులు వేసుకున్నారు. వీటితోపాటు వందకిపైగా దేశాల్లోనూ కూడా పునాదులు వేసుకున్నారు.

* * *

# 6 మదర్ హౌస్

మదర్ హౌస్ మూడంతస్తుల భవనం. ఫలానా తరహాది అని వర్గీకరించి చెప్పలేని భవనం. చిన్నపేవ్‌మెంట్ దుకాణాలకీ, టీ బడ్డీలకీ మధ్య వున్న భవనం. అది 54ఎ లోయర్ సర్క్యులర్‌రోడ్‌లో వుంది. యీ వీధికే యిటీవల ఆచార్య జగదీశ్‌చంద్రబోస్ రోడ్ అని పేరు పెట్టేరు. అయినా కలకత్తావాసులు దాన్ని పాతపేరుతోనే వ్యవహరిస్తూ వుంటారు. లోపలికి దారి పక్కసందులో నుంచి వుంది. ఆ సందు చాలా యిరుకు, మహా అయితే ఒక కారు వెళ్లగలదేమో. గుమ్మం దగ్గర ఒక చిన్న బోర్డ్ వుంది. దాని మీద "మదర్‌హౌస్" అని వుంటుంది. దాని కింద ఒక షట్టర్ వుంటుంది. దాన్ని 'లోపలి'కీ 'బయటి'కీ తెరవచ్చు. చిన్నకంత గుండా ఓ గొలుసు కట్టి వుంటుంది. దాన్ని లాగితే లోపల ఇత్తడి గంట మోగుతుంది. యిదో భేషైన యేర్పాటు. యేమంటే ఎలక్ట్రిక్ బెల్ అయితే విద్యుత్ సరఫరా ఆగినపుడు నిరుపయోగం. కలకత్తా అలాంటి సమయాల్లో విద్యుత్ లేక చెమటలు కక్కుతూ వుంటుంది. గంట మోగగానే వెంటనే ఓ దీక్షార్థి తలుపు తెరుస్తారు. వాళ్లపనల్లా తలుపుని కనిపెట్టుకు వుండడమే. వెళ్లిన వాళ్లని లోపలికి తీసుకువెడతారు. అదో చిన్నగది. ఓ చెక్కబల్ల, అయిదారు కుర్చీలు వుంటాయి. ఆ కుర్చీలైనా ఒక రకంవి కావు. గోడవారనే చిన్న కొయ్యబెంచీలు వుంటాయి. ఆ ధార్మిక సంస్థ కార్యకలాపాల్ని తెలియచేస్తూ చేత్తో రాసిపెట్టిన బోర్డులు రెండు గోడలకు వున్నాయి. వాటితోపాటు కొన్ని ఫోటోలు గోడలకి తగిలించి వున్నాయి. మదర్ థెరెసా పోప్ జాన్‌పాల్–IIతో వున్న ఫోటో ఒకటి వుంది.

ఆ కచేరీ గది నుంచి చిన్న పెరట్లోకి దారి వుంది. అక్కడ నిరంతరాయంగా సందడి వుంటుంది. దీక్షార్థులు చిన్నరేకు బాల్చీలతో లోతుకుంటలో నుంచి నీళ్లు తోడుకుంటూ వుంటారు, బట్టలు ఉతుక్కోవడానికి. వాళ్లు ఆపేదల్లా ప్రార్థన చేసుకునే సమయాల్లోనే. పక్కనే ఓ గూడు వుంది. అందులో మేరీకన్య బొమ్మ వుంది. వాళ్లు యెక్కువగా అక్కడే కనిపిస్తూ వుంటారు. అందరూ ఏకకంఠంతో ప్రార్థనాగీతాలు పాడుతూ వుంటారు.

ఓసారి నేను కలకత్తా వెళ్లినప్పుడు "మీరెప్పుడేనా కేథలిక్ పూజలకు వెళ్లేరా" అని మదర్ థెరెసా నన్ను అడిగేరు. లోగడోసారి ఆవిడ నన్ను రమ్మని పిలిచినప్పుడు,

నేను నిద్ర లేవలేదు. ఆ విషయం ఆవిడకు చెప్ప బుద్ధి పుట్టలేదు. "రేపొద్దున్న ఆరింటికల్లా రండి" అన్నారావిడ చిరునవ్వు నవ్వుతూ. అదే మదర్ థెరెసా పద్ధతి. ఆవిడ బహువిధ కార్యకలాపాల్ని గమనించడం నాకు అవసరంకదా. అంచేత ప్రార్థనా సమావేశానికి హాజరవడం ముఖ్యమే కదా! ప్రార్థనలే మదర్ థెరెసాకీ, సిస్టర్లకీ శక్తినీ, ఉత్సాహాన్నీ అందిస్తున్నాయి మరి.

మర్నాడు ఉదయం చాపెల్‌కి వెళ్లేను. అంత సాదా చర్చిని అంతకు ముందెన్నడూ నేను చూడలేదు. నలుచదరం పెద్దగది. యే అలంకారమూ లేదు. బారుగా వున్నాయి గోడలు. కిటికీలు లోయర్ సర్క్యులర్ రోడ్ వేపు వున్నాయి. ఓ ఉన్నతాసనాలుగాని, కూర్చోవడానికిగాని యేమీ లేవు. ప్రతివాళ్లూ మోకాళ్లమీద మోకరిల్లుతారు. లేకపోతే గోనెపట్టాలమీద కూర్చుంటారు. గుళ్లల్లోలాగా, మసీదుల్లోలాగా చెప్పుల్ని బయటే విడిచి వెళ్లాలి. బలిపీఠంగా వున్నది ఓ సాదాబల్ల. ఓ పక్కన మేరీమాత పెద్ద విగ్రహం వుంది. ఉన్న అలంకారమంతా ఆ బొమ్మ పాదపీఠం దగ్గర పెట్టిన పూలకుండీ, అందులో తాజాపూలు వున్నాయి.

ఓ యిరవైమంది స్వచ్ఛంద సేవకుల సరసన చేరేను. మా యెదురుగా దీక్షార్థులు కూర్చున్నారు. సుమారు ఓ వందమంది అమ్మాయిలు వుంటారు. తెల్లచీరలు కట్టుకున్నారు. చిత్రం, కొట్టవచ్చినట్టు కనిపించే నీలం అంచులు ఆ చీరలకు లేవు. బలిపీఠానికి అభిముఖంగా సిస్టర్లు వున్నారు. వాళ్లందరి వెనకా వున్నారు మదర్ థెరెసా. చేతులు జోడించి గోడవేపు అనుకుని, గాఢప్రార్థనలో వున్నారావిడ.

రోజూ మాదిరిగానే ఆ పూటా మదర్ థెరెసా, సిస్టర్లూ అయిదు కాకుండానే లేచారు. ప్రార్థనా సమావేశానిక ముందే అరగంట ధ్యానంలో గడిపేరు. ప్రార్థనా సమావేశం ముగిసేక యింటి పనులు వుంటాయి. వంట చేసుకోవడం, బట్టలు ఉతుక్కోవడం, పరిపాలనా విధులు వుంటాయి. ఎనిమిది గంటలకల్లా నాస్తా, చపాతీలు, టీ, ఆ తర్వాత నగరంలోకి నాలుగు మూలలకీ వెళ్లిపోతారు. కొంతమంది దగ్గర్లోనే వున్న శిశుభవన్‌కి వెడతారు. కొంతమంది కిర్రుమంటూ చప్పుడుచేసే వాన్ యెక్కుతారు. దాంట్లో కాళీఘాట్‌కి వెడతారు. కొంతమంది కుష్ఠు చికిత్సాలయానికి వెడతారు. క్షయవ్యాధి చికిత్సాలయాలకి వెళ్లే బృందాలు, సాధారణ చికిత్సాలయాలకు వెళ్ళే బృందాలు, అనాథ శిశువుల ఆశ్రమాలకి వెళ్లే బృందాలు వున్నాయి. పసిపిల్లల క్రెషెలకు, పాలబడిపిల్లల కేంద్రాలకు వెళ్లే బృందాలు వేరే వున్నాయి. రెండు వందల యాభై మందికి పైగా నన్‌లూ, దీక్షార్థులూ మదర్‌హౌస్ నుంచి నగరంలో పేదలవాడలకు వెడతారు.

అలా వెళ్లేటప్పుడు కూడా వాళ్లు కొన్ని నియమాలు పాటించాలి. యిద్దరు యిద్దరు జట్టుగానే వెళ్లాలి వాళ్లు. వాళ్ల భద్రత కోసం అలా పంపిస్తున్నారా అని మదర్ థెరెసాని అడిగేను. "ప్రభువు గాస్పెల్‌లో తన శిష్యుల్ని యిద్దరేసి జట్టుగా పంపించేడు" అని ఠక్కున జవాబు చెప్పింది. యీ విషయాన్ని ఫాదర్ వాన్‌ఎక్సెమ్ మరింత స్పష్టంగా వివరించేరు. "వాళ్లు జాగ్రత్తగా వుండాలని మదర్ కోరిక. యేమంటే, వాళ్లు దూరప్రాంతాల్లో కష్టమైనచోట పనిచేస్తారు కదా. యేమో పరిస్థితులు (ప్రపంచంలో కొన్నిచోట్ల) ప్రాణాలకు ప్రమాదకరంగా వుండచ్చు – పోట్లాటలు, కొట్లాటలు లాంటివి. కొన్ని మఠాల నన్‌లు ఒంటరిగానే వెడతారు.

కాని యీా ధార్మిక సంస్థ చేసే కృషివల్ల, అంటే వీధుల్లోనూ, మురికివాడల్లోనూ వాళ్లు చేసే పనులవల్ల, యిద్దరేసి జట్టు పాటించాలని మదర్ నొక్కి చెపుతారు. యిది తెలివైన పద్ధతేననుకుంటాను."

అయినా– పరమ నికృష్టమైన కలకత్తా వీధుల్లో కూడా సిస్టర్లకు రక్షణ అవసరం లేదు. దూరం నుంచే వాళ్లను గురుతుపడతారు, వాళ్లు యెక్కడికి వెళ్లినా వాళ్లని మర్యాదగా చూస్తారు. అందులో రహస్యం యేమిటంటే వాళ్లూ అందరిలాగానే పేదలు, పేదల్ని తమతో సమంగా చూస్తారు. "దేవుడి దయవల్ల మా సిస్టర్లలో ఒక్కళ్లకి కూడా ప్రపంచంలో యెక్కడా యే యిబ్బందీ కలగలేదు. ముఖ్యంగా భారతదేశంలో సాధువులకు చాలా గౌరవం వుంది" అన్నారావిడ.

మరో నియమం యేమంటే– వాళ్లు కాన్వెంట్ బయటగాని, పనిచేసే చోటులోగాని యెక్కడా యేమీ తిండీ తీర్థాలూ తీసుకోకూడదు. నిషిద్ధం. ఓ కప్పు టీ కూడా తీసుకోకూడదు. భారతదేశంలో వేసవి తాపం యెలా వుంటుందో చెప్పక్కర్లేదు కదా. అంచేత ప్రతీ సిస్టర్ తనతో కూడా ఓ మంచినీళ్ల సీసా తీసుకువెళ్లాలి. అవి సాధారణంగా ప్లాస్టిక్‌వి అయి వుంటాయి లేకపోతే వాడి శుభ్రం చేసిన మందుసీసాలు. మదర్ థెరెసా యీా బాపతు నిర్ణయం తీసుకోవడంలో కొంత వాస్తవిక దృష్టి వుంది. మదర్ థెరెసాని నేను అడిగిన మొట్టమొదటి ప్రశ్నల్లో యిదీ ఒకటి. లెఫ్టినెంట్ గవర్నర్‌ని దర్శించేందుకు ఢిల్లీ వచ్చినప్పుడు ఓ కప్పు టీ కూడా యెందుకు వద్దన్నారు? "నేనూ, మా సిస్టర్లూ యెక్కడికి వెళ్లినా మనుషులు వాళ్ల వాళ్ల పద్ధతుల్లో "థేంక్యూ" అని చెబుతూ వుంటారు. ఓసారి టీ యిస్తారు, ఓసారి కూల్‌డ్రింక్ యిస్తారు. లేకపోతే యేదన్నా తినడానికి పెడతారు. పాపం, ఆ మాత్రం యివ్వచూపడం కూడా వాళ్లకు బరువే కావచ్చు. వాళ్ల దగ్గర వద్దని ధనవంతులు దగ్గర్నుంచి తీసుకోవడం బాగుంటుందా చెప్పండి? యెవళ్ళనుంచీ యేమీ తీసుకోకుండా వుంటే యే గొడవా వుండదు, ఏమంటారు? అలా అయితే యెవళ్లకీ నొప్పి వుండదు" అని బదులు చెప్పేరు ఆవిడ.

సిస్టర్లు పేదలలాగే ప్రయాణం చేస్తారు. మామూలుగా నడిచే వెడతారు. మరీ దూరం అయితే బస్సుల్లో వెడతారు. కలకత్తాలో వాళ్లతో కలిసి కిక్కిరిసిపోయిన ట్రామ్‌లలో నేనూ వెళ్లేను. ఎవళ్లో ఒకళ్లు వాళ్లకి కూర్చుందుకు సీటు యిస్తారు. యిక్కడే కాదు, యితర ప్రాంతాలకి వెళ్లినప్పుడూ యీా మాదిరే ప్రయాణం చేస్తారు. రోమ్‌లో వాళ్లతో కలిసి నడిచే వెళ్లేనోసారి. "అబ్బే, యెంతో దూరం కాదు, యిక్కడే" అని మూడవ స్థాయి హోదావున్న వ్యక్తి సాదాగా అన్నారు. చేరవలసిన చోటు చేరడానికి తుంపర వానలో మూడుకిలోమీటర్లు నడిచేం! అక్కడో శిథిలమైన గదిలో ఓ ఎయిడ్స్ రోగి వున్నాడు. సిస్టర్లు నడిచేటప్పుడు కూడా దైవ నామస్మరణ చేస్తూనే వుంటారు. దూరాన్ని చిత్రంగా కొలుస్తూ వుంటారు. "అయిదు జపమాలల దూరం" అని రోమ్‌లో ఆ జంట అన్నారు, మరో యింటికి వెళ్లాలి వస్తారా అని నన్ను అడుగుతూ. నా ముఖం వంకర్లు పోవడం చూసి వాళ్లు పగలబడి నవ్వేరు. జపమాల తిప్పుతూ దైవనామస్మరణ చేస్తారు, అలా దూరాన్ని కొలుస్తారు. యెన్ని చుట్లు జపమాల తిరిగితే అంతదూరం అని లెక్క.

మధ్యాహ్నంవేళకు భోజనాలకు తిరిగివస్తారు. ఒంటిగంట ప్రాంతంలో ఓ అరగంట విశ్రాంతి. ఒకరోజు పని అప్పటికే జరిపించి వుండడంతో ఓ అరగంటేనా కాస్త కునుకు తియ్యాలి. మదర్ డెంగాల్ పాట్నాలో మదర్ థెరెసాకు సలహా యిచ్చిందికదా, దాన్నీ జాగ్రత్తగా పాటిస్తారు. ఏమంటే– రోజు పనిని పొద్దున్నా, మధ్యాహ్నం అని విడగొట్టుకోకపోతే చురుగ్గా పని చెయ్యలేరు. రెండుగంటల వేళ మళ్లీ మొదలు. కొంతమందికి వేరు వేరు పనులుంటాయి. ఓ రకంగా పని విసుగ్గా వుండకుండా చూసేందుకే యీ పద్ధతి. అలా సాయంత్రం 6 గంటల దాకా పనిచేస్తారు. అప్పుడు "మదర్ హౌస్"కి మళ్లీ తిరిగి వస్తారు. అప్పుడే కొంచెం పూజకీ, పరదాలకీ సమయం చిక్కుతుంది. ఆ తర్వాత రాత్రి భోజనం. అదయేక మరో అరగంట ప్రార్థన. పదింటికల్లా నిద్రకు ఉపక్రమిస్తారు.

అయితే మదర్ థెరెసా దినచర్య కొంచెం భిన్నంగా వుంటుందికదా. ఒకోసారి భారతదేశంలోనూ, విదేశాల్లోనూ మిషనరీ శాఖల్ని సందర్శించి రావడానికే అర్ధ సంవత్సరం గడిచిపోతూ వుంటుంది. తమ గృహానికి ఆవిడ రావాలని ప్రతీ సిస్టరూ కోరుకుంటూ వుంటుంది, అది సహజమే. ఓసారి సందర్శన అవుతుందో లేదో "మళ్లీ మదర్ యెప్పుడొస్తారు" అని అడగడమే. ఆ సందర్భాల్లో సిస్టర్లు తమ సమస్యల్ని ఆవిడకు చెప్పుకుంటారు. వాళ్లు వాటిని పరిష్కరించుకో లేకపోయి వుంటారు. స్థానిక సమస్యల్నిబట్టి కలకత్తాలో రైటర్స్ బిల్డింగ్‌కి వెళ్లవలసి రావచ్చు, మిత్రుడైన చీఫ్ మినిస్టర్ని కలుసుకుందుకు. ("ముందుగా అనుమతి తీసుకోకుండానే ఎకాయెకీ ఆయన గదిలోకి వెళ్లగలను"). ఢిల్లీలో ఓ కేంద్రమంత్రిని కలుసు కోవాల్సి రావచ్చు. ప్రధానమంత్రిని కూడా కలుసుకోవాల్సి రావచ్చు, సమస్య అంత తీవ్రమైందైతే. తన రోజువారీ కార్యకలాపాలనీ ఆవిడ అమలు జరుపుతూనే వుంటారు. ఓ ఉపన్యాసం యిమ్మనో, ఓ మత సమావేశానికి రమ్మనో, రోగుల్ని సందర్శించమనో ఆవిడ్ని పిలవని రోజు అంటూ వుండదు. కొత్త యింటి కోసమని ఓ స్థలం చూడ వలసి రావచ్చు. ఓ స్థానిక బిషప్‌నో, ప్రీస్ట్‌నో కలుసు కోవాల్సి రావచ్చు. యివన్నీ యిలా సాగుతూవుంటే మామూలు జనం గుంపులుగా వస్తూనే వుంటారు. కొంతమంది దానం అర్థిస్తూ వుంటారు. కొందరు ఫోటో లేమన్నా వుంటే యిమ్మంటారు. యేదో సమస్య చెప్పుకుందుకు కొందరు ఆశీస్సులు అంద జెయ్యమని కొందరు అలా వస్తూనే వుంటారు. వీలైనంత మందికి ఆవిడ బిజినెస్‌కార్డ్‌ని యిస్తారు. చిన్న పసుపు పచ్చకార్డు, దాని మీద యిలా ముద్రించి వుంటుంది:

మౌనానికి ఫలితం ప్రార్థన
ప్రార్థనకు ఫలితం విశ్వాసం
విశ్వాసానికి ఫలితం ప్రేమ
ప్రేమకు ఫలితం సేవ
సేవకు ఫలితం శాంతి –

మదర్ థెరెసా

రోజు పని పూర్తయ్యేక సిస్టర్లు అందరూ నిద్రకుపక్రమిస్తారు. అప్పుడు మదర్ తన చిన్న ఆఫీసు గదికి వెళ్లి పాలనాపర వ్యవహారాలూ, ఉత్తరప్రత్యుత్తరాలూ చూసుకుంటారు. యీ గడిచిన కాలంలో ఆవిడ స్వయంగా రాసిన చీటీలు

ఉత్తరాలు నాకు అందేయి కదా, అవన్నీ యిదుగో యీ వేళలప్పుడు రాసినవే. ఆవిడ అన్నిట్నీ శ్రద్ధగా చూస్తారు. యిటీవల జబ్బు పడ్డారు కదా, అప్పటిదాకా ఆవిడ టెలిఫోన్ మోగగానే తనే స్వయంగా అందుకునేవారు. "అఁ, మదర్ థెరెసానే మాట్లాడుతున్నా".

మదర్ థెరెసాకైతే సెలవురోజంటూ లేదు. అయితే సిస్టర్లు గురువారాల్లో మామూలు రోజువారీ పనులకు హాజరవరు. యింటిపనులు చక్కబెట్టుకుందుకు, తుడవడం, కడగడం లాంటి పనులకు కేటాయించు కుంటారు. మత సంబంధ బోధనలో వెనకబడ లేదుకదా అని చూసుకుంటారు. ధ్యానానికీ ఆ రోజే కేటాయించు కుంటారు. ఎప్పుడో, అంటే యేడాదిలో ఓసారో, రెండుసార్లో వాళ్లని ఓ ప్రశాంత ప్రదేశానికో, విహార యాత్రకో వెళ్లనిస్తారు. ఆ సందర్భాల్లో రోజువారీపనులని దీక్షార్థులుగా వున్నవాళ్లు చూస్తారు. వాళ్లు మామూలు రోజుల్లో అయితే సహాయం చేస్తూ వుంటారంతే. దీనివల్ల దీక్షార్థులకు తమలో తమకు విశ్వాసమూ కలుగుతుంది, మంచి శిక్షణా లభిస్తుంది.

బట్టలకు చిరుగులు కుట్టుకోవడం, మాసికలు వేసుకోవడం గురువారాల్లోనే చేస్తారు. ప్రతి సిస్టర్‌కీ మూడేసి చీరలుంటాయి. వాళ్లు చేసే పని కష్టంగా వుండడం వల్ల అవి తొందరగా నలిగిపోతాయి, చిరిగిపోతాయి. అంచేత మాసికలు వేసుకుంటూ వుండాలి, కుట్టుకుంటూ వుండాలి. మిగిలిన అన్ని విషయాల్లో మాదిరిగానే యీ విషయంలోనూ మదర్ థెరెసా ఒరవడిగా వుంటారు. పైకి కనిపించకుండా మాసికలు వేసిన చీరలు ఆవిడా కట్టుకుంటారు. ఆ చీరలు తెల్లగా మెరిసిపోతూనే వుంటాయి. పేదరికానికీ, పరిశుభ్రతకూ, చక్కదనాలకూ యెందుకు పొసగదు, హాయిగా పొసగుతుంది అని చాటుతున్నట్టు వుంటాయి ఆ చీరలు.

తలా మూడు చీరలతో బాటు ప్రతి దీక్షార్థికి, సిస్టర్‌కీ క్రీస్తువున్న ఒక చిన్న శిలువ బొమ్మ (దాన్ని చీరకు గుచ్చుతారు), జపమాల, భోజనం చెయ్యడానికి ఇనప అంచు పళ్లెం, పల్చని గడ్డిపరుపు యిస్తారు. యిలాంటి పరుపునే 'హోమ్ ఫర్ ది డైయ్యింగ్'లో వున్నవాళ్లకి యిస్తూ వుంటారు. మదర్ హౌస్‌లో వున్న ఒక్క ఎలక్ట్రిక్ ఫాన్ కూడా సందర్శకుల గదిలోనే వుంది. చిత్రం యేమిటంటే, "మదర్ హౌస్"కి నేను యెపుడు వెళ్లినా ఆ ఫాన్ అవసరం వున్నట్టు నాకైతే అనిపించలేదు.

యిది విషయ లోలుపత్వం ప్రధానంగా వున్న యుగం. 'జీవిత ప్రమాణం'లాంటి మాటలు తరచూ వినిపిస్తూ వుంటాయి. అవసరాలు యెలా పెరుగుతున్నాయో యీ మాటలే తెలియజేస్తాయి. యిలాంటి నేపథ్యంలో సిస్టర్లు గడిపే జీవితం చూస్తే యెంత తారతమ్యం వుందీ అన్న విషయం తెలుస్తుంది. యీ భావనతోనే మదర్ థెరెసా యెవళ్లో వాషింగ్ మెషీన్ యిస్తే వద్దన్నారు. విద్యుత్‌కోతవల్ల అసౌకర్యం కలగకూడదని యెవళ్లో జెనరేటర్ యిస్తే వద్దన్నారు. యీ మధ్యకాలంలో ఆవిడ మినహాయిపు యిచ్చిందల్లా ఒక్క టెలిఫోన్‌కే. దాని వల్ల వుండే ప్రయోజనాలు దానికి వున్నాయని చెప్పగా చెప్పగా ఆవిడ సరేనన్నారు. యీ మహానగరంలో టెలిఫోన్‌లు వుండీ ఉడిగీ పని చేస్తాయి. అలాంటిది మదర్ హౌస్ టెలిఫోన్ యెప్పుడూ పాడవలేదు. అదో చిత్రం. అక్కడ ఓ టెలివిజన్‌గాని, వీడియోగాని,

ఫాక్స్ మెషీన్‌గాని, ఓ ఓవెన్‌గాని, రోస్టర్ గాని యేమీ లేవు. వంటింట్లో బొగ్గుల కుంపటి మీదే అన్నాలు వండుకుంటారు. అదే నిరుపేదల వంటచెరకు. లోకంలో యేం జరుగుతోందో తెలుసుకోవాలికదా, మరి రేడియో అయినా వుండాలా అని అడిగేను. 'అక్కర్లేదు. మన కళ్లముందు యదార్థం కనిపిస్తూనే వుందన్నా'రావిడ.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్‌లో వున్న యదార్థం యేమిటంటే– కష్టభూయిష్టమైన బతుకు. అందులోవున్నవాళ్లు చాలామంది పడుచువాళ్లు. అయితేనేం ఆ బతుకే సాఫల్యం అందిస్తూ సంతోషకరంగా వుంది. మిషనరీస్ ఆఫ్ ఛారిటీని తమ ఆనందానికి పతకంలాగా చూపిస్తూ వుంటారు, యెక్కడ పని అప్పగించినాగానీ, యిదెంత ముఖ్యమంటే ఉత్సాహభరితంగా వుండడం తప్పకుండా వుండాల్సిన యోగ్యత, ఒక ఆనర్స్ డిగ్రీ లాంటిది. "అంకితమైన సేవ అంతగానూ మన ప్రజలకి మనుషుల ప్రేమ అనే ఆనందం కావాలి. ప్రేమాస్పదమైన విశ్వాసం, సంపూర్ణంగా అంకితం కావడం, తాము ఉత్సాహభరితంగా వుండడం కావాలి," అన్నారు మదర్ థెరెసా. వాళ్ల నియమావళిలో వున్నట్టు "దేవునికి మనం కృతజ్ఞతలు తెలియచెయ్యడానికి రాజమార్గం ప్రతిదాన్ని సంతోషంగా స్వీకరించడం" అవసరం.

ఉల్లాసభరిత స్వభావం యెంత అవసరమో యెవళ్లకేనా అర్థమవుతుంది. శిక్షణే దీర్ఘకాలం వుంటుంది, కష్టభూయిష్టంకూడానూ. మతవిశ్వాసం, ప్రశ్నోత్తర ఖండం లాంటి అంశాలలో పాఠాలు వుంటాయి. అలాగే క్షేత్రంలో పనికి సంబంధించీనీ. యీ శిక్షణా నియమాల్ని యెన్నో యేళ్లుగా మదర్ థెరెసా సడలించలేదు. -యిప్పుడున్న యదార్థ పరిస్థితి యింకా యెన్ని సుగుణాల్నో కోరుతుంది. యిందులో లోకజ్ఞానం, చురుకు బుద్ధీ మరీ అవసరం. యిక్కడ చేరే అమ్మాయిలు తమ తల్లిదండ్రుల్ని అప్తుల్ని వదిలిపెట్టి రావాలి. యెప్పుడోగాని యిళ్లకు వెళ్లనియ్యరు. పదేళ్లకోసారి సగటున అని చెప్పచ్చు. కన్నవాళ్లు యెవళ్లన్నా పోయినప్పుడో లేదా యే విదేశానికేనా ప్రత్యేక కార్యనిర్వహణ కోసం పంపినప్పుడో మాత్రమే అలాంటి అవకాశం వుంటుంది. అయితేనేం– చర్చికి సంబంధించి మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్‌లోనే యెక్కువమంది దీక్షార్థులు వున్నారు. మతానుయాయులు తగ్గిపోతూ వున్నారే అని చర్చి ఓపక్క ఆందోళనపడుతూ వున్న సమయంలో, మేం చేరతాం, మమ్మల్ని చేర్చుకోండి అన్న విజ్ఞాపనలు మదర్ థెరెసాని ముంచెత్తేస్తూ వున్నాయి. ఆ విజ్ఞాపనలు యెక్కువగా పెద్ద కుటుంబాల ఆడపిల్లల నుంచి వస్తున్నాయి. వాళ్లల్లో చాలామంది బాగా విద్యావంతులు కూడాను.

సిస్టర్ ఆగ్నెస్ మదర్‌థెరెసా దగ్గర చేరిన మొదటి శిష్యగణంలో ఒకరు. 1949లో మదర్ థెరెసాతో వచ్చి చేరారు. అప్పటికి ఆవిడ కార్యక్రమం యేమిటో కూడా తెలీదు. తను అంత ధైర్యంగా వచ్చి చేరేటప్పుడు కన్న తల్లిదండ్రులు యేమన్నారని సిస్టర్ ఆగ్నెస్‌ని అడిగేను. "మా అమ్మ చాలా ఆందోళన పడింది. ఆవిడ కలకత్తాలోనే వున్నా 1949 నుంచి 1953 దాకా నన్ను చూడ్డానికే రాలేదు. సరే కానియ్యి అంటూ నా పద్ధతిని ఒప్పుకోవడానికి చాలా యేళ్లు పట్టింది," అని చెప్పింది ఆమె. మరో సిస్టర్ కూడా యిలానే చెప్పింది. తన పేరు వెల్లడించవద్దంది ఆమె. యీ మఠం వదిలిపెట్టి వచ్చేయ్యమని చాలాకాలం తన తల్లిదండ్రులు బతిమలాడేరట. అయితే యెంత మనశ్శాంతిగా వుందో గమనించేక సరే కానియ్యి

అన్నారట. "మామూలుగా తమ పిల్లల్ని దేవుని సేవకు అర్పించడానికి తల్లిదండ్రులు సంతోషంగానే వుంటారు. నిజంగా గొప్ప విషయం, గొప్ప త్యాగం. దేవునికి మీరు అర్పితమైనప్పుడు ఆ త్యాగం విచారం కలిగించదు" అన్నారు మదర్ థెరెసా.

యెప్పుడన్నా సిస్టర్స్ మఠం వదిలిపెట్టి వెళ్లిపోతే పత్రికల్లో సంచలనాత్మక కథనాలు కనిపిస్తూ వుంటాయి. రెండేళ్లనాడు సిస్టర్ ఎమాక్యెస్ అనే సీనియర్ నన్ గురించిన వార్త ఓ ఆదివారం పత్రికలో వచ్చింది. సరైన ఆదరణ లేక పోవడంవల్లా, మదర్ థెరెసా నిరంకుశ ధోరణుల వల్లా తను వదిలిపెట్టి వెళ్లిపోతున్నట్టు ఆమె అంది. ఆమెతో బాటు యింకా చాలామందీ వెళ్లిపోయినట్టు ఆ పత్రిక రాసింది. కలకత్తాలో వున్న సహచరులు మదర్ థెరెసాకు ఆ కథనం గురించి చెప్పేరు. కొన్నివారాల తర్వాత నేను కలకత్తా వెళ్లేను. అప్పుడు యీ విషయం గురించి మదర్ థెరెసాను అడిగేను. ఆవిడ నొచ్చుకున్నట్టు కనిపించేరు. అసలా పేరుగల సిస్టరే అక్కడ లేరని చెప్పేరు. యీ విషయం తెలియచేస్తూ ఆ పత్రికా సంపాదకులకు జాబు రాసేరట కూడా. అయినా దాన్ని వాళ్లు ప్రచురించలేదు. "మా సహచరుల పట్ల గౌరవ సూచకంగానేనా వాళ్లు దాన్ని ప్రచురించి వుండాల్సింది" అన్నారావిడ. "పత్రిక అమ్ముడు పోవడానికి యిలాంటి కథనాలని రాసే వాళ్ల పట్ల జాలి చూపించాలంతే. మా సంస్థ పేరుని ఆ రకంగా యెలా అభాసుచెయ్యగలరో" అన్నారు.

అలాగని సిస్టర్లూ, దీక్షార్థులూ మఠం వదలి వెళ్లిపోవడం లేదని కాదు. కావాలను కుంటే హాయిగా వెళ్లిపోవచ్చు. చాలామంది అమ్మాయిలు ఓసారి వచ్చి–చూసి–పోదాం అన్నట్టుగానే వస్తారు. కొన్ని వారాలో, నెలలో వుండాలనుకుంటారు. తమకా విధానం సరిపోతుందో లేదో పరీక్షించు కుంటారు. కొంతమంది కీబతుకు కష్టం అనిపిస్తుంది. కొంతమంది యిళ్లకి తిరిగి వెళ్లిపోదామను కుంటారు. కొంతమంది పెళ్లీసంసారం కావాలను కుంటారు. అయినా వదిలిపెట్టి వెళ్లిపోయిన వాళ్లని వేళ్లమీద లెక్కపెట్టచ్చు. బహుశా మదర్ థెరెసా సమ్మోహకశక్తి వల్ల కావచ్చు, ఆవిడ తన వాళ్లందర్నీ ఒకటిగా కలిసి వుండేటట్టు చెయ్యడంవల్ల కావచ్చు– యీ సంస్థ యిలాగే పెరుగుతూ వుంటుందా అన్న దాన్ని కాలమే తేల్చి చెప్పగలదు. ప్రస్తుతానికి వదిలిపెట్టి వెళ్లిపోయే వాళ్లకంటే వచ్చి చేరే వాళ్ల సంఖ్యే యెక్కువని చెప్పాలి. యివాళ ప్రపంచవ్యాప్తంగా 4,000 మందికి పైబడి సిస్టర్లూ, దీక్షార్థులూ వున్నారు.

శిక్షణా సమయంలో కాలక్రమరీత్యా ఆర్నెల్లు అభిలాషగా ఉమేదువారుగా వుండడం, ఏడాది పాటు శిష్యరికంతో వుండడం జరుగుతాయి. అధికారికంగా అవసరమైన యోగ్యతల్లో శారీరక, మానసిక దారుఢ్యం జ్ఞానాపేక్ష పుష్కలమైన లోకజ్ఞానసంపాదనా సామర్థ్యం ఉల్లాసభరిత స్వభావం వుండాలి. శిష్యరికస్థాయి పూర్తిచేశాక రెండేళ్లు నన్ శిక్షణాకాలం వుంటుంది. అదయేక ప్రమాణాలు స్వీకరిస్తారు. అలా దీక్ష పొందిన సిస్టర్లు అయిదేళ్లపాటు జూనియంట్ (అలా అని ఆ కాలాన్ని పిలుస్తారు) శిక్షణ పొందాలి. ప్రతి యేడూ ప్రమాణాలు పునరుద్ఘాటించాలి. ప్రమాణ దీక్ష పొందిన ఆరవ సంవత్సరాన్ని టెర్షియన్‌షిప్ అంటారు. ఆ తర్వాత తుది ప్రమాణాలు స్వీకరిస్తారు. తుది ప్రమాణానికి ముందు మదర్ థెరెసా వాళ్లని మూడువారాలపాటు సెలవు మీద యిళ్లకు పంపిస్తారు. యిందులో ఆవిడ ఉద్దేశ్యం యేమిటైందీ స్పష్టమే. జీవితం ముందు ముందు అసాధారణమైన, బృహత్తర అంకిత భావాన్ని కాంక్షిస్తుంది.

అక్కడనే వుండిపోయి సేవ చెయ్యాలో వద్దో ఆ అమ్మాయిలు జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయించు కోవాల్సి వుంది. అందుకుగాను అది ఆఖరి అవకాశం అన్నమాట.

నేను యిదే ప్రశ్నను యిద్దరు ఔత్సాహికులను అడిగేను. రోమ్ నగరంలో ఎయిడ్స్ బాధితుల సంరక్షణార్థం వాళ్లు వెడితే నేనూ వాళ్లతో వెళ్లేను. ఒకమ్మాయి ఐర్లండ్ దేశానికి చెందింది, మరో అమ్మాయి స్విస్. వాళ్లిద్దరూ పాతిక ముప్పై మధ్య వయసువాళ్లు. వాళ్లు నేత చీరలు కట్టుకున్నారు. ముతక ఓవర్‌కోట్లు వేసుకున్నారు. తమ పనికి సౌకర్యంగా వుండే బూట్లు తొడుక్కున్నారు. దారిలో కొంతమంది అమ్మాయిలు తగిలేరు. వాళ్లు మంచి ఫాషనబుల్‌గా వున్నారు. వాళ్లు మమ్మల్ని దాటిపోయేక, మీకు అలాంటి మంచిబట్టలు వేసుకోవాలనీ, ముస్తాబవాలనీ వుండదా అని యీ యిద్దర్నీ అడిగేను. వాళ్లిద్దరూ సంతోషంగా నవ్వేరు. నేనేదో పరిహాసం ఆడుతున్నట్టు, తాము ఆ దారిలో వెళ్లాలనుకుంటే అవకాశాలు కొల్లలుగా వున్నాయని వాళ్లు అన్నారు. వాళ్లు వయసుకు మించి యెంతో యెదిగిన ఆధ్యాత్మిక చింతన అలవరచుకున్నారని నిస్సందేహంగా నాకు అనిపించింది.

అలా అని యీ సిస్టర్లు గత శతాబ్ది అంతంలో వచ్చిన క్రైస్తవ మత ప్రచారకులని కాదు. ఇటలీ ప్రధానంగా రోమన్ కాథలిక్ మతావలంబి దేశమే. అంచేత మతమార్పిడి అన్న ప్రశ్నే లేదు. భారతదేశంలో కూడా పద్దెనిమిదవ శతాబ్దం నుంచీ వున్న మతమార్పిడి పాత్ర 1947లో స్వాతంత్ర్యం వచ్చేక మట్టుపడింది. మదర్ థెరెసాకి సంబంధించి ఆత్మల విచారం, బాప్టిజం, అవసానదశ మార్పిళ్లు యిక యెంతమాత్రమూ అవసరమే లేదు. క్రీస్తుతో సహజీవనం చేస్తూ, పేదల రూపంలో ఆయనకు సేవ చేస్తూ, ఆవిడ ఆయనతో మమేకం అయేరు. "ఓ రకంగా చెప్పాలంటే నాకు జీసస్‌తో వివాహం అయింది, మీకూ మీ భార్యకీ అయినట్టు" అని ఆవిడ ఒక రోజున వివరించేరు. ఆవిడ యెటు మొగ్గుతున్నారో తేటతెల్లంగానే వుంది. "ఆఁ, మార్పిడి చేస్తాను" అన్నారావిడ నవ్వుతూ, అలాంటి విమర్శలకు మీ సమాధానం యేమిటని అడిగినప్పుడు. "మిమ్మల్ని యింకా మంచి హిందువుగా, మంచి కాథలిక్‌గా, మంచి ముస్లిమ్‌గా, జైన్‌గా, బౌద్ధమతస్థునిగా మారుస్తాను. మీరు దేవుణ్ణి దర్శించడానికి మీకు సాయం చేస్తాను. ఆయన కనిపించేక, మరి యేం చేసుకుంటారో మీ యిష్టం" అన్నారు. శిశుభవన్‌లో పిల్లలకు వాళ్ల తల్లిదండ్రులు క్రైస్తవులని తెలిస్తేనో, యే క్రైస్తవులకో దత్తత యిస్తేనో తప్ప బాప్టిజం జరిపించరని నాకు తెలుసు. చాలామంది పిల్లల్ని హైందవ కుటుంబాలకే పంపిస్తారు. అలాంటి పిల్లలకి బాప్టిజం యివ్వడం మదర్ థెరెసా వ్యూహాకే అందదు. అందకుపోవడమే కాదు– ఆవిడ దృష్టిలో అది పాపం కూడా. అదేరకంగా కాళీఘాట్‌లో మరణించిన వాళ్లకి సంబంధించీనీ. దహనసంస్కారాల కోసం వారి భౌతిక కాయాల్ని పంపిస్తారు, వాళ్లు ముస్లిమ్‌లో, క్రైస్తవులో అని కచ్చితంగా తెలిస్తే తప్ప. నాకు మదర్ థెరెసా కొన్ని యేళ్లుగా తెలుసుకదా. యింతకాలంలోనూ ఆవిడ సూచనప్రాయంగా గాని, మరోవిధంగా గాని మత మార్పిడి గురించి యేమీ అనలేదు. ఆవిడ పల్లవి అల్లా "ప్రార్థన చెయ్యడం యింకా మొదలెట్టలేదా?" అనే. యెప్పుడో అడపాదడపా ఆవిడకోసం ఓ ప్రార్థన చేస్తానని నేను అన్నాను. "సరే అయితే, బాగానే వుంది,

యేమంటే నేను మీకోసం ప్రార్థన చేస్తాను" అని నవ్వుతూ అన్నారు. అంతలోకే సీరియస్ అవుతూ, "మీరు నా ప్రార్థనల్ని దేవునికి అర్పించాలి" అన్నారు.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ విధిగా వీధుల్లోకి వెళ్లాలి. యీ నియమం యెట్టి పరిస్థితుల్లోను సడలించబడ్డానికి ఆవిడ ఒప్పుకోలేదు. "చూశారా, ధాపా నుంచో, తితాఘర్ నుంచో, యితర బస్తీల నుంచో కుష్ఠురోగులు యిక్కడికి రావాలంటే యెంత కష్టమో. మనమే వాళ్ల దగ్గరకు వెళ్లాలి. మనం నాలుగ్గోడల వెనకాల ముడుచుకు కూర్చోకూడదు" అన్నారావిడ నాతో. ఆవిడ ఒప్పుకున్న సంస్థలల్లా పిల్లలవి, మానసికంగా స్థిమితం లేనివాళ్లవి (కలకత్తాలో ప్రేమదాన్ లాంటివి) అనాథ, కుష్టు రోగులవి అవసానదశలో వున్న వాళ్ళవి. యివి సంస్థాపరమైన జాగ్రత్త అవసరమైన ప్రత్యేక తరహావి. యీ సంస్థల్ని కొంతమంది సిస్టర్లే నిర్వహించవచ్చు. (దీక్షార్థులూ, స్వచ్ఛంద సేవకులూ సాయం చేస్తారు కదా). ఎక్కువ మంది సిస్టర్లు మురికివాడలకీ, వాళ్ల అవసరం చాలా యెక్కువగా వున్న ప్రాంతాలకే వెడతారు. యిదీ మదర్ థెరెసా ఆలోచనల్లో మౌలికమైంది, వాళ్ల నియమావళిలో భాగం అయిందినీ. "నిరుపేదల కోసం, అతి దీనుల కోసం క్రీస్తు వేదనకు అనుగుణంగా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ పేదలవాడలోనే వుంటుంది."

క్రమబద్ధమైన ఆదాయం అందిస్తామనే అభ్యర్థనలన్నిటినీ ఆవిడ వద్దన్నారు. ఓ రోజున ఓ స్థానిక లక్షాధికారి చాలా పెద్ద మొత్తం దానంగా యిస్తానన్నాడు. అయితే ఓ షరతు పెట్టేడు. దాని మీద వచ్చే వడ్డీనే (అది సుమారుగానే వుంటుందనుకోండి) వాడుకోవాలి, అసలు యేమాత్రం కదపకూడదు. "యెప్పుడు యెక్కడ అవసరమైతే అప్పుడు అక్కడ దాన్ని వాడుకోవడానికి లేకపోతే ఆ డబ్బు వల్ల ప్రయోజనం యేమిటి? యీ కృషి వ్యాపారం కావడం నాకు యిష్టం లేదు. యిది ప్రేమతో చేసేదిగానే వుండాలి" అన్నారావిడ. అన్నిటినీ ఆ పరమేశ్వరుడే సమకూరుస్తాడని ఆవిడ విశ్వాసం, అది పిసరు కూడా సడలలేదు. "డబ్బు విషయం అసలు యెప్పుడు ఆలోచించను. అదే వస్తుంది. మా పని అంతా దేవుడి కోసమే. ఆయనే మమ్మల్ని చూసుకోవాలి. యేదన్నా జరగాలీ అని ఆయన సంకల్పిస్తే అందుకు తగ్గ సాధన సంపత్తినీ ఆయనే యిస్తాడు. సాధన సంపత్తి సమకూర్చలేదూ అంటే ఆ పని ఆయన సంకల్పంలో లేదన్న మాట. యిక దాన్ని గురించి ఆలోచనే చెయ్యను."

ప్రభుత్వ సాయాన్నిగాని, చర్చి నిర్వహణను గాని ఆవిడ యెందుకు తీసుకోలేదో సులభంగానే అర్థమవుతుంది. వాళ్ల సాయం తీసుకోవడమూ అంటే లెక్కలు పద్దులు చెపుతూ వుండాలి, అందుగ్గాను ప్రపంచవ్యాప్తంగా వున్న 468 మాతృగృహాల్లోనూ వాటిని చూసేవాళ్లుండాలి. ఒకో గృహానికీ ఒకో సిస్టరేనా యీ పనిలో వుండాలి. అంటే అనాథల సేవనుంచి పక్కకు మళ్లడమేకదా. యిక యిందుగ్గాను అకౌంటెంట్ల పటాలమే వుండాలి. మదర్ హౌస్ చూసిన యెవళ్లకేనా సరే ఓ విషయం తెలుస్తుంది, ఇక్ష్వాకుల నాటి టైప్‌రైటర్లని మోదుకుంటూ ముగ్గురు సిస్టర్లు ప్రపంచంలోని వంద దేశాల్లో పనిని చూసుకుంటూ వుంటారు. అలాంటి పరిస్థితుల్లో "అసలైన పని"కి వినియోగపడని ప్రతి రూపాయి ఖర్చునీ మదర్ చీదరించుకుంటారు.

నోబెల్ బహుమతి రాకముందు దేవుని మీద భారం వెయ్యడమే యెక్కువగా

వుండేది. అప్పటికి మదర్ అంత ఖ్యాతినీ పొందలేదు, ఆవిడ కృషికి అంత గుర్తింపు రాలేదు. ఢిల్లీలోని శిశుభవన్‌లో ఓ రోజున తిండానికి యేమీ లేకపోయిందట. అలా అని ఆవిడే నాకు చెప్పేరు. తిండానికి యేమీ లేదు, అతి చవక పప్పుగింజలు కొనడానికి కూడా చేతిలో చిల్లిగవ్వ లేదు. సిస్టర్లు ఎసరు పెట్టేరు, యేదో యింత అన్నం ఉడకేద్దామని. దాని మీద కాస్త ఉప్పు చల్లుకుని తినాల్సిందే. సరిగ్గా ఆ సమయంలో ప్రధానమంత్రి ఇందిరాగాంధీ నివాసం నుంచి ఒక కారు వచ్చింది. దాన్ని ఆవిడ కోడలు సోన్యా పంపించేరు. దాన్నిండా కాయగూరలు వున్నాయి. "ఆ పూట పిల్లలూ, సిస్టర్లు కడుపునిండా భోజనం చేశారు" అంటూ నవ్వేరు ఆవిడ.

యీ భావనతోనే నిధుల సేకరణను ఆవిడ సర్వదా తిరస్కరించేరు. నిజానికి ఆవిడ పనిగట్టుకుని అలాంటి సేకరణను నిషేధిస్తారు. యీ సంఘంకోసం తోటి కార్యకర్తలెవళ్లూ పూనుకోకూడదు. వాళ్లకి యెక్కడ దానాలు వచ్చినా వాటిని రీజినల్ సుపీరియర్‌కు పంపించాలి. ఆ ప్రాంతంలో వున్న హౌస్‌ల అవసరాలకు వాటిని యెలా సద్వినియోగం చెయ్యాలో ఆవిడ చూసుకుంటారు. నిధుల మదుపు అనేది లేనేలేదు. "బాంకులో డబ్బు పెట్టే అవసరం నాకు లేదు. డబ్బు ప్రజల నిమిత్తం వాడడానికే నాకు కావాలి" అన్నారావిడ. పెద్ద మొత్తాలందిన సందర్భాల్లో కూడా వాటిని మందుల నిమిత్తం (ముఖ్యంగా కుష్ఠు, క్షయ వ్యాధిగ్రస్తులకు) ఆహారం నిమిత్తం, పాలపొడి నిమిత్తం ఖర్చు చేసేశేవారు. కొన్ని దానాలు భారీగా వుండేవి. గత యేడాది ఒకసారి యేక మొత్తంలో 30,00,000 స్విస్ ఫ్రాంకులు దానంగా వచ్చేయి. ఆ డబ్బును తూర్పు యూరప్ దేశాలకి అవసరమైన సరఫరాల మీద చకచకా ఖర్చయేయి. గమనార్హమైన విషయమేమిటంటే– మదర్ థెరెసా పథకంలో అంత పెద్ద మొత్తాలు అత్యావశ్యకమైనా ముఖ్యం కావు. ఆవిడకు ప్రియంగా కనిపించేది "త్యాగధనం."

యీ విషయం గురించి నాకెలా తెలిసిందీ అంటే– మదర్ హౌస్‌లో తన గదిలోకి వెళ్లే దారి అంత మసక వెలుతురులో వుందేం అని అడిగినప్పుడు– అలా అని కొంచెం కొంటెగానే అడిగాననుకోండి. కొంచెం వెలుతురు యెక్కువ వచ్చే దీపాల్ని పెట్టించుకోలేరా? ఆవిడ మామూలుగా అయితే తేలిగ్గా చెప్పేవారు, కాని యిప్పుడు కొంచెం గంభీరంగానే జవాబు చెప్పేరు. "నాకు అందే డబ్బు వ్యాపారం కోసం కాదు. అది త్యాగం చేస్తే వచ్చిన డబ్బు. దాన్ని యిచ్చేవాళ్లు యెంతో త్యాగం చేస్తారు. వాళ్లు తమకిగా చవకబట్టలు కొనుక్కుంటారు. తిండి లేకుండా గడుపుతారు. అవును, మీకు చెప్పలేదు ఓ పడుచు హిందూ జంటగురించి?" అన్నారు. లేదన్నట్టు నేను తల వూపేను. "వాళ్లకి ఒకళ్లంటే ఒకళ్లకు ప్రాణం. ఆ ప్రేమను నాతో పంచుకోవాలనుకున్నారు, పేదలతో పంచుకోవాలనుకున్నారు. పెళ్లికి ఖరీదైన బట్టలు వద్దనుకున్నారు. సాదా బట్టలే కొనుక్కున్నారు. ఓ విందుల్లేవు, చీరల్లేవు, యేమీ లేవు. అలా జాగ్రత్త చేసుకున్న డబ్బంతా నాకు యిచ్చేరు" అంటూ చెప్పేరు.

ఆ మర్నాడు ఆవిడతో మాట్లాడుతూ ముందు గదిలో కూర్చున్నాను. ఆవిడ ఉద్దేశించిన దానికి ఉదాహరణ కనిపించింది. యెవళ్లో లోపలికి వచ్చేరు. వాళ్లల్లో ఒక స్విస్ బేంకర్ వున్నాడు. మిగ్రోస్ అని అతి పెద్ద స్విస్ సూపర్‌మార్కెట్ అధిపతి వున్నాడు. వాళ్లతోబాటు ఒక బిడియస్థుడైన కలకత్తా కుర్రాడూ వున్నాడు. యీ

కుర్రాడికి పద్దెనిమిది, పంధొమ్మిదేళ్లు వుంటాయేమో. స్విస్ పెద్దమనుషులిద్దరూ మదర్‌కి వాళ్ల విజిటింగ్ కార్డులు యిచ్చేరు. మదర్ వెంటనే వాళ్లకి తన బిజినెస్ కార్డు యిచ్చేరు. "యిప్పుడు మనం దైవప్రార్థన చెయ్యాలి" అంటూ నాకేసి తిరిగి, "యీాయన్ని మాత్రం యెందుకు వదలాలి" అన్నారు. "మీరు ప్రార్థన చెయ్యడం నేర్చుకోవాలి" అన్నారు నాతో. ఆవిడ నవ్వితే యెవళ్లైనా లొంగిపోతారు. మేమంతా హాయిగా నవ్వేం. చాలా యేళ్లుగా యూరప్‌లో వున్న మదర్ థెరెసా హోమ్‌లకి దానాలు చేస్తూనే వున్నానని బేంకర్ అన్నాడు. తన సంస్థ సూత్రరీత్యా ప్రతియేటా వచ్చే లాభాలమీద ఒక శాతం మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి యిస్తోందని మిగ్రోస్ సూపర్‌మార్కెట్ అధిపతి అన్నాడు. యింకా యేమన్నా సాయం చెయ్యగలమా?" "మేం యిటీవలే రుమేనియాలో ఒక హోమ్ ప్రారంభించేం. చాలామంది పేదరికంతో, చలికి బాధపడుతూ వున్న వాళ్లక్కడ వున్నారు. అక్కడ తిండీ, బట్టలూ చాలా అవసరం. యెకాయెకీ రుమేనియాలో వున్న సిస్టర్లకి మీరు అందజెయ్యగలరా?" అన్నారు. త్వరలోనే పంపించే యేర్పాటు చేస్తామని మేనేజర్ మాట యిచ్చేడు.

అప్పుడు మదర్ ఆ బెంగాలీ యువకుడు సుబ్రతోమిత్రాని పలకరించేరు. అతను యేదో చెప్పబోయేడు గాని మాటలు దొర్లలేదు. ఆవిడ అతనితో మృదువుగా బెంగాలీలోనే మాట్లాడేరు. మొదట్లో అతను తొట్రుపడ్డాడు గాని, తర్వాత మాటలు ప్రవాహంలా వచ్చేయి. గంటకు పైగా బయటనే యెదురుచూస్తూ వున్నానని చెప్పేడు. అతను మదర్ హౌస్‌కి రావడం అదే మొదటిసారట. తను చిన్నపిల్లాడిగా వున్నప్పుడే మదర్ థెరెసా పేరు విన్నాట్ట. అంతకు ముందు రోజే తొలిజీతం 600 అందుకున్నాట్ట. దాన్ని నిజంగా పేదలైన వాళ్లకు దానం చెయ్యాలని అతని ఉద్దేశమట. ఆ మాటలు అంటూ ఓ కవర్‌ని మదర్ పాదాల దగ్గర పెట్టేడు. ఆవిడ అతని తల అందుకుని పైకి లేపేరు. ఆశీర్వదించేరు. ఓ మధ్యతరగతి కుటుంబానికి ఆ జీతం అంటే యెంతో ఆవిడకు తెలుసు. తల్లిదండ్రులు యెన్నో యేళ్లు చేసిన త్యాగఫలం. ఆ క్షణంలో మదర్ థెరెసాకు గాని, అక్కడున్న మాకు గానీ మరేదీ గొప్పగా కనిపించలేదు.

మేం కూర్చున్న గదిలో చేత్తో రాసి పెట్టిన చార్ట్ ఒకటుంది. మిషనరీస్ ఆఫ్ చారిటీ నిర్వహించే యావత్ కార్యకలాపాల వివరాలూ అందులో రాసిపెట్టి వున్నాయి. సాంఘిక కార్యకలాపాల్లో శిశు సంక్షేమం, విద్యాపథకాలు, కుటుంబ సంరక్షణ, డే క్రెష్‌లు, అన్నదాన కార్యక్రమాలు, మద్యపాయుల చికిత్సా కేంద్రాలు, రాత్రి బసలు, సహజ కుటుంబనియంత్రణా కేంద్రాలు లాంటివెన్నో వున్నాయి. వైద్యసేవల్లో డిస్పెన్సరీలు, కుష్ఠు చికిత్సాకేంద్రాలు, అనాథశరణాలయాలు, మానసిక, అంగవికల శిశుచికిత్సా కేంద్రాలు, అవివాహిత తల్లుల కేంద్రాలు, రోగగ్రస్తమై అవసానదశలో వున్నవాళ్ల శరణాలయాలు, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుల చికిత్సా కేంద్రాలు వున్నాయి. విద్యా కార్యక్రమాల్లో అనేక పాఠశాలలు, కుట్లు నేర్పే కేంద్రాలు, వ్యాపార, చేతివృత్తుల తరగతుల వివరాలు వున్నాయి. మతపర విభాగంలో ఖైదుల సందర్శన, కుటుంబ సంబంధాలు, ప్రశ్నోత్తరఖండ తరగతులు, కాథలిక్ కార్యనిర్వహణ బృందాలు, ఆదివారం బళ్లు వున్నాయి.

యీా కార్యకలాపాలు క్రమేపీ పెరిగాయి. తొలి పదేళ్లూ యీా సొసైటీ, కలకత్తా

కేంద్రంగానే వుంది. మతపర నియమాలని తు.చ. తప్పకుండా పాటించే పద్ధతిలోనే వుంది. యీ నియమాల వల్ల పదేళ్ల లోపుగా యే సంస్థా ఆ చర్చి పరిధి కవతల శాఖను ప్రారంభించడం నిషిద్ధం. యీ విషయంలో మదర్ థెరెసా చిరాకుపడ్డారని నేను కొంత విన్నాను. ఆర్చ్‌బిషప్ పెరియర్ చాలా హెచ్చరిక గల ఆయన. యీ విషయంలో యేమాత్రం సడలింపు యివ్వలేదు. 1960లో మాత్రమే కలకత్తా బయట తన శాఖను తెరిచేందుకు మదర్ థెరెసాకు అనుమతి వచ్చింది. భారతదేశంలోని గిరిజన పరిధికి చెందిన రాంచీలో దాన్ని ప్రారంభించేరు. తర్వాతి హోమ్‌ని ఢిల్లీలో స్థాపించేరు. దాన్ని ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూయే స్వయంగా ప్రారంభించేరు. ఆయనకి జబ్బుగా వుంది. అయినా లేచి వచ్చేరు. "మేం చేస్తూ వున్న పని గురించి చెప్పనా అని ఆయన్ని అడిగేను. "అక్కర లేదు, మదర్! మీరు చేస్తూ వున్న పని గురించి మీరు చెప్పనవసరం లేదు. నాకు తెలుసు. అందుకనే వచ్చేను" అన్నారాయన. ప్రధానమంత్రిగా ఆయన నాకు పద్మశ్రీ అవార్డు ప్రదానం చెయ్యమని దేశాధ్యక్షునికి సిఫార్సు చేశారు. 1962లో ఆ బిరుదు యిచ్చేరు. జన్మతః భారతీయులు కాని వారికి అలాంటి బిరుదుని యివ్వడం అదే మొదటిసారి."

ఆ తర్వాత కొత్త హోమ్‌లు వరసగా అలా గబగబా ప్రారంభమయేయి. 1960లో ఝాన్సీ, ఆగ్రాలోని స్థలాల్లో పని మొదలైంది. 1961లో శాంతినగర్‌లో ముందు కట్టబోయే కుష్ఠుచికిత్సా కేంద్రం నిమిత్తం స్థలాన్ని తీసుకున్నారు. అంబాలా. భాగల్‌పూర్, అమరావతి, గోవా, బొంబాయి, పాట్నా, డార్జిలింగ్ పట్టణాల్లో హోమ్స్ వరసగా ఒకదాని తర్వాత ఒకటి వచ్చేయి. యిక అక్కణ్ణుంచి చూపు ముందుకే సారించడం జరిగింది. 1960 దశాబ్ది ముగిసేలోపున భారతదేశంలో యిరవై అయిదు గృహాలు వెలిశేయి. 1980ల చివరికి యీ సంఖ్య 86 అయింది. 1991 నాటికి 168 గృహాలు అయేయి. యింకా ఆ సంఖ్య పెరుగుతూనే వుంది.

మదర్ విదేశాల్లో కూడా తన కార్యకలాపాలని కొనసాగించడం విధాయకమే. 1965లో వెనిజులాలోని కొకొరోట్‌లో భారతదేశం బయట హోమ్ స్థాపితమైంది. అది చిత్రంగా జరిగింది. యీ సంఘం అప్పటికి యింకా కలకత్తా ఆర్చ్‌బిషప్ అధికారపరిధి కిందే వుంది. అంటే ఆర్చ్‌బిషప్ పెరియర్‌కి మదర్ నివేదించాలన్నమాట. భారతదేశంలో ఆవిడ కార్యకలాపాలు చకచకా విస్తరించడమే ఆయనకు యిష్టంగా లేదు. అలాంటిది ప్రపంచంలో మరోమూల మదర్ థెరెసా హౌస్‌ని ప్రారంభిస్తానంటే వూఁ కానియ్యి అంటాడా?

అసలీ వ్యూహ ఢిల్లీ పాపల్ నన్సియోకి చెందిన ఆర్చ్‌బిషప్ నాక్స్‌కి తట్టింది. వెనిజులాకి చెందిన ఆఫ్రికా సంతతి భూమిలేని పేదలు పడుతూ వున్న అగచాట్ల గురించి రోమ్‌లో యేదో సమావేశంలో ఆయన విన్నారట. వాళ్ల అవసరాలకి తగ్గ జవాబు వుందని ఆయన సూచించేరట -- మదర్ థెరెసా, ఆవిడ స్థాపించిన మిషనరీస్ ఆఫ్ ఛారిటీ. ఆర్చ్‌బిషప్ పెరియర్ పాపల్ నన్సియోని కాదనగలడా? అదీగాక ఫిబ్రవరి 1965లోనే యీ సంస్థ నేరుగా వాటికన్ అధికార పరిధిలోకి వెళ్లిందాయిరి. అది ప్రధాన గురు సంబంధమైన కూటమి అయింది.

వెనిజులా బిషప్ ఆహ్వానం అందుకుని స్వయంగా పరిస్థితి యేమిటో తెలుసుకోవాలని మదర్ థెరెసా అక్కడకు వెళ్లేరు. యెక్కడ హోమ్‌లు ప్రారంభించినా ఆవిడ

విధాయకంగా అనుసరించే పద్ధతి యిదే. ఆ స్థానిక బిషప్ ఆవిడ్ని ఆహ్వానిస్తాడు. ఆవిడ పరిస్థితిని పరిశీలిస్తారు. కాకారోట్‌లో కనిపించిన పేదరికం అక్కడో మిషన్ అవసరాన్ని తెలియచేసింది. అదీగాక, సిస్టర్ల సంఖ్య 300దాకా వుంది. అంచేత ఆ అవసరానికి సానుకూలంగా స్పందించగలిగేరు. మదర్ థెరెసా పంపించిన మొదటి సిస్టర్ల బృందంలో అందరూ భారతీయులే. వెనిజులాకు వెడుతూ దారిలో వాళ్లని పోప్ ఆశీస్సులకోసం వాటికన్ తీసుకువెళ్లేరు. యిలా ఆశీస్సులు పొందడానికే 1968లో రెండవ విదేశీహోమ్‌ని రోమ్ నగరంలోనే ప్రారంభించడానికీ సంబంధం లేకపోలేదు. ఆ తర్వాత సంవత్సరంలో మదర్ రెండు హోమ్‌లని ఆస్ట్రేలియాలో ప్రారంభించేరు. ఒకటి మద్యపాయులకు మాదకద్రవ్య దష్టులకు, రెండవది అక్కడి తెగలవాళ్ల కోసం. 1970లో నాలుగు కొత్త హోమ్‌లని ప్రారంభించేరు. లండన్‌లో, జోర్డాన్‌లో, మరో రెండు వెనిజులాలో. ఆ తర్వాత వరస వరసగా అనేక హోమ్‌లని చకచకా స్థాపించేరు. న్యూయార్క్‌లోని బ్రాన్క్స్‌లో, బంగ్లాదేశ్‌లో, ఉత్తర ఐర్లండ్‌లో. గాజాస్ట్రిప్‌లో, ఎమెన్, ఎథియోపియా, సిసిలి, పాపువా, న్యూగినీ, ఫిలిప్పీన్స్, పనామా, జపాన్, పోర్చుగల్, బ్రెజిల్, బురుండీలలో వాటిని ప్రారంభించేరు. ఇంగ్లండ్, అమెరికాలలో అదనంగా హోమ్‌లని ప్రారంభించేరు. గత కొన్ని యేళ్లల్లోనూ సోవియట్ యూనియన్లో, దక్షిణ ఆఫ్రికాలో, తూర్పు యూరప్ అంతటా ఆవిడ మరెన్ని గృహాలు తెరిచేరు. అఖరికి యెంతో దైవప్రార్థన తర్వాత, ఆవిడ సొంతగడ్డ అల్బేనియా వంతు వచ్చింది.

యీ దేశాలన్నిటిలోనూ గృహాలు ప్రారంభించడం అంత సునాయాసంగా జరిగిన పని కాదు. ముఖ్యంగా పూర్వపు సోవియట్ యూనియన్‌లో మరీ కష్టం అయింది. తను యెన్నోసార్లు అప్పటి అధ్యక్షుడు గొర్బొచెవ్‌కి ఉత్తరాలు రాసినట్టు మదర్ థెరెసా నాతో అన్నారు. ఒక్క జవాబు కూడా రాలేదట. అయినా ఆవిడ పట్టువిడవలేదు. మెత్తగా గుర్తుచేస్తున్నట్టు ఆవిడ సెయింట్ మైఖేల్ దినంనాడు గొర్బచేవ్‌కి అభినందనపూర్వక టెలిగ్రామ్ పంపేరట. అలా అని నవ్వుతూ నాతో అన్నారు. అనుమతి వచ్చింది. ఆ సమయంలోనే ఒక విషాదసంఘటన జరిగింది. 1988 డిసెంబరు 7న అర్మేనియాలో ఒక భూకంపం సంభవించింది. దాంతో మదర్ థెరెసా సిస్టర్ల సహాయకబృందంతో, మందులూ, బట్టలూ, యితర సరుకులూ తీసుకుని బయల్దేరి వెళ్లారు. ఆ తర్వాత అన్నీ సవ్యంగానే జరిగేయి. యివాళ మునుపటి సోవియట్ యూనియన్‌లో పది హోమ్‌లు వున్నాయి.

దక్షిణాఫ్రికాలో యీ మిషన్ స్థాపనకు నేను ఉడతాభక్తిగా సాయం చేశాను. ఆ దేశంతో భారతదేశానికి అప్పట్లో దౌత్యసంబంధాలు లేవు. అంటే భారత ప్రభుత్వం యిచ్చిన దౌత్య పాస్‌పోర్ట్ వున్న మదర్ థెరెసా దక్షిణాఫ్రికాలో ప్రవేశించ లేరన్నమాట. తనకి వాటికన్ యిచ్చిన పాస్‌పోర్ట్ వుంది కాని తాను భారత పాస్‌పోర్టుతోనే విధాయకంగా ప్రయాణం చేస్తానని ఆవిడ నాతో అన్నారు. దానితో తను దక్షిణ ఆఫ్రికా వెళ్ల లేక పోయినట్లయితే అసలు వెళ్లనే వెళ్లనని ఆవిడ అన్నారు. అంతేకాదు, ఆరుగురు సిస్టర్లనీ వెనక్కి పిలిపించా లన్నమాట. వాళ్లు నైరోబిలో దక్షిణ ఆఫ్రికా వెళ్లడానికి అనుమతి కోసం నిరీక్షిస్తున్నారు. వాళ్లల్లో నలుగురు భారతీయులు. మదర్ థెరెసా కేబినెట్ సెక్రటరీ బి.జి.దేశ్‌ముఖ్‌ని ఢిల్లీలో కలుసుకునే యేర్పాటు

చేశాను. ఆయనతో ఆవిడ తన సమస్య గురెంచి చెప్పేరు. సివిల్ సర్వీస్ అధిపతిగా అయన కొన్ని గంటల్లోనే పరిష్కారం .చూశేరు. మదర్ థెరెసాకు డిప్లమేటిక్ పాస్‌పోర్ట్ బదులుగా నాన్–డిప్లమేటిక్ యిచ్చే యేర్పాటు అది. యిందులో యే దౌత్యపర సంబంధాల చిక్కూ లేకపోవడంతో దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం మదర్‌కీ, సిస్టర్లకీ వీసాలు జారీచేసింది. ఆవిడ ఢిల్లీకి తిరిగివచ్చేక కేప్‌టౌన్‌లో మొదటి గృహాన్ని ప్రారంభించేనని నాతో చెప్పారు.

LDM

MISSIONARIES OF CHARITY
64A ACHARYA J CHANDRA BOSE
CALCUTTA 700016, INDIA

10/8/90

Dear Mr. N. Chawla,
Thank you for your kind letter and the article you wrote. I hope it will be all for the glory of God and the Good of all who read it
I have just returned from Eastern Europe where I have opened a number of houses. In all these houses people are hungry for God. I hope the presence of our Sisters will help them. Let us pray.

God bless you
M. Teresa MC

1988లో వాటికన్‌లో ఒక హోమ్‌ని ప్రారంభించేరు. దాని వెనకో చిన్నకథ వుంది. అప్పటికే రోమ్ నగరంలో పనివాళ్ల ప్రాంతాల్లో మూడు హోమ్‌లు వున్నాయి. సెయింట్ పీటర్స్ నీడలో కూడా పేదలు వున్నారని, అంచేత వాటికన్‌లో నాలుగో హోమ్ ప్రారంభించవచ్చనీ మదర్ భావించేరు. యీ విషయం పోప్ జాన్‌పాల్ IIతో సంప్రదించేరు. ఆయన మహదానందంగా సరేనన్నారు. తర్వాత వాటికన్ వెళ్లినప్పుడు ఆవిడ పోప్‌కి యీ విషయం గుర్తుచేశారు. ఆవిడకు అనుకూలమైన చోటు యిచ్చే యేర్పాటు చెయ్య వలసిందని పోప్ సిబ్బందికి చెప్పేరు. అదంత సులభమా? యేమంటే, వాటికన్ సిటీయే చిన్నది, జనాభా యెక్కువ. మళ్లీ మదర్ రోమ్ వెళ్లేరు. అప్పటికి కొన్ని నెలలు గడిచి పోయేయి. యీలోపున పోప్ స్థలం కేటాయింపు విషయమై వాకబు చేస్తూ వున్నారు. ఆయనకు తెలుసు మదర్ మెత్తగా మళ్లీ గుర్తు చేస్తారని. "ఆవిడ వస్తే చాలు, గృహం విషయమే అడుగుతారు" అన్నారట ఆయన. ఆవిడ వరసగా నాలుగోసారి వెళ్లేటప్పటికి, వాటికన్ తయారుగా వుంది. పోప్‌కి తెలుసు ఆవిడ అడుగుతారని. అందుకని తాళం చెవి సిద్ధంగా వుంచమని చెప్పారట. ఆవిడ ఆయన ఆశీస్సులు పొందేరు. ఆవిడ నోరు తెరిచి అడిగే లోపునే పోప్ సరికొత్త యింటి తాళం అందించేరు. వాటికన్ ప్రాచీన నిర్మాణాల్లో దాన్ని ప్రత్యేకంగా నిర్మించేరు. ఆడియన్స్ హాల్‌కి అనుకునే వుంది. ఆవిడ పొంగిపోయేరు. "యిపుడు పేదలకు సరిగ్గా వాటికన్‌లోనే ఓ తావు వుంది, మన జనం (అంటే పేదలు) ఒక్కళ్లే టికెట్ కొనక్కర్లేకుండా వాటికన్‌లోకి వెళ్లగలవాళ్లు" అని ఆవిడ ఒకటికి రెండుసార్లు నాతో అన్నారు.

ఆ గృహం పేరు కాసదొనాడి మారియ. అందులో రెండు భోజనశాలలున్నాయి. ఒక్కోదాంట్లోనూ అరవైమంది భోజనం చెయ్యవచ్చు. వృద్ధస్త్రీల కోసం పడకల వసతులూ వున్నాయి. సాయంత్రం 4 నుంచీ రాత్రి భోజనాల కోసం వరుసగా నుంచుంటూ వుంటారు. సాయంత్రం 6 గంటలకు తలుపులు తెరుస్తారు. మొదట వచ్చిన వాళ్లకి మొదట వడ్డించే పద్ధతిలో వుంటుంది. యెవళ్లనీ తిండి లేక మాడనివ్వరు. సిస్టర్ భరోతి అన్న ఆమె ఆ బాధ్యతలు చూస్తూ వుంటారు. భోజనాన్ని వాళ్లు యేమన్నా కొంటారా అని అడిగేను. ఆమె నవ్వింది. "మేం యెప్పుడూ దేన్నీ కొనక్కర్లేదు. మొదట్లో భిక్షాటన చేసేవాళ్లం. కూరగాయల దుకాణాల దగ్గరా, చేపల బజార్లోనూ, మాంసం దుకాణాల దగ్గరా జోలె పట్టేవాళ్లం. యిప్పుడు వాళ్లే మాకు యిస్తున్నారు."

అక్కడ చాలామంది స్వచ్ఛంద సేవకులు వున్నారు. వాళ్లల్లో లూసియానా కూడా వుంది. ఆమెకి 52 యేళ్లుంటాయి. ఆవిడ కూతురు వెంటూరెల్లా. ఆమెకి పాతికేళ్లుంటాయి. "వంటగదిలో వాళ్లు కూరలు తరుగుతూ, కోస్తూ, కడుగుతూ వున్నారు." యింటి దగ్గర విసుగనిపించే పని యిక్కడ విసుగే అనిపించదు అందా కూతురు మరో స్వచ్ఛంద సేవకుడు రిక్కార్డో. ముప్పై అయిదేళ్లు వుంటాయి. వడ్డనలో సాయం చేస్తూ వుంటాడు. ఇటాలియన్ విమాన సర్వీసు ఎలిటాలియాలో ఫ్లైట్ అటెండెంట్‌గా పనిచేస్తూ వుంటాడు. మరా ఉద్యోగానికీ యీ పనికీ లంగరు యెలా కుదురుతుందని అడిగేను. "యివాళ డ్యూటీ చేస్తే రెండు మూ।డోజులు

మళ్ళీ ఖాళీ. అపుడు మళ్ళీ డ్యూటీ వుంటుంది. అంచేత యిక్కడ లాగించేస్తూ వుంటాను" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

ఓ రోజు మధ్యాహ్నం, చలిగా వుంది. నేను కాసదొనా డిమారియాలో వున్నాను. అప్పుడు వాకిలి గంట మోగింది. ఓ పదహారేళ్ళ కుర్రాడు చలికి వొణికిపోతూ గుమ్మం దగ్గర నుంచున్నాడు. వెచ్చదనం కలిగించే బట్టలేమీ వొంటి మీద లేవు, మారిషస్ నుంచి వొచ్చేట్ట. ఓ దుప్పటీయో, రగ్గో యివ్వగలరా అన్నాడు. అతను నుంచున్న చోట్లోనే యెవళ్ళో బట్టలున్న సంచీని పెట్టేరు. పైన తెల్లని జుబ్బా వుంది. సిస్టర్ దాన్ని చూపించి, వేసుకు చూడమంది. అది సరిగ్గా సరిపోయింది. అతను మహదానందపడిపోయేడు. సిస్టర్ భరోతి చిరునవ్వూ సరిగ్గా సరిపోయింది! యీ విషయం మదర్‌కి చెప్పేను. ఆవిడ ఔనన్నట్టు తలవూపేరు. "రోజులో అలా చాలాసార్లు జరుగుతుంది. అన్ని వేళలా అలానే జరుగుతుంది" అన్నారు.

సూప్ కిచెన్ విషయం మాట్లాడుతూ సుదూర దేశాల్లో యింత చురుగ్గా యెలా నిర్వహిస్తున్నారనీ, ప్రమాద రక్షణ కేంద్రాల్ని అప్పటికప్పుడు యెలా యేర్పాటు చెయ్యగలుగుతున్నారనీ మదర్ థెరెసాని అడిగేను. యీ ప్రశ్న ఆవిడ్ని ఉల్లాస పరచి నట్టుంది. "మాకు బోలెడు అనుభవం వుంది, యేమంటారు? గత ముప్పై ఆరేళ్లుగా మేం చేస్తూ వున్నపనే అది కదా" అన్నారు. యిద్దరం నవ్వుకున్నాం. "ఎప్పుడు యెక్కడ యేం జరిగినా మేం అక్కడ వుంటాం. యేం చెయ్యాలో మాకు తెలుసు. ప్రజల కేం కావాలో మాకు తెలుసు. దాన్ని చేస్తూ వుంటాం. వరదలప్పుడు సిస్టర్లు ఆహారం సేకరిస్తారు. దాన్ని అందించడానికి ప్రభుత్వం హెలికాప్టర్లు యిస్తుంది. సాయం చెయ్యడానికి చాలా సంస్థలు ముందుకొస్తాయి. ప్రజలు యిస్తారు. సాయం చేస్తారు. తలా ఒక చెయ్యి వేస్తే పని జరుగుతుంది. మాకు బోలెడు మంది సిస్టర్లు వున్నారు. అద్భుతమైన పని చేస్తారు" అంటూ చెప్పేరు.

అయినా యింత సులువుగా నిర్వహించే సొసైటీ శక్తిలో ఓ బలహీనత కూడా వుండచ్చన్న అభిప్రాయం లీలగా వుంది. యేమంటే– అధికారం యావత్తూ మదర్ థెరెసా చేతిలోనే కేంద్రీకృతం అయివుంది. అన్నీ తనే అజమాయిషీ చేస్తూ వుంటారా అని అడిగేను. ఆవిడ ఆచి తూచి జవాబు చెప్పేరు. "అబ్బే, మాకు చాలామంది సిస్టర్లు వున్నారు. ప్రతి హోమ్‌కీ ఒక సుపీరియర్ వుంది. కొన్ని హోమ్‌లని కలిపి ఒక రీజినల్ సుపీరియర్ వుంటుంది, ప్రతి రీజినల్ సుపీరియర్ ఒక ప్రావిన్స్‌కి బాధ్యత వహించాలి. ఉదాహరణకి పశ్చిమ యూరప్, అమెరికా అంటూ. ఆ పైన నలుగురు కౌన్సిలర్స్ – జనరల్ వుంటారు. మమ్మల్ని నడిపించడానికి చర్చి నియమాలు వున్నాయి. మాది ఒక మతసంస్థ కదా. ఆధ్యాత్మిక జీవితం యెలా గడపాలో మతాల్ని నిర్వహించే చర్చి నియమాలు వున్నాయి. ఆ నియమాలు లేకపోతే గజిబిజి గందరగోళం అయిపోతుంది. మేం పనిచేసే యే దేశమన్నా వెళ్లి చూడండి, యిదే మీకు సరిగ్గా కనిపిస్తుంది. సిస్టర్లు నేల మీదే కూర్చోవడం అదే పేదరికం, సాదా భోజనం లాంటివే వుంటాయి. మదర్ థెరెసా అన్ని హోమ్‌లలోనూ ఒకేసారి వుండలేరు కదా. దేవుని సేవ సక్రమంగా జరగాలి. డబ్బు కోసం మనుషులు పని చేస్తే మేం భగవంతుని మీద భక్తితో యెందుకు చెయ్యలేం?"

మదర్ థెరెసా తదనంతరం మిషనరీస్ ఆఫ్ ఛారిటీ భవిష్యత్ యెలా వుంటుందోనని జనం ఆతృతగా వున్నారు. అది తెలిసే నేను బెరుకుగా ఆవిడను యీ విషయం అడిగేను. ఆవిడ వేలు యెత్తి పైకి చూపించేరు. "నేను వెళ్లిపోయేదాకా ఆగండి" అన్నారు. తర్వాత మరింత గంభీరంగా, "మేం పేదరికంలోనే ముడివేసుకుపోయి వుంటే, తెలియకుండానే ధనవంతుల సేవలో తేలకపోతే అన్నీ సవ్యంగానే వుంటాయి" అన్నారు

యీ మత సంస్థకు వివరమైన ప్రణాళిక వుంది. నియమాలు వున్నాయి. ప్రతి విషయానికి సంబంధించీ వున్నాయి. యివి, సుపీరియర్ జనరల్ హోదాకి ఎన్నికతో సహా. కౌన్సిలర్స్ జనరల్‌కీనీ. మా సంస్థలో కడపటి అధికారం జనరల్ ఛాప్టర్‌దే. ప్రతి ఆరేళ్లకీ ఒకసారి జనరల్ ఛాప్టర్ సుపీరియర్ జనరల్‌ని ఎన్నుకుంటుంది. నలుగురి కౌన్సిలర్స్, జనరల్‌నీ ఎన్నుకుంటుంది. అందులో వందమంది సభ్యులుంటారు. అందరు రీజినల్ సుపీరియర్స్, అనేక ప్రాంతా ప్రతినిధులూ వుంటారు. 1967 నుంచీ యీ జనరల్ ఛాప్టర్ ఆరేళ్లకోసారి సమావేశం అవుతూనే వుంది. కిందటిసారి అయిదేళ్ల తర్వాతనే, రోమ్ నుంచి ప్రత్యేక అనుమతి పొంది సమావేశం అయింది. రహస్య ఓటింగ్ ద్వారా ఎన్నికలు జరుగుతాయి. పూర్తి మెజారిటీ వుండి తీరాలి.

మదర్ థెరెసా ఒకటి రెండుసార్లు పదవినుంచి తప్పుకుందామనుకున్నారట. ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ చెప్పేరు. మొదటిసారి 1973లో. అప్పటికి ఆవిడ వయసు 63. రెండవసారి 1979లో జనరల్ ఛాప్టర్ సమావేశం అయినప్పుడు. "నేను వృద్ధురాల్ని అయేను. అలసటగానూ వుంటోంది. పనిభారం నిర్వహించడం కష్టమవుతుంది. మరో పడుచు సిస్టర్ రావడం మంచిది" అని చెప్పేరట. 1983లో ఆవిడకు పెద్ద జబ్బు చేసింది. వయసేమో 72. ఆవిడ రోమ్ నగర సందర్శనలో వుండగా, మొదటిసారి అలా జబ్బు చేసింది. ఓ రోజు రాత్రి మంచం మీద నుంచి కిందికి పడిపోయేరట. "అదృష్టవశాత్తూ అది ఎమ్.సి (మిషనరీస్ ఆఫ్ ఛారిటీ) మంచం. అంచేత దూరం పడలేదు" అన్నారు పరిహాసోక్తితో. డొక్కలో నొప్పి వచ్చిందట. ఏ యెముకన్నా విరిగిందేమో తెలీదు. వైద్య పరీక్షలు చేయించు కుందా మనుకున్నారు. వైద్య పరీక్షలో యెముకలు విరగడం అదీ యేమీ లేదు గాని, గుండెకి సంబంధించిన సమస్యలేవో తేలాయి. వెంటనే హాస్పిటల్ చేర్చేరు. "నేను హాస్పిటల్‌కి వెళ్లడం మంచిది అయిందట, వాళ్లన్నారు. లేకపోతే పెద్ద హార్ట్ ఎటాక్ వచ్చేదట." ఆవిడలా మొదట హాస్పిటల్ చేరడం – తర్వాత మరిన్నిసార్లు జరిగిందనుకోండి – ప్రపంచవ్యాప్తంగా ఆందోళన కలిగించింది. సాల్వేటర్ ముండి హాస్పిటల్‌కి కుప్పలు తెప్పలుగా ఉత్తరాలు వచ్చిపడ్డాయి. టెలిగ్రామ్‌లు వచ్చేయి. భారతదేశ అధ్యక్షుడు, అమెరికా సంయుక్తరాష్ట్రాల అధ్యక్షుడు, ఆవిడ మిత్రుడు జ్యోతిబసు (పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి) టెలిగ్రామ్‌లు పంపించేరు. బెల్జియం రాజు, రాణి ప్రత్యేకం ఆవిడ్ని చూడ్డానికి రోమ్ వెళ్లేరు. కాశ్మీర్ నుంచి ఒకతను రాసిన ఉత్తరం మనసు కదిలించేదిగా వుందని ఆవిడ గుర్తు చేసుకున్నారు. అతను హిందువు. అందుకని మదర్ థెరెసాకు ఆరోగ్యం ప్రసాదించమని ఈ కాళీమాతకు పూజలు చేస్తూ వున్నాడట. ఆవిడ అనారోగ్యాన్ని తనకు యిచ్చి, ఆవిడకు ఆరోగ్యం కలిగించమని ప్రార్థించేడట.

1989 డిసెంబర్లో అవిడకు తల తిరిగింది. సిస్టర్ పక్కనే వుండడంతో ఆమె మీద ఆనుకోబట్టి సరిపోయింది గాని లేకపోతే మదర్ హౌస్ మెట్లమీద నుంచి పడిపోయేవారే. అంతకు ముందు కొన్నేళ్లనాడు అమర్చిన పేస్‌మేకర్ని మార్చవలసి వచ్చింది. కలకత్తాలో హాస్పిటల్‌కి వెళ్లి అవిడ్ని చూశాను. వాడి, సొమ్మసిల్లిపోయినట్టు కనిపించేరు. చాలా ఆందోళనకారకమైన దీర్ఘదశ గడిచేక ఆవిడ తిరిగి కోలుకున్నారు. అప్పుడే ఆవిడ రోమ్‌కు ఉత్తరం రాశేరు. నియమావళిని అనుసరించి, యింకా ఒక ఏడాది వుండగానే ముందే జనరల్ ఛాప్టర్ సమావేశానికి అనుమతి యివ్వవలసిందిగా 'హోలీ సీ' (Holy see)ని అర్థించేరు. తన వారసుల్ని ఎన్నుకుందుకు వీలవుతుంది. వాటికన్ మదర్ థెరెసా అభ్యర్ధనను మన్నించింది. ఆవిడ పదవి త్యజించడానికీ అనుమతి యిచ్చింది. 1990 సెప్టెంబరు మొదటివారంలో జనరల్ ఛాప్టర్ సమావేశమైంది.

యిప్పుడు సిస్టర్లు, వాళ్లల్లో బాగా సీనియర్లుగా వున్నవాళ్లు కూడా అలాంటి మార్పు కుదరదని వ్యతిరేకించేరు. ఎన్నిక ముందు ఓ వారం విశ్రాంతినిస్తారు. ఆ సమయంలో యిద్దరు సీనియర్ సిస్టర్లు తనని కలుసుకున్నారట. వాళ్లు సిస్టర్ ఆగ్నెస్, సిస్టర్ నిర్మల అని ఫాదర్ వాన్‌ఎగ్జెమ్ నాతో అన్నారు. మదర్ థెరెసాకు అనుకూలంగా వోటు వెయ్యరాదని వాటికన్ ప్రత్యేకంగా యేమన్నా చెప్పిందా అని వాళ్లు అడిగేరు. "ఆవిడ దిగిపోవడానికి రోమ్ అనుమతించిందని మాత్రం నాకు తెలుసు. మదర్‌కి వోటు వెయ్యకూడదని సిస్టర్లకి యే హుకుమ్‌నీ వాటికన్ యిచ్చినట్టు లేదు." వాళ్లు వెళ్లి సిస్టర్లకి యీ సంగతి చెప్పేరు. ఫలితం యేమిటయ్యా అంటే మదర్ థెరెసా ఏకగ్రీవ ఎన్నిక. ఆ ఫలితం మదర్ థెరెసాకు సంతోషం కలిగించలేదు అని నాకు తెలుసు. అక్కడ్నే యీడ్చుకుంటూ వుండాలని ఆవిడ అనుకోవడం లేదు. "సేవ చేయించుకోవడం కంటే సేవ చెయ్యడం మంచిది" అని నాకు రాశేరు. కాని, మిగిలిన అన్నిటి మాదిరిగానే, దీన్ని ఆవిడ అంగీకరించేరు.

"నేను విముక్తురాల్ని అవుదా మనుకున్నాను. కాని దైవ సంకల్పం మరొకలా వుంది" అని ఎన్నికను ఉద్దేశించి ఓ రోజున ఆవిడ నాతో అన్నారు. ఒకవేలిని పైకి ఆకాశం కేసి యెత్తి చూపించేరు. "యిది ఆయన పనే, నాది కాదు. ఆయనకు ముడి వేసుకుని వున్నంతకాలం, పేదరికానికి కట్టుబడి వున్నంతకాలం యీ సేవ ముందుకు సాగుతుంది. నేను నిమిత్తమాత్రురాలిని."

* * *

# 7 బ్రదర్స్ సహకార్యకర్తలు

కలకత్తాలోని హౌరా రైల్వేస్టేషన్లో ఓ రోజు రాత్రి పోలీసులు కొంతమంది కుర్రాళ్లని పట్టుకున్నారు. వాళ్లంతా కరడు గట్టిన నేరస్థులు. వాళ్లల్లో జేబుదొంగలు, తాగుబోతులు, తార్పుడుగాళ్లు, మాదకద్రవ్యాలను అమ్మేవాళ్లు, యింకా చిన్నాచితకా నేరాలు చేసేవాళ్లు వున్నారు. హడావుడి యేమీ చెయ్యకుండా వాళ్లని పోలీసుస్టేషన్ కి తీసికెళ్లి కొట్లో పడేశారు. ఆ మర్నాడు మేజిస్ట్రేట్ ముందు హాజరుపరుస్తారు. వాళ్లల్లో ఓ యువ బ్రదర్ (క్రైస్తవ సన్యాసి) కూడా వున్నాడు. తను యెవరైందీ చెప్పబోయేడు కాని అతని మాట ఆ గందరగోళంలో అరుపుల్లో, నిర్దోషులమన్న కేకల్లో మణిగిపోయింది. అతన్నీ కొట్లో తోసేశారు. రాత్రి ఉక్క. ఒకటే చెమటలు. దోమలు సరేసరి. యిక ఎలకలు కరవడం అన్నిటికంటే అధ్వాన్నం. పక్కనున్న ఖైదీలు యెత్తిపొడవడం. "భాయ్, బ్రదర్! నిన్ను నువ్వు చూసుకోలేవు కాని మాకు సాయంచేస్తావ్! యెక్కడ వున్నాడు నీ దేవుడు?" అంటూ దెప్పడం. అతనేం అంటాడు? కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. మోకాళ్లమీద వాలి తనకెందుకలా అవమానం భరించాల్సి వచ్చింది అని మొత్తుకున్నాడు. అది తను మొయ్య వలసిన శిలువా?

ఆ ప్రీస్ట్ మిషనరీ బ్రదర్ ఆఫ్ ఛారిటీ వాడు. కొత్తగా మఠంలో చేరేడు. వందలాది పోకిరీ కుర్రాళ్లని, అనాధ పిల్లల్ని బాగుచెయ్యడం అతని విధుల్లో భాగం. ఆ బాపతు వాళ్లందరికీ హౌరా, సీయాల్దా స్టేషన్లో మకాం. మూటలు మోసీ, బూట్లు పాలిష్ చేసీ, ఉత్తరాలు, వార్తలూ చేరవేసీ వాళ్ళు పొట్ట పోసుకుంటున్నారు. వాళ్ల గురించి అతను తెలుసుకున్నాడు. తనూ పడుచువాడే. దారుఢ్యంగానూ వున్నాడు. అంచేత వాళ్లకి దగ్గర్లోనే వున్న ఓ మైదానంలో ఫుట్ బాల్ ఆటలు ఆడించేవాడు. యీ ఆదివారం ఆటవిడుపులు యెవళ్లకి యెక్కువ వినోదం కలిగించేయో చెప్పడం కష్టం. అతను దగ్గర్లో వున్న మురికివాడల్లో పనిచేస్తూ వుండడం వల్ల చిన్నా చితకా నేరాలు చేసేవాళ్లూ అతనికి తగిలేవాళ్లు. ఆ నేరస్థులకి దగ్గర్లో వున్న రైల్వేస్టేషన్ కార్యస్థానం. యేదన్నా పని నేర్చుకొని బతకమని, నేరాలు చెయ్యద్దని వాళ్లని బాగుచెయ్యడానికి అతను తంటాలు పడేవాడు.

ఆ తుంటరివాళ్లే అతన్నా రాత్రి యెద్దేవాచేసి అవమానపరచినవాళ్లు. అతని జన్మలో ఆ రాత్రి జరిగిన అవమానాన్ని మర్చిపోలేడు. అతను గనక సన్యాసి

వేషంలో వుండి వుంటే యిలాంటి పరిస్థితి దాపురించి వుండేది కాదు. అదీగాక, మఠంలో వుండే సిస్టర్లులాగా యీ బ్రదర్స్‌కి ప్రత్యేకరకం బట్టలు లేవు. అంచేత ఓ మందలోనో, గుంపులోనో వున్నప్పుడు ఫలానా అని గుర్తించడం కష్టం. భారతదేశంలో మామూలుగా వేసుకునే పంట్లాం చొక్కా వేసుకోవడంతో వాళ్లు మదర్ థెరెసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి చెందిన వాళ్లని గుర్తించనే గుర్తించలేరు. యెదురెదురుగా వాళ్లు తగిలినప్పుడే వాళ్ల చొక్కాకి వున్న చిన్న శిలువ కనిపిస్తుంది. మామూలుగా భారతదేశంలో చాలామంది ప్రీస్ట్‌లు నల్ల ఉడుపులు వేసుకుని కనిపిస్తారు. చేతిలో జపమాలో, శిలువో వున్నంత మాత్రాన వాళ్లు సన్యాసులనీ లేకపోతే మిషనరీ పనిలో వున్నారనీ గుర్తించడం కష్టం.

మదర్ థెరెసాకీ, బ్రదర్ ఆండ్రూకీ మధ్య యిలా ప్రత్యేక వేషధారణ గురించి అభిప్రాయ భేదాలున్నాయన్న విషయం అంతగా నలుగురికీ తెలీదు. బ్రదర్ ఆండ్రూ మొదటి జనరల్ సర్వెంట్ (లేకపోతే సుపీరియర్ జనరల్) బ్రదర్స్ శాఖకు సంబంధించి. 1986లో బ్రదర్ ఆండ్రూ మఠం నుంచి రిటైర్ అయేడు. "బ్రదర్స్ మతవేషంలో వుండాలంటారు మదర్. చాలామంది బ్రదర్స్ కూడా అదే అభిప్రాయం వుంది. దానివల్ల కొంత హోదా వస్తుందికదా. నేననుకున్నదేమంటే మతవేషం లేకుండా వుంటే మనల్ని పేదసాదలు తమలో మనిషిగా భావించుకుంటారని. చొక్కా మీద శిలువ గుర్తు చాలు, సాదాగా వుంటుంది" అని ఓసారి నాతో అన్నారు. అయితే ఆడవాళ్లు ప్రత్యేకవేషంతో వుండవచ్చని ఆయన అభిప్రాయం. యేమంటే దానివల్ల వాళ్లకి రక్షణ వుంటుంది. ప్రత్యేక గుర్తింపు లేకపోతే బ్రదర్స్ అడపాదడపా కొన్ని అవమానాలు భరించాల్సి వస్తుందికదా అని నేనన్నాను. "అవచ్చు" అన్నాడు బ్రదర్ ఆండ్రూ. కొన్ని నెలల తర్వాత మదర్ థెరెసా కూడా యిదే తరహాలో అన్నారు. "యీ పడుచు బ్రదర్‌కి ఆ అవమానం ఒక్కరాత్రితోనే సరిపోయింది. ప్రతి రాత్రీ అలా అవమానాలు భరించేవాళ్లు మన పేదల్లో యెంతమంది వున్నారో" అన్నారావిడ. ఆవిడ కళ్లనిండా విచారం నిండింది.

యీ యువ బ్రదర్ సంఘటన గురించి నేను బ్రదర్ ఆండ్రూకి చెప్పలేదు. అయితే వేషధారణ విషయం అంత ముఖ్యమైందేనా అని అడిగేను. "బహుశా నేనే యీ విషయంలో పొరపాటు కావచ్చు. బ్రదర్స్‌కి ప్రత్యేక తరహా వేషం వుండాలని మదర్ థెరెసా అంటారు. ముందు ముందు యీ నియమాన్ని మారుస్తారేమో" అని కొంచెంసేపు ఆలోచించి అన్నాడాయన.

బ్రదర్స్ శాఖను 1963లో ప్రారంభించేరు. మగాళ్లు కొన్ని రకాల పనులకు బాగా సరిపోతారన్న అభిప్రాయం కలగడం వల్ల ఆ శాఖను స్థాపించేరు. యెప్పటిలాగానే, యీ విషయానికి సంబంధించీ మదర్ థెరెసా ఫాదర్ వాన్ఎక్సెమ్ సలహా అడిగేరు. అప్పుడాయన అసన్‌సోల్ ప్రాంత ప్రీస్ట్‌గా వున్నారు. 1961లో ఓ రోజున మదర్ థెరెసా అనుకోకుండా ఆయన్ని చూడ్డానికి వెళ్లేరు. శిశుభవన్‌లో మగపిల్లలు యెదుగుతున్నారనీ, వాళ్లని సంరక్షించడం సిస్టర్లకి యిబ్బంది కావచ్చనీ ఆయనతో అన్నారు. అదీగాక కాళీఘాట్‌లోనూ, కుష్ఠురోగులసేవలోనూ బరువైన పనులు వుంటాయి. మగవాళ్లయితే ఆ పన్లని బాగా చెయ్యగలరు. అందుకని బ్రదర్స్ శాఖను

ప్రారంభిస్తే బాగుంటుంది. ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ యిందుకు సంబంధించి ఆర్చ్‌బిషప్‌ని అనుమతి అడగ్గలరా? ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ యీ ఆలోచన భేషుగ్గా వుందని పించింది. యీ విషయం గురించి ఆర్చ్‌బిషప్ ఆల్బర్ట్ విన్సెంట్‌తో సంప్రదించడానికి కలకత్తా వెళ్లేరు. "యీ కొత్త ఆర్చ్‌బిషప్ ఆర్చ్‌బిషప్ పెరియర్ లాంటి మనిషి కాదు. ఆయనైతే కొత్త ఆలోచనల్ని కాదు పొమ్మనేసేవాడు. (తెలుసుకిదా ఆయన యెలాంటి ప్రశ్నలు అడిగేవాడో? 'యిది దైవసంకల్పం అని మీకెలా తెలుసు' లాంటివి.) మదర్ థెరెసా ఆలోచన యేమిటైంది ఆయనకు చెప్పేను. ఓక్షణంపాటు - చాలా దీర్ఘ క్షణమే నిజంగా! - ఆయనేమీ మాట్లాడలేదు. "భారతదేశంలో ఓ ఫాదర్, ఓ సిస్టర్ చేసే పనులు యేమిటో బోధపడింది. కాని బ్రదర్స్ కావాలి. అలాగే కానిమ్మని మదర్ థెరెసాకు చెప్పండి" అన్నాడు. అయిదు నిముషాల్లో వ్యవహారం తేలిపోయింది."

మదర్ థెరెసా సంతోషపడ్డారు. యెంత త్వరగా వీలైతే అంత త్వరగా సరైన యువకుల్ని కొందర్ని పంపించమని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్‌తో చెప్పేరు. అసన్‌సోల్‌కి తిరిగి వెళ్లిన కొంత కాలానికే ఆయన అరడజను మంది కుర్రాళ్లని యీ పని నిమిత్తం కలకత్తా పంపించేరు. వాళ్లు దృఢగాత్రులు. వాళ్లని శిశుభవన్‌లోనే యెక్కడో వుండమన్నారు ఆ చిన్నపిల్లలతో, అని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ నవ్వేడు. "ఆ తర్వాత, సిస్టర్ గెర్ట్రూడ్ (డాక్టర్) వాళ్లకి వడ్రంగం శిక్షణ యిచ్చింది. ఆమెకు చాలా విషయాలు తెలుసు. వడ్రంగం పనీ కొంతవచ్చు. భలే తమాషాగా వుందిలెండి" ఆ సంగతులు గుర్తు చేసుకుని ఆయన యెంతలా నవ్వేడంటే వెక్కిళ్లు వచ్చేయి. మళ్లీ మాట మొదలెట్టడానికి ముందు ఓ గ్లాసు మంచినీళ్లు తాగేడు. "అప్పుడు మదర్ థెరెసా అన్నారు "చూశారా ఫాదర్? వాళ్లు మగాళ్లు. వ్యాయామం అవసరం, ప్రతిరోజూ సాయంత్రం వాలీబాల్ ఆడమని చెప్పాను." చిన్న విగ్రహం.మదర్ థెరెసా బలిష్టులైన మగవాళ్లని వాలీబాల్ ఆటకు తీసుకువెళ్లే వూహాచిత్రంగా కనిపించి. మేం పగలబడి నవ్వుకున్నాం. ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ మరోగ్లాసు నీళ్లు తాగాల్సి వచ్చింది.

ఆ మఠాన్ని సరిగ్గా నడిపించే దారిలో పెట్టడానికి కొన్ని అవాంతరాలు యెదురయేయి. అది గుర్తింపు పొందిన సంస్థ అయేదాకా మగాళ్లు చేరడానికి సుముఖత చూపించలేదు. యిక రోమ్ నుంచి గుర్తింపు రావాలీ అంటే మందీ యెక్కువ వుండాలి, నిర్వహణా సక్రమంగా వుండాలి. మరో చిక్కూ వచ్చింది. మగవాళ్ల సంస్థకు ఆడమనిషి అధిపతిగా వుండడానికి రోమన్ కాథలిక్ చర్చి ఒప్పుకోదు. యివన్నీ సర్దుకోవడానికి యింకో యేడాది పట్టింది. అప్పుడు మదర్ థెరెసా తనకి తెలిసిన ఒక యుగోస్లావ్ జెసూట్‌ని సాయం చెయ్యమని పిలిచేరు. ఆయన పేరు ఫాదర్ గాబ్రిక్. అయితే జెసూట్‌ల మఠం ఆయన్ని పంపించడానికి యిష్టపడలేదు. అప్పుడావిడ ఫ్రెంచి ప్రీస్ట్ ఫాదర్ వాన్ ఆతోయిసే సాయం అర్థించేరు. ఆయన తన మఠం వదలి రావడానికి ఒప్పుకోకపోయి వుండవచ్చు. అప్పుడో యువకుడు ముందుకు వచ్చేడు. అతను వెల్సియన్ షిప్ శిక్షణలో వున్నాడు. మదర్ థెరెసా అతన్ని అంతకుముందు ఎరగరు. అతన్ని పంపడానికి జెసూట్ మఠం ఒప్పుకుంది. అతను జన్మతః ఆస్ట్రేలియన్. పేరు ఇయాన్ ట్రావెర్స్ బాల్. మఠనామం బ్రదర్ ఆండ్రూ.

అతను ఆరడుగుల ఎత్తరి. ఆకర్షణీయంగా వుండే విగ్రహం. బాగా మాట్లాడగలడు. అయితే, యేనదురూ బెదురూ వుండదు. "యువ జెసూట్‌గా భారతదేశానికి 1954లో వచ్చేను. బీహార్ హజారీబాగ్ బొగ్గు గనుల ప్రాంతంలో పని చేసేటప్పుడు పేదలంటే ఆసక్తి కలిగింది. నా శిక్షణలో భాగంగా మదర్ థెరెసాతో పనిచెయ్యాలనిపించింది. అది నా భవిష్యత్ కార్యక్రమానికి ఉపకరిస్తుంది. ఆవిడ దగ్గర కొంతమంది యువకులు వున్నారు. వాళ్లకి ఆవిడ శిక్షణ యిచ్చేవారు. ఆ శాఖను నడిపించేందుకు ఆవిడకు మనిషి అవసరం అయేడు. కాకతాళీయంగా నేను వచ్చి పడ్డాను" అని చెప్పేడు. అప్పటికి అతని వయసు ముప్పైయెనిమిదేళ్లు.

"7, మానసతల రో"లో బ్రదర్ ఆంబ్రూతో ఓ రోజు సాయంత్రం గడిపేను. అది మురికివీధిలో వున్న చిన్న యిల్లు. అదే బ్రదర్స్ శాఖ కేంద్ర కార్యాలయం. ఆ వీధిలో యెంత గోల, పకపకలు వికవికలు వున్నాయో చెప్పలేం. చప్పట్లొకటి. ఆటవిడుపు సమయం అని చెప్పాడతను. బ్రదర్స్ కులాసాగా వున్నారు. ఆ శాఖ పుట్టుపూర్వోత్తరాల గురించి చెప్పేడు. "ఒక స్వతంత్ర సంస్థగా ఎదగాలీ అంటే శిశుభవన్‌నుంచి వచ్చేయ్యాలి అనుకున్నాం. అది నా పురుష దురహంకారమో, జెసూట్ శిక్షణ ప్రభావమో చెప్పలేను. బ్రదర్స్ తమ నాయకత్వాన్ని, తమ పద్ధతిలో తయారుచేసుకోవాలి అనిపించింది. మదర్ థెరెసా మాకు ప్రోత్సాహాన్ని, సాయాన్ని అందిస్తారు. కాని మేం మాకుగా పనిచెయ్యాలి. మదర్ మనస్ఫూర్తిగా ఒప్పుకున్నారు.

"యీ యింటికి ముందు కిడ్డర్‌పూర్‌లో ఓ వాటాకి అద్దెకు తీసుకున్నాం. మదర్ దీన్ని కొని పెట్టేరు. యిక్కడికి మారినప్పుడు మేం పదిహేను మందిమి వున్నాం. మగాళ్లు బతికే పద్ధతులకీ ఆడవాళ్ల పద్ధతులకీ తేడా వుంటుంది. మాటకు ఒకళ్లపైన ఒకళ్లం బెర్తుల్లో మేం వుండలేం కదా. మగాళ్లం షికారు పోవాలి, ఓ ఫుట్‌బాల్ ఆట ఆడుకోవాలి, కొంచెం మల్లయుద్ధం చూడాలి. సిస్టర్లు పనికి తప్ప బయటకు వెళ్లరు. యిక యింట్లో పనులూ వాళ్లకీ మాకూ ఒకలా వుండవు. ప్రతీదీ పరిశీలనగా మేం చూడం కదా" అన్నాడు ప్రత్యేకించి.

ప్రస్తుతం జనరల్ సర్వెంట్‌గా బ్రదర్ గోయెఫ్ వున్నారు. ముఖ్య విషయాలకి సంబంధించి తేడాగా వుండకపోయినా, వాళ్ల పని స్వభావాన్నిబట్టి మరింత తక్కువ కాఠిన్యం వుండాలి. మరింత వెల్లడిగా వుండాలి, ముఖ్యంగా బయటివాళ్లతో, సందర్శకులతో. ఆదినుంచీ వాళ్ల దారే వేరుగా వుంది. సిస్టర్ల మాదిరి కాదు. వాళ్లంత రక్షణ వుండదు. బ్రదర్స్ స్థానిక, సాంస్కృతిక పరిస్థితులకు తగ్గట్టు నడుచుకోవాలి. ఒకే దేశంలో ప్రాంతాల్ని బట్టి చాలా తేడాగా వుండచ్చునా పరిస్థితులు. వాళ్ల బృందాలూ చిన్నవిగానే వుంటాయి. ఒక హోమ్‌లోనూ వున్న బ్రదర్స్ సంఖ్య తక్కువే. భారతదేశం బయట వాళ్లు ఉపయోగించే భాషా తప్పనిసరిగా ఇంగ్లీష్ అవనక్కర్లేదు. ఇంగ్లీషుని విస్తారంగా వాడుతూ వున్నా వాళ్ల కార్యకలాపాలు శిశుభవన్‌లోనే మొదలయేయని ఫాదర్ వాన్‌ఎగ్జిమ్ చేసిన వ్యాఖ్యకు జవాబుగానా అన్నట్టు, చివర్లో బ్రదర్ గోయెఫ్ అన్నాడు. తాము శిశువులతో యెంత మాత్రమూ పనిచెయ్యడంలేదని.

బ్రదర్స్ మొదట పనిచేసిన తావుల్లో హౌరా రైల్వేస్టేషన్ ఒకటి. గుహలాంటి దాని కప్పుకింద అక్షరాలా వందలాది మంది కుర్రాళ్లు, యువకులు బతికేస్తూ

వుంటారు. చాలామంది అనాధలు. కొందరు యిళ్లనుంచి పారిపోయి వచ్చినవాళ్లు. కొంతమంది మొదటి నేరాలకిగాను శిక్ష పడకుండా తప్పించుకున్నవాళ్లు. చాలామంది అంటువ్యాధిగ్రస్తులు, రోగులు. బ్రదర్స్ వాళ్లకి చిన్నగా సాయం చెయ్యడం మొదలుపెట్టేరు. కొంతమందికి వైద్యసాయం అత్యవసరం. బ్రదర్స్ వాళ్లకి శుభ్రంగా స్నానం చేసేటందుకు సబ్బు బిళ్లలు యిచ్చేరు. క్రమేణా ఆ స్టేషన్ పిల్లలకు రాత్రిపూట భోజనాలు యేర్పాటు చేశారు– ఒక్కపూటేనా కడుపునిండా మంచి తిండి తింటారని. కొంతమంది పిల్లలకు మానసతాలలో తాత్కాలికంగా మకాం యిచ్చేరు. వృత్తిశిక్షణ యిచ్చేదాకా అక్కడ వుంచుకున్నారు. శిశుభవన్‌లోని పిల్లలతో బాటుగా వీళ్లనీ కలకత్తాలోనూ సమీపంలోనూ యేర్పాటు చేసిన యితర గృహాలకి పంపించేవాళ్లు.

ఆ గృహాల్లో మొదటిది నిలువ నీడ లేనివాళ్లకి, వికలాంగులైన పిల్లవాళ్లకీ ఉద్దేశించింది. దాన్ని "నవజీవన్" (కొత్తజీవితం) అని పిలిచేరు. దాన్ని హౌరాలో ప్రారంభించేరు. యేదోరకం శిక్షణను యివ్వవలసి వచ్చింది. అందుకని మొదటగా డమ్–డమ్‌లో ఒక రేడియో రిపేరింగ్ షాపును ప్రారంభించేరు. ఆ పని నేర్చుకుంటే యెక్కడో ఓ చోట ఓ చిన్న ఉద్యోగం రాకపోదు. మానసికరోగగ్రస్తులైన పిల్లలకీ క్షయవ్యాధిగ్రస్తులైన మగవాళ్ళకీ ఉద్దేశించి బ్రదర్లు నూర్‌పూర్‌లో ఓ క్షేత్రం సంపాదించేరు. అది కలకత్తాకు యిరవై మైళ్ల దూరంలో వుంది. యిక్కడ కొంతమంది మామూలు వ్యవసాయం పన్లు చేసేవాళ్లు.

బ్రదర్లు కుష్ఠువ్యాధిగ్రస్తుల సేవనూ చేశారు. మొదట్లో మొబైల్ డిస్పెన్సరీలలో సాయం చేశారు. తర్వాత క్రమం తప్పకుండా ధాపా వెళ్లేవారు. అదే కలకత్తాలో వున్న అతి పెద్ద కుష్ఠువ్యాధి కేంద్రం. రోగులకు అక్కడ చికిత్స చేసేవారు. యెంతోకాలం అవకుండానే టిటాఘర్‌లో సిస్టర్లకు సాయపడ్డారు. రైల్వే లైన్ల వెనక్కాల కాలనీలలో వున్న కుష్ఠువ్యాధి కేంద్రాలలో వుండే సమస్యలతో సిస్టర్లు తలపడలేరు. కొద్దిరోజుల్లోనే బ్రదర్లు యావత్తు పనినీ భుజం మీద వేసుకున్నారు.

భారతదేశంలో బ్రదర్లశాఖ పుట్టిన పదేళ్లకు బ్రదర్ ఆంద్రూ మొదటి విదేశీ శాఖను స్థాపించేరు. యుద్ధశిథిలమైన వియత్నాంలో. అక్కడ సిస్టర్లు పనిచెయ్యడం లేదు. విదేశాలలో సిస్టర్లు పనిచెయ్యని చోటుల్లోనే బ్రదర్లు తమ కార్యకలాపాలు సాగించేవాళ్లు. ఓ చిన్న యింటిని అద్దెకు తీసుకునేవాళ్లు. మొదట్లో వాటిల్లో కొద్దిమందే వుండేవాళ్లు, యుద్ధంవల్ల అనాథలైన పిల్లలతో సహా. రెండేళ్ల తర్వాత రెండోగృహాన్ని తెరిచేరు. అది లాస్‌ఏంజెల్స్‌లో, కాలిఫోర్నియా. "స్కిడ్–రో" అనే పేరుబడ్డ మెక్సికన్–అమెరికన్ పరిసరప్రాంతం అది. రోగగ్రస్తులమయం, నేరగాళ్లమయం. తాగుబోతుల కోసమూ, మాదకద్రవ్యాలకి అలవాటుపడ్డ వాళ్ల కోసం చిన్న హోమ్ తెరిచేరు.

క్రమేపీ బ్రదర్ ఆంద్రూ వాళ్లని ప్రతి ఖండంలోనూ వున్న అశాంతి ప్రాంతాలకు తీసుకువెళ్లేడు. హాంకాంగ్, జపాన్, తైవాన్, కొరియా, గౌతమాలా, ఫిలిప్పీన్స్, ఎల్‌సాల్వడార్, డొమినికన్ రిపబ్లిక్, హైతి, బ్రెజిల్, మడగాస్కర్, ఫ్రాన్స్‌కి కూడా యీ శాఖలు విస్తరించేయి. యీ ప్రాంతాల్లో కొన్నింటిలో చిటికెవేస్తే భగ్గుమనే

పరిస్థితులు వుండేవి. ఓ సారి ఎల్ సాల్వడార్లో అయితే ఓ బ్రదర్ ని అపహరించుకు పోయేరు. అప్పుడు ఎల్ సాల్వడార్ ఆర్చ్‌బిషప్ జోక్యం చేసుకోవాల్సి వచ్చింది. పాపం, ఆయన్నే కొన్ని నెలల తర్వాత తీవ్రంగా గాయపరిచేరు.

బ్రదర్లు చాలామట్టుకు తమకు బాగా తెలిసిన పనులనే అందుకునేవాళ్లు. అనాథ బాలురకీ, తాగుబోతులకీ, మాదకద్రవ్యాలకు అలవాటు పడినవాళ్లకీ హోమ్‌లు నడిపేవాళ్లు. పారిస్‌లో సూప్ కిచెన్ ప్రారంభించేరు. చాలా ప్రాంతాల్లో వాళ్లకి కొందరు సాయం చేసేవాళ్లు. వీళ్లని "వచ్చి–చూసి–పోయేవాళ్లు" అనేవారు. యీ మాటను బ్రదర్ ఆండ్రూ కూర్చేడు. ఏదో కొన్ని వారాలో, నెలలో ఓసారి చూద్దాం అని సాయం చెయ్యడానికి వచ్చేవాళ్లకీ మాట బాగా నప్పుతుంది. మఠంలో చేరాలని గాని, ప్రమాణాలు చెయ్యాలని గాని నిర్బంధం యేమీ లేదు. యిదే మాటను మదర్ థెరెసా కూడా వాడడం మొదలుపెట్టేరు. తాము పని చెయ్యగలమో లేదో అని ఓ ప్రయత్నం చేసే యువతులకు యీ మాటని అన్వయించి వాడేరు. తైవాన్, హైతీ, బురుండీ, పెరూ లాంటి సుదూర ప్రాంతాల్లో వున్న అనేక మిషనరీస్ ఆఫ్ ఛారిటీలలో – అంటే బ్రదర్స్‌కీ, సిస్టర్స్‌కీ సంబంధించిన శాఖల్లో కూడా – యేదో ఓ సందర్భంలో యిలా వచ్చి–చూసి–పోయేవాళ్ల సాయం లభించింది.

1987లో బ్రదర్ ఆండ్రూ మఠం వదిలివేశాడు. అంతకుముందే 1986లో బ్రదర్ గొయెఫ్ చేరేడు. అతనూ ఆస్ట్రేలియనే. బ్రదర్ ఆండ్రూ వెళ్లిపోయేక యితను ఆ స్థానంలోకి వచ్చేడు. యితను కొత్త శైలిని, మార్పును, పునారాలోచనను, సమాలోచనను ప్రవేశపెట్టేడు. కొన్ని రకాలుగా, యితను సంస్థను, మదర్ థెరెసాకు మొదట్లో వున్న వ్యూహాలకు అనురూపంగా మార్చేడు. ప్రస్తుతం బ్రదర్ల నియమావళిని తిరగ రాస్తున్నారు. అప్పుడు సిస్టర్ల శాఖకీ దీనికీ మరింత సాన్నిహిత్యం వుండచ్చు. చూడాలి యేం జరుగుతుందో.

అయితేనేం, యీ కూటమి మెల్లిగా పెరుగుతోంది. కొత్త వాళ్ల సంఖ్య అంతకు ముందు సంవత్సరాలలో కంటే తగ్గుతోంది. యిందుకు కారణాలూ లేకపోలేదు. అభ్యర్థులు వచ్చే నేపథ్యం పరిస్థితులు ముందటి మాదిరివిగా వుండడం లేదు, అంత సారవంతంగా. భౌతిక విలువలూ, పరిమిత కుటుంబాలూ మూల్యం చెల్లిస్తున్నాయి. యీ కూటమే మరింత నియమబద్ధంగా మారింది. ఎవళ్లని పడితే వాళ్లని చేర్చుకోవడమూ లేదు, చేరడానికి వస్తూ వున్నవాళ్లని ముందు బడి చదువు పూర్తి చెయ్యమని ప్రోత్సహిస్తున్నారు. యీ అంశాలన్నీ యెలా వున్నా బ్రదర్స్ శాఖలో యెక్కువ మంది వచ్చి చేరడం కష్టం. సిస్టర్ల శాఖకీ, ప్రీస్ట్‌ల శాఖకీ అయితే వేరు. ఏమంటే– అక్కడ ఆ పేర్లతో అతికే హోదా కొంత వుంటుంది. "అవును, కొంతమంది వదిలిపెట్టి వెళ్లిపోతున్నారు, నిజమే. తాత్కాలిక ప్రమాణాల సంవత్సరంలో యెటు తేల్చుకోవాలన్నది మామూలే. కడపటి ప్రమాణాల తర్వాత నిష్క్రమణలు తక్కువే. యెప్పుడూ కొంతమంది వెళ్లిపోవడం యెక్కడన్నా వున్నదే. యిప్పుడు మనం వుంటున్న రోజులు యెలాంటివంటారు? నిబద్ధత తగ్గింది, అంత సులభంగానూ ఒట్టు తీసి గట్టున పెట్టడమూ జరుగుతోంది" అన్నాడు బ్రదర్ గోయెఫ్. గత పదేళ్లల్లో సంస్థ వేగంగా పాకిపోయి అతి అనే స్థాయికి పోయింది.

యీా కారణాల వల్ల శిఖర స్థానంలో తొంభై నాలుగు సంఖ్యగా వున్న హోమ్‌ల సంఖ్య ఎనభై ఒకటికి (1991) పడిపోయింది. వీటిలో నలభై అయిదు భారతదేశంలో వున్నాయి, ముప్పై అయిదు పాతిక దేశాల్లో వున్నాయి.

యీా మతంలో నిండైన విశ్వాసం వున్న అతనే ఆ రాత్రి జైల్లో తీవ్రమైన వేదనకు గురైన వ్యక్తి. అలాంటి పరిస్థితికి విచారించారా, మరం వదలిపెట్టి వెళ్లిపోవాలనుకున్నారా అని అడిగేను. యివి కష్టమైన ప్రశ్నలే అనుకోండి, మనసు కలిగితేనే జవాబు చెప్పండి అని ముందే మాట జోడించేను. అతను డొంకతిరుగుడు లేకుండా రక్కున జవాబు చెప్పేడు. "అయ్యొయ్యో, కష్టమేం వుందండి. యీా మతంలో చేరేముందు నాకు చాలా సమస్యలు, యెన్నో కలలు, కోరికలు వుండేవి. నేను బలహీనంగా, కుంగిపోయి వుండేవాణ్ణి. నాలాంటి దౌర్భాగ్యుణ్ణి దేవుడు యెందుకు బతకనిస్తున్నాడా అనేదే నాకెప్పుడూ వింతగా వుండేది. ఆయనే నన్నీ జీవితానికి పిలిపించుకున్నాడు. మిషనరీ బ్రదర్ ఆఫ్ ఛారిటీని వదిలిపెట్టి వెళ్లిపోవాలని యిప్పుడు కలలో కూడా వూహించుకోవడం లేదు. పని యెంత కష్టంగా వుంటే, యెంతగా నా మీద ఒత్తిడి పడితే అంతగా ఆయనకు దగ్గరవుతున్నాను. నేను వదలివెళ్లిపోవడం అనేది కల్ల" అన్నాడతను.

మేం మాట్లాడుకున్నాక యిక వెడదామని లేచేను. గోడ మీద పటం నా కంటబడింది. అది హిందీలో వున్న సామెత. గుమ్మం పక్కనే వేలాడుతూ వుంది.

రెండు రొట్టెముక్కలు వుంటే
ఒకటి పేదలకియ్యి, రెండోదాన్ని అమ్ము
అది పెట్టి నీ మానసికతృప్తికి
తెచ్చుకో ఒక పారిజాతాన్ని.

☆ ☆ ☆

అతి నాగరిక లండన్‌కి దూరంగా, సంపన్న ఆవాసాలు లేని ప్రాంతంలో ఒక శిథిలమైన చర్చి వుంది. దాని గోడల రంగులు పెచ్చులు వూడిపోతున్నాయి. కిటికీలు పగిలి పోయేయి. అది నిరుపయోగంగా వుందని చాటడానికి అదే సాక్ష్యం. దాన్ని నడిపించాలంటే చాలా ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. యెన్నో యేళ్లుగా వాకిలి గుమ్మం మూాతపడే వుంది. యిప్పుడు ప్రతిరోజూ సాయంత్రం ఆరుగంటలకు కొంతమంది ఆడవాళ్లు ఆ వాకిలి తెరుస్తున్నారు. చాలామంది చీరలు కట్టుకున్న విదేశీ వనితలే. వీళ్లంతా మదర్ థెరెసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వాళ్లు. వాళ్లకు తోడుగా కొంతమంది స్వచ్ఛంద సేవకులు, సహసేవకులూ వున్నారు. అక్కడ పోగయే వంద చిలుకు లబ్ధిదారులలోనూ యెక్కువమంది మగవాళ్లే. తెల్లవాళ్లు, కొంతమంది మరీ కుర్రాళ్లు, వాళ్లు తాగుబోతుతనం నుంచీ, మాదకద్రవ్యాల నుంచీ దూరం వచ్చేరు. కొంతమంది ఆడవాళ్లు మానసికంగా స్థిమితం పోయి వున్నారు. ఒకతను వున్నాడు, ముఖమంతా పచ్చబొట్టు పొడిపించుకుని, దెయ్యం కళ్లూ అతనూనూ. వాళ్లు మాటా పలుకూ లేకుండా లోపలికి వస్తారు. హాల్లో వేసిన బల్లల దగ్గర చేరతారు.



ఢిల్లీలోని శిశు భవన్‌లో ఓ బిడ్డని పలకరిస్తున్న థెరెసా.



మాతృగృహంలో సిస్టర్లు ప్రార్థనలో



మదర్ థెరెసా వున్న తొలి నివాసం 14, క్రీక్ లేన్ కోల్‌కత. ఆమె అక్కడ వున్నప్పుడు కుర్చీలు, బల్లలు వంటి సరంజామా చాలా తక్కువ వుండేది.

S. Tarafdar and Associates



ఫాదర్ సెలెస్టె వాన్ ఎగ్జెమ్, మదర్ థెరెసా ఆధ్యాత్మిక గురువు.

S. Tarafdar and Associates



Raghu Rai

మదర్ థెరెసా, మృత్యువు ఆసన్నమయేవారి గృహం, కాళీఘాట్, కోల్‌కతా.



నార్వేజియన్ నోబెల్ కమిటీ అధ్యక్షునితో, ఓస్లో, 1979.

ఓస్లోలో ఒక ప్రార్థనా సమావేశం, 1979.

నోబెల్ శాంతి బహుమతీ, పతకం.







Raghu Rai

కోల్‌కతా కాళీఘాట్‌లో మృత్యువు ఆసన్నమయేవారి గృహంలో,
ఒకరితో మదర్ థెరెసా.



Raghu Rai

కోల్‌కతా నిర్మలా శిశుభవన్‌లో ఓ బిడ్డతో మదర్ థెరెసా.



టిటాఘర్‌లో నివాస సముదాయాన్ని నిర్మిస్తున్న కుష్ఠురోగులు.

టిటాఘర్‌లో కుష్ఠు వ్యాధి గ్రస్తులు నిర్మించిన ఉత్పత్తి కేంద్ర దృశ్యం.

టిటాఘర్‌లో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వారు నేసిన చీరలు కట్టుకుని వ్యాధినయమైన కుష్ఠు రోగులు.



Chitrabani-EMRC





Chitraba
EM





S. T

Ass

కోల్‌కత శిశుభవన్ సందర్శనలో ప్రిన్స్ ఛార్లెస్. మధ్యలో వున్నారు మదర్ థెరెసా.

జాక్వెన్ ద డెక్కర్‌తో మదర్ థెరెసా, రోమ్ 1982.

మదర్ థెరెసా మొదటి పోస్ట్యులెంట్ సిస్టర్ ఆగ్నెస్‌తో రచయిత నవీన్ చావ్లీ



Raghu Rai

ప్రార్థనలో మదర్ థెరెసా.



Amarjeet
Cine India
International

రచయిత, ఆయన శ్రీమతి రూపికలతో మదర్.



ప్రిన్సెస్ ఆఫ్ వేల్స్‌తో, రోమ్‌లో.

Associated Press

ప్రార్థన. తర్వాత వేడి వేడి భోజనం. మాటా పలుకూ లేకుండా తిని, మళ్లీ బయటకు వెళ్లిపోతారు.

వాళ్లు తినే భోజనానికి యేమీ డబ్బు కట్టక్కర్లేదు. యివాళ భోజనం లండన్‌లో ఓ ఖరీదైన హాస్పిటల్‌ది. అక్కడ దాన్ని వినియోగించుకోలేదంట. అక్కడి ముఖ్య వంటమనిషి వండింది. అతనూ వీళ్ల సహకార్యకర్త. భోజనం యెప్పుడూ ఖర్చు లేకుండానే వచ్చేది. పేరు మోసిన ఫుడ్‌స్టోర్స్ అమ్మకం కాక మిగిలిపోయిన కాయగూరల్ని పళ్లనీ పంపిస్తుంది. సహకార్యకర్తలు లోపాయకారీగా మాంసం దుకాణదార్లకీ, రొట్టెల దుకాణాల వాళ్లకీ యీ సంస్థ గురించి చేరవేశారు. "తిండి సరుకుల్ని వృథాగా పారెయ్యకండి, వాటిని మదర్ థెరెసాకు పంపించండి" అని చెప్పేరు. హాల్లో ఓ అరడజనుమంది స్వచ్ఛంద సేవకులు వడ్డనకు సాయం చేస్తారు. తర్వాత ఎంగిళ్లు యెత్తి శుభ్రం చేసే పనికీ సాయపడ్తారు. వాళ్లు సహకార్యకర్తలు కారు. అడపాదడపా వచ్చి సాయం చేసేవాళ్ళే. ఒకతను పడుచువాడు. అప్పుడే వించెస్టర్ నుంచి వచ్చేడు. బ్రిటన్‌లో వున్న ప్రముఖ పబ్లిక్ స్కూల్ అది. అతను న్యాయశాస్త్రం అధ్యయనం చేస్తున్నాడు. అతను యెప్పుడో ఓసారి వస్తూ వుంటాడు. "యిదీ జీవితంలో భాగమే. యిక్కడివాళ్లతో మాట్లాడ్డం, సిస్టర్లతో మాట్లాడ్డం నాకు సరదా" అన్నాడు.

నన్ను క్వైక్స్‌రోడ్ చర్చికి తీసికెళ్లిన సహచరులు అంతర్జాతీయ కార్యదర్శి బ్రిడ్జెట్ ఏకాట్, ఫయేలార్కిన్స్, నేషనల్ లింక్ ఫర్ బ్రిటన్‌కి చెందిన మనిషీనీ. "మేం మా ప్రాంతాల్లో, చుట్టుపక్కలా యేం చెయ్యగలమో యావత్ బ్రిటన్‌లోనూ మొదట మేం చూస్తాం. ఈశాన్య ప్రాంతంలో మేం పోగుచేసిన దాన్నంతట్నీ మా అవసరాలు యెక్కడ వున్నాయో అక్కడకు తరలిస్తాం. మాంఛెస్టర్, బర్మింగ్‌హామ్, లివర్‌పూల్ పట్టణాల్లో శారీరకంగా అవకరం పాలైన వాళ్లని సహకార్యకర్తలు చూస్తారు. మిగిలిన ప్రాంతాల్లోనూ మానసికంగా కుంగిపోయిన వాళ్లుండచ్చు. వేలాదిమంది నిరాధారంగా బతికేవాళ్లున్నారు. వాళ్లు పేదవాళ్లు కాకపోవచ్చు. కాని మదర్ అన్నట్టు కలకత్తాలో తగిలే పేదలకంటే వేరే రకాలుగా పేదలైనవాళ్లు. వర్ధమాన దేశాలని చెప్పకునే దేశాల్లోని భౌతిక దారిద్ర్యం కంటే పాశ్చాత్యదేశాల ఆధ్యాత్మిక పేదరికం చాలా యెక్కువ అని ఆవిడ అంటారు. వాళ్లని ఆవిడ యెవళ్లకీ అక్కర్లేని వాళ్లు అంటారు. ఆ రకం ఒంటరితనాన్ని బాగుచెయ్యడం మహాకష్టం. యీ ప్రజలు "ఎవళ్లూ కారు". ఎవరూ వాళ్లని గురించి పట్టించుకోరు. "ఎవళ్లకేనా" "ఏదో ఒకటి" కమ్మని మదర్ సహకార్యకర్తల్ని కోరతారు" అని ఫయే అన్నాడు.

యెవళ్లూ పట్టించుకోని యీ జనంలో కొంతమంది నిజంగా దేవదారు చెక్కపెట్టెల బస్తీల్లో వుంటారు. వాటర్లూ బ్రిడ్జి కింద ముడుచుకుపోయి వుంటారు. లింకన్స్ ఇన్ ఫీల్డ్స్ లాంటి పార్కుల్లో వుంటారు. లండన్ మెట్రోస్టేషన్లలో వుంటారు. యిల్లు ఓ చెక్కల పెట్టె. శవపేటిక కంటే ఓ పిసరు పెద్దది. శీతకట్టు చలిగాలులకి వాళ్ల ఆధారం అల్లా అదొక్కటే. వాళ్లల్లో చాలామందికి నిజంగా దక్కే అకల్మష మందహాసాలు సహ కార్యకర్తల నుంచీ, సిస్టర్ల నుంచీనే. వారంలో రెండ్రోజులు రాత్రిపూట సుమారు 10 గంటల ప్రాంతంలో అంబులెన్స్ సూప్ కిచెన్ వాళ్లకి

వేడివేడి తిండి అందిస్తుంది. దానితోపాటు ఉత్సాహం కలిగించే కబుర్లూ, నవ్వులూ కూడా అందుతాయి.

మదర్ థెరెసా సహచరుడు అనే మాటని అర్ధ శతాబ్దం కింద మహాత్మాగాంధీ నుంచి గ్రహించేరు. ఆయనంటే ఆవిడకు అపారమైన గౌరవం. కానైతే ఆయన్ని యెప్పుడూ కలవలేదు. గాంధీజీ తనకు సాయపడేవాళ్లని సహకార్యకర్తలు అన్నారు. మహిళల హోదా పెంచడానికి, కుష్ఠు వ్యాధి నిర్మూలనకు, విద్యావ్యాప్తికి, భారతదేశంలో అట్టడుగు వర్ణాలు "అస్పృశ్యతను" తొలగించడానికి ఆయన సాంఘికసేవా కార్యకలాపాలు అమలు జరిపేరు. యీ సహకార్యకర్తలు వాటికి సాయపడేవారు. యీ పదబంధం మదర్ థెరెసా మనసులో వున్న భావానికి సరిగ్గా తూగింది. సాంఘిక హోదాతో నిమిత్తం లేకుండా ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకు, మతాలకు చెందిన పురుషులు, స్త్రీలు, యువకులు, పిల్లలు ఆవిడ సహచరుల విభాగంలో వుండచ్చు. తోటి మనుషుల్లో వాళ్లు దేవుణ్ణి దర్శిస్తారు. అన్ని తరగతుల, విశ్వాసాల ప్రజలకీ సేవ చెయ్యడమే అది. తమ ప్రార్ధనల ద్వారా, త్యాగం ద్వారా మదర్ థెరెసా కృషితో, మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కృషితో మమేకం అవుతారు.

నిజానికి మొదటి సహకార్యకర్తలు మైఖేల్ గోమ్స్, ఆయన కుటుంబ సభ్యులూనూ. యీ అర్థంలో చెప్పాలంటే ఆవిడ విజ్ఞప్తులకు స్పందించిన డాక్టర్లు, దంతవైద్యులు, నర్సులు అందరూ సహకార్యకర్తలే. వాళ్లు తమ వృత్తినైపుణ్యాన్ని అందించేరు. సహకార్యకర్తలకూ సంఘం వుండాలన్న వూహ క్రమేపీ రూపు తీసుకుంది. 1950 ల్లో కొంతమంది బ్రిటిష్ గృహిణులు కలకత్తాలో సాంఘికసేవా కార్యకలాపాల్లో పనిచేశారు. మదర్ థెరెసా అపారశక్తికి ఆకర్షితులయేరు.

అన్నీబ్లైకీ అనే ఆవిడ ఓ బ్రిటిష్ వ్యాపారస్తుని యిల్లాలు. "ది స్టేట్స్‌మన్" అన్న పత్రికలో మదర్ థెరెసా గురించి చదివిందట. ఆ పత్రిక ఆవిడ కార్యకలాపాల్ని గురించి రాయడం మొదలుపెట్టింది. 1954 జూలై నెలలో ఓ పొద్దుటి పూట ఆవిడ కుతూహలం కొద్దీ మదర్ థెరెసాని కలుసుకున్నారు. సాయపడ్తానని అంది. వెంటనే మదర్ థెరెసా ఆమెని ఓ గూనివాన్‌లో యెక్కించి కాళీఘాట్‌లో వున్న అవసాన జీవుల గృహానికి తీసుకువెళ్లారు. ఆ సాయంత్రం అన్నీబ్లైకీ యింటికి వచ్చేవేళకు ఆమె జీవితం మారిపోయింది. ఏడాదిలోపునే, కచ్చితంగా చెప్పాలంటే 1954 జూలై 26న కలకత్తాలో మొదటి సహకార్యకర్తల బృందాన్ని స్థాపించేరు. ఆ తర్వాత కొన్ని నెలల్లోనే ఆ బృందం కొన్ని వాడకానికి పనికొచ్చే బట్టల్ని సేకరించింది. శిశుభవన్‌లోని పిల్లలకీ, మురికివాడల్లోని జనాలకీ క్రిస్టమస్ నాడు వాటిని యిచ్చేరు. వాళ్లు మంచి పని చేశారు. క్రిస్టమస్ అయిపోయింది. పొగుడుతారని చూస్తూ వున్నారు వాళ్లు. వాళ్లని అభినందించడానికి మదర్ థెరెసా వచ్చేరు. కాని వ్యవధి తక్కువగా వుందనీ, ఈద్ పండగ, దీపావళి పండుగ వస్తుందని అన్నారు. ఒకటి ముస్లిం పండగ, రెండోది హిందువుల పండుగ. ఆ పిల్లలూ బట్టల కోసం చూస్తూ వుంటారు కదా అన్నారు. అప్పట్నుంచీ అన్నీబ్లైకీకి తీరికే లేదు.

1960లో అన్నీబ్లైకీ ఇంగ్లండ్ వెళ్లిపోయేరు. దగ్గర్లోనే ససెక్స్‌లో జాన్ సే త్‌వర్త్ అనే ఆయన వున్నాడు. ఆయన కలకత్తాలో వున్నప్పుడు కుష్ఠు వ్యాధిగ్రస్తుల

సేవ చేశాడు. వాళ్లకు త్వరలోనే కలకత్తాలో మదర్ థెరెసాకు సాయం చేసిన సహకార్యకర్తలు కలిశేరు. అందరూ కొంచెం యించుమించు దగ్గరి ప్రాంతాల్లోనే వున్నవాళ్లు. యెంతోకాలం అవకుండానే "మదర్ థెరెసా కమిటీ" యేర్పాటు చేసుకున్నారు. జాన్ సేత్ వర్త్ చైర్మన్, ఆన్నీబ్లైకీ వైస్ చైర్ పర్సన్. నవంబరు 1960లో మదర్ థెరెసా ఇంగ్లండ్ సందర్శించారు. ఆ సందర్శన వాళ్ల పనికి ఉత్సాహం కలిగించింది.

కలకత్తాలో యేదో సంసారపక్షంగా ప్రారంభమైంది సహకార్యకర్తల చిన్న బృందం. ఇంగ్లండ్ లో వేళ్లు పాతుకుంది. మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్ వున్న యితర దేశాల్లోనూ శాఖల్ని విస్తరింపచేసుకుంది. మొత్తం సంఖ్య యెంత వుంటుందో తెలియదు కాని ఒక్క బ్రిటన్ లోనే ముప్పైవేలమంది సహకార్యకర్తలు. అమెరికాలో పదివేలమంది సహకార్యకర్తలు వున్నట్టు అంచనా. యూరప్ ఖండంలోని కొన్ని దేశాల్లో యేదో కొన్ని వందలమంది వుంటారు.

భారతదేశంలో వందలాదిమంది సహకార్యకర్తల్ని నేను కలుసుకున్నాను. అయితే వీళ్ల బృందాలు సరిగా వ్యవస్థీకృతం కాలేదు. అయితే ఒక విషయాన్ని మాత్రం కచ్చితంగా చెప్పచ్చు. బృందంలోని ప్రతి ఒక్క క్రిస్టియన్ కీ కనీసం పదిమంది క్రిస్టియనేతర (ముఖ్యంగా హిందూ) సహకార్యకర్తలు వున్నారు. ప్రతి విభాగం విజయమూ ఆయా ప్రాంతాల బాధ్యుల శక్తియుక్తులు మీద ఆధారపడి వుంటుంది. వాళ్లని "లింకు"లు అంటారు. ఆ బృందాలు చిన్నవి. ఇద్దరినుంచి పన్నెండు మంది దాకా వుంటారు. సంఖ్య పెరిగితే మరో విభాగాన్ని స్థాపిస్తారు. వాళ్ల సమావేశాలలో మద్యం యివ్వరు, సాదా పానీయాలే యిస్తారు. అలా అయితే సమావేశాలు, ధనవంతుల యిళ్లల్లోనూ, పేదల యిళ్లల్లోనూ ఒకలాగానే జరుగుతాయి.

సహకార్యకర్తల సంస్థ నలుగురికీ బాగా తెలియదు. ప్రచారంగాని, నిధుల సేకరణగాని వుండరాదని వాళ్లమీద నిషేధం వుంది.

ప్రచారం వున్నదల్లా గృహపత్రిక ద్వారా. అది "సహకార్యకర్తల వార్తా సమాచారం" రూపంలో వుంటుంది. కారుచౌక కాగితం మీద దాన్ని అచ్చు వేస్తారు. సభ్యులందరికీ అందజేస్తారు. దాన్ని మిమియోగ్రాఫ్ చేయిస్తే బాగుంటుందని మదర్ థెరెసా భావన. అలా అయితే చవగ్గా పడుతుంది. యీ పనిచేసే సహకార్యకర్తలకు ఓ ఆఫీసంటూ విడిగా అవసరమూ వుండదు. సిబ్బందీ అక్కర్లేదు. ఆ కేంద్రంవాళ్లూ ఓ యిల్లు అద్దెకు తీసుకకోనక్కర్లేదు. యిదే విషయం పాతబట్టల సేకరణ కేంద్రాలకీ వర్తిస్తుంది. ఆ కేంద్రం వాళ్లూ ఓ యిల్లు అద్దెకు తీసుకోనక్కర్లేదు. యే యింటి భూగర్భ బాగంలోనో ఓ గది సరిపోతుంది. లేకపోతే కారు గారేజ్, ఓ చిన్నగది లాంటివీ చాలు. "మా యిల్లంతా పిసరు కాళీ లేకుండా మదర్ థెరెసాకు పంపించాల్సిన బట్టలతో నిండిపోయింది. మాకోసం మేము వేరే యిల్లు చూసుకోవాలేమో అంటూ వుంటారు మా ఆయన," అని ఫమెలార్కిన్స్ నవ్వుతూ అన్నారు.

యాభైయేళ్లనాడు చేతిలో చిల్లిగవ్వ లేకుండా తన కార్యకలాపానికి శ్రీకారం చుట్టిన ఆ మహిళ పేరు మీద భారీ మొత్తాలు జమ అవడం చాలా గొప్ప విషయం. సహకార్యకర్తలు అంతర్జాతీయ స్వీకర్లు చెప్పారు. పెద్ద మొత్తాలకీ, చిన్న మొత్తాలకీ

కూడా చెక్కులు రోజూ వస్తూ వుంటాయని, ఆ మొత్తాలు చేతికి అందినంత త్వరగానూ ఖర్చయిపోతూ వుంటాయి.

కొనుగోళ్ల విషయం చూస్తే సహకార్యకర్తలకి సిస్టర్ల నుంచి మందులనో, పాలపొడి అనో, ప్రోటీన్లనో, బట్టలనో అభ్యర్థనలు వస్తూనే వుంటాయి. యీ బృందానికి ఇంటర్నేషనల్ లింక్ ఫర్ రిలీఫ్ వర్క్ ఆధిపత్యం వహిస్తూ వుంటుంది. అది అన్ట్వెర్ప్లో వుంది. యీ లింకుకు సహకార్యకర్తల కమిటీ సాయపడుతూ వుంటుంది. యిలా రవాణా చేసిన వాటి పరిమాణం చూస్తే తెలుస్తుంది యెంత కార్యనిర్వహణ జరుగుతూ వుండేదీనీ. ఒక్క 1990లోనే 1,70,00,000 బెల్జియన్ ఫ్రాంకుల ఖరీదు చేసే పాలపొడి సరఫరా అయింది. 2,00,000 డచ్ గిల్డర్ల విలువ చేసే ప్రోటీన్ బిస్కట్లని పంపించేరు. యీ సరుకుల్ని ఆఫ్రికా, దక్షిణ, మధ్య అమెరికాల ఆసియా దేశాలకు పంపించేరు. వీటికి తోడు 30,00,000 బెల్జియన్ ఫ్రాంకుల విలువ చేసే బట్టల్ని, వాటి అసలు చిల్లర అమ్మకం ధరల్లో పదో వంతుకే కొని పశ్చిమ ఆఫ్రికా దేశాలకు పంపించేరు. 1991లో వాడుకోవడానికి పనికొచ్చే పాత బట్టల మూటలని, యెంతో అవసరం అయిన దుప్పట్లనీ, బాండేజీలని ఆసియాలోని అనేక ప్రాంతాలకు యిరవైనాలుగు భారీ రవాణా పెట్టెలలో పంపించేరు. యీ బట్టలని, దుప్పట్లనీ యింటి యింటికీ తిరిగి బ్రిటీష్ సహకార్యకర్తలు సేకరించేరు.

అయినా న్యూస్లెటర్ తర్వాత న్యూస్లెటర్లో అణకువ అయిన పని నుంచి పక్కకు మళ్లకండి అంటూ మదర్ థెరెసా సహకార్యకర్తలకు ఉద్బోధ చేస్తూనే వుంటారు. పని అన్నది యేదీ చిన్నది కాదు. అంధులకు సాయపడుతూ ఉత్తరాలు రాసిపెట్టచ్చు, ఓ వయసు మళ్లిన వృద్ధురాలికి యిల్లు వూడ్చుకుందుకు సాయం చెయ్యచ్చు, బట్టలు ఉతికి పెట్టవచ్చు, పెద్దపనులు మిగిలినవాళ్లు చేస్తారులెండి అంటూ ఆవిడ గుర్తు చేస్తూ వుండేవారు. వేలాదిమంది యిల్లు వదలి కదల్లేనిస్థితిలో వున్నారు. వాళ్లవాళ్లే వెళ్లి చూడరు.

ఓసారి మదర్ థెరెసా పాశ్చాత్యదేశాల్లోని పేదరికం గురించి చెప్పేరు. లండన్లోని ఒంటరి మనుషుల గదులుండే ప్రాంతంలో ఓ ఫ్లాట్లో ఒకావిడ వుండేదట. ఆవిడ్ని చూడ్డానికి ఒక్కళ్లు కూడా యెన్నడూ వెళ్లలేదట. కనీసం ఉత్తరమ్ముక్కైనా యెరగదట. తనకి యెవళ్లూ ఉత్తరమేనా రాయలేదని యిరుగుపొరుగు అనుకుంటారేమోనని తనే ఒకటీ అరా ఉత్తరాలు రాసుకుని పోస్టులో వేసేదట. యిదుగో యిలా విచారభరితంగా, ఒంటరిగా వుండే వాళ్లకే కాస్త ఉత్సాహం కలిగించండి అని మదర్ థెరెసా సహకార్యకర్తల్ని అర్థించేవారు. మదర్ థెరెసాకు స్వతఃసిద్ధంగా వున్న తాత్విక దృక్పథం గురించి ఒక పేరా ఆలోచనాత్మకంగా వుంది. యిది సహకార్యకర్తల నియమావళిలో వుంది. "ప్రపంచంలో వున్నవన్నీ, మనసు శరీరం, జన్మతః సమకూరే సౌకర్యాలు, విద్యలాంటివాటితో సహా అన్నీ దేవుని వరప్రసాదాలు అని మదర్ థెరెసా సహకార్యకర్తలు గుర్తిస్తారు. మితం తప్పిన సంపదల మీద యెవళ్లకీ హక్కులేదు, ఓ పక్క జనం ఆకలితో లేమితో మాడి మరణిస్తూ వుంటే. వాళ్లీ దారుణ అన్యాయాన్ని స్వచ్ఛంద పేదరికం అనుభవించడం ద్వారా, తమ జీవితంలో భోగాల్ని త్యాగం చెయ్యడం ద్వారా సరిదిద్దాలని భావిస్తారు."

మదర్ థెరెసా, ఆవిడ సహకార్యకర్తలూ సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసి ప్రార్థనతో యేకం అయేరు. ఆ ప్రార్థన మహాత్మాగాంధీకి కూడా యిష్టమైందే.

ప్రభూ నీ శాంతిదూతను చెయ్యి నన్ను...
విచారం వున్నచోట నేను ఆశని అందించాలి
నీడలు వున్నచోట నేను వెలుతురు ప్రసరింపచెయ్యాలి
దుఃఖం వున్నచోట సంతోషం అందించాలి...

☆ ☆ ☆

సహకార్యకర్తల సంస్థ ప్రత్యేకం బాధపడేది శారీరక అవకరం వల్ల, జబ్బుల వల్ల, వార్ధక్యం వల్ల లేచి తిరగలేనివాళ్లు క్రియాశీలంగా పనులు చెయ్యలేనివాళ్లకోసం. అందుకు బదులుగా ప్రతి కార్యకర్తా మిషనరీ ఆఫ్ ఛారిటీ సిస్టర్‌కో, బ్రదర్‌కో జత అవుతారు. వాళ్లు పనికిగాను తమ బాధనీ, దుఃఖాన్నీ, ప్రార్థననీ అందిస్తారు. చురుగ్గా పనిచేసేవాళ్లు ద్విగుణీకృత ఉత్సాహంతో పనిచేసి వాళ్లకోసం ప్రార్థిస్తారు. ఒకళ్లు అవతలి వాళ్లకి "ప్రతిబింబం", బాధలో వున్న ప్రాణులకు అర్థవంతమైన జీవితాన్ని అందించేందుకు యిది దోహదపడుతుంది. యేమంటే, వాళ్ల బాధ ఒకరకమైన విముక్తిగా భాసిస్తుంది.

"సిక్ అండ్ సఫరింగ్ కో వర్కర్స్" (దుఃఖం, బాధ అనుభవించే సహకార్యకర్తలు) సంస్థ అని పిలిచే దీన్ని మదర్ థెరెసా జాక్వెలిన్ డె డెక్కర్ అనే ఆమెకి అప్పగించేరు. 1969 మార్చి 26న వాటికన్‌లోని పోప్ కార్యాలయం మదర్ థెరెసా అంతర్జాతీయ సహకార్యకర్తల సంఘాన్ని గుర్తించినపుడు జాక్వెలిన్‌ని సిక్ అండ్ సఫరింగ్ లింకుగా చేశారు. అప్పటినుంచీ ఆవిడే దాన్ని నిర్వహిస్తున్నారు. చాలా కాలంగా ప్రతి మిషనరీ ఆఫ్ ఛారిటీని యేదో రోగగ్రస్త, బాధాతప్త వ్యక్తికి లింక్ చేస్తూనే వుందామె, చాలా శ్రమపడి తనే నిరంతర దుఃఖితురాలిగా వున్నా స్వహస్తంతో వేలాది ఉత్తరాలు రాసింది. మదర్ థెరెసా ప్రతిబింబంగా ఆమె 1979లో మదర్ థెరెసా నోబెల్ బహుమతి తీసుకున్నప్పుడు ఓస్లో వెళ్లింది.

"రెండు వారాల క్రితం, తిరువనంతపురంలోని సెయింట్ జోసెఫ్స్ కాథెడ్రల్ పరొకియల్ హౌజ్‌లో చీర కట్టుకున్న ఒక యూరప్ వనితను చూశేను" అంటూ ఒక కేరళ పత్రికలో పాత్రికేయుడొకరు 1948 ఆగస్టు 25న రాశేడు. "మొదట ఆవిడ పెద్దగా ఆకర్షించలేదు, తిక్కమనిషేమో లేకపోతే వింతగా వుండాలనుకుందేమో అనుకున్నాను." అయితే అంతలోనే అతని అభిప్రాయం మారింది. "ఆవిడ బెల్జియం దేశస్థురాలు. మంచి కేథలిక్ కుటుంబానికి చెందిన ఆవిడే. లూవియన్‌లోని కాథలిక్ యూనివర్సిటీ గ్రాడ్యుయేట్. ప్రత్యేక అధ్యయన విషయంగా సోషియాలజీ తీసుకున్నారు. నర్సింగ్‌లోనూ, ప్రథమ చికిత్సలోనూ ఓ డిప్లమా కూడా వుంది. యూనివర్సిటీలో చదువు పూర్తయేక ఆరేళ్లు నర్స్‌గా పనిచేసింది. క్షతగాత్రులకీ, యుద్ధఖైదీలకీ గొప్పగా సేవ చేసింది. ఆవిడ కోరికల్లా భారతదేశానికి వచ్చి యీ గడ్డ మీద వున్న ఆర్తులకీ, పేదలకీ సేవచెయ్యడం. కుమారి డెడెక్కర్ భారతదేశం వచ్చి ఒక్క యేడాదే అయింది. భారతదేశ వేషభాషలు, ఆహారం అలవాటు చేసుకుంది.

చీర కట్టుకుంటుంది. నేల మీద కూర్చునే భోజనం చేస్తుంది. చెంచాలు, ఫోర్కులు వగైరాలేమీ వాడదు. నేల మీదే పడుకుంటుంది. మంచాలు, పరుపులులాంటి సౌకర్యాలేమీ అక్కర్లేదు. పేదలకోసం అంకితం అయిన వాళ్లకు అలాంటివేమీ అక్కర్లేదంటుంది". ఆమె సాయం కావాల్సిన వాళ్లెవరికైనా సేవలందిస్తుంది. పేదలకు అందుబాటులో వుండే యింటికోసం మద్రాస్‌లో చూస్తోంది. ఆ పాత్రికేయుణ్ణి యిది కదిలించింది.

తన జీవిత లక్ష్యం మిషనరీ అవడం అని ఆమె తీర్మానించు కున్నప్పుడు డెడెక్కర్ వయసు పదిహేడు సంవత్సరాలు. కొన్నియేళ్ల తర్వాత ఆవిడ ఒక జెసూట్ ప్రీస్ట్‌ని కలుసుకుంది. భారతదేశం వెళ్లి సాంఘిక వైద్యపాఠశాల పెట్టమని ఆయన ఆమెకు ప్రోత్సాహం యిచ్చేడు. అయితే యుద్ధం అడ్డం వచ్చింది. యుద్ధం ముగిసిన తర్వాత ఆమె బయల్దేరదా మనుకుంది. ఓడ యెక్కగానే తనకు సాయం చేస్తానన్న ప్రీస్ట్ చనిపోయినట్టు టెలిగ్రామ్ వచ్చింది. అయినా ఆవిడ ప్రయాణం మానుకోలేదు. చేతిలో డబ్బా తగినంత లేదు, వెనక తోడ్పాటూ లేదు. చాలా సాదాగా బతకాలని భావించి భారతీయ పద్ధతులు అవలంబించింది.

మద్రాస్‌లో ఆమె యింకో జెసూట్ ప్రీస్ట్‌ని కలిసింది. పాట్నాలో ఒక నర్స్ వుందనీ, ఆవిడా తనకిలాగానే యీ దేశ పద్ధతులు అలవాటు చేసుకుందనీ ఆయన చెప్పేడు. ఆ రోజుల్లో పాట్నా వెళ్లాలంటే రైల్లో చాలాసేపు పట్టేది. అయినా జోక్వెలిన్ వెంటనే బయల్దేరాలని ఉత్తేజపడింది. భారతదేశ పేదలకోసం యెంతో నిబద్ధత వున్న తనలాంటి నన్ యెవరో చూడాలి. "పాట్నా మెడికల్ మిషన్ చేరేటప్పటికి సాయంత్రం అయిదు అయింది. నాకు అది బాగా గుర్తుంది. యేమంటే లొరేటో నుంచి వచ్చిన సిస్టర్ థెరెసా కోసం అడిగినప్పుడు, "ఆఁ అయిదయింది, అంటే పని పూర్తి చేసుకుని ఆవిడ చర్చిలో వుంటారన్నమాట" అని చెప్పేరు. నిజమే, ఆవిడ అక్కడే వున్నారు. 'మొదటిసారి మిమ్మల్ని కలుసుకుందుకు నేవచ్చినప్పుడు మీరు మీ వీపు చూపించేరు' అని తర్వాత ఆవిడతో పరిహాసంగా అన్నాను."

కొన్నిరోజులల్లోనే ఒకళ్ల గురించి యింకొకళ్లు బాగా తెలుసుకున్నారు. యిద్దరివీ సమంగా వుండే అభిరుచులే. పేదలంటే అభిమానం, భారతదేశం అంటే ప్రేమ, ప్రభువు పట్ల భక్తి. తను శ్రీకారం చుట్టబోయే పనికి సాయం చెయ్యమని మొదట మదర్ థెరెసా అడిగింది జాక్వెలిన్‌నే. అది తన ప్రార్థనలకు ఫలం అనిపించింది జాక్వెలిన్‌కి. అయితే ఆమెకు వెన్నులో నొప్పి వచ్చింది, వైద్యం కోసం ముందు బెల్జియం వెళ్లాలి. కోలుకోగానే కలకత్తా వచ్చి మదర్‌తో చేరుతుంది. 'యెలా పనిచేస్తారని సిస్టర్ థెరెసాని అడిగేను. "నేను డిసెంబర్లో కలకత్తా వెడతాను. వీధుల్లోకి వెళ్లి యేం చెయ్యగలనో చూస్తాను. ఆయనే నడిపిస్తాడు' అని సాదాగా చెప్పేరు."

బెల్జియమ్‌లో డాక్టర్లు జాక్వెలిన్‌ని పరీక్షించేరు. వెన్నుపూసకు సంబంధించి బలహీనపరిచే వ్యాధి అని తేల్చేరు. ఒకరకం పక్షవాతాన్ని అడ్డుకుందుకు వెన్నులో పూసని అతికించాలనీ, కొన్నిసార్లు ఆపరేషన్ చెయ్యాలనీ చెప్పేరు. బాధాకరమైన ఆపరేషన్లని కొన్నింటికి చేశారు. "మీకు చేసినంత దీర్ఘ శస్త్రచికిత్స నేనెన్నడూ

చెయ్యలేదు" అని డాక్టర్ ఆమెతో అన్నారు. మరో సర్జరీ కూడా అవసరం అని చెప్పారు. తన కలలు అంతమయేయని జాక్వెలిన్‌కి అనిపించింది. యెంత చేరువగా ఫలవంత మయేటట్టు కనిపించేయా కలలు! "నా జీవితం ఓడిపోయింది" అని యివాళ ఆమె ఒకటికి రెండుసార్లు అంటుంది.

బెల్జియంలో ఒక ప్రాచీన వంశంలో ఆమె పుట్టింది. తండ్రి ధనికుడైన వ్యాపారస్తుడు. ఆయనకు బ్రెజిల్‌లో కాఫీ తోటలున్నాయి, ఇండోనేషియాలో రబ్బర్ తోటలున్నాయి. ఆవిడ చిన్ననాటి జ్ఞాపకాలలో, అమ్మమ్మగారి కోట మైదానంలో వున్న భవంతిలో గడిపిన బాల్యం వుంది. ఉన్నట్టుండి, అదృష్టచక్రం కిందికి దిగిపోయింది. ధరలు పడిపోయేయి. తండ్రి ఆస్తి దాదాపు అంతా హరించుకుపోయింది. జాక్వెలిన్ నర్సు అయింది. యుద్ధకాలమంతా నిస్వార్థంగా పనిచేసింది. ఆంట్‌వెర్ప్‌లో బ్రిటిష్ సైనికులకు చెప్పలేనంత సాయం చేసింది. యివాళ జాక్వెలిన్ ఆంట్‌వెర్ప్‌లో ఒక చిన్నఫ్లాట్‌లో వుంటోంది. ఆమె చుట్టూతా పుస్తకాలు, పత్రికలూ పేరుకుని వుంటాయి. ఆమె బల్లనిండా తనపనికి సంబంధించి ఉత్తరప్రత్యుత్తరాలే. బల్ల వెనక తల్లి ఫోటో, సాయంత్రం దుస్తుల్లో. గది అంతా చెదిరిపడివున్న కళాప్రతిమలు గతకాల వైభవానికి సాక్షీభూతంగా వున్నాయి.

అయితే యిప్పుడు మెడకి ఎముకల పట్టీ యేం చుట్టుకోదు. ఒంటిమీద ఇనప జుబ్బాలాంటిది ధరిస్తుంది. నడవడానికి ఆనకర్రలు అవసరం. ముఖం కళగా వుంటుంది. యెంతో రాజసం ఉట్టిపడుతూ వుంటుంది. నేనామెని ఆంట్‌వెర్ప్‌లో కలుసుకున్నప్పుడు ఒక్కసారి కూడా బాధ ముఖంమీద కనిపించనియ్యలేదు, చాలా రాత్రిళ్లు నిద్రపట్టకపోయినా.

సహకార్యకర్తల సిక్ అండ్ సఫరింగ్ బృందం యేర్పాటైన క్రమం జాక్వెలిన్‌కి మదర్ థెరెసా రాసిన ఉత్తరాల కంటే చక్కగా యేదీ తెలియచెయ్యదు. ఆ ఉత్తరాల్లో కొంత వ్యక్తిగతమైన విషయాలూ వున్నాయి, వాటిని వదిలెయ్యడం జరిగింది. ఆ మసకబారిన పాతఉత్తరాలు భారతదేశంలో మదర్ థెరెసా కృషి యెలా రూపుతీసుకుందో, వృద్ధి చెందిందో తెలియచేసే విలువైన సమాచారం అందిస్తాయి. అంచేత అవే విషయాన్ని అందిస్తే బాగుంటుంది.

మొట్టమొదటిసారి 1949 మే 29న మదర్ థెరెసా జాక్వెలిన్‌కి ఉత్తరం రాశేరు. మామూలుగానే సంబోధించేరు.

14, క్రీక్ లేన్
కలకత్తా–14.
29 మే, 1949.

ప్రియమైన కుమారి డెడెక్కర్,

మీ దయాపూరిత ఆలోచనకూ, కానుకకూ దేవుడు ఆశీర్వదించుగాక. నాకు సాయం చెయ్యగల శక్తి చాలా పోగొట్టుకున్నారు. కాని ఆయన మీకు తిరిగియిస్తాడు.

నా దగ్గర యిప్పుడు ముగ్గురు సహచరులు వున్నారు, చాలా ఉత్సాహవంతులైన కార్యకర్తలు. యీ సంగతి మీకు సంతోషం కలిగిస్తుంది కదా. అయిదు వేర్వేరు

మురికివాడలు వున్నాయి. కొన్ని గంటలు అక్కడ గడుపుతాం. యెంత వేదన, యెంత లేమి. సిస్టర్లు వెళ్లినప్పుడు వాళ్ల ఆత్రుతాభరిత ముఖాలు యెంతలా వెలిగిపోతాయో మీరు చూడాల్సిందే. వాళ్లు మురిగ్గానే వుండచ్చు, వొంటి మీద బట్టలు లేకపోవచ్చు. అయితేనేం వాళ్ల గుండెల్లో ప్రేమ నిండుగా వుంది.

ప్రియమైన సోదరీ, ధైర్యం చిక్కబట్టుకోండి, ఉల్లాసంగా వుండండి. కష్టంగా వుందే అని తోచినప్పుడు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ గురించి తలచుకోండి, భగవదేచ్ఛ పరిపూర్తి చెయ్యడంలో మనం ఏకం కాగలందుకు.

దేవుడు ఆశీర్వదించి, తన హృదయంలో సర్వదా మిమ్మల్ని నిలుపుకోగాక.

ప్రభువులో మీ ప్రేమతో
మదర్ ఎమ్.థెరెసా.

ఆర్నెల్ల తర్వాత మదర్ థెరెసా మళ్లీ జాక్వెలిన్‌కి రాశేరు. ఆమె ఆపరేషన్ జరిగేక కోలుకుంటున్నారు.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ,
14, క్రీక్ లేన్,
కలకత్తా–14.
19 నవంబరు, 1949.

ప్రియమైన జాక్వెలిన్,

మీరు 1949 నవంబరు 8న రాసిన ఉత్తరం నిన్న చేరింది. మీరు మళ్లీ ఆరోగ్యంగా వున్నారని తెలిసి చాలా సంతోషం కలిగింది. అంత మంచి తావులో వున్నందుకూ సంతోషం...

అవును, చెయ్యవలసింది యెంతో వుంది. ప్రస్తుతం మేము అయిదుగురం వున్నాం. దేవుని కృపవల్ల యింకా యెక్కువ మంది చేరవచ్చు. కలకత్తాలోని అనేక మురికివాడల్లో మా కేంద్రాల సాయంతో ఛారిటీ మోగించగలం. అక్కడి నుంచి మహాకలకత్తా మీద (దేవుని) ప్రేమ నిర్నిబంధంగా ప్రకాశించవచ్చు.

డిస్పెన్సరీలో డాక్టర్లు, నర్సులు అద్భుతంగా పనిచేస్తున్నారు. వాళ్లు ప్రజల్ని యెలా చూసుకుంటారనుకున్నారు, వాళ్లు దేశంలోని యువరాజులేమో ననుకుంటారు మీరు.

ప్రియమైన జాక్వెలిన్, చిన్న సొసైటీ కోసం, సిస్టర్స్ కోసం వీలైనన్నిసార్లు ప్రార్థనలు చెయ్యండి. ప్రస్తుతం వాళ్లంతా వాళ్ల వాళ్ల పరీక్షలకోసం చదువుతున్నారు. కాని పేదలన్నా, సేవా కార్యక్రమం అన్నా వాళ్లకి యిష్టం. మురికివాడల్లో పిల్లలు కేరింతాలతో ఆడుకుంటున్నారు, తెలుసా?

ధైర్యంగా వుండండి, ఉల్లాసంగా వుండండి. ఎక్కువగా ప్రార్థనలు చెయ్యండి.

జీసస్ క్రైస్ట్‌లో మీమీది ఆప్యాయతతో
మదర్ ఎమ్.థెరెసా.

ఆ తర్వాత వారాల్లో జాక్వెలిన్‌కి వరసగా ఆపరేషన్లు జరిగేయి. యేమాత్రం కదిలినా నొప్పిగా వుండేది. కూర్చోవడానికి కూడా ప్రత్యేకం పట్టీలు, జుబ్బాలు అవసరం అయేవి. యిక తను మిషనరీ ఆఫ్ ఛారిటీ కావడం మీద ఆశపెట్టుకోవడం వృధా అని ఆమెకి తేటతెల్లమైంది. మూడునెల్ల తర్వాత మదర్ థెరెసా, తనకి తట్టిన కొత్త వ్యూహ గురించి ఉల్లాసంగా రాశేరు.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ,
14, క్రీక్‌లేన్,
కలకత్తా–14.
20 అక్టోబరు, 1952.

ప్రియమైన కుమారి డెడెక్కర్‌కి,

బాగున్నారు కదూ? యెన్నోసార్లు మీ గురించి అనుకుంటూ వుంటాను. మీ బాధతో నా పనిని యేకం చేసుకుని చూస్తాను, అంచేత మీరు నాకు దగ్గర. యీవేళ మీకో కొత్త సంగతి తెలియచేస్తున్నాను. మీకు సంతోషం కలుగుతుందో, లేదో మరి. మీరు యెంతోకాలంగా తపన పడుతున్నారు, మీ హృదయంలో గాఢంగా మిషనరీయే మీరు. ఆధ్యాత్మికంగా మా సొసైటీతో యేకం కాలేరూ, మీకు యెంతో ప్రియమైందే కదా యిది? మేము మురికివాడల్లో యింకా అలాంటిచోట్లా పనిచేసేటప్పుడు అందులో మీరు ప్రార్థనల ద్వారా, పని ద్వారా మీ బాధతో, ప్రార్థనలతో భాగం పంచుకోవచ్చు. యిక్కడ పని అద్భుతంగా వుంది. నాకు యింకా సహాయకులు కావాలి, నిజమే. యీ పనికోసం బాధపడి ప్రార్థనలు చేసే మీలాంటివాళ్లు కావాలి. మీరు మా ఆధ్యాత్మిక సిస్టర్ కాగలరా? అలా మిషనరీ ఆఫ్ ఛారిటీ కాగలరా? భౌతికంగా బెల్జియంలోనే వుంటారు, మీ ఆత్మ మాత్రం ఇండియాలో వుంటుంది" అని రాస్తూ యింకా యిలా ప్రస్తావించేరు–

"యిప్పుడు మేం యిరవై అయిదు మందిమి వున్నాం. మరో అయిదుగురు వస్తామంటున్నారు. వాళ్లందరూ మిమ్మల్ని యెరుగుదురు. వాళ్లతో మీ గురించి చాలాసార్లు చెప్పేను. మీరు చేరితే గనక, వాళ్ల ప్రార్థనలలో మీకూ గొప్ప హక్కు వుంటుంది. ఆఁ, ఎలా వున్నారు? యింకా మంచం మీదనేనా? యింకా యెంత కాలం అలా? ప్రభువు తన బాధలో మీకూ అంత వాటా యిస్తున్నాడంటే మిమ్మల్ని యెంతగా మనసులో నిలుపుకున్నాడో? మీరు ధన్యులు, మీరు ఆయన కృప దక్కినవారు. ధైర్యంగా వుండండి, నాకు యింకా యివ్వండి. మీకోసం యెక్కువగా ప్రార్థన చేస్తాను.

జీసస్‌లో మీ
**ఎమ్. థెరెసా ఎమ్.సి"**

తర్వాత మదర్ కొత్త కాన్వెంట్ నుంచి రాశేరు. అక్కడి నుంచి అదే మొదటిది. అప్పటికి ఆవిడ వ్యూహాలకు ఒక రూపం వచ్చింది.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ,
14, క్రీక్ లేన్,
కలకత్తా–14.
13 జనవరి, 1953.

ప్రియమైన బిడ్డా జాక్వెలిన్,

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ బాధిత సభ్యులలో చేరేందుకు యిష్టంగా వుండడం సంతోషం. మురికివాడలలోని పేదల విముక్తికోసం పవిత్రీకరణ కోసం శిలువ మీద అర్పితమైన జీసస్ ఆర్తిని తీర్చడమే మన లక్ష్యం. మీరూ మీలాగ బాధపడేవారూ తప్ప యెవరు యింకా బాగా చెయ్యగలరీ పనిని? యీ ఆర్తిని తీర్చేందుకు మనకో కలశం కావాలి. మీరూ యితరులు, పురుషులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, పడుచువాళ్లు, పేదలు, ధనికులు యీ కలశ నిర్మాణానికి రావచ్చు. నిజానికి కాళ్లతో పరుగులు తీసే నా కంటే మీరే బాధతో మంచం మీద వుంటూ యీ పనిని బాగా చెయ్యగలరు. అయితే మీరూ నేనూ కలిసి మనకు శక్తి రావడానికి ఆయన నిమిత్తం అన్నీ చెయ్యగలం.

ప్రతిజ్ఞలు యేమీ వుండవు రోమన్ కాథలిక్ ఫాదర్ నుంచి అలా చెయ్యడానికి కొందరు అనుమతి పొందితే తప్ప. మనకు ఉమ్మడిగా వుండవలసిన ఒక అంశం యేమిటంటే, మనదీ సొసైటీ అన్న భావన. ఈశ్వరునికి త్రికరణశుద్ధిగా అంకితం కావడం. ఆదరపూర్వక విశ్వాసం, పరిపూర్ణ ఉల్లాసం. వీటివల్ల మిమ్మల్ని మిషనరీ ఆఫ్ ఛారిటీగా గుర్తిస్తారు. మిషనరీ ఆఫ్ ఛారిటీలో సభ్యులు కాదలచుకున్న యెవరైనా, ఈశ్వరుని ప్రేమవాహిక కాదలచుకున్న యెవరైనా రావచ్చు. అయితే నేను ముఖ్యంగా ఆహ్వానించేది కదలలేనివాళ్లని, అవిటివాళ్లని, జబ్బులు నయంకానివాళ్లని. యిక యిటువేపునుంచి సిస్టర్లకి ఒక్కొక్కళ్లకీ ఒక్కొక్క ప్రార్థించేమనిషి, బాధపడేమనిషి, చింతన చేసే మనిషి, జాబులు రాసే మనిషి వుంటారు, అంటే ప్రతిబింబం... మిమ్మల్ని నా బాహ్యరూపంగా పొందడం నాకు చాలా ఆనందంగా వుంది, మీకు కృతజ్ఞురాల్ని.

ప్రియమైన సోదరీ, భగవంతుడు
మిమ్మల్ని ఆశీర్వదించుగాక
జీసస్‌లో మీ
మదర్ థెరెసా

1953 ఫిబ్రవరిలో మదర్ థెరెసా, సిస్టర్లు 54 ఎ, లోయర్ సర్క్యులర్ రోడ్‌లో యింటికి మారేరు. అక్కడి నుంచి ఆవిడ రాశేరు.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ,
54 ఎ – లోయర్ సర్క్యులర్ రోడ్,
కలకత్తా.
15 మార్చి, 1953.

ప్రియమైన సిస్టర్,

ఎట్టకేలకు మా కాన్వెంట్ కి వచ్చేం. దీన్ని చూడాలని మీరు ఆత్రుతగా వుంటారని తెలుసు. యెవళ్లన్నా ఫోటో తీస్తే పంపిస్తాను.

నేను మీకు రాయలేదుగాని నా ఆలోచనలన్నీ మీ మీదే వున్నాయి. పరిస్థితులు గడ్డుగా వున్నప్పుడు నా అంతరాత్మ ప్రోత్సాహం పొందుతుంది, నా కోసం మీరు ప్రార్థనచేసి బాధపడతారన్న ఆలోచనతో, అప్పుడు నాకు తేలికపడ్డట్టు అనిపిస్తుంది. భగవంతుని కృపాముద్ర కోసం చిరునవ్వు మరింత వేగంగా వస్తుంది. మీరు యివ్వగలిగినదంతా నాకు అవసరమే. సిస్టర్లు కూడా తమ సిస్టర్లకోసం అలానే అనుకుంటూ వుంటారు. వాళ్లు ప్రస్తుతంలో రాయలేరు, తమ కార్యనిర్వహణ కోసం సమాయత్తమవుతున్నారు. మొదటి పదిమందీ ఏప్రిల్ 12న దీక్ష పొందుతారు. వాళ్లు ఒక ఏడాదికిగాను ప్రమాణాలు చేస్తారు. అదే రోజున నేనూ నా తుది ప్రమాణం చేస్తాను.

1956 జనవరి 9న ఆవిడ రోగగ్రస్తులకీ, బాధితులకీ సామాన్యంగా ఉద్దేశించి రాశేరు.

9 జనవరి, 1956.

ప్రియమైన సోదర సోదరీమణులారా,

సిస్టర్ల తరఫునా, నా తరఫునా అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు. యీ సంవత్సరం సుఖసంతోషాలు అందించాలని కోరుతున్నాను.

మేం ఉత్తరాలు రాయలేకపోతే మరొకలా అనుకోకండి. మీ అందరి పట్ల మాకున్న ప్రేమాభిమానాలు యేమాత్రం తగ్గవు. నిజానికి మరింత ఉధృతమవుతాయి. మేమంతా మీతో ఒకళ్లకొకళ్లం యెంత సన్నిహితంగా వున్నామో తెలుసుకుని ఓ రోజున మీరు ఆశ్చర్యపోతారు. 1955వ సంవత్సరం సత్ఫలితాలను యిచ్చింది. మా బళ్లో 1114 మంది పిల్లలున్నారు; 1416 మంది ఆదివారం బళ్లల్లో వున్నారు, 48,313 మందికి చికిత్స జరిగింది. అవసానదశలో వున్న 1546 మందికి సాయం చేశాం. అంచేత మీరు పడిన బాధలకు ఫలితం దక్కింది. మేం చేసే ప్రతి పనిలోనూ మీకూ సగం వాటా వుంది.

దేవుడు మిమ్మల్నీ మమ్మల్నీ కరుణించుగాక,<br>
జీసస్‌లో మీ<br>
**ఎమ్. థెరెసా**

1956 జూలై 18న ఆవిడ ఆమెని మొట్టమొదటసారి జాక్వెలిన్—థెరెసా అని సంబోధిస్తూ రాశేరు.

"నా మౌనం మీకెంత కష్టం కలిగించిందో. దయచేసి మన్నించండి. మొత్తం రోజంతా పనే. యెంతో ఉదారంగా దానం యిచ్చిన అందర్నీ నా పేరు మీద

స్తుతించండి. ఆ డబ్బుని కాన్వెంట్ కోసమే ఖర్చు చేశాం... సిస్టర్ గెర్ట్రూడ్ ఎమ్.బి.బి.యస్. పరీక్ష మూడవ రేంకు పొందింది. సిస్టర్ ఫ్రాన్సిస్ గ్జావియెర్ డి.ఎమ్.ఎస్. పరీక్షలో బెంగాల్‌లో రెండవ రేంకు పొందింది. త్వరలోనే మా డాక్టర్లు అంది వస్తున్నారు".

1958 మే 21వ క్లుప్తంగా, తొందర్లో రాసేరు.

"యిప్పుడు డెబ్భైఆరు మందిమి వున్నాం. త్వరలోనే యింకో ఎనమండుగురు వస్తారు. భారతదేశంలోని నాలుగుమూలల నుంచీ వాళ్లు వస్తారు, కొత్తదారిలో. మనకి యూరప్‌నుంచీ యితర దేశాల నుంచీ యేదో ఓ రోజున యిలానే వస్తారని ఆశిస్తా.

మేం చేస్తూ వున్న కుష్ఠురోగ చికిత్సా కార్యకలాపాలు గురించి మీరు వినే వుంటారు. ఎనిమిది కేంద్రాల్లో వాళ్ల కోసం సంచార చికిత్సాలయాలు వున్నాయి. వాళ్లకో కాలనీ ప్రారంభించాలని అనుకుంటున్నాను."

తర్వాత ఉత్తరం 1961 మార్చి 10వ ఆగ్రా నుంచి రాశేరు. ఓ యేడాది కాలంలో ఆవిడ నాలుగు నూతన గృహాల్ని ప్రారంభించేరు.

ప్రియమైన జాక్వెలిన్–థెరెసా,

యేమైందీవిడకు అనుకుంటున్నారేమో కదూ? యేం చెప్పను, ప్రతిక్షణం సిస్టర్లు లాగేసుకుంటున్నారు. యిప్పుడు 127మంది (సిస్టర్లు) వున్నారు. ఢిల్లీ, రాంచీ, ఆగ్రా, ఝూన్సీ, క్రీక్‌లేన్, కలకత్తాలలో గృహాలు వున్నాయి. మళ్లీ నెల సిమ్లా వెడుతున్నాం.

మీ గురించి అన్ని విషయాలూ రాయండి. ఆగ్రాలో బోలెడు పని వుంది. ఢిల్లీలో సిస్టర్లు మంచి పని చేస్తున్నారు. ఇంగ్లీషు, జర్మన్, అమెరికన్, మాల్టీస్ దీక్షార్థులు వున్నారు. మరి బెల్జియన్ యెప్పుడు వస్తున్నట్టు? మీరు సాయం చెయ్యాలి.

ఈశ్వర ఆశీర్వాదాలతో

ఎమ్.థెరెసా, ఎమ్.సి.

1965 నాటికి జాక్వెలిన్ డెడెక్కరు భరించాల్సిన యాభై సర్జరీలలోనూ సగం అయేయి. 1965 ఏప్రిల్ 22వ తేదీ నాటి ఉత్తరంలో మదర్ థెరెసా యిలా రాశేరు!

"మీ సమాచారం తెలిసి యెంతకాలమైంది. చాలా సార్లు మిమ్మల్ని తలుచుకుంటూ వుంటాం. మీరు నా బాహ్యరూపం, యెంత బాధను అనుభవిస్తూ. అందుకనే నేమో నేను తిరగ్గలుగుతున్నాను, పని చేస్తున్నాను. మాకు యెన్ని గృహాలు వున్నాయో అన్ని ఆపరేషన్లు అయి వుంటాయి మీకు... జబ్బు పడ్డం, బాధపడడం అంతా మీరే చేస్తూ వుండాలి. యేమంటే దూరప్రాంతాలకు 3వ* తరగతిలో నేను అందుకే వెళ్లగలుగుతున్నాను. యిప్పుడు యిక్కడ 235మంది సిస్టర్లు వున్నారు. యింకో 30 మంది కొత్త అమ్మాయిలు చేరబోతున్నారు."

---

* అప్పట్లో అదే కారుచవక రైలు ప్రయాణం. తర్వాత దాన్ని రద్దు చేశారు. యిప్పుడు మొదటి తరగతి, రెండవ తరగతి మాత్రమే వున్నాయి.

1972 డిసెంబరు 16న మదర్ థెరెసా ఆందోళనగా జాక్వెలిన్‌కి రాశేరు.

ప్రియమైన జాక్వెలిన్-థెరెసా,

నా మనసూ ప్రార్ధనలూ యెక్కువగా మీ గురించే. ఏ మాత్రం శరీరం స్వాధీనంలో లేకపోయినా, బాధతో నలిగిపోతున్నా మీరు యీ తల్లికోసం సకలసేవలూ చేస్తూ వున్నారు. అలాంటిదాన్ని యివాళ ఆరోగ్యవంతులు కూడా చెయ్యడంలేదు. మీ జీవిత త్యాగమే నాకు శక్తి. మీ తల్లి విషాదవేషంలో వున్న క్రీస్తు. ఆమె పట్ల మీరు చూపించే శ్రద్ధ మిమ్మల్ని నిర్మల్ హృదయ్‌లో నాకు సన్నిహితం చేస్తోంది. యిక్కడి వాళ్లు ప్రేమ కోసం, ఆదరణ కోసం తపిస్తున్నారు. మీకు ఆపరేషన్ జరిగినప్పుడు నేను అక్కడికి వచ్చి మీ తల్లిగారి సంరక్షణ చూడగలిగితే బాగుండును.

యిక ఉత్తరాల విషయానికొస్తే జనం మమ్మల్ని రొట్టెముక్కల్లా తినేస్తున్నారు. ఉత్తర ప్రత్యుత్తరాలని అలా సాగిస్తూ వుండడం నాకు (కష్టం). నేను అర్ధరాత్రి రెండు గంటలకు పక్క మీదకు చేరతాను. మళ్లీ తెల్లవారకట్ల 4-40కు లేస్తాను. పడుచు సిస్టర్లని అలానే వుండమని అడగలేను కదా. అంచేతనే రాయలేకపోవడం."

ఆ రోజుల్లో మదర్‌థెరిసా యెప్పుడూ ప్రయాణాలు చేస్తూనే వున్నారు. 1974 జూలై 26న రాసిన ఉత్తరంలో ప్రయాణం గురించిన ప్రస్తావన వుంది.

"మీ ఉత్తరం యెంత సంతోషాన్ని కలిగించిందో, శక్తిని కూడానూ. మీ దయవల్లనే ఎనిమిది రాత్రుళ్లు రైల్లోనూ, పగళ్లు పనిలోనూ గడపగలుగుతున్నాను."

రోజులు గడిచే కొద్దీ సమయం ఒత్తిడి, అనారోగ్యం మదర్ థెరెసాని కుంగదీశాయి. జాక్వెలిన్‌కి ఆవిడ రాస్తే ఉత్తరాలూ తగ్గేయి. మదర్ థెరెసా "మదర్ హౌస్"లో టెలిఫోన్ పెట్టేందుకు సరేనన్నాక, జాక్వెలిన్ రానురాను దాన్నే ఉపయోగించుకుంది. అయితే అడపాదడపా ఒకటీ, రెండూ ఉత్తరాలు లేకపోలేదు. ఓ రకంగా యిటీవలిదే అవి చెప్పగలిగిన ఉత్తరం 1990మార్చి 13న రాసినది. మదర్ థెరెసాకీ అనారోగ్యంగా వుండింది. ఆవిడ హాస్యధోరణి మెరిసే ఉత్తరం.

"మీ చెవిలో హోరు యింకా వుందా, రాత్రిళ్లు నిద్రపోలేకపోతున్నారా, యే మందులూ పనిచెయ్యడం లేదా. నాకు బాధగా వుంది. ప్రభువు తనను నమ్ముకున్న వాళ్లని యిలానే పరీక్షిస్తాడు. మీ దంతాలకీ, దవడ ఎముకకీ జరిగిన ఆపరేషన్ వికటించడం బాధగా వుంది. మళ్లీ ఆపరేషన్ జరగాలన్నమాట. మీకు బాధా పరీక్షలు పెట్టిన కృపామయుడు వందలరెట్లు కనికరిస్తాడు. 1) అల్బేనియా 2) లెనిన్‌గ్రాడ్ 3) రుమేనియా. యింత ధారగా కానుకలివ్వవద్దని ప్రభువును అర్ధిస్తాను. యేమంటే, నిజంగా సరైన విరామం వుండాలి.

ఈశ్వర కృప

**ఎమ్.థెరెసా, ఎమ్.సి.**

మదర్ థెరెసా "ప్రతిబింబరూపాలు" యాభైయేడు దేశాల్లో రోగగ్రస్త, బాధిత సహకార్యకర్తల హారం 5000 మందికి మించి వుంది. యీ సంఖ్యలో 2,500 మంది చనిపోయినవాళ్లూ, యితరుల స్థానంలో వచ్చిచేరిన వాళ్లు కలవలేదు. ఒకోసారి

యిద్దరు సహకార్యకర్తలు ఒక నన్‌కే రాస్తారు. యిలాంటి సహకార్యకర్తల గరిష్ట సంఖ్య ఇంగ్లండ్‌లో 400, ఫ్రాన్స్‌లో 300, యు.ఎస్.ఎ, కెనడాల్లో చెరి రెండేసి వందలూ వుంటుంది.

అంట్‌వెర్ప్ నుంచి ఆ మర్నాడు వచ్చేస్తాననగా జాక్వెలిన్‌తో ఆవిడ బల్ల దగ్గర కూర్చున్నాను. ఆరోజే అందిన కొన్ని ఉత్తరాల్ని ఆవిడ చదివి వినిపించేరు. యునైటెడ్ స్టేట్స్‌నుంచి మనసు కదిలించివేసే ఉత్తరం ఒకటుంది.

> "నాకు ముప్పైయేళ్లు. ఇరవైరెండో యేట నుంచీ అనేక రక్తనాళాలు గడ్డకట్టుకుపోవడం వ్యాధితో బాధపడుతున్నాను. హాస్పిటల్‌లో చాలా, చాలాసార్లు వున్నాను. చక్రాలబండికో, మంచం పట్టడానికో త్వరలోనే దారితియ్యవచ్చని న్యూరాలజిస్టు అంటున్నాడు. బహుశా ఆయనకు తెలీదేమో పరమేశ్వరుడే మహావైద్యుడు, తను కాదు అని.
>
> మంచం పట్టినప్పుడు ప్రోత్సాహకరమైన ఉత్తరాలు రాస్తూ, యితరుల కోసం ప్రార్థిస్తూ యెన్ని గంటలు గడిపానో చెప్పలేను. భగవంతుని కృప వుంటే చాలని, నా అవసరం యేదో ఆయనకు వుందనీ, ప్రపంచవ్యవస్థ నన్ను తిరస్కరించినా కూడా అంతే వుండచ్చనీ గత యెనిమిది యేళ్లలో నేను తెలుసుకున్నాను.
>
> శారీరకంగా దారుఢ్యంతో నేను చెయ్యలేని పని యితరులు చేస్తున్నందుకు, వాళ్లకోసం నేను ప్రార్థనలు చెయ్యవలసిన ధర్మం నా మీద వుంది. మదర్ థెరెసా కోసం ప్రార్థనలు చేస్తున్నాను."

వేరే ఉత్తరాలనీ జాక్వెలిన్ చదివి వినిపించింది. కొన్ని మానసిక క్షోభలో వున్నాయి. కొన్ని ఆశావహంగా వున్నాయి. వాటిలో ప్రతీదీ మదర్ థెరెసా చిరువూహలో నుంచి పుట్టిన పెద్దగొలుసులో ఒక భాగమే. జాక్వెలిన్ యెంత చక్కగా బదులు తీర్చుకున్నారు! నేను సెలవు తీసుకుంటూ లేచేను. "మానసికంగా నేను యెప్పుడూ భారతదేశానికి చెందినదాన్నే. మదర్ థెరెసాను ఒక కోరిక కోరేను. నేను చనిపోయినప్పుడు నా భౌతికకాయాన్ని మిషనరీస్ ఆఫ్ ఛారిటీ చీరకట్టి ఖననం చేయించమని. జీవితకాలంలో చెయ్యలేకపోయిన దాన్ని యేదో ఉడతాభక్తిగా మరణంలోనేనా చెయ్యవచ్చని" అందామె.

* * *

# 8 శిశుభవన్

1975వ సంవత్సరం, జనవరి నెలలో ఓ రోజు ఉదయం యింకా వెలుతురు నాలుగువైపులా పరుచుకోలేదు. చిరుచలిగా వుంది. కలకత్తాలో ఉదయం శీతలగాలులు అలాగే వుంటాయి. ఓ సైకిల్ రిక్షా లోయర్ సర్క్యులర్ రోడ్‌లో వున్న నిర్మలా శిశుభవన్ దగ్గర ఆగింది. ఒకావిడ రిక్షా దిగింది. సుమారు ఓ ముప్పై యేళ్లుంటాయి. చేతిలో చంటిబిడ్డ. నాలుగైదేళ్లుంటాయేమో. మగబిడ్డ. ఆమె బిడ్డకు శాలువా కప్పింది, గట్టిగా అదుముకునే వుంది, అదే ఆఖరిసారి అయినట్టు. పాతకాలం గంట, తాడు లాగితే యింట్లో మోగుతుంది. ఆ తాడు ముందు క్షణంసేపు అలాగే నుంచుండిపోయింది. వెంటనే పక్క తలుపు తెరుచుకుంది. గుమ్మం పక్కనే వున్న చిన్నగదిలోకి ఆమెని తీసుకెళ్లారు. అక్కడ ఆగి ఆగి తన విషాదగాథను చెప్పుకుంది.

ఆమె బిడ్డటు. యెన్ని సమస్యలతోనో పుట్టేడట. యించుమించు బిడ్డ చేటలో పడ్డ రోజు నుంచీ తనూ భర్తా హాస్పిటళ్ల చుట్టూ, క్లినిక్‌ల చుట్టూ తిరుగుతూనే వున్నారట. రెండేళ్లనాడు భర్త ప్రమాదంలో మరణించేడు. తనూ, పిల్లాడూ దిక్కులేని వాళ్లయిపోయేరు. పిల్లవాడు యిక లాభంలేదని డాక్టర్లు చెప్పేరు. చాలా యిళ్లల్లో చాకలి పనిచేసిందట. తెల్లవారుతూనే పనికి వెళ్లేదట. పిల్లవాణ్ణి పగటిపూట యెక్కడ పెట్టడానికీ లేకపోతోందిట. వాళ్ల యింటి దగ్గర్లో వున్న క్రెష్ దగ్గరక్కూడా వెళ్లిందట. తనకా అంత స్తోమత లేదు. కాని రోగిష్టి పిల్లాడ్ని చేర్చుకోమని వాళ్లు అన్నారట. తనకి మదర్ థెరెసా గురించి అంతకు ముందు వారమే తెలిసిందట. తను పనిచేసే యింటావిడ ఒకరు చెప్పింది పిల్లాణ్ణి శిశుభవన్‌కు తీసుకువెళ్లమని ఆవిడ అందట. యిక తనకి మదర్ థెరెసాయే దిక్కు.

ఆ పిల్లాడు పేరు బాపి. ఆ కుర్రాడికి వెన్నుపూస లోపం యేదో వుంది. రక్తనాళాలు గడ్డకట్టిపోతాయి. యేమాత్రం కదలలేడు. పక్కకి ఒత్తిగిల్లను కూడా ఒత్తిగిల్లలేడు, కనీసం గోక్కోలేడు. యివి చాలవన్నట్టు చెవుడు, మూగ. కళ్లు పెద్దవి. మనసులో వున్న దాన్ని తెలియచేస్తూ వుండే కళ్లు. సంతోషంగా వున్నప్పుడు మిలమిల మెరుస్తాయి. విచారంగా వుంటే ముఖం యెర్రబడుతుంది. వెక్కిళ్లమీద కన్నీళ్లు కారతాయి. యేదన్నా అడిగితే నోరు బాగా తెరిచి, అబ్బా అంటున్నట్టు నిట్టూరుస్తాడు. అదే అతని జవాబు. అతికష్టం మీద సిస్టర్లు బాపి "భాష"ను అర్థం చేసుకోగలిగేరు.

ఆ పిల్లాడు కూర్చోవా లనుకుంటున్నా, పడుకోవా లనుకుంటున్నా, టాయిలెట్ కి తీసుకెళ్లండి అంటున్నా, చక్రాల కుర్చీలోకి తీసుకువెళ్లండని చెప్పాలనుకుంటున్నా అతని సైగని బట్టి అర్థం చేసుకోవడం మొదలుపెట్టేరు. అతను ఉల్లాసంగా యెప్పుడుంటాడో, యెప్పుడు కళ్లమ్మట నీళ్లు తిరుగుతాయో వాళ్లు గ్రహించ గలిగేరు. తమ సంరక్షణలో వుండే యితర పిల్లల్ని యెంతలా వెయ్యికళ్లలో చూసుకుంటారో, అంతలా బాపీనీ చూసుకోవడం వాళ్లకి సహజం.

కొన్నేళ్లుగా నేను బాపిని అడపాదడపా చూస్తూ వున్నాను. అతనికి ఎనిమిదేళ్ల వయసున్నప్పుడు చూశేను. చక్కని ముఖం, నల్లని కనుబొమలు. ఓ సిస్టర్ ద్రవాహారం యిస్తోంది. ఓ అరగంట తర్వాత నేను బయటకు వచ్చేసినా, ఆ పని జరుగుతూనే వుంది. ఆ తర్వాత రెండేళ్లకు కామోసు మళ్లీ చూశేను. ఆ పూట అతను సిస్టర్లతో "మాట్లాడే" యత్నంలో వున్నాడు. అతనా ప్రయత్నం చేస్తూ వున్నప్పుడు మొత్తం శరీరం గూడా అంతా కదిలిపోయింది. యెంత తీవ్రంగాసంటే చక్రాల కుర్చీలోనుంచి పడిపోతాడేమో కుర్రాడని భయపడ్డాను. తల్లి రావడం లేదట. చనిపోయి వుంటుందని సిస్టర్లు అనుకున్నారు. అప్పట్నుంచీ సాలుకు రెండు మూడు సార్లు అతన్ని చూశేను. అతని పధ్నాలుగో పుట్టినరోజు తర్వాత అతన్ని చూశేను. అతను పై అంతస్తులో ఉల్లాసంగానే వున్నాడు. అక్కడ సిస్టర్లు నెలలు తక్కువగా పుట్టిన బిడ్డల్ని, జబ్బు ముదిరిపోయిన వాళ్లనీ అనుక్షణం కనిపెట్టుకునే వుంటారు. నేనతన్ని చూడ్డం అదే అఖరుసారి.

1991 అక్టోబర్లో ఫోటోలేవో తీసుకుందామని నిర్మలా శిశుభవన్ కు వెళ్లేను. ఆ కుర్రాడు మామూలుగా వుండే చోట్లో కనిపించలేదు. అప్పుడు చెప్పారు బాపి చనిపోయేడని. పెద్ద దగ్గు, జ్వరం వచ్చేయట. యేమీ తినేవాడు కాదట. బతిమాలి బామాలి కొంచెం పాలు తాగించేవారట. అతన్ని చూసే డాక్టరు లాభం లేదన్నారట. జూలై 28 పొద్దున్న బాపి చనిపోయేడట. వాళ్లు చాలా బాధపడ్డారు. బాపి ఫోటోలు చూపించేరు. అఖరిఫోటో కాళీఘాట్ కి దహనం కోసం తీసుకువెళ్లినప్పుడు తీసింది. బాపి హిందువు కదా. పువ్వుల దండలు కప్పేరు. చుట్టూతా ఏడుస్తూ వున్న సిస్టర్లు, నిర్మలా శిశుభవన్ పిల్లలు వున్నారు.

ప్రతి శిశుభవన్ కీ యిలాంటి దుఃఖం వుంటూనే వుంటుంది. అయినా యీ భవన్ లు విచార స్థలాలు కావు. కాకపోవడమేనా, నవ్వుతూ తుళ్లుతూ ఆడుకునే పిల్లలతో వుంటాయి. మంచి తెరలు, గోడల మీద రంగురంగుల పోస్టర్లు, నేల మీద చెల్లాచెదురుగా పడి వున్న ఆటబొమ్మలు. పిల్లలు రకరకాల రంగుల బట్టలు వేసుకుంటారు. యెవళ్లో దానం చేసినవే కాబట్టి అవి పొట్టిగా వుండచ్చు, పొడుగవచ్చు. నవ్వులు యెప్పుడూ గింగుర్లెత్తిస్తూనే వుంటాయి. యీ సంస్థని నిర్వహించే సిస్టర్లు యిద్దరో ముగ్గురో కనిపిస్తూనే వుంటారు. దీక్షార్థులు వాళ్లకి సాయం చేస్తూనే వుంటారు. యెవళ్లేనా చూడ్డానికి వచ్చినప్పుడు తప్పటడుగులు వేసే పిల్లలు వూహించేటట్టుగానే ప్రవర్తించుకుంటూ వుంటారు. కొందరు తలయెత్తి చూడను కూడా చూడకుండా తమ దారిన తాము వుంటారు. కొంతమంది యే బట్టలచాటుకో, చీర చాటుకో పోయి దాంకుంటారు. కలివిడిగా వుండే పిల్లలు ముందుకొచ్చి "అంకుల్"కి పరిచయం అవుతారు. వాటేసుకుని ఫోటోలు

తీయించుకుంటారు. మదర్ థెరెసా నిర్వహించే యితర హోమ్‌లకీ వీటికీ యెంత తేడా. ఆ హోమ్‌లు నైష్ఠకంగా వుంటాయి. అలా చూస్తే శిశుభవన్‌లు వైభవోపేతంగా వున్నట్టే. తల్లిదండ్రుల ప్రేమకు సాటిగా వుండేటట్టు మదర్ థెరెసా యిలా వుండేట్టు చూస్తారేమో.

భారతదేశంలో సిస్టర్స్ ఆఫ్ ఛారిటీ ప్రారంభించిన పిల్లల హోమ్‌లకు సాధారణంగా వున్న పేరు శిశుభవన్. వాటిని మామూలుగా కాన్వెంట్‌ల దగ్గర నిర్వహిస్తారు. నెలలు తక్కువ బిడ్డలకీ, జబ్బుగా వున్న పిల్లలకీ నిరంతర సంరక్షణ అవసరం. బిల్డింగ్‌నిబట్టి పిల్లల సంఖ్య వుంటుంది. పెద్దదైతే యెక్కువమంది వుంటారు, చిన్నదైతే తక్కువమంది వుంటారు. యిరవై నుంచి రెండువందలమంది దాకా అలా వుండచ్చు. నెలగుడ్డునుంచి ఏడేళ్ల పిల్లల దాకా వుండచ్చు. మాటకు, ఢిల్లీలో రెండు శిశుభవన్‌లు వున్నాయి. ఒకటి ముందు నుంచీ వున్నది. చిన్న భవనం. యాభై ఉయ్యాలలు వుంటాయి. కొత్తది ఓ పారిశ్రామికవేత్త కొన్నేళ్లనాడు మదర్ థెరెసాకు కానుకగా దాన్ని కట్టించి యిచ్చేడు. రెండేళ్ల వయసు నుంచి పైబడ్డ పిల్లలందరూ వున్నారు. సుమారు రెండువందల మంది వుంటారు. కొన్ని శిశుభవన్‌లో చోటు వుంటే గనక చిన్న కిండర్‌గార్టెన్‌లని పెట్టేరు. అయితే చాలామట్టుకు పిల్లల్ని దగ్గర్లో వున్న మామూలు బళ్లకి పంపిస్తారు. యూనిఫాంలు, పుస్తకాలతో సహా విద్యకయే ఖర్చంతా మిషనరీస్ ఆఫ్ ఛారిటీయే భరిస్తుంది.

వాళ్ల కుష్ఠకేంద్రాల్లో ఒకోదాంట్లోనూ ఒక శిశుభవన్ స్థాపించాలని మదర్ మహా గట్టి ప్రయత్నం చేస్తున్నారు. పశ్చిమబెంగాల్ శాంతినగర్‌లో ఓ శిశుభవన్ వుంది. పల్లెటూరి వాతావరణం. కుష్ఠురోగులు యిష్టం వచ్చినన్నిసార్లు శిశుభవన్ సందర్శించేందుకు సిస్టర్ అల్బర్ట్ ఒప్పుకుంటారు. కాని పిల్లల్ని వాళ్లు ముద్దుపెట్టుకో కూడదు. అలా దూరం చెయ్యడం వాళ్లని గాయ పరుస్తుందనీ, మరీ యేమంటే చికిత్స దీర్ఘకాలం వుంటుందనీ నేనన్నాను. అప్పుడు మదర్ శాంతినగర్ దగ్గర ఒకామె గురించి వివరించేరు. ఓ రోజున పిల్లవీపు మీద అనుమానంగా తోచే మచ్చ కనిపించిందట. భయపడిపోయి పిల్లని మూడుమైళ్లు దూరంలో వున్న కుష్ఠ కేంద్రానికి తీసుకుపోయేరట. ఆ ఆడమనిషికే అంత తీవ్రంగా అది సోకి వుండకపోతే, పాదాలు కొరుక్కుని వుండకపోతే అంత అసాధారణం యేమీ కాదట. ఆ మచ్చ కుష్ఠ అని తేలగానే బిడ్డని శిశుభవన్‌లో చేర్చుకోండంటూ కాళ్లవేళ్లా పడింది. ఆమె రోజూ వచ్చేది. ఒకోసారి ఆవిడ చేతులు బిడ్డ దగ్గరకంటా చాచుకునేవి. బిడ్డను చేతుల్లోకి తీసుకొని ముద్దుపెట్టుకోవాలని. మళ్లీ వెనక్కి వెళ్లిపోయేది. ఆ తల్లికి బిడ్డ పట్ల వున్న గాఢమైన ప్రేమను నేను మర్చిపోలేను" అని ఆవిడ అన్నారు.

అయినా బాపి, గీత లాంటి వాళ్ల విషాద జీవితాలే మనసులో మాసిపోకుండా వుంటాయి. చిరునవ్వు అంటే యేమిటో తెలియని పిల్ల గీత. శాంతినగర్ శిశుభవన్‌లోని ఉయ్యాలలో ఆ పిల్ల నుంచుంది. అందులో వింత యేమీ లేదు, ఆ పిల్లకి మూడేళ్లు అన్నది తప్ప. మూడేళ్ల పిల్లలు ఉయ్యాల్లో వుండరు కదా. మిగిలిన పిల్లలు నేల మీద దొర్లుకుంటూ కేరింతలు కొడుతున్నారు. కొంతమంది బొమ్మల్తో ఆడుకుంటున్నారు. తను మాత్రం గోడకేసి చూస్తూ నుంచుంది.

నేను సిస్టర్ ఆల్బర్ట్‌తో అక్కడ నుంచున్నంత సేపు మాకేసి చూడనే లేదు. యెందుకనో సిస్టర్ ఆల్బర్ట్ చెప్పింది. కొన్నేళ్ల క్రితం దగ్గర్లోవున్న "దుంకా"లో ఘోరమైన అగ్ని ప్రమాదం జరిగిందట. యీ పిల్ల కన్నవాళ్లతో సహా యెంతోమంది ఆహుతైపోయేరట. అగ్నిమాపకదళం వాళ్లు గీతని రక్షించి హాస్పిటల్‌కు తీసుకువెళ్లారట. కొన్ని వారాలపాటు చావుబతుకుల మధ్య వూగిసలాడిందట. యెలాగైతేనేం బతికి బట్టకట్టింది. కాని ముఖం అంతా మచ్చలు పడిపోయేయి. దూరపు బంధువు కూడా యెవరూ వున్నట్టు కనిపించలేదు. ఆఖరికి యిక పిల్లని హాస్పిటల్‌లో వుంచుకోవడం కుదరదని తేలింది. ఆ పిల్లని శాంతినగర్ మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి పంపించేరు. నోరు బాగా తెరవడానికీ, వేళ్లు యింకా కదిలించగలగడానికి యింకా ఆపరేషన్లు చెయ్యాల్సి వుంది. ఉచితంగానే చేస్తామని డాక్టర్లు అన్నారు. అయితే పిల్ల మళ్లీ మామూలుగా కనిపించాలీ అంటే చాలా ప్లాస్టిక్ సర్జరీ చెయ్యాలిట. "గీత యెంతలా గాయపడిందంటే యిప్పుడు పిసరంత నొప్పి కూడా యెక్కువసేపు తట్టుకోలేదు" అంది సిస్టర్ ఆల్బర్ట్. "చూడాలి యేం జరుగుతుందో, మరి. మొదట మనసులో బాధ మరిచి పోయేటట్టు చెయ్యాలి" అంది.

నెలలు తక్కువ పిల్లలు, గర్భస్రావం విఫలమై బయటపడ్డ పిల్లలు, మాదక ద్రవ్యాల ప్రభావంతో గర్భస్థ పిండాలు దెబ్బతిని పుట్టిన పిల్లలు చాలా మంది బతికి బట్టకట్టలేరు. ఎన్నోసార్లు అలా మృత్యుముఖంలో వున్న పిల్లల్ని సిస్టర్ల దగ్గరకు తీసుకువస్తారు. యెలాగూ ఓ గంటలో కన్ను మూయబోయే పిల్లల పట్ల అంత సమయమూ, ధనమూ వ్యయం చెయ్యడం వల్లా తమ సంస్థకేమన్నా ప్రయోజనం వుందా అని చాలాసార్లు మదర్‌ని అడిగేవాళ్లు. వాళ్లశ్రమని మరింత ఉపయోగకరమైన వాటిల్లో పెట్టవచ్చుకదా? "యేమిటా మాటలు" అని కోపంతో గద్దించేవారు ఆవిడ. "పిల్ల క్షణాల్లో చనిపోతూ వున్నా గానీ, యెవరూ పట్టించుకోకుండా నిరాదరణతో ఆ పిల్ల చనిపోరాదు. పసిగుడ్డు కూడా మానవ ఆదరాన్ని అర్థం చేసుకుంటారు. అందుకనే చనిపోతూ వున్న పిల్లల్ని కూడా ఆదరంగా చూడాలి, ఓదార్చాలి. కలకత్తాలో ఓ పరిహాసోక్తి వుంది, తెలుసా. మదర్ థెరెసా కుటుంబ నియంత్రణ గురించి మాట్లాడతారు. కాని ఆవిడే దాన్ని అమలు చెయ్యరు. యేమంటే– రోజూ యింకా యింకా యెక్కువ మంది పిల్లలు ఆవిడ దగ్గరకు వస్తూనే వున్నారు" అన్నారావిడ. "కలకత్తాలో వున్న ప్రతివాళ్లకీ తెలుసు ప్రతి బిడ్డనీ నేను ఆదరిస్తానని. నేను యెన్నోసార్లు చెప్పేను, మీకు బిడ్డలు అఖ్ఖర్లేనట్లయితే నా దగ్గరకు పంపించండి, వాళ్లను చనిపోనియ్యకండి."

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ యే పిల్లనైనా ఆదరిస్తుంది. ఆ పిల్ల తీవ్ర అవకరంతో వున్నా, నెలలు తక్కువగా పుట్టినా అంటూ కలకత్తాలోని ప్రతి వైద్యశాలకీ నెలకో రెండునెలలకో ఉత్తరాలు వెడుతూనే వుంటాయి. విజ్ఞాపనలు చేసినా, యిబ్బంది పెట్టే ప్రశ్నలేమీ అడగనని చెప్పినా అబార్షన్ క్లినిక్స్ సర్వదా ముందుకు రావడం లేదు. అవకాశం వున్న అన్ని చోట్లా దిక్కులేని గర్భవతుల్ని సిస్టర్లు ఆదరంగా పిలుస్తారు. కాన్పు అయేదాకా తమ కేంద్రాల్లో పని చెయ్యమంటారు. "వాళ్లు వీధుల్లో పడకుండా వుండేందకని", అని ఓ సిస్టర్ అంది. కాన్పయేక తల్లి పిల్లని

యెంత బతిమాలినా తీసుకోకపోతే, లేదా పిల్లని సంరక్షించుకుందుకు పరిస్థితులు అనుకూలించకపోతే మిషనరీస్ ఆఫ్ ఛారిటీ బిడ్డని తన వద్దే వుంచుకుంటుంది. యిక గత్యంతరం లేని స్థితిలో అలా చేస్తారు. "కన్నతల్లి ప్రేమానురాగాల్ని నేను యివ్వలేకపోవచ్చు కాని యెన్నడూ యే బిడ్డనీ వద్దనలేదు– యెన్నడూ ఒఖ్ఖళ్లని కూడా. ప్రతి శిశువూ విలువైందే. ప్రతి శిశువూ దేవుని సృష్టే."

ఎవళ్లకీ అక్కర్లేని బిడ్డలందర్నీ తను తీసుకుంటానని మదర్ థెరెసా అన్నారు కాని, అది సాధ్యం కాదు. యీ క్షణంలో శిశుభవన్ కిక్కిరిసిపోయింది. అదీగాక యిది ఏకపక్ష ఉద్యమం కాదు. వందలాది పిల్లల్ని భారతదేశం నుంచి దత్తత తీసుకుంటున్నారు. దత్తత వయసు దాటిన అబ్బాయిలను మిషనరీస్ బ్రదర్స్ ఆఫ్ ఛారిటీ – యీ మఠానికి సంబంధించిన శాఖ – వాళ్లు నడిపే అబ్బాయిల గృహాలకు పంపిస్తారు. అక్కడ వాళ్లకి చదువు చెప్పిస్తారు. ఏదో వృత్తిపని నేర్పుతారు. ఉద్యోగం దొరికేందుకు సాయం చేస్తారు. "యే పిల్లవాణ్ణయినా దత్తత తీసుకోకపోతే పెద్దపిల్లల్ని, వో సోదరుణ్ణీ, సోదరినీ విడదియ్యం. మామూలుగా వాళ్ల చదువు బాధ్యత మోసేవాళ్లని చూస్తాం. అలా బాధ్యత మోసుకునే దాతలే వేలాదిమందికి చదువు చెప్పిస్తున్నారు– భారతదేశంలోనూ, బయట కూడా" అన్నారు మదర్ థెరెసా.

మొత్తం మీద పిల్లలు బాగా రాణిస్తున్నారు. చాలామంది యూనివర్శిటీలకు వెడుతున్నారు. చదువుసంధ్యలు పెద్దగా అబ్బని అమ్మాయిలకు పెళ్లిళ్లు చేసి పంపేస్తాం. ప్రతి వాళ్లకీ యేదో యింత కట్నం యిచ్చేటంత వాస్తవికంగానే వుంటారు మదర్. కొన్ని చీరలు, వంటపాత్రలు, కుర్చీలు, బల్లలు కొద్దిగా డబ్బు బ్యాంక్ డిపాజిట్‌లో వాళ్ల పేరు మీద వేసి చేస్తూవుంటారు. యిదొక హిందూ ఆచారం. దాన్ని పాటించకుండా ఆడపిల్లలకు పెళ్లిళ్లు జరిపించడం కష్టం. మదర్ థెరెసా మేధావి కాకపోవచ్చు కాని ఆవిడ ఆచరణాత్మకంగా వుండరని యెవళ్లూ అనలేరు. శిశుభవన్‌లో పెరిగిన అమ్మాయిలు చాలామంది చక్కగా కాపురాలు చేసుకుంటున్నారు. వాళ్ల వాళ్ల కుటుంబాలు వాళ్లకి వున్నాయి. కలకత్తాలోనే వుంటూ వున్నవాళ్లు యెక్కువగా మదర్‌హౌస్‌కి వస్తూనే వుంటారు. ముఖ్యంగా పండగలప్పుడు పబ్బాలప్పుడూ. మామూలుగా మదర్ థెరెసా కూడా హాజరై ఆ కుటుంబాలని ఆశీర్వదిస్తూ వుంటారు. అక్కడ వుండే అంతమంది సిస్టర్లలో యెవళ్లని ముందు వాటేసుకోవాలో ఆ అమ్మాయిలకు చిక్కు అయిపోతుంది. అక్కడో జోక్ వుండేది. అక్కడి అమ్మాయిల్ని పెళ్లి చేసుకోవాలనుకునే పెళ్లికొడుకులు ముందు జాగ్రత్త పడాలి, యేమంటే వాళ్లకి బోలెడుమంది అత్తగార్లు!

గర్భస్రావం గురించీ, కాన్పులు లేకుండా చేసుకోవడం గురించీ మదర్ థెరెసా అభిప్రాయాలకి చాలా ప్రతిబంధకాలు యెదురవుతూ వున్నాయి. ఆవిడ కార్యకలాపాలు నిర్వహిస్తూన్న చాలా దేశాల్లో జనాభా సమస్యలు గడ్డుగా వున్నాయని సామాజికశాస్త్రవేత్తలు యెత్తి చూపిస్తూ వుంటారు. తిరస్కృత శిశువులందర్ని తను తీసుకున్నంత మాత్రాన అవి పరిష్కారం కావు. కుటుంబ నియంత్రణ, సంక్షేమ కార్యక్రమాలు అభివృద్ధిలో అంతర్భాగమయే వుంటాయి. యీ దేశాల్లో అధికభాగం కుటుంబ నియంత్రణ ఆపరేషన్లూ, గర్భస్రావాలూ బాగా అందుబాటులో వున్నాయి. కుటుంబ నియంత్రణ గురించి ప్రచారం సాగించేందుకు మదర్ థెరెసా తన

పలుకుబడిని వినియోగించాలని చాలామంది అంటూ వుంటారు. తను సహజ కుటుంబ నియంత్రణను, దంపతులు నిష్టగా వుండడాన్ని, స్వయం దమనాన్ని ప్రచారం చేస్తానని మదర్ థెరెసా గట్టిగా జవాబు చెబుతూ వుంటారు. యీ పద్ధతివల్ల "ప్రేమ, గౌరవం ఒకళ్లపట్ల ఒకళ్లకు వుంటాయని" ఆవిడ నమ్మకం. యీ పద్ధతివల్ల కొన్ని యేళ్లుగా వేల జననాలు అదుపులోకి వచ్చేయని ఆవిడ అంటారు. 1989లో సమర్పించిన సాంవత్సరిక నివేదికలో అరవై తొమ్మిది సహజ కుటుంబ నియంత్రణ కేంద్రాలు వుండడం గమనార్హం. యీ విధానానికి తీవ్రమైన పరిమితులు వున్నాయని, యేమంటే– బహిష్టుకి సంబంధించి కచ్చితమైన లెక్క వుంచుకోవాల్సి వస్తుందనీ అంటారు కొంతమంది. యీ చక్రపద్ధతికి సంబంధించి సూచనలు యిచ్చినా, అనేక రంగుల పూసల హారం సాయపడచ్చు, యేరోజులు యిబ్బంది కలిగించనివో తెలియ చేసేందుకు. అయితే మతిమరుపు సందర్భాలూ యెక్కువే వున్నాయి. యీ పూసల హారం పద్ధతి సరిగా బోధ పరచు కోకపోవడంవల్ల, ఓ చోట జననాన్ని నివారించగలిగినా మరిన్ని చోట్ల సంభవిస్తూనే వున్నాయి. ఒకవేళ ఆ పద్ధతిని సరిగ్గా అమలు జరుపు తున్నారనుకున్నా అది అన్నివేళలా మినహాయింపు ల్లేకుండా ఆచరణలో నెగ్గుకు రావడం లేదు. పేదరికంతో మగ్గే కుటుంబాలకు ఆలుమగల కలయిక ఒక్కటే ఆనందం, అదీ యే ఖర్చూ లేకుండా!

పెళ్లికాని తల్లులకీ, బలవంతంగా వేశ్యావృత్తిలోకి దింపిన అమ్మాయిలకీ సహజ కుటుంబ నియంత్రణ పద్ధతి అమలవదు కదా. చాలా భారత కుటుంబాలకు ఒత్తిళ్లు వుంటూ వుంటాయి, నిజానికి పెళ్లికాని పిల్లని యింట్లో పెట్టుకున్న ఛాందస కుటుంబాలకి అనేక సమస్యలు వుంటాయి. వీటికి మదర్ థెరెసా సరైన జవాబులు యివ్వలేరు. యిలాంటి దేశాల్లో పెళ్లికాని పిల్ల గర్భవతి అయితే ఆ ఒక్క కుటుంబానికే కాదు, మొత్తం వూరంతటికీ, కులం అంతటికీ తలవొంపులే.

చాలా ఆసియా, దక్షిణ అమెరికా, ఆఫ్రికా నగరాల్లో గర్భస్రావ అవకాశాలు విస్తృతంగా అందుబాటులోనూ లేవు, చవకా కావు. అయినా అలాంటి గడ్డు పరిస్థితుల్లో యిరుక్కున్న కుటుంబాలు గర్భస్రావానికి యేదో మార్గాలు చూసుకుంటాయి. తమ కూతుళ్లని కొన్ని నెలలపాటు యేదో విహారయాత్ర మిషతో, దూరం పంపించగలిగే సంపన్న కుటుంబాలు ఓ రకంగా తక్కువగానే వుంటాయి. ఆ విధంగా వాళ్లు గుట్టుగా కాన్పు కానిచ్చేస్తారు. ఆ బిడ్డని యే మిషనరీస్ ఆఫ్ ఛారిటీ లాంటి సంస్థకో అప్పగించేస్తారు, దత్తత పేరు చెప్పి. అంచేత చాలామట్టుకు యిలాంటి సందర్భాల్లో అమ్మాయిలు గర్భస్రావ "చికిత్సాలయాల్లో" చేరతారు. అక్కడ ఒకే పడక మీద, దుర్భర పరిస్థితుల్లో యిద్దరేసి, ముగ్గురేసి కూడా వుండాల్సి వస్తుంది. సెప్టికేమియా, అంటువ్యాధులూ సాధారణం. వీటివల్ల ఆ అమ్మాయి తనువు చాలిస్తే గనక ఆ సందర్భాల్ని కుటుంబం పైకి పొక్కనే పొక్కనివ్వదు, అప్పటికే అవమానంతో సగం చచ్చి వుంటుందా కుటుంబం.

యివేవీ కూడా మదర్ థెరెసాను పక్కకు మళ్లించలేవు. కుటుంబ నియంత్రణ విషయంలో రోమన్ కాథలిక్ సిద్ధాంతం పట్ల ఆవిడకు చెప్పలేనంతటి నమ్మకం. 'గర్భస్రావం' అనే మాట అంటేనే చీదరించుకుంటారు. దానికి వ్యతిరేకంగా ఆవిడ చాటిన సందర్భాలు అనేకం వున్నాయి. ముఖ్యంగా అమెరికానీ, యూరప్‌నీ

సందర్శించిన సందర్భాల్లో. 1979లో ఓస్లోలో నోబెల్ ఉపన్యాసం యిచ్చినప్పుడు శాంతికి విఘాతం కలిగించే మహా చెడ్డది యుద్ధంకాదనీ, గర్భస్రావమేననీ తాను విశ్వసిస్తున్నట్టు చెప్పేరు. గర్భస్రావం అనేది ప్రత్యక్ష యుద్ధం, తల్లి తనకిగానే చేసిన హత్య అంటారావిడ. "చాలామంది భారతదేశంలోని పిల్లలపట్ల, ఆఫ్రికాలోని పిల్లలపట్లా ఆందోళన చెందుతూ వుంటారు, చాలామంది పిల్లలు సరైన ఆహారం లేక ఆకలివల్ల చచ్చిపోతున్నారని. కాని లక్షలాది తల్లులు ఉద్దేశపూర్వకంగా, కావాలని చేస్తున్న పనులవల్ల చనిపోతున్నారు. తల్లే తన బిడ్డను చంపేస్తే యిక మిగిలింది యేమిటి?"

ఐక్యరాజ్యసమితి నలభైయ్యవ వార్షికోత్సవాలు జరిగేయి. మదర్ థెరెసా మీద తీసిన చలనచిత్రాన్ని ప్రదర్శించేరు. అదో గొప్ప సంఘటన. మదర్ థెరెసా అప్పుడక్కడ హాజరయేరు. ఆవిడ ఆఖర్న చిన్న ఉపన్యాసం చేశారు. ప్రేమ గురించీ, ఒకళ్లకతో ఒకళ్లు కలిసి ఉండడం గురించీ, మన జీవితాల్లోకి ప్రార్థనను తిరిగి తీసుకురావడం గురించీ చెప్పేరు. "మనం అణుయుద్ధం గురించి భయపడుతున్నాం", అంటూ ఆవిడ అక్కడ హాజరైన ప్రముఖుల్నీ, పౌర ఉద్యోగుల్నీ ఉద్దేశించి అన్నారు. "యీ కొత్త భయంకర వ్యాధి ఎయిడ్స్ గురించి కంపించి పోతున్నాం. కాని ఒక అమాయిక జీవిని చంపడానికి యేమాత్రం భయపడ్డం లేదు. యివాళ గర్భస్రావమే శాంతికి మహావిపత్తు అయిందని నేను అనుకుంటున్నాను," అన్నారు.

యీ అభిప్రాయాలు శ్రోతల్లో చాలామందిని యిబ్బంది పెట్టాయి. ఐక్యరాజ్యసమితి ప్రత్యేక పరిస్థితుల్లో గర్భస్రావాన్ని సమర్థిస్తోంది. యునైటెడ్ నేషన్స్ ఫండ్ ఫర్ పాపులేషన్ యాక్టివిటీస్ (UNFPA) కార్యక్రమం కింద అవి అమలవుతాయి. ఆ శ్రోతల్లో వున్న ఆ శాఖ వాళ్లూ యిబ్బంది పడిపోయేరు. మరికొందరికి మదర్ థెరెసా గర్భస్రావానికి వ్యతిరేకంగా మాట్లాడ్డం అసంబద్ధంగా కనిపించింది, యేమంటే, ఆవిడ కార్యకలాపాలు నిర్వహిస్తూ వున్న దేశాలు అధిక జనాభా వున్నవే. చాలామంది దుర్భర జీవితాలు గడుపుతూ వున్నవే. ఆ దేశాలవాళ్లూ సభలో వున్నారు. మదర్ థెరెసా చాలా మంచిమనిషి అనీ, అయితే ప్రస్తుత పరిస్థితులతో అంత పరిచయం లేని మనిషి అనీ శ్రోతల్లో చాలామంది అనుకున్నారు, మరి అలా అనుకోవడం తప్పదు కదా. మహర్షులకూ్కడా ఒకటి, రెండు తిక్కలుంటాయని మరికొంత మంది అభిప్రాయపడ్డారు.

గర్భస్రావం గురించి తనకున్న అభిప్రాయాలు చాలామందికి నచ్చవని, చాలా ప్రభుత్వాలు, పత్రికలు, మేధావులు తనని సమర్థించరనీ ఆవిడకు బాగానే తెలుసు. యితర మతాలూ గర్భస్రావం మీద యింత గట్టిపట్టుతో వుండవనీ తెలుసు. చాలా కాథలిక్ సంస్థలు తనతో ఏకీభవించవనీ శుభ్రంగా తెలుసు. అమెరికాలో, యూరప్‌లో జరిగిన ఎన్నికలో చాలాసార్లు కాథలిక్‌లు నిరోధక పద్ధతుల్నీ, చాలా సందర్భాల్లో గర్భస్రావాన్నీ ఒప్పుకుంటున్నారనీ తెలుసు. అయినా యే ఒక్కటీ ఆవిడ నమ్మకాల్ని పిసరు కూడా మార్చలేదు. "అతి పేద దేశం యేదీ అంటే గర్భస్థ శిశువును హత్యచేసేదే అని నా అభిప్రాయం. అదనంగా సుఖాలు పొందడం కోసం మరో ప్రాణికి తిండి పెట్టాలంటే భయం" అని నాతో యెన్నోసార్లు అన్నారు.

యేదో ఒక కేంద్రానికి రోజూ కొంతమందైనా పిల్లలు రాని మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కేంద్రం భారతదేశంలో ఒక్కటి కూడా వుండదేమో! "ఎక్కువసార్లు పోలీసులే మా కేంద్రాలకు పిల్లల్ని తీసుకువస్తూ వుంటారు. కొన్ని రోజుల్లో పెళ్లికాని తల్లులే తమ బిడ్డల్ని తీసుకువస్తూ వుంటారు. ఎప్పుడేనా ఓ హాస్పిటల్ నుంచో, క్లినిక్ నుంచో పిల్లల్ని తీసుకువెళ్లమని ఫోన్లు వస్తూ వుంటాయి. వీధుల్లో పారేసిన పిల్లల్నీ తీసుకవస్తూ వుంటాం. యిప్పుడు యీ పరిస్థితి అంతగా లేకపోయినా, ఒకసారి మా గుమ్మం దగ్గరే ఓ బిడ్డ కనిపిస్తూ వుంటుంది. సాధారణంగా యీ బాపతు వాళ్లు శారీరకంగానో, మానసికంగానో అవకరం వున్న వాళ్లయి వుంటారు" అని శిశుభవన్‌కి చెందిన సిస్టర్ నిర్మల అన్నారు. "యిదో అద్భుతం, ప్రతి రోజూ ఒకటో, రెండో కుటుంబాలు పిల్లల్ని పెంచుకుంటామని వస్తూ వుంటాయి; పెద్ద కుటుంబాల వాళ్లు కూడా. హిందు న్యాయశాస్త్రం ప్రకారం దత్తు వచ్చిన బిడ్డలు వారసులే అవుతారు. ఆస్తి వాళ్లకే దక్కుతుంది" అన్నారు మదర్ థెరిసా.

దత్తతపట్ల అభిప్రాయాలు మారేయి. "కొన్నేళ్ల క్రితం దాకా మగపిల్లల్నే కావాలనుకునేవాళ్లు. మంచి ఛాయ గురించీ, చక్కని ముక్కు గురించీ యేం పట్టింపులుండేవని" అని ఓ సిస్టర్ నవ్వుతూ అంది. "యిప్పుడు పిల్లల్ని చూడకుండానే తీసుకుందుకు సిద్ధపడుతున్నారు; ఆడపిల్లల్ని కూడా. కొన్నేళ్లక్రితం పిల్లలు లేని దంపతులు యిక్కడి చంటిపిల్లల్ని గుట్టుచప్పుడు కాకుండా యే నర్సింగ్‌హోమ్‌కో తెప్పించుకుని, యిల్లాలు 'కాన్పయి' వెళ్లినట్టు కొన్నిరోజుల తర్వాత తీసుకువెళ్లేవారు. యిప్పుడంత పరిస్థితి లేదు. జనం గుట్టుగా వుండడం లేదు," అందామె. మగపిల్లల పట్లే మొగ్గు వుండడానికి కారణం వుంది. సాంప్రదాయిక హిందూ సమాజంలో ఆడపిల్లని యెప్పుడూ పరధనంగానే పరిగణించేవారు. మధ్యతరగతి వాళ్లు ఆడపిల్లల్ని యిప్పుడు తీసుకుంటున్నారు. అయితే శారీరక అవకరం వున్న వాళ్లకి సంబంధించే చిక్కులు వస్తున్నాయి. "అవకరం వున్న పిల్లలకు సాయపడే మార్గాలు, సాధనాలు మాకు లేకపోవడం ఒకటి. యివీ త్వరలోనే రావచ్చు" అంది సిస్టర్.

విదేశాలకు పిల్లల్లని దత్తత యిచ్చే విషయం యెప్పుడూ విమర్శలకు గురవుతూనే వుంది. పిల్లల్ని అమ్ముకోవడం అనేది తెలియనిది కాదు. ప్రపంచవ్యాప్తంగా పత్రికలలో 'పిల్లల వ్యాపారం' గురించిన వార్తలు వస్తూనే వున్నాయి. అవి అంత అతిశయోక్తులూ కావు. ప్రపంచవ్యాప్తంగా సంపన్నులు "సౌష్టవ"మైన పిల్లల కోసం యెంతేనా యిస్తారు. అంటే తెల్లగా నిర్దోషంగా వున్న పిల్లలని సభ్యోక్తి. దక్షిణ అమెరికా "పిల్లల బజార్"కి చక్కని ఆధారంగా యెప్పటినుంచో వుంది. అలాంటి పిల్లలకు యెంత గిరాకీ వుందంటే, చాలా దత్తత ఏజెన్సీలు బహుకొద్ది శాతం కూడా అందుకో లేకపోతున్నాయి. యీ శాతాన్ని యాభైకి ఒకటిగా కొన్ని ఏజన్సీలు అంటున్నాయి. ప్రభుత్వ హాస్పిటళ్ల నుంచి పిల్లల్ని అపహరించుకు పోయే సంఘటనలూ అడపా దడపా కల్లోలం రేపుతూనే వున్నాయి. దానివల్ల విదేశీ దత్తతలు మందగించడమూ జరుగుతోంది లేదా దత్తత విధానాన్ని పునఃపరిశీలించడమూ అవసరమవుతోంది.

పత్రికా వార్తల వల్ల మదర్ థెరెసా పిల్లల్ని దత్తత యివ్వడం ఆపు చేసిన సందర్భాలు లేకపోలేదు. తృతీయ ప్రపంచం నుంచి అవకరం వున్న పిల్లల్ని యూరప్‌లో ఒక దేశానికి, బహుశా దత్తత కోసం, పంపించడం జరుగుతోందని ఓ పత్రిక

సంచలనాత్మక కథనం ప్రకటించింది. ఆ పిల్లల్ని దత్తత తీసుకోవడం కాక వైద్య పరిశోధనలకు వాడుకుంటున్నట్టూ అందులో వుంది. ఆవిడ యెంతగానో బాధపడ్డారు. అంతలా బాధపడ్డం నేను చూసిన సందర్భాల్లో ఒకటి. యెంత బాధ పడ్డారంటే హుటాహుటీన కలకత్తా నుంచి ఢిల్లీకి వెళ్లే విమానం యెక్కేరు. ఆ పత్రికలో రాసిన దేశం దౌత్య కార్యాలయానికి ఆవిడ్ని కార్లో తీసుకువెళ్లాను. అంబాసిడర్ వెంటనే ఆవిడను కలుసుకున్నారు. ఆవిడ తీవ్ర ఆందోళనను అర్థం చేసుకున్నారు. ఆ పత్రిక సంపాదకునికి ఉత్తరం రాశేరు. ఆ కథనం దారుణమనీ, అప్రతిష్టాకరమనీ ఆ లేఖలో రాశేరు. ఆ పత్రిక క్షమాపణ చెప్పింది. కాని మదర్ థెరెసా తేరుకోవడానికి కొంత వ్యవధి పట్టింది.

"ఫ్రెంచి వాళ్లు, స్విస్ వాళ్లు, కెనడా వాళ్లు ముఖ్యంగా ఉదారంగా వుంటారు" అని ఒక సిస్టర్ అంది. "తీవ్రమైన ఎముకల సమస్యలతో బాధపడే పిల్లల్ని లేదా పోలియోతో బాధపడే వాళ్లని, మానసిక వ్యాధులున్న వాళ్లని తీసుకుందుకు యిష్టంగా వుంటారు. పిల్లో పిల్లాడో చూడ్డానికి బాగున్నారా లేదా అని మీమాంస చేయరు. కొన్ని కుటుంబాలకి వాళ్లు కన్న సంతానమే వుంటుంది. అయినా అవకరం వున్న పిల్లల్ని తీసుకుంటారు. మీరు ఉత్తర అమెరికా గాని, యూరప్ గాని వెడితే యీ బాపతు కుటుంబాలు మీకు తగుల్తాయి. మిమ్మల్ని సంతోషంగా ఆహ్వానిస్తారు వాళ్లు. మీకు సరదాగా వుంటుంది" అందామె.

ఆ తర్వాత కొంతకాలానికి నేను స్విట్జర్లాండ్ వెళ్లేను. అలాంటి కుటుంబాలని చూడాలనుకున్నాను. ఒక దత్తత కేంద్రం వాళ్లకు రాశేను. చిత్రం– ఆ సంస్థ మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్‌తో చాలా యేళ్లుగా కలసి సన్నిహితంగా పనిచేస్తోంది. "దీపావళి దత్తతసేవా సంఘం" అది. దాని స్థాపకుడు జో మిల్లర్. ఆమె జెనీవాలో వుంటుంది. ఆమె అలా దత్తత తీసుకున్న కొన్ని కుటుంబాలని పరిచయం చేస్తానని అంది. ఆ కుటుంబాలు దగ్గర్లోనే కాపురాలు వుంటున్నాయి.

ఒక కాఫీ హౌస్‌లో కలుసుకున్నాం. ఆ కాఫీ హౌస్ ఐక్యరాజ్యసమితికి జెనీవాలో వున్న ఒక అంతర్జాతీయ సంస్థ వాళ్లది. అలాంటి అంతర్జాతీయ సంస్థలు జెనీవాలో చాలా వున్నాయి. 'ఆఁ, యిక్కడ మా అబ్బాయి వంటపని చేస్తూ వుంటాడు. చూస్తారా' అంది. కొంచెంసేపటి తర్వాత అతను మాదగ్గరకు వచ్చేడు. ఆవిడ నాకు చెప్పనిది యేమిటంటే, అతను అసలు భారతదేశం వాడేనట. తర్వాత నాకు తెలిసింది– మిల్లర్‌లకే నలుగురు సంతానం అట. తొమ్మిదేళ్ల పిల్లాడిగా వున్నప్పుడితన్ని దత్తు తీసుకున్నారట. అతని పేరు బబ్లూ. వాళ్ల నాన్న సిలిగురి రైల్వేస్టేషన్లో పోర్టరు. ఆ స్టేషన్ కలకత్తాకు 350 మైళ్ల దూరంలో వుంది. కుర్రాడికి ఏడేళ్ల వయసప్పుడు అతను క్షయగ్రస్తుడై చనిపోయేడు. ఆ వూళ్లో పనిచేసే సిస్టర్లు అతన్ని ఆదుకున్నారు. అప్పుడతని పరిస్థితి యేం బాగోలేదు. గట్టిగా కూర్చోలేకుండా వుండేవాడు. యివాళతను జెనీవా ఫుట్‌బాల్ క్లబ్‌లో మెంబరు. రెండేళ్లనాడు అతను సిలిగురి వెళ్లేడు, స్విస్ పౌరుడిగా. యీ తల్లిదండ్రులు మంచివాళ్లు. అలాగే వెళ్ళిరమ్మని ప్రోత్సహించేరు– తన పేగు బంధం తెగిపోకుండా కాపాడుకుంటాడని, తనకి యూరప్ పరిస్థితులు అబ్బినా.

జో మిల్లర్ మతప్రచారకులు యెంతమాత్రం కాదు. అయితే అవకరం వున్న పిల్లల్ని జాగ్రత్తగా మనసుపెట్టి చూసుకునే చోట్లే పెడుతుంది. ఆ రకంగా స్విట్జర్లాండ్‌లో మదర్ థెరెసాకి బాగా ఉపయోగపడుతోంది. "కుటుంబం మంచిదని నాకు నమ్మకం కలగాలి. అప్పుడే ఆ పిల్లల్ని యిస్తాను. యిది సరైన కుటుంబం అని నాకు అనిపించే దాకా అంతే. ఒకోసారి యాభై కుటుంబాల్ని కూడా చూస్తూ వుంటాను" అంది. అందుకనే కామోసు ఆమె చేరదీసిన పిల్లలు జీవితంలో హాయిగా వుంటున్నారు. నా కళ్లతో నేను దాన్ని చూసివుండక పోయినట్లయితే నిజంగా నమ్మలేకపోయి వుండేవాణ్ణి. కలకత్తాలో సిస్టర్లు యిలా దత్తత వచ్చిన పిల్లల కుటుంబాల లిస్టు ఒకటి నాకు యిచ్చేరు. నేను యిక్కడో పేరూ, అక్కడో పేరు యెంచుకుని జెనీవాకు దగ్గర్లోనే వుండే కుటుంబాలని చూద్దామనుకున్నాను. దూరం వెళ్లచ్చుగాని నాకంత వ్యవధి లేదు. నేను చూసిన సందర్భాల్లో అంత బాగాలేని దత్తతలు తక్కువే, అదృష్టవశాత్తూ.

ఆ మర్నాడు రుదాజ్ కుటుంబాన్ని కలిశేను. జెనీవాకు దగ్గర్లోనే ఓ వూళ్లో వుంటుందా కుటుంబం. అలివర్ అని ఓ కంప్యూటర్ కంపెనీలో పని చేస్తున్నాడు. ముప్ఫైఎనిమిది యేళ్లు వుంటాయి. అతని భార్య మార్గరెట్. యింటి కోసమని ఉద్యోగం మానుకుంది. పడుచు దంపతులు. వాళ్ల యిల్లు చిన్నది. చక్కని వెలుతురు వచ్చే యిల్లు. యిల్లంతా ఆటబొమ్మల్తో, చిన్న పిల్లల్తో నిండుగా వుంది. వాళ్ల కడుపున పుట్టిన సంతానమే వుంటే, మళ్లీ యెవళ్లనో దత్తత చేసుకోవడం యెందుకట? "రక్తం సార్వత్రికం. లోకంలో పేద పిల్లలు చాలామంది వున్నారు. అదే అన్యాయం. నా కడుపున పుట్టిన బిడ్డే నాకు అనుకోవడం అహంకారం" అంది మార్గరెట్.

రుదాజ్ కుటుంబం మొదట ఒక యుగోస్లావ్ ఆడపిల్లని పెంచుకుంది. రెండేళ్లనాడు దద్దు పేరు విన్నారు. అతనికప్పుడు నాలుగైదేళ్లు వుంటాయి. ఆ కుర్రాడికి తీవ్రమైన పోలియో వచ్చింది. రెండు కాళ్లూ దెబ్బతిన్నాయి. చేతులూ దెబ్బతిన్నాయి. కాని తక్కువ. ఆ కుర్రాడి ఫోటోలని జోమిల్లర్ వాళ్లకి చూపించింది. శిశుభవన్ తయారుచేసిన మెడికల్ రిపోర్టుని చూపించింది. ఆ కుర్రాణ్ణి సిస్టర్లు రాయ్‌పూర్ వీధుల్లో చూశేరు. ఆ నివేదిక, ఫోటోలూ చూస్తే దద్దు యిక లేచి తిరగ్గలడా, అనుమానమే అనిపిస్తుంది. ఆ కుర్రాణ్ణి దత్తత తీసుకోవాలని రుదాజ్ కుటుంబం నిర్ణయించుకుంది. జో మిల్లర్ మిగిలిన లాంఛనాలు పూర్తి చెయ్యడం మొదలుపెట్టింది. భారతదేశంలో ఆ పని కొంచెం వ్యవధి తీసుకుంటుంది. అవి పూర్తయేక, కొన్ని నెలల తర్వాత అతణ్ణి జెనీవాకు తీసుకువెళ్లింది. యీ దంపతులు ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లి పిల్లవాణ్ణి తెచ్చుకున్నారు.

"వచ్చినప్పటి నుంచి, చుట్టూ వున్న దేన్ని చూసినా సరదా పడేవాడు. కార్లంటే మరినీ. 'గాడి' అంటూ వర్ణించేవాడు, అంటే హిందీలో కారు కదా, దారమ్మట కారు వెళ్లడం పాపం 'గాడి' అనేవాడు" అని చెప్పేడు అలివర్. "వచ్చేక అతనికి కొన్ని రోజుల్లోనే ఆపరేషన్ చేయించాం. రెండు నెలలు ప్లాస్టర్ పట్టీల్లోనే వున్నాడు. చాలా గబగబా కోలుకున్నాడు, డాక్టర్లే నమ్మలేకపోయేరు. అతనికి చక్రాలబండి

తప్పదని మొదట్లో డాక్టర్లు అన్నారు. యిప్పుడు, ఫరవాలేదు ఆనుకర్రలతోనూ, ఇనప కట్లతోనూ, నిలబడగలడు అంటున్నారు" అని మార్గరెట్ జత చేసింది.

"కుర్రాడు తెలివైనవాడు. బడంటే యిష్టం. రెండు నెలల్లో ఫ్రెంచి పట్టేశాడు తెలుసా?" అన్నాడు తండ్రి దడ్డు జుట్టు నిమురుతూ.

యిద్దరు పిల్లలు చాలరన్నట్టు రుదాజ్ దంపతులు అలెక్స్ని దత్తు తెచ్చుకున్నారు. మూడేళ్ల కుర్రాడు. కొంచెం పోలియో వుంది. కామిల్లె అనే అమ్మాయినీ తెచ్చుకున్నారు. చిన్నపిల్ల– చూడముచ్చటగా వుంటుంది. పెద్ద మానసిక రుగ్మతే వుంది. ఓ ఏడాది బతికితే గొప్ప అన్నారు డాక్టర్లు. యేడాది పిల్లప్పుడు వచ్చింది నేను చూసినప్పుడు అయిదేళ్లుంటాయి. మానసిక రుగ్మత లేనేలేదు. తల్లి రక్తం ప్రభావం దాటి బతికిందని డాక్టర్లు అన్నారు. మేం కూచున్న గదిలో యితర పిల్లల్ని చూశేను. వాళ్లంతా చక్కటి కుటుంబంలాగా నాకు కనిపించేరు. మతనిష్ఠ బాగా పాటిస్తారా అని అడిగేను. "నాకా పట్టింపులేమీ లేవు. అలివర్కినీ. మేం చర్చికే వెళ్లం" అంది మార్గరెట్.

భారతదేశం నుంచి దత్తు వచ్చిన పిల్లల కుటుంబాలు ముఖ్యంగా మదర్ థెరెసా హోమ్స్నుంచి వచ్చిన పిల్లలు, తాము "దీపావళి" కుటుంబం వాళ్లమని చెప్పుకుంటూ వుంటారు. (దీపావళి భారతదేశంలో దీపాల పండుగ. యెంత పేదకుటుంబం వాళ్లూ గొప్పగా జరుపుకుంటారు.)

ఆ సంప్రదాయంలోనే లుసానెలోని ఓ స్విస్ కుటుంబం నన్ను ఆదరించింది. వాళ్ల డ్రాయింగ్ రూమ్లో 'దీపావళి' దీపం వుంది. రండి అని పిలుస్తున్నట్టు వెలుగుతూ వుంది. ఆ దంపతులు నడివయస్కులు. పేర్లు బయట పెట్టవద్దని అన్నారు కాబట్టి పేర్లు చెప్పడం లేదు. ఓ బిడ్డని దత్తు తెచ్చుకుందామనుకున్నార్ట. కాని అంతలోనే వాళ్లకే యిద్దరు ఆడపిల్లలు వరస వరసగా కలిగేరట. అయినా దత్తు తీసుకోవాలన్న వ్యూహ పోలేదు. ఆఖరికి దత్తు తెచ్చుకున్నార్ట. యే దేశం నుంచి అన్న ధర్మసందేహం వచ్చింది. చిలీ, కొలంబియా, ఇండియా. యెప్పుడోగాని "దీపావళి" కుటుంబాల గురించి విన్నారట. వాళ్లని చూడ్డానికి వెళ్లేరు. జో మిల్లర్ దగ్గర తేలేరు. "అబ్బో, యెన్ని ప్రశ్నలు వేశామో. జబ్బుగా వుండే పిల్లల గురించీ అనుకున్నాం. చివరికి సిద్ధపడ్డాం" అన్నారు.

వాళ్లు తెచ్చి పెంచుకుందా మనుకున్న పిల్లాడికి జబ్బు. మూడు వారాలకోసారి రక్తమార్పిడి చేయిస్తే తప్ప ఆర్నెల్లకుమించి బతకడు. డెస్ఫెరాల్ అనే మత్తుమందుని అలా యిస్తూ వుండాల్సిన మానసిక వ్యాధి. దానివల్ల రక్తంలో వుండే అనవసర ఇనుము తగ్గుతుంది. ఆ పిల్లాడితో మరీ అనుబంధం పెంచుకోవద్దని అక్కడి డాక్టర్లు ముందే హెచ్చరించేరు. "యెంతకాలం వుంటాడో యేమో." యిదంతా యెన్నో యేళ్లనాటిమాట. యిప్పుడు అతనికీ ఆశ కలిగింది, పిల్లాడికి మామూలు ఆయుర్దాయం వుంటుందని.

ఆ పిల్లాడి కోసం, ఆ కుటుంబం త్యాగాలు చెయ్యవలసివచ్చింది. తండ్రి డ్రైవరు. బాగానే సంపాదించేవాడు. అయితే యింత విపరీతమైన వైద్యం చేయించాలంటే అది సరిపోతుందా? "మా బ్యాంకు ఖాతా కర్పూరమైపోయింది. దాంతో కారు అమ్మేసాం. అదేమంత ముఖ్యమా, జీవితం కాని పిల్లల వల్ల నాకూ, మా ఆవిడకూ

కలిగే సంతోషం యే వస్తువుల వల్ల వస్తుంది? మాకు పిచ్చి అని కొందరు అన్నారు. మేం పిల్లల మీద మదుపు పెడుతున్నాం, అని వాళ్ళకు చెపుతూ వుంటాం" అన్నాడతను.

మదర్ థెరెసా యెంతగానో అభిమానించే పిల్లాడు ప్రిన్స్. బాల్లెస్ట్రాజ్ కుటుంబం పెంచుకోవడానికి తెచ్చుకున్నపుడు ఆ పిల్లడికి యేడాదిన్నర వయసుంటుంది. ఆ కుటుంబం సీయెటె అనే పర్వతప్రాంత పట్టణంలో వుంటుంది. బాల్లెస్ట్రాజ్ అవిటి పిల్లల సమస్యల్లో నిపుణుడు. ప్రిన్స్‌కి నడంలేదు, కాళ్ళులేవు. చేతులు వెనక్కి తిరిగి వుంటాయి. ఆ కుటుంబంలో అవిటివాళ్లు పిల్లలు ఒక దండే అని చెప్పాలి. అలాంటి కుటుంబం వేరే వుంటుందనుకోను. అంచేత యీ పిల్లాడూ ఒకడు, విశేషం యేమీలేదు. ఆ పిల్లవాడి వర్చస్సు, ప్రశాంతత, కలుపుగోలుతనం కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. సుళ్లుతిరిగిన మేడమెట్ల మీద భలేమెలుకువగా యెక్కేసే నేర్పు చూస్తే చిత్రమనిపిస్తుంది. మొదటి మెట్టు మీద యెక్కేటపుడు వుండే జాగ్రత్తానూ. ఇటీవలి నిపుణులు అతని మొండెం భాగాన్ని రబ్బరు "పాత్ర" లో పెట్టేరు. దాన్ని కృత్రిమమైన జతపాదాలకు బిగించేరు. అది యింకా ప్రయోగదశలోనే వుంది కాని ప్రిన్స్‌కి సంతోషంగా వుంది, ప్రయత్నించి చూడాలని. నేను ఫోటోలుతీస్తే పోజ్ యిచ్చేడు అలానే. బేటరీతో నడిచే చక్రాలబండిలో తిరగ్గలడు. అది బొమ్మకారులా వుంటుంది. త్వరలోనే బడికి దాన్ని నడుపుకుంటూ వెళ్లగలడని చెప్పారు.

ప్రిన్స్ ఆ కుటుంబంలో ఆరోవాడు. వాళ్లకడుపున పుట్టినవాళ్లు ముగ్గురు. మరిన్ని గదులు కట్టుకున్నారు. ఓ దత్తత యేజన్సీ దగ్గరకు వెళ్లేరు వాళ్లు. ఆ యేజన్సీ వాళ్లకి ఫోటోల ఆల్బమ్‌ని అందించింది, యెవళ్లు కావాలో యెంచుకొమ్మని. ఆ పద్ధతి యిదిగో సరుకుల లిస్టు, యేం కావాలో చెప్పండి అన్నట్టుంది. చిరాకేసి వాళ్లు వచ్చేశారు. వాళ్లకు "దీపావళి" గురించి తెలియ వచ్చింది. ఆ రకంగా సబిత మొదట వచ్చింది. రెండేళ్లపిల్ల. మానసిక సమస్యలు వున్నాయి. ఆ తర్వాత మాయ అనే యేడేళ్లపిల్ల. ఆ పిల్లది అసలు నేపాల్. కలకత్తా వీధుల్లో దారుణమైన పరిస్థితుల్లో పడివుంటే సిస్టర్లు కాపాడేరు. శిశుభవన్‌లో ఆ పిల్లా సబిత ఒకళ్లని విడిచి ఒకళ్లు వుండలేకపోయేవాళ్లు. యేక గర్భవాసుల్లా వుండేవాళ్లు, అక్కాచెల్లెలూ అన్నట్టు. యీ అనుబంధం చూసి, యిద్దర్నీ కలిపే దత్తుతీసుకొమ్మని సిస్టర్లు జో మిల్లర్‌కి చెప్పేరు. బాల్లెస్ట్రాజ్‌లు సరేనన్నారు. అయితే మాయకి సంబంధించిన పత్రాలు అరకొరగా వున్నాయని కలకత్తాలోని మేజిస్ట్రేట్ సబితతోకూడా పంపించడానికి వొప్పుకోలేదు. అవన్నీ సరిచూసి, ఆయన వొప్పుకోవడానికి ఆర్నెల్లు పట్టింది. అప్పుడు వాళ్లిద్దర్నీ కలిపేరు, అక్కాచెల్లెళ్లలాగా.

సర్జాన్ అని చిన్నపిల్లాడు. దాదాపు కళ్లు కనిపించవు, యిక్కడికి వచ్చేటప్పటికి. సప్న మానసికరోగి. వీళ్లతో బాల్లెస్ట్రాజ్ కుటుంబం నిండింది. లేకపోతే ప్రేమ కుమారి గురించి తెలియ వచ్చేదాకా అలా అనుకున్నారోమరి. ముచ్చటైన ఆ అమ్మాయి ఈశాన్యభారతంలోని ఓ పర్వత ప్రాంత పట్టణంలో కొన్నేళ్ల నాడు దొరికింది. యిప్పుడు పదమూడేళ్ల వయసు వుంటుంది. యీ అమ్మాయికి చేతులు లేవు. కాళ్లులేవు. సప్నలాగా ఆమె పుట్టుకతోనే అలా లేదు. యేదో ఘోరప్రమాదం జరిగిందనీ, కాళ్లూ చేతులూ పోయే యనీ అన్నారు. బాల్లెస్ట్రాజ్

దంపతులు ప్రేయకుమారిని గురించి విన్నారు. ఆ అమ్మాయిని తెచ్చుకోవాలని అనుకున్నారు. అప్పటికే ఆ పిల్లకి పదేళ్లు. అయినా వాళ్లు అలా అనుకున్నారు. మామూలుగా దత్తుతీసుకునే వయసుకంటే చాలా యెక్కువే. "అదొక పిలుపులాగా వచ్చింది నాకు. ఆ పిల్లని గురించి విన్నాక యిదే ఆమె యిల్లు అవాలి అనుకున్నాను" అంది శ్రీమతి బాల్లెస్ట్రాజ్.

రాణి అని మరొక అమ్మాయి వుంది. ఆమె గురించి మదర్ థెరెసాయే చెప్పారు. ఆ పిల్లా సియెరెకి దగ్గర్లోనే వుంటోంది. మచేడ్ కుటుంబంవాళ్లు ఆ పిల్లని తీసుకొచ్చేరు. నన్ను చాలా ఆదరించేరు. రాణినే గాక మరో ఆరుగురు పిల్లల్ని పెంచుకున్నారు. మొదట్లో యిద్దరు అబ్బాయిలు వచ్చేరు. కంపూచియా యుద్ధం వల్ల అనాథలయేరు. తర్వాత రాజ్, సూరజ్ అనే వేలు విడిచిన అన్నదమ్ముల్ని దత్తు తెచ్చుకున్నారు. డార్జిలింగ్ నుంచి వచ్చేటప్పుడు వాళ్లల్లో ఒకళ్లకి ఏడేళ్లు, యింకొకళ్లకి అయిదేళ్లు. యింట్లో నలుగురు మగపిల్లలు వున్నారు. అంచేత ఆడపిల్లకూడా వుంటే బాగుంటుం దనుకున్నారు. ముగ్గుర్ని మొత్తంమీద తెచ్చుకున్నారు! మొదటి పిల్ల పేరు గీత. ఆరేళ్లు. యెవళ్లకీ అక్కర్లేని ఆ పిల్ల బిడియంగా వుండేది. నల్లని నలుపు. ఆఖర్నవచ్చిన పిల్ల బిందు. మూడేళ్లపిల్ల. చెవుడు, మూగ. దిక్కులేక పడివుంటే ఢిల్లీలో సిస్టర్లు చేరదీసేరు. "వచ్చినప్పుడెలా వుందనుకున్నారు, దారుణం! ఓ ఆకలేస్తోందని చెప్పలేదు, ఓ చలిగా వుందని చెప్పలేదు. ఫలానాది కావాలని చెప్పలేదు. అన్నం తినిపించాలన్నా, బట్టలు తొడగాలన్నా గంటలకి గంటలు పట్టేది అప్పటికీ యిప్పటికీ యెంత తేడా వుందని" అంది శ్రీమతి మచేడ్. మూగభాషతో తల్లి యేం చెప్తోందో మగ పిల్లలు బిందుకు వివరించేవాళ్లు. అందరూ పగలబడినవ్వేవాళ్లు.

రాణియే మచేడ్ కుటుంబంలో ఆశాకిరణం. ఆ పిల్లా డార్జిలింగ్‌లోనే దొరికింది. ఆమెకూ చెవుడే. నాలుగేళ్ల వయసప్పుడు వచ్చింది. అయితే రెండేళ్లపిల్లలా కనిపించేది. ఆ పిల్లకి పదేళ్లువయసట నేను చూశేటప్పటికి. అయితే ఆరేళ్ల పిల్లలాగా కనిపించేది. మీటరు యెత్తుకంటే యెదగదని డాక్టర్లు అన్నారు. అయితేనేంగాక, ఆదరించే అభిమానించే కుటుంబంలో వుంది. ఆ పిల్ల నవ్వుతూనే వుండేది. కిల కిలమంటూనే వుండేది. ఆ నవ్వు యిల్లంతా మార్మోగేది. ఆ పిల్లవల్ల మచేడ్ కుటుంబం మరింత సంపన్నం అయినట్టు కనిపించింది.

☆ ☆ ☆

మొదట్లో పై దేశాలకు పిల్లలు దత్తు వెళ్లినప్పుడు మదర్ థెరెసాయే కూడా వెళ్లేవారు. అయితే ప్రయాణం ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. ఆవిడేమో మహా పొదుపుగా వుంటారు. తన ప్రయాణానికి ఖర్చు చెయ్యడం యిష్టం వుండేదికాదు. ఓసారి మే యిద్దరం ఒకే విమానంలో వెడుతున్నాం. అదీ యిూ మధ్యనే. ఎయిర్‌లైన్స్ ఆవిడ ఫ్రీ ప్రయాణానికి వొప్పుకోవడం యెలా జరిగిందని అడిగాను. ఆవిడ ఆ విషయం గుర్తుకొచ్చి పకపకా నవ్వేరు.

"పని ఒత్తిడి యెక్కువ అవుతూ వుండడంతో భారత ప్రభుత్వానికి రాశేను, నాకూ, ఓ సిస్టర్‌కు ఫ్రీపాస్‌లు యిమ్మని అడుగుతూ. యిక ఆఖరిగా, దారిఖర్చులక్కే వూడ్చడానికి ఎయిర్ హోస్టెస్‌గా పనిచేస్తానని రాశేను. దాంతో జవాబు వచ్చింది.

ఎయిర్ ఇండియా పాస్ యిచ్చింది. ఇండియన్ ఎయిర్‌లైన్స్ (దేశీయ ప్రయాణాలకు) రెండు పాస్‌లు యిచ్చింది. యిప్పుడు ఎలిహిలియా, పాన్ అమ్, ఇథియోపియన్ ఎయిర్‌లైన్స్ కూడా ఫ్రీటిక్కెట్లు యిస్తున్నాయి" అన్నారావిడ కళ్లు మెరుస్తూవుంటే.

మదర్ థెరెసా ఎయిర్ హోస్టెస్‌గా! వూహించుకోవడానికి సరదాగానే వుంటుంది. ఆవిడ సామాన్య ప్రయాణీకురాలిగా వున్నా యించుమించు అంతే. లేకపోతే ఆవిడ సేవ యావత్తూ దారి పొడుగూతా ఆటోగ్రాఫ్‌లు పెట్టడానికే సరిపోతుంది.

మాకు పరిచయం కలిగిన కొత్తలోనే ఆవిడ ప్రభావం యెలా వుంటుందో చూశేను. కొన్ని నెలలుగా ఆవిడ్ని చూడలేదు. ఆవిడ విదేశాల్లో యెక్కువ వుండాల్సివచ్చింది అప్పుడు. ఆవిడ రోమ్ నుంచి ఆ సాయంత్రమే దిగుతున్నారని ఓ రోజున నాకు తెలిసింది. ఢిల్లీలో యెంతసేపు ఆవిడ ఆగుతారో తెలీదు. అంచేత కలుద్దామని ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లేను. రోమ్‌నుంచి రావాల్సిన ఎయిర్ ఇండియా విమానం పదిహేను నిముషాలు ఆలస్యం అయింది. ఆవిడ టెర్మినల్ బిల్డింగ్ దగ్గరకు వచ్చేటప్పటికి దాదాపు ఏడున్నర అయింది.

"మీరు వచ్చేరా, సంతోషం. యీ రాత్రికే నేను కలకత్తా విమానం అందుకునేట్టు చూడాలి మీరు" అన్నారావిడ నన్నుచూసి చిరునవ్వు నవ్వుతూ.

అది సాధ్యం అని నాకు అనిపించలేదు కలకత్తా వెళ్లే విమానం డొమెస్టిక్ టెర్మినల్‌నుంచి బయల్దేరుతుంది. బయల్దేరే టైమ్ ఎనిమిది. యేం ముంచుకువచ్చిందో అపుడు సరిగ్గా ఎనిమిదింటికే బయల్దేరబోతోంది. యిక్కడేమో ఆవిడ లగేజి ఎయిర్‌ఇండియా విమానం నుంచి దించనే లేదు. యింకా అప్పటికి మదర్ థెరెసా యెలాంటి మనిషో నాకు పూర్తిగా తెలియలేదు. ఆవిడ పట్టుబడితే జరగాల్సిందేనట. అయితే ఆవిడ చెప్పేది శాంతంగానే వుంది. "కలకత్తా శిశుభవన్‌లో" ఓ బిడ్డ చావుబతుకులమధ్య వుంది. నా లగేజీలో ఒక మందు వుంది. ఆ పిల్ల దానివల్ల బతకచ్చేమో. ఆ విమానం అందేటట్లు చూడాలి మీరు" అని మెల్లగా అన్నారు. పాత గుడ్డ సంచీలోనుంచి జపమాల తీశేరు, ప్రార్థన మొదలెట్టేరు. అప్పుడే ఏడు నలభై అయిదు అయిపోయింది. కలకత్తా విమానంలో ప్రయాణీకులు యెక్కేశారు.

యీలోపున టెర్మినల్ బిల్డింగ్‌లో ఉన్నవాళ్ళకి మదర్ థెరెసా అక్కడ ఉన్నట్లు ఉప్పు అందింది. ఆశీస్సులనీ, ఆటోగ్రాఫ్‌లనీ, ఆవిడ్ని దగ్గరగా చూడాలనీ జనం పోగవడం మొదలుపెట్టారు. యెలా జరిగిందో యేమో తెలీదు, కలకత్తాలో ఓ చిన్నపిల్ల చావుబతుకుల్లో వుందనీ, మదర్ థెరెసా యెలాగైనా అక్కడకి వెళ్లి తీరాలనీ నలుగురికీ తెలిసిపోయింది. సీనియర్ మేనేజర్ స్థాయినుంచి పోర్టర్ దాకా ప్రతి వాళ్లూ ఆవిడకు సాయం చెయ్యాలని హడావుడి పడిపోయారు. మదర్ థెరెసా లగేజి కన్వేయర్ బెల్ట్‌మీద దొర్లుతూ వస్తోంది. అరు కార్డుబోర్డు పెట్టెలు (ఒకదాంట్లో ఆవిడ సొంతవస్తువులు, మిగిలిన వాటిల్లో మందులు వున్నాయి.) మొట్టమొదట వాటినే దింపి పంపేరు. యెక్కడినుంచి వూడిపడ్డాడో యేమో, ఒకతను వచ్చి ఆవిడ చేతిలో బోర్డింగ్ కార్డ్ పెట్టేడు. మాకు తెలీకుండానే కంట్రోల్ టవర్, ఆ విమానం కెప్టెన్‌కి మాట అందించేడు. సరిగ్గా విమానం రన్‌వే మీదకు వెళ్లబోతోంది. కెప్టెన్ కలకత్తావాడే. విమానం ఆపేశాడు. కొంచెం మార్పులు

జరగబోతున్నట్టు ఎయిర్ ట్రాఫిక్‌కి ఫ్లయిట్ కంట్రోల్ హెచ్చరించింది. విమానం మదర్ థెరెసా కోసం ఆగింది. నా కార్లో ఆవిడ్ని విమానం దాకా తీసుకెళ్ళనా? కొన్నిక్షణాలు. మసకలో నుంచి నిచ్చెన వచ్చింది. విమానం తలుపు తెరుచుకుంది. మదర్ థెరెసా మందుల పెట్టెలతో కలకత్తా విమానం యెక్కారు.

పదిరోజుల తర్వాత మదర్ థెరెసా మళ్లీ ఢిల్లీ వచ్చేరు. సరే, నేనడిగే మొదటి ప్రశ్న శిశుభవన్‌లో ఆ బిడ్డ యెలావుందని. ఆవిడ ముఖమంతా చిరునవ్వులు విరిశాయి. సరిగ్గా సమయానికి కలకత్తా చేరగలిగేరట, ఆవిడ అన్నారు. ఆ చంటిబిడ్డ తెప్పరిల్లింది. "యెంత అద్భుతం యిది! కదా?" అన్నారావిడ.

* * *

# 9 తితాఘర్

భారతదేశంలోగాని, విదేశాల్లోగాని నేనుచూసిన ప్రతి కుష్ఠుకేంద్రానికీ ఒకో దీర్ఘగాథ వుంది. కుష్ఠుకేంద్రాన్ని స్థాపించడానికి, నిర్వహించడానికి, వ్యవస్థీకరించడానికి ధైర్యం అవసరం. యిక బాధితులవైపునుంచీ ధైర్యం కావాలి. యెక్కువ సందర్భాల్లో శిధిలమైన జీవితాల్ని తిరిగి యేర్పాటు చేసుకోవాలి, నూతన జీవితాల్ని ప్రారంభించాలి. దీనికంతటికీ ధైర్యం కావాలి. తితాఘర్‌లో వున్న గాంధీజీ ప్రేమనివాస కుష్ఠుకేంద్రం యిలాంటి ధైర్యానికి సజీవచిహ్నంగా నిలుస్తుంది.

యిది కలకత్తా పారిశ్రామిక శివార్లో వుంది. మిషనరీ ఆఫ్ బ్రదర్స్ ఆఫ్ ఛారిటీ యిక్కడ చేస్తున్న కృషి గురించి మదర్ థెరెసా నాతో చాలాసార్లు చెప్పేరు. నేను కలకత్తా యెక్కువగా వెడుతూనే వుంటాను. అలా వెళ్లినప్పుడు ఓసారి ఆవిడ్ని అడిగేను ఆ కేంద్రాన్ని చూసిరానా అని. ఆవిడ వెంటనే ఆ కేంద్రం డైరెక్టర్ బ్రదర్ మరియాదాస్‌కి ఉత్తరం రాసి యిచ్చేరు. "వెళ్లిచూసిరండి, మాదగ్గరున్న కుష్ఠురోగులు చక్కనివాళ్లు. వాళ్లకీ వ్యాధి వచ్చింది, అదీ దేవుని కానుకే ననుకోవాలి వాళ్లని తన దగ్గరకు తెచ్చుకొందుకు ఆయన పద్ధతి యిది" అన్నారు.

ఫిబ్రవరి నెలలో ఓ రోజు పొద్దున్నే కలకత్తానుంచి కార్లో బయల్దేరేను. తితాఘర్‌కి దగ్గర దగ్గర గంట పట్టింది. జనం రణగొణ ధ్వనులు, అమ్మేవాళ్ల అరుపులు. హారన్ మోగించీ మోగించీ, యిరుకుల్లో నుంచి మెల్లగా సాగీ సాగీ ఆ పదిహేనుమైళ్లూ వెళ్లాం. అటూ యిటూ రకరకాల దృశ్యాలు దూసుకుపోతూనే వున్నాయి. కూరగాయల దుకాణాలు, చిల్లర కొట్లు, అగ్నిమాపకదళం వారి గొట్టాల నీళ్లల్లో కేరింతలు కొడుతూ స్నానం చేసే పిల్లలు, గాలిలో ఆరేసిన రంగురంగుల చీరలు, రకరకాలుగా బుట్టల్ని అల్లుతూవున్నవాళ్లు– యిలా యెన్ని దృశ్యాలో దాటేం. భారత ప్రధానమంత్రి జవహర్‌లాల్ విగ్రహం దాటేం. దానిపక్కనే చిన్న కృష్ణ ఆలయం వుంది. భక్తులు సాష్టాంగపడిపోతున్నారు. అదిదాటేక ఓ మసీదు వుంది. దాని గుమ్మటం చిన్నచిన్న పింగాణీ ముక్కలు అతికించి వుంది. అది యెండలో భారీ ముత్యంలా మెరుస్తోంది. అది దాటేక పొగ గొట్టాలు తగిలేయి. యిప్పుడవి వాడకంలో లేవు. ఒకప్పుడు పేపరు వుండేది అక్కడ. ఆ కాగితం మిల్లు వల్లే ఆ శివారుకు అప్పట్లో పేరు వచ్చింది. యెటు వెళ్లాలో అని అడిగేందుకు ఆగేం.

"కుష్ఠకేంద్రానికి దారి యిటేనా?" అని డ్రైవరు దారమ్మట వెళ్ళేవాళ్లని అడిగేడు. "ఆ" అని ఒకతను అటు వేపు చూపించేడు. సందుచివర పసుప్పచ్చరంగు బిల్డింగ్ వుంది. "మదర్ థెరెసా" అని వివరిస్తున్నట్టుగా అన్నాడు.

తితాఘర్‌కేంద్రాన్ని మిషనరీస్ ఆఫ్ ఛారిటీ 1958లో స్థాపించింది. అలాంటివి వంద కేంద్రాలకి పైగా వున్నాయి. అవి ఆఫ్రికా, మధ్య ప్రాచ్యం, ఆసియాఖండాల్లో విస్తరించుకుని వున్నాయి. వాటిని యిప్పుడు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సంస్థవాళ్లే నడుపుతున్నారు. భారతస్వాతంత్ర్య సంగ్రామ మహా యోద్ధ మహాత్మా గాంధీ పేరు పెట్టడం యెంత మాత్రం యాదృచ్ఛికం కాదు. యేమంటే, అణగారిన ఆర్తుల సముద్ధరణ కంకణం కట్టుకున్నాడు. వాళ్లల్లో నాలుగువేల మంది కుష్ఠరోగులుంటే, వాళ్లందరికీ ప్రత్యేక శ్రద్ధతో సేవలు చేశారు. ఆ కేంద్రం ఔట్ పేషంట్ హాల్లో నేను కొంచెం సేపు బ్రదర్ మరియాదాస్ వచ్చేదాకా ఆగేను. అక్కడ చాలా పోస్టర్లు వున్నాయి. 1948 జనవరి 30 కుష్ఠవ్యతిరేక దినంగా భారతదేశం జరుపుతుందని గుర్తుచేసే పోస్టర్ ఒకటుంది. ఆ రోజున మహాత్ముడు ఒక హంతకుని పిస్టల్ గుళ్ళకు బలైపోయాడు. అక్కడి పేషెంట్లు గాంధీజీ బొమ్మల్ని పెన్సిల్‌తో స్కెచ్ చేశారు. గాంధీజీ సేవాగ్రామ్‌లో యిద్దరు కుష్ఠరోగులకు సేవ చేస్తూవున్నట్టు చిత్రించిన స్కెచ్ ఒకటుంది. యింకా పోస్టర్లూ, బొమ్మలూ వున్నాయి. వాటిని చూస్తూ నుంచున్నాను. అప్పుడో చురుకైన యువకుడు వచ్చేడు. అతనికి గడ్డం వుంది. కళ్లు కరుణార్ద్రపూరితంగా వున్నాయి. అతను రండి అంటున్నట్టు నాకేసి చేతిని చాచేడు. అతనే బ్రదర్ మరియాదాస్. చిన్న ఆఫీస్ గదిలోకి తీసుకువెళ్లేడు. నేల మీద యే తివాసీలూ లేవు. ఓ చిన్నబల్ల, ఒకటిరెండు కుర్చీలు వున్నాయి. గోడమీద ఒకేఒక్కఫోటో వుంది. బ్రదర్స్ శాఖకు సహస్థాపకుడైన బ్రదర్ ఆండ్రూతో మదర్ థెరెసా వున్నఫోటో అది. దాని కింద యిలా రాసివుంది: "కుష్ఠరోగులు అంటూ లేరు. కుష్ఠవ్యాధి మాత్రమే వుంది. దాన్ని నయం చెయ్యవచ్చు."

మదర్ థెరెసా అకుంఠిత దీక్షకు ప్రేమనివాస్ కూడా సజీవ సాక్ష్యమే. యిప్పుడీకేంద్రం వున్నప్రాంతం యిటీవల కొన్నేళ్లదాకా పూరిగుడిసెల మయంగా వుండేది. ముఖ్యరైలు మార్గం అటూ యిటూ అవి లేచేయి. కుష్ఠవ్యాధి గ్రస్తులైన కుటుంబాలు యెన్నో వెలి అయి, వాళ్ల హైన్యంతో, వ్యాధితో, దారిద్ర్యంతో, నేరాలతో యిక్కడకి వచ్చిపడేవి. వాళ్ల పరిస్థితి యెంత దుర్భరంగా వుండేదంటే, వేరే పూరిగుడిసెల్లో వుంటున్న వాళ్లు కూడా కన్నెత్తిచూసేవాళ్లుకాదు. దాంతో నగరానికి దూరంగా, రైల్వేలైన్ పక్క రొచ్చు గుంటల్లోకి వాళ్లని గెంటేసేవాళ్లు. పట్టణవాసులే కాదు, చట్టం అమలు జరపాల్సిన అధికార్లు కూడా ఆ అంటువ్యాధి అంటే గజగజ వొణికేవాళ్లు. పోలీసులు యీ పూరిగుడిసెల ప్రాంతానికి వచ్చేవాళ్లు కారు. దొంగసారా అమ్మకాలు, తయారీ జరుగుతూవున్నా, కుష్ఠవాళ్లున్నంత కాలం, చూసీ చూడనట్టే దాటుకుపోయేవాళ్లు. యీ బస్తీలోపల యెప్పుడూ యేదో అల్లరీ కొట్లాటలూ జరుగుతూనే వుండేవి. ఓసారి హత్య కూడా జరిగింది.

పట్టణంలో కుష్ఠరోగులకు వైద్యసహాయం అందించేవాళ్లూ యెవళ్లూ లేరు. డాక్టర్లు వాళ్లకు చికిత్స చెయ్యడంలేదు. పరువుమర్యాదలున్న యే క్లినిక్‌గాని హాస్పిటల్‌గాని వాళ్లని చేర్చుకోదు. కొంతమందికి ప్రాణం మీదకు వచ్చి వైద్యం అవసరమైనా

పరిస్థితి యింతే. కొన్ని కుటుంబాల్లో అయితే అందరికీ యీ వ్యాధి సోకింది. దీనికితోడు పరమకచాడీ పరిసరాలు. దాంతో యీ వ్యాధి, యిట్టే వ్యాపించేది. కుష్టువ్యాధి చెప్పాపెట్టాకుండా వచ్చేజబ్బు అని చెప్పే నాథుడు లేడు. గుట్టుచప్పుడు కాకుండా నరాల్ని లాగేస్తుంది. నొప్పి అనేది కవచం, యేమంటే దాన్నిబట్టి యేం రాబోతుందో తెలుస్తుంది. అలాంటి కవచమూ దీనికి వుండదు. చేతుల్లో కాళ్ళల్లో స్పర్శపోతుంది. యెక్కువగా గాయాలు నొప్పిలేకుండానే తగిలేస్తాయి. దాంతో పుళ్ళు వస్తాయి. రక్తకణజాలం విషపూరితం అవుతుంది. చాలాకాలం అలా ఉపేక్షిస్తే అవకరాలు వచ్చి, వేళ్లు కాళ్లవీ చేతులవీ కూడా, కొరుక్కుపోతాయి. నాసికలు తప్పడైపోతాయి. కనుబొమలు పోతాయి.

వ్యాధి సోకిన వాళ్లల్లో కొందరు వైద్యం కోసం కలకత్తా రావడం తప్పదుకదా! మదర్ థెరెసా నడుపుతున్న సంచార చికిత్సాలయాల గురించి వాళ్లు విన్నారు. ఓ చికిత్సాలయం ప్రతి బుధవారం ఎంటల్లీలోని లొరేటోకాన్వెంట్ ప్రహారీగోడ బయట కుష్టురోగులకి చికిత్స చేస్తోందనీ వాళ్లకి తెలిసింది. యీ సంచార చికిత్సాలయంలో ప్రతివారం సిస్టర్ కొల్లెట్ మరో ముగ్గురు సిస్టర్ల సాయంతో వందమందికి పైగా కుష్టురోగులకు చికిత్స చేసేది. చాలా ఖరీదైన మందుల్ని, విటమిన్లనీ ఉచితంగా అందించేది. పౌష్టికాహారంలేని రోగులకు ఆహారం పొట్లాలు అందచేసేవారు. దాంతో తితాఘర్ నుంచి కుటుంబాలకు కుటుంబాలు యీ సంచార చికిత్సాలయానికి కొన్నిరోజుల్లోనే రావడం మొదలైంది.

చాలామంది పేషెంట్లకి బస్సుఛార్జీలు, రైలు ఛార్జీలూ పెట్టుకునే స్తోమతకూడా లేదని సిస్టరు గ్రహించేరు. ఒకోసారి టికెట్ లేకుండానే ప్రయాణం చేసేవారు. పట్టుబడితే గనక తర్వాతి స్టేషన్లోనే దిగిపోవాల్సివచ్చేది. యీ జబ్బు అప్పుడే పుట్టిన శిశువులకీ సోకేది. ఆ బాలెంతరాళ్లు వాళ్లని తీసుకుని తితాఘర్ నుంచి ప్రయాణం చెయ్యడమూ కష్టమయేది. రోగులు మదర్ థెరెసా దగ్గరకు వెళ్లి తితాఘర్‌లోనే చికిత్సాకేంద్రాన్ని ప్రారంభించమని అర్థించేరు.

మదర్ థెరెసా తితాఘర్ వెళ్లారు. ఆ మొదటి సందర్శనలోనే ఆవిడకు పరిస్థితి అర్థమైంది. గత్యంతరం లేదు. కొన్నినెలల్లోనే రైలు పట్టాల దగ్గరున్న ఓ షెడ్డులో చిన్న క్లినిక్ ప్రారంభించేరు. రోగులు విపరీతంగా వచ్చి పడుతున్నారు. ఆ ఒత్తిడి తట్టుకుందుకు ఆవిడ కొంతమంది సిస్టర్లని అక్కడకు పంపేరు. ఆ చికిత్సాలయం వల్ల కొండంత సమస్యలో ఆవగింజంత కూడా పరిష్కరించలేకపోతున్నట్టు తెలుసుకోవడానికి యెంతో కాలం పట్టలేదు. ఆ పల్లపు బురదప్రాంతాలనిండా పాములొకటి. రోగుల చుట్టూతా భరించలేని అపరిశుభ్ర వాతావరణం. యేదో ఒకటి ఆఘమేఘాల మీద చెయ్యకపోతే లాభం లేదు. ఓ మురుగు నీరు పోయే దారి లేదు. ఓ మంచినీళ్ల సరఫరా లేదు. పారిశుద్ధ్యం లేదు. ఎలక్ట్రిసిటీ లేదు. చెప్పాలంటే నెత్తిమీద యెండకో వానకో సరైన కప్పుకూడాలేదు. జనవరి నెలలో పొద్దున్నే చలిగాలులు కూడా వీస్తాయి. అలాంటి చోట్ల పని మగవాళ్లకి సరిపడుతుంది అని గ్రహించి మదర్ థెరెసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ బ్రదర్స్‌కి ఆ కష్టభూయిష్టమైన పనిని అప్పగించేరు.

బ్రదర్ క్రిస్టో దాస్, ఆయన పడుచు అసిస్టెంట్ బ్రదర్, మరియాదాస్ పరిస్థితుల్ని బాగుచెయ్యడానికి ప్రయత్నించేరు. అయితే గూండాలు, ముఠానాయకులు వాళ్లప్రయత్నాలని అటకాయించేరు. వాళ్లంతా దుర్మార్గపు పనుల్లో మునిగినవాళ్లు. దాంతో ఆ శిబిరం మార్పు రావాలన్నవాళ్లకీ, దాన్ని వ్యతిరేకించినవాళ్లకీ మధ్య చీలిపోయింది. ఉద్రిక్తతలు పెరిగేయి. బ్రదర్లమీద రాళ్లు విసిరేరు. వాళ్లతోబాటు పనిచేస్తూవున్న యువకుల మీద, యువతుల మీదా కూడా రాళ్లు విసిరేరు.

మార్పు కావాలనుకునేవాళ్లు, తొలిమెట్టుగా, సరికొత్త గృహసముదాయం కట్టడం మొదలుపెట్టేరు. దానికి కొన్ని నెలలు పట్టింది. దాంతో ఉద్వేగం పెరిగింది. ఆ బిల్డింగ్ తయారయేవేళకు, ఆఖరి ప్రతిఘటన కూడా పటాపంచలైంది. ముఠానాయకులు పారిపోయేరు. వాళ్లతోబాటే కసి, ద్వేషాల చిహ్నాలూ పోయేయి. అప్పట్నుంచీ మగాళ్లు, ఆడాళ్లు, పిల్లలు కూడా శక్తి యుక్తులతో పనికి నడుంబిగించేరు. మొదటగా, ఆ బాడవలో రెండు పెద్ద చెరువులు తవ్వేరు. అలా తవ్వగా వచ్చిన మట్టితో మిగిలిన చిత్తడినేలను పూడ్చేరు. ప్రధాన భవనాల నిర్మాణం అప్పుడు మొదలైంది నిజంగా. మొదట మరిన్ని వాన యోగ్యమైన వాటాలు రావాలి. తర్వాత పెద్ద పొడుగాటి, సన్నని పటాలంవాళ్లకు వుండే బాపతు యిళ్లు వచ్చేయి. వాటి తలుపులూ, కిటికీలు ఆకుపచ్చరంగువి. యివాళ అది పునరావాస కేంద్రంగా, ఉత్పత్తి కేంద్రంగా వుంది. వాటి తర్వాత హాస్పిటల్ కట్టేరు. అందులో ఆడవాళ్లకీ మగవాళ్లకీ వేరు వేరు విభాగాలు వున్నాయి. ఓ కాంటీన్ వుంది. చిన్న చిన్న యిళ్లు కలిసివున్నాయి. అవి తితాఘర్ రైల్వేస్టేషన్ నుంచి, కార్దా రైల్వేస్టేషన్ దాకా విస్తరించుకున్నాయి. దగ్గర దగ్గర ఒక మైలు దూరం అన్నమాట. పట్టాల వెంబడే.

బ్రదర్ మరియా దాస్ నన్ను పట్టాల వెంబడే పునరావాసకేంద్రానికి తీసుకువెళ్ళేడు. ఓ రైలు వంతెన గాని, పట్టాల కిందనుంచి వెళ్లే దారి గాని లేవు. యే రైలన్నా వస్తోందేమోనని వెనకా ముందూ చూసుకుంటూ వెళ్లేం – పట్టాలు దాటేం. కేంద్రం గుమ్మంలో ఓ చిన్న బోర్డు కనిపించింది. ఆ బిల్డింగ్ నిర్మాణంలో రోగులు పడ్డ శ్రమని తెలియచేస్తూ దాని మీద రాసి వుంది. నిజం చెప్పాలంటే అంతదూరం యీ మూల నుంచి ఆ మూలకి పరుచుకుని వుంటుందని అన్న విషయం నేను వూహించలేదు. హాల్లో రెండు వైపులా మగ్గాలున్నాయి. వాటి మీద కుష్ఠురోగులు, యేకరీతి తెల్లని చీరల్ని అందరికీ పరిచయం అయిన నీలం అంచుతో నేస్తున్నారు. అంతకుముందుటేడు దాదాపు నాలుగు వేల చీరలు భారత దేశంలోనూ విదేశాల్లోనూ వున్న మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కేంద్రాలకి యిక్కడి నుంచి సరఫరా అయేయి. నేలమీద కొంతమంది ఆడవాళ్లు కూర్చున్నారు. చర్ఖాలని తిప్పుతున్నారు. విదేశీ ఆర్థిక ప్రభావాన్ని తట్టుకుందుకు ప్రధాన ఆయుధంగా గాంధీజీ చర్ఖాని తయారు చేశారని నాకు గుర్తుచేశారు. దిగుమతి చేసుకున్న ఖరీదైన విదేశీవస్త్రాల్ని బహిష్కరించమని ఆయన పిలుపునిచ్చేడు. దానిబదులుగా సాదా నేతబట్టలు ధరించమన్నాడు. నిరుపేదలు సాదా చర్ఖామీద నేసిన నూలు బట్టలు ధరించమన్నాడు. ఆ ఉద్యమం ఉద్ధృతంగా వ్యాపించింది. చర్ఖా నాలుగు దిక్కులా విస్తరించుకుంది. దానివల్ల లక్షలాది మందికి ఉపాధి లభించింది. అంతేకాదు, అది భారత స్వాతంత్ర్య ఉద్యమ ప్రతీక అయింది. నేలమీద రోగులు తలమీద చీరలు

కప్పుకుని కూర్చున్నారు. రోగం మీద, గడ్డుపరిస్థితుల మీద సాధించిన విజయం వల్ల కలిగే హుందాతనం వాళ్ళల్లో వుంది.

కేంద్రం నుంచి హాస్పిటల్ కి వెళ్లేం. నేలంతా శుభ్రంగా కడిగేరు. దాగా గట్టి యాంటీసెప్టిక్ వాసన వస్తోంది. ఓ వందపైచిలుకు పడకలు వుంటాయి. యావద్భారతం నుంచీ వచ్చిన రోగులు అక్కడ వున్నారు. మందులు, సర్జరీ, హాస్పిటల్ మకాం, అఖరికి భోజనం కూడా ఉచితం. పైసా ఛార్జీలేదు. విదేశాల్లో దాతలు చాలా ఖరీదైన మందుల్ని దానం చేశేరు. అవి అయిపోతే గనక స్థానికంగా మార్కెట్లో కొనుక్కోవాలి. యేమంటే చికిత్సలో నాగా వస్తే యితర యిబ్బందులు వచ్చిపడతాయి. దాంతో యీ పడ్డ శ్రమంతా బూడిద పాలవుతుంది.

కుటుంబాలున్న వాటాలు మహాసందడిగా వున్నాయి. కొన్ని వాటాల్లో నేను చూసిన పేషెంట్లు చాలా అవకరంతో వున్నారు. అయితే కదురు తిప్పడం మానలేదు, యింటి పన్లు ఆగలేదు. ఓ పెద్ద వయసు మనిషి కనిపించేడు. చేతులు మొండిగా వున్నాయి, వేళ్లు లేనేలేవు. అయితేనేం నేర్పుగా కుట్టుమిషన్ మీద పనిచేస్తున్నాడు. దాన్ని అతను కాలితో, సైకిల్ పెడల్లాంటి దానిమీద, నడిపేస్తున్నాడు. యీలోపున పిల్లలు మదర్ మరియాదాస్‌ని అటొకరూ, యిటొకరూ లాగేస్తున్నారు. పిల్లలు అప్పుడే బడి అయివచ్చినట్టుంది "బ్రదర్, బ్రదర్" అంటూ ఒక్కటే గొంతుక అన్నట్టు అరుస్తున్నారు. అతని చేతులు గుంజుతున్నారు. ఓ పిల్లాడి ముక్కు నులుముతూ ఓ పిల్లాడి చెవి మెలిపెడుతూ అతను ఒక్కొక్కళ్ల పేరూ చెప్పేడు నాకు. యింకా చాలామందికి నన్ను పరిచయం చేశాడు. వాళ్లల్లో అమ్మమ్మలాంటి ఆవిడ ఒకరున్నారు. ముగ్గుబుట్టలా పండిపోయింది తల. "మా మీదకు రాళ్లు విసిరిన వాళ్లల్లో సంచారి కూడా వుంది. తర్వాత వీటిని కట్టేటప్పుడు ఆ బృందానికి మేస్త్రీ యీవిడ. మాకు యీవిడా ఓ స్తంభం లాంటిది" అని చెప్పేడతను. సంచారి నన్ను తన యింట్లోకి తీసుకెళ్లి చూపించింది గొప్పగా. అది అద్దంలా వుంది. చుట్టూ వున్న పెరట్లో పొద్దుతిరుగుడు పువ్వులు పూస్తున్నాయి. పెద్ద కెంపు దహేలియాలు వున్నాయి. మేం నుంచున్న నేల ఒకనాడు చిత్తడి బాడవ అంటే నమ్మబుద్ధిపుట్టదు.

యిక సెలవు తీసుకుందామనుకుంటూ, బెరుగ్గానే బ్రదర్ మరియాదాస్‌తో అన్నాను, బ్రదర్స్ వుండే వసతుల్ని చూడచ్చా అని. అతని సైకిల్ మీద వెనక కూర్చున్నాను. అతను తొక్కుతున్నాడు. వద్దని నా కార్లో వెడదామన్నాను. యేమంటే అదే సౌకర్యం. వాళ్లుండే యిళ్లు మూడుమైళ్లదూరంలో వున్నాయి. ఓ కప్పు టీ తాగేక – అది అవసరం అనిపించింది కూడా–అతను వాళ్ల దినచర్యల గురించి చెప్పేడు.

"తెల్లవారకట్ల నాలుగున్నరకు లేస్తాం. అయిదున్నర నుంచి ఏడుదాకా ప్రార్థనా సమావేశం. ఆరుగంటలకు ప్రీస్ట్ మాస్ నిర్వహిస్తాడు. అదయేక అరగంట సేపు యిల్లు శుభ్రం చేసుకుంటాం. మాకు పనివాళ్లెవరూ లేరు. ఎనిమిది గంటల నుంచి ఒంటిగంటదాకా, మళ్లీ మూడుగంటలసేపు ప్రేమ నివాస్‌లో పనిచేస్తాం. ఒకో అప్పుడు కొంచెం విశ్రాంతి తీసుకుంటాం. అయితే ఆ పూట రోగుల్ని బట్టి వుంటుందది. సాయంత్రం ఆరున్నరకు సాయంత్రం ప్రార్థనలు వుంటాయి. ఆ

తర్వాత రాత్రి భోజనం. మళ్లీ రాత్రి ఎనిమిదిన్నరకు ప్రార్థనలు." మీకు మీ సొంతం అనేదేమన్నావుందా అని అడిగేను. అతని జీవితం పేదరికంలో వుంది కదా. రెండు చీరలు, యేదన్నా అవసరం పడితే వుంటుందని మూడవదీ వుంటాయి సిస్టర్లకు. అలాగే బ్రదర్లకీ రెండు సాదా నూలు చొక్కాలు, నూలు పంట్లాములూ వుంటాయి. మూడోజత యేదన్నా అవసరం పడితే వుంటుందని. వాళ్లప్రమాణాలు సిస్టర్ల ప్రమాణాల లాంటివే. అతనికి చెక్కమంచం వుంది. అదే పడక. దానిమీద తన "ఐహిక వస్తువుల్ని చక్కగా సర్దిపెట్టుకున్నాడు. బొంతమీద వాట్నే ఓపక్క వుంచుకున్నాడు. వాటిని నేను చూశేనని కనిపెట్టినట్టుంది. చిన్నగా చిరునవ్వు నవ్వేడు– "పేదలగురించి తెలుసుకుందుకు, పేదల కింద వుండాలిమరి"అన్న మదర్ థెరెసా మాటల్ని గుర్తుచేశాడు.

కొన్ని నెలల తర్వాత ఆ ముక్కలు మళ్లీ గుర్తువచ్చేయి. నేను శాంతినగర్ వెళ్లవలసి వచ్చింది. ఆ శాంతి స్థానం గురించి మదర్ థెరెసా చాలాసార్లు చెపుతూ వుండేవారు. దాన్ని గురించి చెప్పేటప్పుడు ఆవిడ గొంతుకలో ఉత్సాహం తొణికిసలాడేది. అదీ కుష్టురోగులదే. శాంతినగర్ ముప్ఫై నాలుగు ఎకరాల్లో వుంది. ఒకప్పుడది అడవి. బీహారు రాష్ట్రసరిహద్దుల్లో వుంది. అక్కడికి వెళ్లాలంటే కలకత్తాలో రైలెక్కి గంటలసేపు ప్రయాణించి అసన్ సోల్ చేరాలి. అది 150 మైళ్ల దూరం. అక్కడినుంచి మరో పదిహేను మైళ్లు.

"మీతో కూడా ఓ బ్రదర్ని పంపిస్తా" అన్నారు మదర్. సరిగ్గా అ సమయంలో మెట్లదగ్గర బ్రదర్ మరియాదాస్ కనిపించేడు. మేమిద్దరం కృతపరిచయస్థుల్లాగే పలకరించుకోవడం మదర్ చూశేరు. తను నాతోకూడా వెళ్లచ్చునేమోనన్నారు మదర్ థెరెసా. అంతకంటేనా అన్నాడతను.

మర్నాడు పొద్దుట హౌరా స్టేషన్ దగ్గర కలుసుకోవాలని యేర్పాటు చేసుకున్నాం. అసన్సోల్కి బ్లాక్ డైమాండ్ ఎక్స్ప్రెస్ వుంది. పొద్దున్నే 6.10కి. అతను టిటాఘర్ నుంచి వచ్చేవుంటాడనుకొని రాత్రి యెక్కడ పడుకున్నారని అడిగేను. "స్టేషన్లోనే" అన్నాడతను చిరునవ్వు నవ్వుతూ. కాని టికెట్లు నా దగ్గర వున్నాయి. అంచేత లోపలికి యెలా చేరుకున్నట్లు అని అడిగేను. సెకండ్ క్లాస్, వెయిటింగ్ రూమ్లో కొన్ని పరుపులు యిస్తారు లెండి. అందుకని అలా అడిగేను. "నాది పేదరిక దీక్ష కదా. అంచేత హోటెల్లో రూమ్ని గాని, సెకండ్ క్లాస్ వెయిటింగ్ రూమ్ బెడ్కిగాని ఖర్చు పెట్టను." అన్నాడు మరియాదాస్. నాకు యిబ్బందిగా వుంది. అయితే యేం చేశారు అని అడిగేను. "ప్లాట్ ఫాం మీద పడుకున్నాను. అర్ధరాత్రి అవుతూ వుండగా కలకత్తా వచ్చేను. హుగ్లీలోవున్న కలకత్తాబ్రదర్స్ని ఆవేళప్పుడు యిబ్బంది పెట్టడం బాగుండదు. అందుకని రైల్వేస్టేషన్లోనే గడిపేద్దామని అనుకున్నాను," అన్నాడు. జనవరి నెల. కటిక నేలమీద యెంత చలిగా వుంటుందో తెలుసా. అంచేత బూట్ పాలిష్ చేసే పిల్లల పెట్టెలు వుంటాయికదా. వాటిని నాలుగింటిని చేర్చి, యేదో పడక్కి సరిపడేట్టు తయారుచేసుకున్నాడు. రాత్రి వాటిమీద పడుకున్నాడు. రైలు బొగ్గు గనుల ప్రాంతంలో నుంచి వెడుతుంది. నేను నా ఆలోచనల్లో వున్నాను. అతను హాయిగా నిద్రపోతున్నాడు.

రైలు అసన్‌సోల్ స్టేషన్‌లోకి మెల్లిగా వెళ్లి ఆగింది. బ్రదర్ మరియాదాస్ రక్కన నిద్రలేచేడు. నన్ను నా ఆలోచనల నుంచి బయటకు లాగేడు. అక్కణ్ణుంచి శాంతినగర్‌కి అతను యే విపరీత రవాణాపద్ధతి చూస్తాడోనని, నేను ముందే టాక్సీ పిలిచాను, టైమ్ కలిసి వస్తుందికదా అన్న సాకుతో. యేమంటే, మేం ఆ సాయంత్రమే తిరిగి వెనక్కి వెళ్లాలి కదా మరి. శాంతినగర్‌కి వస్తావా అని అడిగిన వెంటనే ఆ టాక్సీడ్రైవర్ తబ్బిబ్బుపడ్డాడు.

బెంగాలీ, హిందీ, ఇంగ్లీషు– యిలా యే భాషలో వీలు పడితే అందులో, తర్వాత సైగలతో అసలు అక్కడకు వెళ్ళడంలో మా ఉద్దేశం యేమిటైందీ చెప్పేం. "లెపర్స్ హోమ్" అని ముందే చెప్పచ్చుకదా అన్నాడు డ్రైవరు. కాని శాంతినగర్ అంటే తెలీదా అని అడిగేను. యీ పాటికి యెంతమందిని అక్కడకు టాక్సీలో తీసుకు వెళ్లి వుంటాడో! "గత పదేళ్లలో ఒక్కసారే అక్కడికి వెళ్లేను. బుర్ర వున్న వాడెవడూ కుష్ఠువ్యాధిగ్రస్తుల గృహానికి వెళ్లడు" అన్నాడతను.

మధ్యాహ్నం వేళకు టాక్సీడ్రైవర్ రాము మనసు మారిపోయింది. టాక్సీలో ఒక్కడు వుండడం విసుగనిపించి వుంటుంది. కుతూహలం కొంత. యిక ఆకలి సరేసరి. సిస్టర్లు భోజనం తినమని పెట్టబోయేరు. బయట దొరక్కపోతుందా అని వద్దన్నాడు. యెక్కడా యేమీ కనిపించలేదు. ఆఖరికి వంటింట్లోకి వెళ్లేడు. సిస్టర్లు ఆప్యాయంగా అతనికి భోజనం పెట్టేరు. చవక ఉప్పుడుబియ్యం అన్నం, పప్పు, కొంచెం సలాడ్. చేపలు కూడా వున్నాయి. అప్పుడే పట్టి తెచ్చిన చేపలు. రుచిగా వున్నాయన్నాడు రాము. "కుష్ఠు సంస్థలు చూడ్డానికి వెళ్లేనంటేనే యింట్లోవాళ్లు స్నేహితులు వికారపడిపోతారు, యిక భోజనం తినడం మాట చెపితేనో!" అన్నాడు రాము. కాని ఆ పూట అతను ప్రాథమిక పాఠం నేర్చుకున్నాడు. తొలిదశలో గనక కనిపెట్ట గలిగితే కుష్ఠును నయం చెయ్యెచ్చు అది భయపడాల్సిన అంటువ్యాధి కానేకాదు.

ఆ మధ్యాహ్నం కలిగిన భావాలు సిస్టర్ ఆల్బర్ట్ నిండుగా నవ్విన నవ్వుల్తో యేకమై పోయేయి. ఆ నవ్వు సొంపైన గుడి గంటల్లాగా మోగుతూనే వుంది. 1961లో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం మదర్ థెరెసాకు ముప్పైనాలుగు ఎకరాల నేల యిచ్చింది. ముప్పైయేళ్లు కౌలు. కౌలుకు యేదో నామకః ఓ రూపాయి. నిజం చెప్పాలంటే అది ముఖ్యమంత్రి యిచ్చిన కానుకే అనాలి. ఆయన భారతదేశంలో అగ్రశ్రేణి రాజకీయవేత్త, పెద్ద కమ్యూనిస్టు. ఆయన యీ చిన్ననన్‌గాని ఆవిడ సిస్టర్ల బృందం గాని యేం అడిగినా "లేదు" అనడట. ఆ విషయం కలకత్తాలో అందరికీ తెలుసు. ఆయన యెరుగును, వాళ్లేం అడిగినా వాళ్లసొంతంకోసం కాదని. యెవళ్లూ పట్టించుకోకుండా వదిలేసిన అణగారిన ఆర్తుల కోసమే వాళ్లు యేదన్నా అడుగుతారు అనీ తెలుసు.

"శాంతినగర్ ఓ అద్భుతం" అంది సిస్టర్ ఆల్బర్ట్. మదర్ థెరెసా భాషలో అద్భుతాలు చిటికెవేస్తే పలుకుతాయి. ఆ మాటను మహా మురిసిపోతూ రోజూ పదిసార్లైనా వల్లిస్తూవుంటారు. వాళ్లకు తృప్తికలిగేటట్టు పనులు జరిగినప్పుడల్లా అద్భుతం అని అంటూనే వుంటారు. శాంతినగర్ కూడా యెంతో కష్టపడితే

వచ్చింది. "1961 లో యిది సాగూ ఓగూలేని అడివి," అని చెప్పింది సిస్టర్ ఆల్బర్ట్. కుష్ఠురోగులకు అన్నిసౌకర్యాలు వున్న వసతి, వైద్యసహాయ కేంద్రం వుంటే మంచిదని మదర్ తాపత్రయం. అయితే విత్తం యేదీ?

"అప్పుడో అద్భుతం జరిగింది. 1964లో అంతర్జాతీయ యూఖారిస్టిక్ మహాసభ కోసమని పోప్‌పాల్ VI బొంబాయి వచ్చేరు. ఆయన సందర్శన కోసమని కస్టమ్స్ యిబ్బందులేమీ లేకుండా వుండేటట్టే ఒక లివిన్ కాంటినెంటల్ లైమూజిన్‌ని (కారు) బొంబాయికి విమానంలో చేర్చేరు. అది అమెరికా వాళ్లు ఆయనకు యిచ్చిన కానుక. వందలాది భక్తుల్ని ఆశీర్వదిస్తూ ఆయన అందులోనే వెళ్లేరు. దాంట్లోనే ఆయన బొంబాయిలోవున్న మదర్ థెరెసా హోమ్‌కి వెళ్లేరు. అవసానదశలో వున్న వాళ్లకోసం ఉద్దేశించిన హోమ్ అది. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వాళ్లు చేసే పనులు చూసి ఆయన చలించిపోయేరు. దాంతో భారతదేశం నుంచి వెళ్లిపోయేటప్పుడు ఆలైమూజిన్ కారుని మదర్ థెరెసాకు యిచ్చేరు. మదర్ థెరెసా చేతల మనిషే కదా. వెంటనే దాన్ని లాటరీ వేశారు. పేపర్లలో వేసి ప్రకటనలిచ్చి అమ్మితే వచ్చేదానికంటే యెక్కువ డబ్బు వచ్చింది. అలా వచ్చిన డబ్బుని శాంతినగర్‌లో మెయిన్ హాస్పిటల్ బ్లాక్ కోసం ఖర్చుచేశారు. అదనంగా అవసరం అయిన నిధుల్ని జర్మనీ పిల్లలు సేకరించిపెట్టేరు. అసలీ లాటరీ వ్యవహారం యెలా వచ్చిందని ఆవిడ్ని అడిగేను. దాదాపు నాస్తికుడినైన నాకళ్ళల్లోకి చూస్తూ, – ఆ చూపే యెంతలోతైన విషయాల్ని చెపుతుందో–"మీరూ ప్రార్థన చేస్తే మీకూ వస్తాయి ఆ వూహాలు" అన్నారు.

యీ అడవిని బాగు చేసేందుకు 1968లో సెయింట్ గ్జావియర్ అనే ఆయన వచ్చేడు. ఆయన నోరు అలా మాట్లాడుతూనే వుంటుంది. యుగోస్లావ్ వాసి. మంచి చొరవ వున్న మనిషి. కొంతమంది సిస్టర్ల సాయం తీసుకున్నాడు. యెంత బాగా వెగ్గుకొచ్చేరని! దగ్గర్లోనే మేఘనాథ్ ఆనకట్ట వుంది. నీరు పుష్కలంగా వుంటుంది. దాంతో శాంతినగర్ పువ్వులతో, పూలపాదలతో కిలకిల లాడింది. పళ్ల మొక్కలనీ నాటేరు. యేదో లెక్కకి ఒకటి రెండు చెట్లుకాదు, ఒక చిన్న మామిడితోట. వాటి మధ్యలో గోధుమ, కాయగూరలు. పెద్దచెరువు తవ్వేరు. దాన్నిండా చేపలు వుంటాయి. యివాళ అలా మాంసకృత్తులు అందించే వనరు దొరికింది. పౌష్టికాహారంలేని వాళ్లకది యెంతో లాభం. యిదంతా మొదటి బేచ్ రోగులు రాకముందే జరిగింది. ఆ రకంగా అయితే స్వయం పోషక వనరుల్తో మొదలవవచ్చని.

రెండేళ్లల్లో ముఖ్యమైన భవనాలు లేచేయి. పునరావాసకేంద్రం, కుష్ఠురోగుల వసతి గృహాలు వచ్చేయి. యీ గృహాల్ని వాళ్లే కట్టుకున్నారు. ఓ హాస్పిటల్ కూడా వెలిసింది. కుష్ఠురోగగ్రస్తకుటుంబాలు వీలైనంతవరకూ విడిగా వుంటేనే బాగుంటుదన్నదే మదర్ థెరెసాకు మొదటి నుంచీ వున్న అభిప్రాయం. ఆవిడ కుష్ఠురోగులకు ఒక ఒయాసిస్ యేర్పాటు చెయ్యాలని సంకల్పించేరు. అందులో అన్ని మత విశ్వాసాలవాళ్లు, అన్ని తరహాల వాళ్లు చేరవచ్చు. వైద్యసహాయం, సూచనలు పొందవచ్చు. కనీసం ఓ మేరకేనా కాళ్లూ చేతులూ కూడదీసుకోగలరు. తమ అవకరం పట్ల యెలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో వాళ్లకి బోధించడం ముఖ్యం. పెద్దవాళ్లు శేషజీవితాన్ని మనశ్శాంతిగా గౌరవప్రదంగా బతకగలిగే స్థలాన్ని యేర్పాటు చెయ్యడం,

సొంతంగా తమ యింటిని నిర్మించుకోవడం నేర్పుతారు. సాదా నమూనా వున్న యిళ్లు, అవి పల్లెల్లో వుండే నివాస గృహాల్లాగే వుంటాయి. దీనివెనకాలే ఒక శిశుభవన్ వచ్చింది. వ్యాధి సోకిన వాళ్ల నుంచి పిల్లలు దూరంగా వుండేందుకని దాన్ని యేర్పాటు చేశారు. తర్వాత ఒక హాస్పిటల్ వచ్చింది. అందులో పునర్నిర్మాణ శస్త్రచికిత్స జరుగుతుంది. అక్కడ ప్రొస్థెటిక్, ఆర్థోటిక్ శస్త్రచికిత్సా పరికరాలు వుంటాయి. యితర పరికరాలూ వుంటాయి. అక్కడ వాళ్లు వాళ్ల ధాన్యం వాళ్లే పండించు కుంటారు. చిన్న కోళ్లఫాం పెట్టుకున్నారు. బుట్టలు అల్లుతారు. పళ్లతోట పెంచుతారు. గ్రామ పెద్దలు ఓ తరహా స్థానిక పరిపాలన యేర్పాటు చేసుకున్నారు. వాళ్ల నాయకుల్ని వాళ్లే యెన్నుకుంటారు.

దేన్నీ వృధాగా పారుపోనివ్వరు. పశువుల పేడనికూడా. పశువుల కొట్టాన్ని ఆనుకునే ఒక ప్లాంట్ వుంది (గోబర్ గాస్ ప్లాంట్ అంటారు). ఆ పేడనుంచి వాసనా, రంగూలేని వాయువు వస్తుంది. దాన్ని గొట్టాల ద్వారా వంటగదికి పంపిస్తారు. కమ్యూనిటీసెంటర్లకు పంపిస్తారు. మామూలు వంటగాస్ పక్కవూరి నుంచి సరఫరా అయేదానికంటే నమ్మకమైనదీ సరఫరా. వందలాది కొబ్బరిచెట్లు వున్నాయి. కొబ్బరినీళ్ళల్లో మంచి భాస్వరం వుంటుంది. పీచుతో ముతకవే అయినా పరుపులు చెయ్యచ్చు. టేకుచెట్లు యెదుగుతూ వున్నాయి. ముందు ముందు చాలా "హోమ్స్"కి అవి పనికొస్తాయి. పొలంలోగాని, చెరువులోగాని, కిచెన్‌లోగాని, ఆ పూట మేం వెళ్లిన ప్రతి చోటులోనూ రోగం సోకని రోగులు, అవసరంతోనో, లేకుండానో నలుగురికీ ఉపయోగపడే పనుల్లో నిమగ్నం అయివున్నారు. యిది నాదీ అన్నభావంతో పనిచేస్తున్నారు. "మేము బయటినుంచి పెట్టుకునే పనివాళ్లకంటే యెంతో యిదిగా, నా బొందో అని పనిచేస్తారు చాలామంది రోగులు. అవసరంవున్నా లేకపోయినా కూడా," అని సిస్టర్ ఆల్బర్ట్ అంది.

సిస్టర్ ఆల్బర్ట్ 1990 నాటి గణాంకాలు గొప్పగా చూపించింది అది నిజంగా ముచ్చటగానే వున్నాయి. 17,631 మంది కుష్ఠురోగులూ, 4,362 మంది సాధారణ జబ్బుమనుషులు ఔట్‌పేషెంట్ చికిత్స పొందేరు. 966 మంది కుష్ఠురోగుల్ని హాస్పిటల్‌లో చేర్చుకున్నారు. 449 మందికి సర్జరీ జరిగింది. పునరావాస కేంద్రంలో 785 జతల ప్రత్యేక బూట్లని తయారుచేశారు. ముప్పైఅయిదు మందికి కృత్రిమ అవయవాల్ని అమర్చేరు. 135మంది పిల్లల్ని శిశుభవన్‌లో చేర్చుకున్నారు. 38 మందిని చికిత్సచేసి పంపించేరు. ప్రతినెలా 2000మందికి రేషన్లు యిచ్చేరు. 400మందికి భోజనం పెట్టేరు. ఒక్క పైసా తీసుకోలేదు. అసన్‌సోల్ నుంచి రెండు వారాలకోసారి ముగ్గురు డాక్టర్లు శస్త్రచికిత్స చెయ్యడానికి వస్తారు. వాళ్లల్లో యెవళ్లకీ సిస్టర్లకు వున్న నిబద్ధతా విశ్వాసాలు లేవు. అయినా దమ్మిడీ ఫీజు పుచ్చుకోరు.

ఇటికలు పరిచిన ఫుట్‌పాత్ వుంది. దాన్ని ఘనంగా పోప్ పాల్ అవెన్యూ అని పిలుస్తారు. దానికి దగ్గర్లో మగపిల్లల వసతివుంది. చక్కటి పడకలు, గోడలమీద అభిమాన పోస్టర్లువున్నాయి. ఓ యిరవైమంది అబ్బాయిలు సరదాగా వున్నారు. అప్పుడే బడినుంచి వచ్చినట్టుంది వాళ్లు. ఓ కుర్రాడు సిస్టర్ ఆల్బర్ట్ దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చేడు. షేక్‌హేండ్ అయేక, ఆ కుర్రాడు రివ్వున వెళ్లిపోయేడు.

"షాపున్, కొన్నేళ్ల కితం రైల్వే లైను పక్కన దొరికేడు. ఎండిపోయివున్నాడు. తండ్రిశవం పక్కన కూచున్నాడు. రైల్వే మెకానిక్‌లు యెవళ్లోచూసి యిక్కడికి తీసుకువచ్చేరు. బళ్లో బాగా చదువుతున్నాడు. ఎప్పుడూ క్లాసులో మొదటి రేంకే" అని ఆవిడ గొప్పగా చెప్పింది.

ఆ డార్మిటరీలో దృఢగాత్రుడైన పడుచతనొకడున్నాడు. అతను వీళ్లల్లా బ్రదరేమో ననుకున్నాను. యేమంటే చిన్నపిల్లలకి బాధ్యతగా వున్నాడు. "నీకంప్యూటర్ క్లాస్ యెలా వుందీవాళ, సంతోష్" అని సిస్టర్ అల్బర్ట్‌అడిగింది. అతను బెంగాలీ కుర్రాడు. పక్కనున్న పట్టణంలో ప్రత్యేక శిక్షణ పొందుతున్నాడు. "త్వరలోనే బోలెడు సంపాదించేస్తావ్, చక్కని పిల్లని చూసి నీకు పెళ్లిచేసేయ్యాలి" అని యేడిపించింది. "నేను పెళ్లీగిళ్లీ చేసుకోను. యీ హోమ్ వదలిపెట్టి వెళ్లిపోవడమూ లేదు" అన్నాడు సంతోష్. మేం అక్కడున్న యిళ్ల దగ్గరికి వెడుతున్నాం. సంతోష్ జీవితంలో మార్పు తీసుకువచ్చిన సంఘటన గురించి సిస్టర్ అల్బర్ట్ చెప్పింది. ఆ కుర్రాణ్ణి అనాధగా వదిలేశారట. ఓ కేంద్రం గుమ్మంలో. అప్పుడతనికి రెండేళ్ళు. సిస్టర్స్ అతన్ని పెంచి పెద్దచేశారు. అతని అనుభవంలోకి వచ్చిన ప్రేమానురాగాలు సిస్టర్లవే. రెండువారాల కితం సంతోష్ లోకమే అనూహ్యంగా మారిపోయింది. కుష్ఠు వ్యాధిగ్రస్తులైన దంపతులొకళ్లు వచ్చి సంతోష్ తమ బిడ్డ అన్నారు. యిన్నేళ్ల తర్వాత అతన్ని తమ "యింటికి" తీసుకుపోదామని వచ్చేరు. అసలు వాళ్లు నిజంగా తల్లిదండ్రులవునో కాదో సిస్టర్లకు ఆధారం దొరకాలి. అనుమానం లేకుండా వాళ్లు తల్లిదండ్రులే అని తేలాక ఆ బృహత్తర పరిణామానికి సంతోష్‌ని మానసికంగా సిద్ధం చెయ్యాలి. తల్లిదండ్రులతో కలపడానికి యేర్పాటయాక అతన్ని పిలిపించేరు. పదహారేళ్ల తర్వాత తొలిసారి అతను తల్లిదండ్రుల్ని చూశేడు. కుష్ఠుతో మొత్తం కొరుక్కుపోయి వున్నారు వాళ్లు. తనని చుట్టుముట్టిన సంఘటనలతో సంతోష్ బిత్తరపోయేడు. సంతోష్‌కి నచ్చచెప్పాలని చూస్తున్నాం. కుష్ఠు సోకినప్పుడు తల్లిదండ్రులకి యెంతటి విషాదం ఆవహించుకుందో అతను అర్థం చేసుకునేట్టు చేస్తున్నాం. వాళ్ల తరఫువాళ్లు యీ యిద్దర్ని వెలేశారు. ఉద్యోగం నిలవలేదు. దాంతో వీధుల్లో జోలెపట్టుకు తిరగాల్సి వచ్చింది. వున్న ఒక కొడుక్కి ఆ వ్యాధి సోకకూడదనుకున్నారు. అంచేత అతన్ని పంపేశారు. ప్రేమ లేక కాదు, చాలా యెక్కువగా ప్రేమించడం వల్లే" అని సిస్టర్ అల్బర్ట్ వివరించింది. సంతోష్ పరిస్థితిని అర్థంచేసుకుని తల్లిదండ్రులతో కలుస్తాడనే ఆశ వున్నట్టు చెప్పింది.

ఉన్నట్టుండి, ఆ మధ్యాహ్నం పూట ప్రశాంతత భగ్నం అయింది. ఓ పొడగరి పెద్దగా అరుస్తూ, బెదిరిస్తూ మాదగ్గరకు దూసుకు వస్తున్నాడు. ఓ చేతిలో కర్రని ఝుళిపిస్తున్నాడు. మరో చేతికి కట్టువుంది. "నా కిష్టం లేకుండా నన్ను యిక్కడవుంచ లేరు. నేనేమన్నా ఖైదీనా? యీ క్షణంలో వెళ్లిపోవాలనుకుంటున్నాను," అని ఓ సిస్టర్‌ని చూసి అరుస్తున్నాడు. ఆమె కొంచెం దూరంలో వుంది.

సిస్టర్ అల్బర్ట్ నిబ్బరం, చిరునవ్వు యేమీ తగ్గలేదు. "నీ ప్లాస్టర్ తీసేదాకా మరి కాసిని రోజులు వుండచ్చుకదా, అప్పుడు వెళ్లిపోదువుగాని. యేమైనా మీ తమ్ముడు మళ్లీ మంగళవారం దాకా రాడు," అందామె. "తమ్ముడా? వాడెవడు? నాకైతే

యే తమ్ముడూ లేడు, యెప్పుడో చచ్చేడు, యిప్పుడే వెళ్లిపోతా" అని అరిచేడు. ఉద్విగ్నంగా వుంది వ్యవహారం. అతన్ని చూస్తే గనక, చేతులోవున్న కర్ర దగ్గర్లోని యే సిస్టర్ నెత్తి మీదో పడేటట్టే వుంది. కొన్ని క్షణాల పాటు అంతా స్తంభించి పోయి నట్టువుంది. అంతలోకీ అతని కోపం చల్లబడినట్టే కనిపించింది. అతను వెనక్కి తిరిగేడు. కర్ర పారేశాడు. హాస్పిటల్ కేసి వెళ్లిపోయేడు.

"ప్రమోద్‌కి ఒకోసారి తట్టుకోలేనంత నొప్పిగా వుంటుంది. పెళ్లాం యెవళ్లతోనో లేచిపోయింది. పిల్లల్నీ యితన్నీ వాళ్లమానాన వాళ్లని వదిలేసింది. ఆమెని క్షమించలేక పోయేడు, మరిచిపోలేకపోయేడు. యితని తమ్ముడు మంచివాడు. యితనంటే అభిమానం. అతనే ప్రమోద్ పిల్లల్ని చూసు కుంటున్నాడు. అతనే ప్రమోద్‌ని యిక్కడికి సర్జరీకోసం తీసుకువచ్చేడు. ప్రమోద్‌కి త్వరలోనే నయమవుతుంది. వేళ్లు కదల్చ గలుగుతాడు, కాని మనసులో బాధ మాయమవడానికి చాలాకాలం పడుతుంది," అని సిస్టర్ ఆల్బర్ట్ చెప్పింది.

మేం బయల్దేరే వేళ అయింది. సిస్టర్లకీ ఆ పూటంతా మాతోకూడా వున్న సంతోష్‌కీ సెలవు చెప్పే సమయం అయింది. సిస్టర్ ఆల్బర్ట్ సందర్శకుల పుస్తకాన్ని నా ముందు వుంచింది. యేమన్నా నాలుగు మాటలు రాయమని. అంతకు ముందే అందులో రాసివున్న కొన్ని పేజీలను తిరగేశాను. అంతకు ముందునెలలో శాంతినగర్ సందర్శించిన ఓ మహిళా బృందం రాసిన మాటలు కనిపించేయి.

**"శాంతినగర్‌లో సిస్టర్లు మనఃపూర్వక, స్వార్థరహిత, అంకిత భావంతో చేస్తూ వున్న కృషి మమ్మల్ని యెంతగానో ఆకట్టుకుంది. మదర్ థెరెసా ఆశీస్సులు కోరుతున్నాం.**

తూర్పు రైల్వే మహిళా సంస్థ
*28 జనవరి 1990."*

యివాళ ప్రపంచంలో 1,20,00,000 మంది కుష్ఠువ్యాధిగ్రస్తులున్నట్లు అంచనా. యెక్కువగా ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా, మధ్యప్రాచ్యాల్లో కేంద్రీకృతమై వున్నారు. యెలా జరిగిందో యేమోమరి, కుష్ఠువ్యాధి యూరప్‌లో 16వ శతాబ్దంలోనే మాయమైంది. ఒక్క భారతదేశంలోనే 40,00,000 మంది కుష్ఠురోగులున్నారు. కుష్ఠు ప్రాణాంతకరమైన వ్యాధేం కాదు. అయితే బైబిల్ కాలం నుంచీ, కొన్ని దశాబ్దాల క్రితం దాకా సరైన చికిత్స లేకపోయింది. దాంతో శరీరం కొరుక్కుపోవడం, అది సోకగానే సాంఘిక బహిష్కారం మొదలయేయి. గత దశాబ్దంలోనే ముఖ్యమైన ముందడుగు వచ్చింది. మల్టీడ్రగ్ పద్ధతి వల్ల చికిత్స వచ్చింది. అప్పుడు జాతీయస్థాయిలో కుష్ఠునిర్మూలనా కార్యక్రమాలు వచ్చేయి. కుష్ఠు స్థానపర వ్యాధిగా వున్నదేశాల్లో చికిత్సలు యిలా మొదలయేయి. ఆ వ్యాధికి అంకుర స్థితిలో వున్నప్పుడు కనిపెట్టి చికిత్సచేస్తేనే, అవకరం రాకుండానే, అనుక్షణం చూసుకుంటూ జాగ్రత్తలు తీసుకుంటేనే ఆ చికిత్స ఫలితాలని యిస్తుంది. ప్రభుత్వ కార్యక్రమాలు, వాటికి తోడుగా స్వచ్ఛందసంస్థలు యీ వ్యాధి చికిత్సాకేంద్రాలు, కనిపెట్టే స్థావరాలు, హాస్పిటళ్లు స్థాపించడానికి దోహదపడ్డాయి. వాటి ఫలితంగానే

వేలాది రోగులు యిటీవల బాగయేరు. అయితేనేంగాక, అజ్ఞానం, దారిద్ర్యం యింకా రోగుల్ని బలిగొంటూనే వున్నాయి. ముఖ్యంగా మురికివాడల్లో సరైన ఆహారంలేని పిల్లలు దీని బారిన పడుతున్నారు. ప్రభుత్వ ప్రయత్నం నూటికి నూరుపాళ్లూ నెగ్గడం లేదు. యేమంటే, నిర్మూలనా కార్యక్రమాలకు చాలా దేశాల్లో నిధులు లేవు, సాంకేతికసిబ్బంది లేరు. అదే రకంగా ఐచ్ఛిక ప్రయత్నాలు, యెంత త్రికరణ శుద్ధిగా అంకితమై సేవచేస్తున్నా చాలడం లేదు.

మదర్ థెరెసా చేరదీసిన దిక్కు లేని వాళ్ళల్లో కుష్ఠు రోగం సోకిన వాళ్లకి ఒక ప్రత్యేక స్థానం వుంది. ఆవిడ కనీసం ఒక్క కుష్ఠుకేంద్రమేనా స్థాపించని దేశమంటూ అభివృద్ధి చెందుతూవున్న ప్రపంచ దేశాల్లో లేదు. కొన్ని దేశాల్లో ఒకటికంటే యెక్కువే వున్నాయి. యీ కేంద్రాల్ని నగరం హద్దుల కావల స్థాపించడానికే ఆవిడ మొగ్గు చూపిస్తారు. సగం కారణమేమంటే కుష్ఠు కేంద్రాల్ని మునిసిపాలిటీ హద్దుల్లో యేర్పాటు చెయ్యనివ్వక పోవడం. మరొక సగం యేమిటంటే నగరానికి దూరంలో వుండడం వల్ల రోగులు బిచ్చమెత్తుకుందుకు వూళ్లోకి వెళ్ళే పరిస్థితులు సన్నగిల్లుతాయి.

కుష్ఠువ్యాధిగ్రస్తులంటే ఒక రకమైన కళంకం వుంది. దాన్ని యెదిరించి పోరాడ్డానికి మదర్ థెరెసా కృషిచేశారు. అదేమంత సునాయాసంగా సాగలేదు. యెన్నో కష్టనష్టాలు, అవమానాలు భరించవలసి వచ్చింది. ఒకప్పుడు కలకత్తాలో గోబ్రా హాస్పిటల్ అని ఒక కుష్ఠు హాస్పిటల్ వుండేది. అది నగరం శివార్లలో వుండేది. నగరం విస్తరించింది. దాంతో అది నగరం మధ్యలోకి వచ్చిపడ్డట్టు అయింది. అప్పుడు అక్కడ కాపురాలు వున్నవాళ్లు, అభివృద్ధి చెయ్యాలనుకున్న వాళ్లూ ప్రభుత్వం మీద వొత్తిడి తెచ్చేరు– దాన్ని మూసెయ్యమనీ, లేకపోతే యెక్కడికేనా తరలించమనీ. కాపరాలుండేచోట మధ్య కుష్ఠువ్యాధి హాస్పిటలేమిటి అని ప్రతివాళ్లకీ అనిపించింది. అప్పట్లో బెంగాల్ రాష్ట్రానికి డా. బి.సి.రాయ్ ముఖ్యమంత్రి. మదర్ థెరెసా ఒకటికీ రెండుసార్లు ఆయన దగ్గరకు వెళ్లేరు. హాస్పిటల్‌ని మూసెయ్య నివ్వద్దని అర్థించేరు. డాక్టర్ బి.సి.రాయ్‌కి ఆవిడంటే యెంతో గౌరవం. ఆయన కుటుంబంలోని వాళ్లు కొందరు ఆవిడ దగ్గర మహోత్సాహంతో పనిచేస్తున్నారు, ఆవిడకు సహాయం చేస్తున్నారు. అయినా ఆవిడ ప్రయత్నం ఫలించలేదు. గోబ్రా హాస్పిటల్‌ని మూసేశారు. అప్పట్లో నగరంలో అలాంటి హాస్పిటల్ అదొక్కటే. దాన్ని మూసివెయ్యడం అంటే రోగులకు పెద్దదెబ్బే. యేమంటే, మరెక్కడా దారిలేదు చికిత్సకు. నగరంలో మరోప్రాంతంలో కుష్ఠుచికిత్సా కేంద్రాన్ని ప్రారంభించాలని ఆవిడ ప్రయత్నించేరు. అప్పుడు మరో సంఘటన జరిగింది. ఒక అనువైన చోటును ఆవిడ చూశారు. ఓసారి ఆవిడ అక్కడకు వెళ్లినప్పుడు స్థానిక "కౌన్సిలర్" ఆవిడకు "స్వాగతం" చెప్పేందుకు సిద్ధంగా వున్నాడు. ముందు అతను, వెనక స్థానికులు. వాళ్లు ఆగ్రహంగా వున్నారు. ఆవిడ వాన్ నుంచి దిగీ దిగ్గానే రాళ్ల వర్షం కురిసింది. ఆవిడ ప్రతిస్పందన ఆచారణాత్మకంగానే వుంది. "యిక్కడ చికిత్సా కేంద్రం వుండడం దేవునికి యిష్టం లేనట్టుంది. ఆయన యేం కోరుతున్నాడో తెలుసుకుందాం ప్రార్థన చేసి" అన్నారు.

ప్రోత్సాహం ఒక అంబులెన్స్ రూపంలో వచ్చింది. ఆ వాన్‌ని కొందరు అమెరికన్ దొరలు యిచ్చేరు. దాన్ని తన తొలి సంచార చికిత్సాకేంద్రాల్లో ఒకటిగా మార్చాలని

ఆవిడ నిర్ణయించుకున్నారు. అదే సమయంలో డాక్టర్ సేన్ అనే ఆయన ఓ ప్రముఖ హాస్పిటల్‌లో ఒప్పందం గడువు పూర్తి చేసుకుని బయటపడ్డాడు. ఆయన చర్మ, కుష్ఠ వ్యాధుల నిపుణుడు. యిక తర్వాత యేంచెయ్యాలా అని చూస్తూ వున్నాడు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వాళ్ళు చేస్తూవున్న నిస్వార్థ సేవలు ఆయన్ని ముగ్ధుణ్ణి చేశాయి. తనకి తోచిన రీతిలో తన సేవల్ని మదర్ థెరెసా ఉపయోగించుకోవచ్చని ఆవిడతో అన్నాడు. తనకి జీతం యేమీ అక్కర్లేదనీ అన్నాడు. సామెత చెప్పినట్లు రోగి కోరిందీ అదే, వైద్యుడు యిచ్చిందీ అదే అన్నట్టు ఒకదాని కొకటి సరితూగేయి. 1957 సెప్టెంబర్లో మొదటి సంచార కుష్ఠు చికిత్సా కేంద్రాన్ని ఆర్చ్‌బిషప్ పెరియర్ లాంఛనంగా ప్రారంభించేరు. యిటీవల నేను ఎంటర్లీ సందర్శించినప్పుడు సిస్టర్లు బహు జాగ్రత్తగా రాసివుంచిన రికార్డులు చూశేను. వేయిమందికి పైగా రోగులు ఆ ఒక్క తావులోనే నమోదు చేయించు కున్నట్టు తెలిసింది.

కొన్నేళ్ళ క్రితం మదర్ థెరెసా ఢిల్లీ కేంద్రాన్ని సందర్శించేరు. నేనూ ఆవిడతో కూడా వెళ్లేను. ఆ కేంద్రం పన్నెండెకరాల విస్తీర్ణంలో వుంది. ఆ స్థలాన్ని ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ ఆవిడకు కానుకగా యిచ్చేరు, యెప్పుడో పదిహేడు సంవత్సరాల నాడు. అక్కడున్న బిల్డింగులు ముచ్చటగానే వున్నాయి. చిన్న సర్జికల్ థియేటర్ వుంది. డార్మిటరీస్ వున్నాయి. యివి ముఖ్యంగా "కొరుకుడు పోయిన" వాళ్ళకీ, దిక్కులేని వాళ్ళకీనీ. ఆ వేళ ఆపరేషన్ రోజు. ప్రతి బుధవారం డాక్టర్ ఛాధా అనే ఆయన ఉచితంగా ఆపరేషన్లు చేస్తూ వుంటాడు. ఆయనకు యిద్దరు సహాయకులు. వాళ్లు మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి చెందిన ట్రెయిన్డ్ సిస్టర్లు. చిన్న ఆపరేషన్లు జరిగేక రోగులు చాలా సందర్భాల్లో ఓ వేలునో , బోటన వేలునో స్వాధీనం లోకి తెచ్చుకోగలుగుతారు. ఆయన దగ్గర దగ్గర పన్నెండు ఆపరేషన్లు చేస్తాడు. టీ బ్రేక్ సమయంలో కొన్ని క్షణాలు డాక్టరుతో మాట్లాడేను. తనకు యేదో తిక్క అని యింట్లో వాళ్లు తన గురించి అనుకుంటూవుంటార్ట. తనేమో దేశంలో వున్న భేషైన మెడికల్ కాలేజీలో చదివి పట్టా పుచ్చుకున్నాడాయె. సొంతంగా యెక్కడ సర్జరీ యేర్పాటు చేసుకున్నా రెండు చేతులా డబ్బే. అలాంటివాడు మదర్ థెరెసా అనాథ కుష్ఠుకేంద్రంలో దమ్మిడీ లేకుండా పని చెయ్యడ మేమిటో అన్నది వాళ్ళకు అర్థం కావడం లేదు. పోనీ తను క్రైస్తవుడు కూడా కాదు అంటారు వాళ్లు. అతను ముచ్చటగా చిరునవ్వు నవ్వేడు. "అవును, నాకు కొంచెం తిక్కే. నిజం చెప్పాలంటే దేశం నుంచి సర్వోత్కృష్టమైంది నేను తీసుకున్నాను. బదులు తీర్చుకోవద్దా?" అని అంటూ వుంటాడట.

ముచ్చటైన బిల్డింగులు, పువ్వులు, కూరగాయల తోటలు వున్నాయి. అయితే యివి యేవీ మానవ విషాదాన్ని కప్పివుంచలేవు. కుష్ఠు వ్యాధి తెచ్చి పెట్టిన విషాదం. బీహార్ రాష్ట్రం నుంచి జెహంగీర్ అనే నడి వయస్కుడొకరొచ్చారు. "యీ తొమ్మిదేళ్లల్లో ఒక్కసారి మాత్రమే యింటికి వెళ్లేను దొంగలాగా నక్కినక్కి లోపలికి వెళ్ళేను. ఊళ్ళోవాళ్లు చూస్తారేమో నన్న భయం. మా నాన్న యేడ్చేడు. మా ఆవిడ దగ్గరకు రాలేదు. మా అమ్మాయి లిద్దరూ నన్ను వాటేసుకుని, ముద్దుపెట్టు కున్నారు. వాళ్లు యింకా భయం అంటే యేమిటో యెరగరు. వెనక్కి

కానివాళ్లు మామూలు బతుకు గడిపేటట్టే వుండాలి కదా! నాకు కుష్ఠు వుందని వూళ్లో తెలిస్తే యెవళ్లు నా కూతుళ్లను పెళ్లాడతారు?" అని చెప్పేడు జెహంగీర్.

కాళు అనే అతను కూడా యిలానే వెలి అయేడు. మామూలు బతుకు బతకాల్సిన అవసరం అనేది యాభైయేళ్ల నాడే అలా చేసింది అతన్ని. వాళ్లవూరికి తిరిగి వెళ్లనేలేదు. అన్నదమ్ములు వాళ్లకి సంబంధించి కాళు "మృతుని" కిందే లెక్క. యెవళ్ళనా అసక్తి చూపిస్తే అతను తన కథ చెప్తాడు.

☆ ☆ ☆

కాళు అనేది అతని ముద్దు పేరు. డెబ్బైయేళ్లు వుంటాయి. అవయవాలు లేవు, మొండి భాగాలు మాత్రమే వున్నాయి. చెప్పాలంటే తల, మొండెం అంతే. చిన్న పిల్లల తోపుడు బండీలో చేరేశారు. గోడకు అన్చేరు. దూరం నుంచి చూస్తే పండిన తలవున్న పిల్లాడేమో ననిపిస్తాడు. జీవితంలో యెదురు దెబ్బలకి అంతు అనేది లేకపోయింది. అయినా కూడా కాళు ఉల్లాసం పోగొట్టుకోలేదు. కాని యివాళ పరిస్థితి వేరు. దూరం నుంచే ఆ విషయాన్ని కనిపెట్టగలను. అతని కన్నీటి విషాదగాథ నేపథ్యానికి మళ్ళగలను. దక్షిణ భారతదేశంలో అంతో యింతో వున్న రైతు కుటుంబం వాడే కాళు. మర్యాదగానే బతికేడు. నలుగురు అన్నదమ్ములు. వీపుమీద యేదో మచ్చకనిపించింది. అప్పటికి పదుచువయసే. దగ్గర్లోనే పట్టణంలో వున్న ఓ డాక్టరుకి చూపించేడు. అది కుష్ఠు అని ఆ డాక్టరు చెప్పేడు. కాళు నమ్మలేకపోయేడు. భయంతో వణికిపోయేడు. యేదో పొడిచినట్టు దగ్గర్లోవున్న గుడికి పరిగెత్తి వెళ్ళేడు. దేవా, నన్ను కాపాడు అంటూ విష్ణుమూర్తిని ప్రార్థించేడు. గత జన్మలో యేం పాపం చేశానో ప్రభూ, యింత శిక్ష విధించావ్! సాష్టాంగ బడ్డాడు. వెక్కిళ్ళతో డొక్కలు కదిలిపోయేయి.

దేవుడు ఓ జోస్యుడి రూపంలో వచ్చినట్టే ననిపించింది అతనికి. ఓ ప్రత్యేకమైన ఔషధాన్ని అతను అమ్మేడు. దాంతో వారాల్లోనే నయమైపోతుంది. సోదిచెప్పే వాళ్ల నుంచి జోస్యం చెప్పేవాళ్ల దాకా, యేదో దివ్య ఔషధం అని తనకి ఓ మందు అమ్మిన ముసలమ్మ దాకా యెంతమందిని చూశాడోయేమో. గుట్టు చప్పుడు కాకుండా దూరంలో వున్న పట్టణాలకీ వెళ్ళేడు. యెవళ్లూ తనని గుర్తుపట్టరనుకున్న చోటులకి వెళ్ళేడు. వ్యాధి నయం అవుతుందన్న ఆశతో. యీ విషయం గురించి అన్నదమ్ములాళ్లకు చెప్పలేదు. వూళ్ళో స్నేహితులెవళ్ళకూ చెప్పలేదు. వ్యాధి ఫలానా అని మొదట చెప్పిన డాక్టరు దగ్గరకూ వెళ్ళలేదు. తానెవరైందీ యేమిటో అని ఆ డాక్టరు ఆరా తీస్తాడని భయం. రెండేళ్లు యీ భయంకర సత్యాన్ని దాచివుంచ గలిగేడు. ఓ రోజున కుడిచేతిమీదా యిలాంటి అంటుమచ్చ కనిపించింది. దాంతో అతను గజగజ వొణికిపోయేడు. అతను చేసిన పాపాలకు దేవుడు వేసిన శిక్షే అది అని యింట్లో వాళ్లు అన్నారు. వూళ్లో ఓ సారి కుష్ఠు సోకిన మనిషి ఒకడు కొన్నేళ్ల కితం వుండేవాడు. అప్పుడు వూళ్లో పెద్దలు ఆ కుటుంబాన్ని వూరి నుంచి బహిష్కరించేరు. ఆ కుటుంబాన్ని మొత్తం బహిష్కరించడం, వున్న యిద్దరు ఆడ పిల్లలకీ పెళ్లిళ్లు గగనమవడం అన్ని గుర్తువచ్చేయి. కాళు గురించి నిజం పొక్కితే తమ కుటుంబం గతేం కాను? పరువు మంట గలుస్తుంది. ఆడపిల్లల్ని

యెవడన్నా పెళ్లి చేసుకుంటాడా? సిగ్గుతో కుళ్లి చచ్చి పోవాల్సిందే. పొలాల్లో చివర ఓ గుడిసె వేసి కాళును అక్కడ వుంచేద్దామని అన్నదమ్ములు నిర్ణయించుకున్నారు. అదో మారుమూల వుంటుంది. యెవళ్లకీ కొన్ని రోజులు ఆచూకీ తెలీదు. కాళు ఒప్పుకోలేదు. తనూ ఉమ్మడి ఆస్తి యిరవై యెకరాలలో భాగస్వామే. అప్పుడతన్ని కోడిపెట్టను సంచీలో పెట్టి కట్టినట్టు కట్టేసి అర్ధరాత్రి యెవళ్లకంటా పడకుండా మోసుకుపోయేరు. గొలుసుతో కట్టేసి, యినప బొచ్చెలో యింత ముద్ద పారేశే వారు.

అతనీ అవమానం భరించలేకపోయేడు. ఓ రోజు రాత్రి గొలుసు తెంపుకుని పారిపోయేడు. యిక తిరిగి వెనక్కి వెళ్లలేదు. కొన్ని నెలల పాటు రోగిష్టి జంతువులాగా చెడదిరిగేడు. కొన్ని రోజులు యీ వూళ్లో, కొన్ని రోజులు ఆ వూర్లో తిరిగేడు. బస్ స్టాపుల్లో, రైల్వే స్టేషన్లలో ముష్టెత్తుకునేవాడు. దేవాలయాల బయట అడుక్కునేవాడు. అతన్ని రెండు సార్లు అరెస్టు చేసి, కుష్ఠు రోగుల ప్రత్యేక ఖైదులో పడేశారు. చికిత్స సజావుగా లేదు. అమావాస్యకీ, పున్నానికీ మందులు పడేవి. కొన్ని నెలలలోనే నరాలు దెబ్బతిన్నాయి. ఒకప్పుడు చక్కగా వున్న వేళ్లు దెబ్బతిన్నాయి. స్పర్శ పోయింది. చేతులు పుళ్లు పడిపోయేయి. యెక్కడో వూరూ పేరూ తెలియని హాస్పిటల్‌లో వాటిని తీసి వేశారు. గుండె గాయపడిపోయింది. జీవచ్ఛవం అయేడు. యెలాగో ఢిల్లీ చేరాడు. మదర్ థెరెసా కుష్ఠు కేంద్రం గురించి అక్కడ విన్నాడు. యిది జరిగి అయిదేళ్ళు అయింది. యిప్పుడు అతను మిత్రులతో వున్నాడు. మామూలుగా ఉల్లాసంగానే వుంటాడు. జంతువులా యేళ్ల తరబడి బతికినవాడు యివాళ కొంత ఆత్మ గౌరవం, మనశ్శాంతి పొందుతున్నాడు.

☆ ☆ ☆

ఆడవాళ్ల డార్మిటరీలో మదర్ థెరెసా ఆగేరు. ఓ మంచం మీద ముణగలాక్కుపోయిన ఒకామెని పలకరించేరు. ఆవిడ ఒకప్పుడు ఓ ప్రముఖ పాఠశాల మేట్రన్. యిప్పుడీదౌర్భాగ్యపు స్థితిలో, మూటలా, ఒళ్లంతా పుళ్లతో పడివుంది. యెన్నో యేళ్లు కుష్ఠువ్యాధిని కప్పిపుచ్చుకుంది. యే చికిత్సా చేయించుకోలేదు. దాంతో నరాలు దెబ్బతినడం మొదలైంది. దాని వెనక్కాలే ఆకారం మారిపోవడం, అవకరం వచ్చేయి. యెక్కువ రోజులు గడవకుండానే కన్నకొడుకులకు బరువైపోయింది. ఓ కొడుకు ఆవిడ్ని మదర్ థెరెసా హోమ్‌కి తీసుకువచ్చాడు. పెద్ద కొడుకు ఒక్కసారీ వచ్చి చూడలేదట. గత రెండేళ్ళల్లోనూ చిన్నకొడుకు ఓ సారి క్రిస్టమస్‌కి వచ్చేడట. యీసారి క్రిస్టమస్‌కి వస్తాడా? అని ఆమె మదర్ థెరెసాని గుండె బరువుతో అడిగింది.

ఓసారి మదర్ థెరెసా ఓ సభలో మాట్లాడేరు. ఆ సభలో ప్రముఖులు, పౌరఅధికార్లు, విదేశీ దౌత్యవేత్తలు వున్నారు. వాళ్లల్లో కుష్ఠువ్యాధిగ్రస్తుల పిల్లలూ ఓ డజను మంది వున్నారు. ఆవిడ కుష్ఠువ్యాధికి సంబంధించి ఒక నివేదికను విడుదల చేశారు. ఆ నివేదిక ఆవిడ ప్రేరణ మేరకే తయారైంది. ప్రార్థనతో సభను ప్రారంభించారు. ఆ తర్వాత క్లుప్తంగా మాట్లాడారు. సంక్షిప్తంగా నేను ఆ

ఉపన్యాసాన్ని యిస్తున్నాను. పూర్తి పాఠం అనుబంధంలో వుంది. యీ ఆడ మనిషినే అపుడావిడ దృష్టిలో వుంచుకున్నట్టుంది.

"కుష్ఠువ్యాధి శిక్ష యేమీకాదు. మనం ఉపయోగపెట్టుకున్నట్టయితే అదొక అందమైన కానుక అవుతుంది. దీని ద్వారా ప్రేమ కోల్పోయిన వాళ్లని ప్రేమించగలం, యెవళ్ళకీ అక్కర్లేని వాళ్లని ఆదరించగలం. వాళ్లకు వస్తువుల్ని అందించడానికి మాత్రమే కాదు, వాళ్లు కూడా పనికొస్తారనీ, యేదో ఒకటి చెయ్యగలుగుతారనీ వాళ్లు భావించేటట్టు చెప్పగలం. ఏమంటే, తమని యెవళ్లో ప్రేమించగలుగుతున్నారనీ తమని కోరుకుంటున్నారనీ, ప్రేమాదరాల సంతోషం తమకీ కలుగుతుందనీ వాళ్లు భావించగలుగుతారు.

"భయాన్ని తొలగించగలిగితే కనక బోలెడు చెయ్యచ్చు. అది చాలా పెద్ద విషయం. ఆ భయాన్ని తొలగించి, విశ్వాసాన్ని కలిగించడానికి యీ గ్రంథం తోడ్పడుతుంది. భయం యిన్నియేళ్లుగానూ వుంది. దేవుడు తమకి యేదో గొప్పదాన్ని యిచ్చేడని వాళ్లు భావించగలుగుతారు. తాముకూడా మామూలు మనుషుల్లా వుండి మామూలు పనులు చెయ్యగలమనీ, మామూలు బతుకు బతకగలమనీ వాళ్ల భావించగలుగుతారు."



# 10 కాళీఘాట్

భక్తాగ్రేసరులైన హిందువులు, వెనక్కి తగ్గని యాత్రికులు మాత్రమే దక్షిణ కలకత్తాలో వున్న కాళీఘాట్‌ని సందర్శిస్తూవుంటారు. యిక్కడ కాళీమాత ఆలయం వుంది. మృతదేహాల్ని యిక్కడే దహనం చెయ్యాలని హిందువులు కోరుకుంటూ వుంటారు. హుగ్లీనదీ తీరంలో. గంగానది యిందులోకి ప్రవహిస్తూ వుంటుంది. గంగానది యిందులోకి ప్రవహిస్తూ వుంటుంది. గంగానది హిందువులకు పరమపవిత్రమైంది. యీ హుగ్లీనదీ తీర పవిత్రతకు ఒక ఐతిహ్యం వుంది. కాళీమాత కుడి పాదం వేలు సరిగ్గా యిక్కడే పడిందట. ఆ కారణంగా దేవాలయాన్ని నిర్మించి, యీ స్థలాన్ని పావనం చేశారట. హిందువులకు పరమ పవిత్రమైన యాభైవొక్క పుణ్యక్షేత్రాల్లోనూ యిదీ ఒకటి అని పురాణాలు ఘోషిస్తున్నాయి. వేలాది మంది భక్తులు యీ దేవాలయాన్ని నిత్యం సందర్శిస్తూవుంటారు. కొంత మంది మొక్కులు తీర్చుకుంటారు. యేదన్నా దీర్ఘప్రయాణానికి బయల్దేరేముందు తల్లి తనుని కాపాడాలని ప్రార్థిస్తారు కొందరు. జబ్బులు నయం కావాలని కొందరు పూజలు చేస్తారు. జీవితప్రయాణంతో ముడిపడివున్న కర్మకాండలు నిర్వహించేందుకు కొందరు దేవిని ఆరాధిస్తారు. నామకరణాలు, పుట్టువెంట్రుకలు తీయించుకోవడం, ఉపనయనాలు, వివాహాలు లాంటివి జరిపించుకుంటారు. ఆఖరిగా దహన సంస్కారాలూ ఆ ఘాట్‌లలో దేవాలయ సమీపంలో జరిపించుకుంటారు.

మొదటిసారి యిక్కడికి వచ్చినవాళ్లకు మదర్ థెరెసా హోమ్ యెక్కడ వుందో తెలుసుకోవడం కష్టమే. అవసాన దశలో వున్న అభాగ్యుల కోసం కట్టిన హోమ్ అది. ఏమంటే, అధిక జనాభాతో కిటకిటలాడే ప్రాంతాల్లో కాళీఘాట్ ఒకటి. యిక్కడ జనం మరీ కిక్కిరిసిపోయివుంటారు. గుడి చిన్న యిరుకు సందు వేపు వుంటుంది. అక్కడ చెప్పలేనన్ని చిల్లర మల్లర కొట్లు సందుకు అటూ యిటూ పరుచుకుని వుంటాయి. పూజకు అవసరం అయే సరుకుల్ని అమ్ముతూ వుంటాయి. పువ్వులు, అగరు వత్తులు, పూలసజ్జలు, దేవత బొమ్మలు, పటాలు–ఒకటేమిటి, అన్నీ పోటీపడి అమ్మకానికి వుంటాయి. రోజువారీ అవసరాలకి వాడుకునే సరుకులూ యివీ పక్కపక్కనే ప్రత్యక్షమవుతూ వుంటాయి. ఆ మధ్యలో కాషాయ బట్టల వాళ్లు నుదుటిమీద కుంకుంబొట్లు పెట్టుకుని వుంటారు. భిక్షకులు చేత్తో తగరం

పళ్లేలు పట్టుకుని ప్రత్యక్షం. వీరికి తోడు ఆవులు. యెవళ్లూ పట్టించుకోరు వాటిని. అవి అలా తిరుగుతూ వుంటాయి. మధ్య మధ్యలో యాత్రికులు. వాహనాల రొద సరేసరి. బస్సులు, కార్లు, రిక్షాలు, తోపుడుబళ్లు. కలకత్తా రద్దీకి, గందరగోళానికి యివన్నీ ప్రతీకలే. మనకళ్లు పట్టెలు తీర్చిన గుమ్మటాలకేసి మళ్లుతాయో లేదో ఓ భౌతిక కాయాన్ని దహనానికి తీసుకుపోయే దృశ్యం యెదురవుతుంది. వేదమంత్రాల ఘోష మన దృష్టిని ఆకర్షిస్తుంది. దూరంలో చితి మంటల పొగ, అగరు వత్తుల సుగంధ ధూపం కనిపిస్తాయి. జీవితం మధ్యలో మృత్యువుని నిర్లిప్తంగా వేదాంత ధోరణిలో ఆమోదిస్తూ వున్నట్టు గుర్తు చేస్తాయి.

నీలం అంచు తెల్ల చీరకట్టుకున్న ఆడవాళ్లు స్ట్రెచర్‌ని అందుకోవడానికి వొంగుతూ వుండడం మామూలుగా కనిపించే దృశ్యమే. నిర్మల హృదయ్ దగ్గరకు వెళ్లినట్టు దాన్నిబట్టే యెవళ్లకన్నా బోధపడుతుంది. (బెంగాలీలో మేరీమాత స్వచ్ఛమైన హృదయం అని దీని అర్థం. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ మేరీమాత పరమ స్వచ్ఛ హృదయానికి అంకితం అయిన సంస్థ.) తల వాకిలి గుమ్మం అనేది లేదు. వున్నదల్లా చిన్న ప్రవేశ ద్వారమే. ఒకప్పుడక్కడ భక్తుల మందిరం వుండేది. నిజానికి రెండు హాల్స్ వున్నాయి. ఒకటి మగవాళ్లకి, మరొకటి ఆడవాళ్లకి. మధ్యలో రిసెప్షన్ జాగా.

నేను నిర్మల్ హృదయ్‌కి కొన్నేళ్ల కితం వెళ్ళేను. మొదట్లో యేదో చూడాలన్న కుతూహలం వుంది. కాని అడుగు పెట్టేటప్పటికి భయం వేసింది. ఓ రకమైన యేవగింపు కలిగింది కూడా. యెందుకు సాహసించేనా అనిపించింది కూడా. వీలైనంత త్వరగా తప్పించుకు పోతేనో అనిపించింది. చిత్రంగా గంటలు కొద్దీ అక్కడ వుండిపోయేను. నాకే ఆశ్చర్యం వేసింది. సిస్టర్లు వూ, కదలండి అంటూ పొడిచే దాకా అక్కడే వున్నాను. అప్పటికి సాయంత్రం ప్రార్థనల వేళ అయింది. అప్పట్నుంచీ, నేను కలకత్తా వెళ్లినప్పుడల్లా, కొన్ని గంటలేనా నిర్మల్ హృదయ్‌లో గడిపేవాణ్ణి, నాకు కాళీఘాట్, నిర్మల్ హృదయ్ ఒకటేనన్నట్లు కలిసిపోయేయి.

ఓ హాల్లోకి వెళ్లేను. స్ట్రెచర్ పడకలతో నిండిపోయి వుందది. వాటిని నేలమీద పెట్టేరు. నేల బాగా కడిగి, యాంటీ సెప్టిక్‌గా వుండేటట్టు చేశారు. కుడివేపున రిసెప్షన్ జాగా వుంది. అక్కడ కొన్ని బల్లలు వున్నాయి. పక్కనే స్ట్రెచర్లమీద ఒకళ్లిద్దరు రోగులు వున్నారు. వాళ్లకి చాలా జబ్బుగా వుంది. మందూ మాకు యివ్వడానికి వెళ్లినప్పుడు సిస్టర్లు మరీ జాగ్రత్తగా వాళ్లని కనిపట్టే వుంటారుట. యీ విషయం నాకు తర్వాత తెలిసింది. ఓ వంద శిథిల శరీరాలు వుండే వుంటాయి మంచాల మీద. గోడ మీద ప్రతీమంచం వెనకా సంఖ్యవేసి ఉంది. పై కిటికీల నుంచి పడే దీపాల వెలుతురుకంటే కూడా కొట్టవచ్చినట్టు గమనంలోకి వచ్చేది ప్రశాంతత. చీరల రెపరెపలు, యేదో మందులిచ్చే శబ్దాలు తప్ప పిసరు సవ్వడిలేదు. కొన్ని అడుగుల దూరంలోనే వీధుల్లో యెంత రొద్దు, కాలుష్యం. దానికీ దీనికీ యెంత రొద. నేనే యేదో గుసగుస లాడుతున్నట్టు వుంది. పరధ్యానంలో నా కెమేరా ధనామనికిందపడింది. దారుణమైన అపవిత్ర కార్యంలా కనిపించింది అది. మతపరమైన అలంకారాలు యేమీలేవు. ఒక్క బోర్డుమాత్రం కనిపించింది. మదర్ తొలి ప్రేమ కాళీఘాట్ అని చాటుతోంది అవునుకదా!

తన అఖరి కార్యభారం కాళీఘాట్‌లోనేనా అని మదర్ థెరెసాని ఓసారి అడిగేను. ఆవిడ 1990 సెప్టెంబర్లో రిటైరవుదా మనుకుంటున్నారు కదా, అలానే జరిగితే అని నా ఉద్దేశం. అదేమంత ముఖ్యం కాదు, దేవుడు సర్వాంతర్యామి అని ఆవిడ అన్నారు. అంత మనస్ఫూర్తిగా ఆవిడ తన అభిప్రాయం చెప్పడం లేదని నాకు అనిపించింది. అయినా కాళీఘాట్‌లోనీ యీ హోమ్‌కే మదర్ థెరెసా చేరు కోవాలను కుంటున్నారని నా విశ్వాసం. అకాల ముదిమి పాలబడిన వాళ్ళు, నయంకాని జబ్బులతో బాధపడే తోపుడు బళ్లవాళ్లు, రిక్షావాళ్లు, స్త్రీలు, మానసికరోగగ్రస్తులు వున్న ఆ చోటుకు చేరుకోవాలని ఆవిడ అనుకుంటూ వుండచ్చు. అక్కడ వున్న పగోలా అనే వ్యక్తి దగ్గరకు. యిరవై యేళ్లుగా అక్కడ్నేవున్న వ్యక్తి, మదర్ థెరెసా యెప్పుడు అక్కడకు వెళ్లినా మొదటిసారి నమస్కారం చేసేవ్యక్తి. అక్కడకు వెళ్లాలనే మదర్ థెరెసా మనసులో వుండచ్చు.

నిర్మల్ హృదయ్ ద్వారం యెప్పుడు తెరిచే వుంటుంది. పరాయి వ్యక్తి యెవళ్లేనా లోపలికి వెడుతూవుంటే, చొచ్చుకు పోతున్నట్టు భావిస్తాడు. నిలబడి, అలా చూస్తూవుండే తావు కాదు అది. లేదా కూర్చుని ప్రపంచరీతిని పరిశీలనగా చూసే తావూలేదు. ఓ హాస్పిటల్ కూడా కాదు. అక్కడకు వెళ్లేవాళ్ళకు ఫలానా అని ఓ పని వుంటుంది. నేను అక్కడ వున్నాను. శుభ్రంగా ఆరోగ్యంగా వున్నాను. అప్పుడు ఒక మనిషిని తీసుకువచ్చేరు. గుమ్మం దగ్గర గోడకు ఆన్చేరు. ఓ సిస్టర్ గబగబా లోపలికి వెళ్లింది. అతన్ని యెత్తి తీసుకు రావడానికి తోడు కావాలి. నేను రానా అన్నాను. అయ్యో, అంతకంటేనా అన్నారు. అతన్ని ఓ కుక్కి మంచం మీదకు చేరేశాక, గ్లూకోజ్ కలిపి యివ్వడానికి సిస్టర్‌కి సాయం చేశాను. అప్పుడు నాకు తేలిక పడ్డట్టు అనిపించింది.

ఆడవాళ్ల వార్డులోకి అడుగు పెట్టేను. మగవాళ్ల దానికంటే అది కొంచెం పెద్దది. అదే నిశ్శబ్దం అక్కడానూ. అప్పటికి నేను ఆ పరిస్థితులకు అలవాటు పడ్డాను. అంట కత్తెర వేసిన ముఖాలు శుష్కించి వున్నాయి. బక్కచిక్కిన శరీరాలు, లేతవయసు ముఖాలు వున్నాయి. వాటికి ఓ రూపం, అర్థం కలిగినట్టున్నాయి. పక్కనే మంచం మీద ఓ ముసలావిడ వుంది. నన్ను డాక్టర్ అనుకున్నట్టుంది. వచ్చి దగ్గర కూర్చోమంది. నేను వెళ్లి కూచున్నాను. తన పేరు జహనారా బేగమ్ అని చెప్పింది. కాన్వెంట్ రోడ్ దగ్గర ఓ మసీదులో వుండేదిట. నా అన్నవాళ్లు యెవళ్లూ లేరట. చనిపోయారో, వదలిపెట్టేశారో మాత్రం చెప్పలేదు. తన కాళ్లు యెందుకు పుళ్ల మయం అయేయో చెప్పలేదు. నా చేతిని పట్టుకుంది. “చాలా నీరసంగా వుంది. యిక వొంట్లో పిసరు రక్తం లేనట్టే వుంది” అంది. కట్టుకట్టిన పుళ్ల బాధ కాదు తనను సల పెట్టేది, రోజూ స్నానం చేయిస్తారట. అది తనకు నచ్చడం లేదు.“డాక్టరు గారూ,” అంటూ హిందీలో బతిమలాడింది. “రోజూ స్నానం చేయించడం నా చర్మానికి సరిపడదని సిస్టర్లకు చెప్పండి. డాక్టరు గారూ, నాకో రెండు నిమ్మకాయలు యిప్పించగలరా? నిమ్మకాయలు లేకుండా తిండి హితవుగా వుండడం లేదు”అంది.

“నిర్మల్ హృదయ్” కూడా మోతీఝీల్ మురికి వాడలాగానే “నేలమీద మొదలైంది.” మదర్ థెరెసా కలకత్తాలో సంచరిస్తూ వున్నారు. ఓ యిల్లూ, వాకిలీ

లేకుండా వీధుల్లో వున్నవాళ్లని ఆవిడ చూశారు. కొన్ని కుటుంబాలు వృధాగా పడి వున్న చెత్తాచెదారంతో యేదో తలదాచుకుందుకు నిర్మించుకున్నారు. కొంతమంది పాతగుడ్డలతోనో, రెల్లుతోనో చిన్న కప్పులు వేసుకున్నారు. చాలామందికి ఆ అదృష్టమూ లేదు. గుళ్లబయట బిచ్చమెత్తుకుంటూ, ట్రాఫిక్ కూడళ్లలో తిరిగి మెత్తుకుంటూ బతుకుతున్నారు. రాత్రిపూట నడిరోడ్డు నిద్రపోయేవాళ్లు. సరైన తిండి లేకపోవడంతో జబ్బులు పిలిస్తే పలుకుతాయి. వాళ్లల్లో క్షయ ప్రబలంగా వుంది. శానిటోరియంలో పడకలు లేవు. అవేనా పలుకుబడి వుంటేగాని దక్కవు. జనరల్ హాస్పిటళ్లలో రద్దీ విపరీతం. జబ్బు ముదిరిపోయిన ఆ దశలో వాళ్లకి యేమీ చెయ్యనూలేవు. దాంతో యెక్కడ వున్నవాళ్లు అక్కడే దారిపక్క తనువు చాలించేవాళ్లు. మునిసిపాలిటీ వాళ్లకి ఆ కబురు తెలిస్తే ఓవాన్ గాని బండి గాని పంపించి ఆ మృత కళేబరాల్ని తీసుకుపోయేవారు. చనిపోయినట్టు ఓ రిజిస్టర్‌లో ఓ ముక్క రాసేవారు; పేరు తెలీదు. వయసు తెలీదు, మతం తెలీదు.

తొలి రోజుల్లో తాను సాయపడిన ఓ ఆడమనిషి గురించి మదర్ థెరెసా చాలాసార్లు సభల్లో చెప్పేవారు. ఆవిడ కాంప్‌బెల్ హాస్పిటల్ దగ్గర తన కార్యకలాపం మొదలుపెట్టిన రోజులు అవి. (తర్వాత దానికి నీలరతన్ సర్కార్ హాస్పిటల్ అని పేరు మార్చేరు). అక్కడ ఓ బట్టల మూట ముడుచుకుపోయిపడి వున్నట్టుంది. మదర్ థెరెసా, తోడుగా వున్న సిస్టర్ అక్కడికి వెళ్లేరు. తీరా చూస్తే ఆ మూట ఓ నడివయస్కురాలు. స్పృహ వున్నట్టులేదు. ఎలుకలు, చీమలు సగం ముఖాన్ని కొరుక్కు తినేశాయి. ఆమెని యెత్తుకుని హాస్పిటల్‌కి తీసుకువెళ్లేరు. హాస్పిటల్ వాళ్లు చేర్చుకోలేదు. పడకలేమీ ఖాళీ లేవుట. యేమైనా, ఆ ఆడమనిషి చనిపోతుంది. యికవాళ్లు చెయ్య గలిగిందీ యేమీలేదు అన్నారు వాళ్లు. మరియెక్కడికి తీసుకెళ్లమంటారు అని మదర్ థెరెసా వాళ్లని అడిగేరు. వీపుమీద మోసుకెళ్లి యెక్కడి నుంచి తెచ్చేరో అక్కడికే తీసుకు వెళ్లమని వాళ్లు చెప్పేరు. యేం చెయ్యాల్సిందీ దిక్కు తోచలేదు. మదర్ థెరెసా ససేమిరా వీల్లేదన్నారు. "ఆఖరికి నా ఒత్తిడివల్ల వాళ్లు ఆమెని చేర్చుకున్నారు" అని చెప్పారు మదర్ థెరెసా. ఆ ఆడమనిషికి నేలమీద ఓ పరుపు పరిచేరు. తర్వాత కొన్ని గంటలకే ఆమె చనిపోయింది. "చనిపోయేవాళ్లకు ఓ హోమ్ స్థాపించాలని అప్పుడు నాకు తోచింది. నేనే వాళ్ల సంరక్షణ చూడాలి."

అవసాన దశలో వున్నవాళ్లు గతంలో సిస్టర్లకి దాదాపు రోజూ కనిపించేవారు. ఓ రోజున వాన కురుస్తోంది. సిస్టర్ ఆగ్నెస్‌కీ, మదర్ థెరెసాకీ ఓ ఆడమనిషి కనిపించింది. ఆమె దారి పక్క పడివుంది. ఓ చెయ్యి బురదలో కూరుకుపోయి వుంది. వాళ్లామెని లేవనెత్తేరు. అలా యెత్తగానే ఓ చేతి చర్మం వూడి వచ్చేసింది. ఆమె అదే కాంప్‌బెల్ హాస్పిటల్ దగ్గరే, అలా యెంత సేపటి నుంచి పడివుందో వాళ్లకి తెలీదు. హాస్పిటల్ అధికార్లకి తెలుసు మదర్ థెరెసా పట్టుబడితే వదలరని. దాంతో యేం రచ్చచెయ్యకుండా ఆ ఆడమనిషిని చేర్చుకున్నారు.

"మదర్ థెరెసా మురికివాడల్లో పనిచెయ్యడం మొదలుపెట్టినప్పుడు మాకు అవసానదశలో వున్న వాళ్లు కనిపించేవారు. ఒకసారి ప్రాణంపోయిన మృతదేహాలు

కనిపించేవి. వాళ్ళని హాస్పిటళ్ళకి తీసుకువెళ్లేవాళ్లం. అయితే అన్నప్పుడల్లా పడకలు దొరికేవి కావు. యింకెక్కడికి తీసుకెళ్లడానికి లేకపోయేది. మోతీఝీల్ మురికివాడలో మదర్ థెరెసా రెండు గదులు అద్దెకు తీసుకున్నారు. ఒకో దానికీ అయిదేసి రూపాయలు అద్దె. ఒకటి క్లాస్ రూమ్‌గా మారింది రెండవది అవసాన దశలో వున్నవాళ్లకి హోమ్ అయింది. ఆ గది ఎనిమిది చదరపు అడుగులు వుంటుంది. అక్కడ హాస్పిటళ్లలో చేర్చలేనివాళ్ళని వుంచేవారు. అలాంటి ప్రయోగం నెగ్గుకు రావడం కల్ల. అతి కష్టం మీద యిద్దర్నో ముగ్గుర్నో నేలమీద వుంచ వచ్చు నంతే. వాళ్ళకు చికిత్సలు చెయ్యడానికి మదర్ థెరెసాకు జాగాయే వుండేది కాదు. ఓ రోజు రాత్రి ఓ మనిషి చనిపోయాడు. జబ్బు బాగా ముదిరిందే ననుకోండి. ఆ మర్నాడు పొద్దున్న మిగిలినవాళ్లు పారిపోయేరు."

మదర్ థెరెసా బెదరలేదు. మునిసిపాలిటీకి వెళ్లింది. అక్కడ చీఫ్ మెడికల్ ఆఫీసర్ దగ్గరకు ఆవిడ్ని పంపించేరు. ఆయన పేరు డాక్టర్ అహ్మద్. అవసాన దశలో వున్న వాళ్ళని చేర్చుకోవడంలో వూళ్ళో హాస్పిటళ్ళకి సమస్యలున్నాయి, అలాంటప్పుడు వాళ్లని యెక్కడికి తీసుకెళ్ళాలి అని ఆయనతో అన్నారావిడ. "నేను జాగా మాత్రమే యివ్వండి చాలు అన్నాను. మిగిలిన సంగతి నేను చూసుకుంటాను అని ఆయనకు చెప్పాను." ఆ నడి వయస్కురాలైన నన్ త్రికరణశుద్ధిగా, ప్రభుత్వం చెయ్యాల్సిన పనిని నెత్తి మీద వేసుకుని చేస్తోందని ఆ ఆఫీసర్ కనిపెట్టేడు. ఆ మాత్రం యింగితం వుందతనికి యెంతయినా, నడి వీధుల్లో మనుషులు చచ్చిపోవడం మునిసిపాలిటికీ. చెడ్డపేరు తెస్తుంది. డాక్టర్ అహ్మద్ ఆవిడ్ని కాళీఘాట్ ప్రఖ్యాత దేవాలయం దగ్గరికి తీసుకువెళ్లేడు. గుడిని అనుకునే రెండు హాల్స్ వున్నాయి. వాటిని చూపించేడు. యెప్పుడో కొన్నేళ్ళక్రితం ఓ హిందూ దాత భక్తుల కోసమని చెప్పి వాటిని కట్టించేడు. ఓ రాత్రిపూట యాత్రీకులూ భక్తులూ తలదాచుకోవచ్చు. అవి నిరుపయోగంగా యెవళ్లూ వాడకుండా వున్నాయి. వాటిని మదర్ థెరెసాకి యిచ్చెయ్యవచ్చు. ఆ రకంగా అవ్వనీ, బువ్వనీ కూడా పొందవచ్చు అని డాక్టర్ అహ్మద్ ఆలోచన చేశాడు.

తన ప్రతిపాదనకు ప్రతిఘటన యేదీ వుండదని డాక్టర్ అహ్మద్ అనుకుని వుండచ్చు. కాని వ్యతిరేకత వచ్చింది. "అది యేదో అక్కడక్కడ తలెత్తిందే. సాధారణ వ్యతిరేకత యేమీకాదు. పెద్ద గొడవే అయినట్లయితే, పత్రికల్లో పెద్దగా వచ్చెయ్యదూ? అవసానదశలో వున్నవాళ్లు అక్కడకు చచ్చిపోవడం కోసమే వెళ్లడం జనానికి నచ్చలేదు" అని ఫాదర్ వాన్ ఎక్షిమ్ అన్నాడు.

తనువుచాలించిన వాళ్లకి క్రిస్టియన్ల పద్ధతిలో అంతిమ సంస్కారాలు జరుగుతున్నాయనీ, క్రిస్టియన్లలాగానే ఖననం చేస్తున్నారనీ వదంతులు వ్యాపించేయి. డాక్టర్ అహ్మద్, మరో పోలీసాఫీసరూ స్వయంగా పరిస్థితి యేమిటో చూద్దామని వెళ్ళేరు. నిర్మల్ హృదయ్‌లోకి అడుగు పెడుతూనే మదర్ థెరెసా కనిపించేరు. ఆవిడ ఓ ఆకారం మీద వొంగి వున్నారు. ఆ వ్యక్తి ముఖం పెద్దది. ఆవిడ పెద్ద పుండు కేసి చూస్తున్నారు. ఆవిడ ఆ పనిలో యెంత నిమగ్నమై పోయి వున్నారంటే, వాళ్ళవేపు తిరిగి చూడ్డానికి కొన్ని క్షణాలు పట్టింది. చిన్న శ్రవణం లాంటి దాంతో పురుగుల్ని

తీస్తున్నారు, ఆ వుండు నుంచి. ఆ వుండు యెంత దుర్వాసన కొడుతుందంటే, సగం మంది ఆ గదిలో అడుగు పెట్టాలంటేనే వెనకాముందూ చూస్తారు. ఆవిడ ఆ రోగితో అంటూ వున్న మాటలు వాళ్ళకి వినిపిస్తున్నాయి. "నీ మతం యేమిటో మరి. ఆ మత ప్రార్థనలే చేసుకో, నాకు తెలిసిన ప్రార్థన నేను చేస్తాను. యిద్దరం కలిసి యీ ప్రార్థన చేద్దాం. దేవునికి ప్రీతి పాత్రం అవుతుంది" అంటున్నారామె.

ఆవిడ ఆఫీసర్లను చూశారు. తాము చేస్తూవున్న పని యేమిటో వాళ్ళకి చూపించబోయేరు. పోలీసాఫీసరు గుడ్ల నీళ్లు కుక్కుకున్నాడు. "అవసరం లేదు, మదర్" అన్నాడు. బయట జనం గుంపుగా వున్నారు. వాళ్లకేసి తిరిగేడు. "సరే, నేను యీవిడ్ని యిక్కడ్నుంచి పంపించేస్తాను. అయితే యీవిడ చేస్తూవున్న పనిని మీ తల్లులూ సిస్టర్లూ చేసేటట్టు మీరు వాళ్ళని బలవంతం చెయ్యాలి. యీవిడ ఓ సెయింట్" అన్నాడు.

ఆఫీసర్లు యిలా జోక్యం చేసుకున్నా కూడా, లోపల్లోపల చిటపటలు అంటు కుంటూనే వున్నాయి. అవసాన దశలో వున్న వాళ్లకి హోమ్, అదీ హిందూ దేవాలయం పక్కనే. అది గుడి పూజార్లకి మంటగా వుంది. అదీగాక, కాళీమాత దేవాలయ పరిసరాల్ని ఓ క్రైస్తవ మత మిషనరీకి ధారాదత్తం చెయ్యడం బ్రాహ్మణ పురోహితులకు తల తిరిగి పోయేటట్టు వుంది. యీ యేర్పాటుని తప్పించాలని చాలాసార్లు మునిసిపాలిటీకి అర్జీలు పెట్టేరు. అంతలోకి ఓ రోజున వో వింత సంఘటన జరిగింది. ఆ దెబ్బతో ప్రతిఘటన ఆగిపోయింది. ఓ పడుచు పురోహితుడు రక్తం కక్కున్నాడు. నిండా ముప్పైయేళ్ళయినా వుండవు. అతనికి క్షయ. బాగా ముదిరిన దశలో వుంది. అలాంటి దిక్కుమాలిన కేసుల్ని యే హాస్పిటలూ కూడా చేర్చుకోదు. అలా చేర్చుకుంటే, నయం కాగల రోగికి పడక వుండదు. శారీరకంగా, మానసికంగా జబ్బు పడ్డ ఆ పురోహితుణ్ణి ఆఖరుకు నిర్మల్ హృదయ్‌కి తీసుకు వచ్చేరు. మదర్ థెరెసా అతనికో ప్రత్యేక జాగా యిచ్చేరు. అక్కడ అతనికి చికిత్స చేశారు. అతనికి కోపం, అవమానం రెండూ కలిగేయి. కాని రోజులు గడిచేకొద్దీ ఆ పరిస్థితికి సర్దుకుపోయేడు. అతను చనిపోయేడు. అప్పటికి ఆవేశకావేషాలు పోయి ప్రశాంతత చోటుచేసుకుంది. యీ లోపున దేవాలయ పురోహితులు తమ తోటి మనిషి పట్ల నిర్మల్ హృదయ్ చూపించిన శ్రద్ధ యేమిటో గుర్తించేరు. వాళ్లే ఆ పని చెయ్యలేక పోయేరు. లేకపోతే చెయ్యడానికి యిష్టపడలేదు. అదీకాక, అతను చనిపోయేక, క్రిస్టియన్ సంప్రదాయం ప్రకారం అంతిమ సంస్కారం జరిపించలేదు మదర్. హైందవ సంప్రదాయం ప్రకారం దహన సంస్కారం జరిపించేందుకు ఆవిడ ఆ మృతదేహాన్ని పంపించేరు.

కలకత్తాలో, సమీపప్రాంతాల్లో అనేక రకాల మత, సాంఘిక సంస్థలు వున్నాయి. చిన్నవీ, పెద్దవీ ఆ సంస్థలు. పేదలకి రోగులకి చేయూత నిస్తూ వుంటాయి. కాని యే ఒక్కటీ అవసాన దశలో వున్న వాళ్లనీ, యిళ్లు లేనివాళ్లనీ, హాస్పిటళ్లు చేర్చుకోని వాళ్లనీ చేరదియ్యవు. హిందూ దృక్పథంలో ఆత్మ పునర్జన్మ యెత్తుతుందన్న భావం యెన్నో నిలువుల లోతు పాతుకుపోయింది. రోగులగురించి చర్చించనక్కర్లేదు. ఆత్మ వెళ్లిపోవడానికి అది అందుకు గురయిందంతే. మోక్షం సాధించుకోవడానికి

పునరపిజననం, పునరపిమరణం అనే సంసార చక్రంలో అలా పడి వుంటుందంతే. అయితే మదర్ థెరెసాకీ, సిస్టర్లకీ వున్న దృష్టి వేరు. కరుణతో, జాలితో యీ శిధిల శరీరాల్ని, దిక్కూ మొక్కూలేని జీవాల్ని స్పృశించాలి, అది ముఖ్యం. అయితే మరో ముఖ్య విషయాన్ని గమనించకపోతే అసలు సంగతిని అర్థం చేసుకోనట్లే. నిర్మల్ హృదయ్‌లో స్ట్రెచర్ మీద పడివున్న ప్రతి జీవీ జబ్బు పడి, అనాథ అయి చనిపోతూ వున్న క్రీస్తే. యీ గాఢమైన విశ్వాసమే లేకపోతే వాళ్లు యింత పనిని చెయ్యగలిగి వుండేవారేకాదు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వాళ్ల మౌలిక తాత్విక దృష్టి యిదే. మతం మార్పిడి చెయ్యడం, మృత దేహాల్ని క్రైస్తవ ఖననానికి పంపడం కాదు. అలా కావాలని ప్రత్యేకంగా అర్థిస్తే తప్ప అలా జరగదు. వాళ్ల అభీష్టానికి వ్యతిరేకంగా చెయ్యడం మదర్ థెరెసా దృష్టిలో మహాపాపం.

ఆ పురోహితుడి సంగతి చూశేక వ్యతిరేకత తగ్గింది. కలకత్తా ప్రజలు మూడు విషయాల్ని గమనించేరు. సిస్టర్లు ఒక అవసరమైన పని చేస్తున్నారు. యిది మొదటిది. నిర్మల్ హృదయ్‌లో చేరేవాళ్ళల్లో కొందరు గుడి బయట అడుక్కునే భిక్షకులు. స్థానికంగా రిక్షాలు లాక్కునే వాళ్లు. వీళ్ళకి క్షయ ప్రబలంగా వుంటుంది. అక్కడ చేరాక వాళ్లకి వైద్యసహాయం అందుతుంది. అంతేకాదు, ప్రేమ దక్కుతుంది. అదీ ముక్కూ మొహం యెరగని వాళ్లనుంచి. యికరెండవది అంతిమ సంస్కారం మృతుని కోరిక మీదే జరగడం. రోగుల్ని అపస్మారకంగా వున్న స్థితిలో అక్కడికి తీసుకు వస్తారు. అంచేత తను మతం యేమిటో చెప్పలేరు. అందుగ్గాను ఓ ధర్మ సూక్ష్మం కనిపెట్టేరు. ముస్లిం మగవాళ్లయితే సుంతీని బట్టి పోల్చుకోవచ్చు. స్థానికంగా వున్న అంజుమన్‌ని పిలిపించి ముస్లిం మృతదేహాల్ని అప్పగిస్తారు. మిగిలిన సందర్భాల్లో యేదో గుర్తును బట్టో, పచ్చబొట్లని బట్టో ఆ ప్రాణి మతాన్ని గుర్తిస్తారు. ఆ మృతదేహాన్ని గుర్తించలేనప్పుడు, హిందూ సంప్రదాయం ప్రకారం కర్మకాండలు జరిపిస్తారు. యిక మూడవ అంశం: సిస్టర్లు నగరంలో వున్న యితర పేదల్లాగానే పేదలు. సిస్టర్లకి మరింత మెరుగైన భోజనం, శుభ్రమైన బట్టలూ వుండచ్చుగాక. కాని స్వయంగా వరించుకున్న పేదరికం వల్ల, గుమ్మం లోనుంచి వాళ్లతో తక్షణం ఒకటి అయిపోతారు.

1952 ఆగష్టు 22న మదర్ థెరెసా నిర్మల్ హృదయ్ తెరిచేరు. అప్పట్నుంచీ రికార్డుస్థాయిలో కేసులు నమోదు అయేయి. నయమై బతికిన వాళ్ల పేర్లూ, చనిపోయిన వాళ్ల పేర్లూ ఓ పట్టికలో వున్నాయి. అపస్మారక స్థితిలోనే తనువు చాలించిన వాళ్ళ పేర్లు తెలియవు కాబట్టి, వీధి పేరూ లేదా రోడ్డు పేరూ వుంటాయంతే. ఉదాహరణకు "పురుషుడు, కాన్వెంట్ రోడ్" అంటూ. కోలుకుని, వెళ్లిపోయేవాళ్ళూ వుంటారు. కాని మళ్లీ అక్కడికే చేరతారు, చనిపోయేముందు. మొత్తం మీద ఆ రిజిష్టరులో అక్కడ చేరిన వాళ్ల వివరాలు పొల్లు పోకుండా నమోదవుతాయి.

అ పట్టికలోవున్న తొలివాళ్ల పేర్లుచూస్తే, అక్కడ చేరిన అందరూ దాదాపు వాళ్ల వాళ్ల రోగాలకు బలైపోయినట్టే కనిపిస్తుంది. యిది 1940లలో, 1950లలో వున్న పరిస్థితి. యీ పరిస్థితి 1960 ల నాటికీ 1970 ల నాటికీ మారింది. అక్కడచేరిన వాళ్ళలో మృతి చెందిన వారిసంఖ్య దాదాపు సగంగానే వుంది. గత

పదేళ్ళలోనూ అయిదోవంతు మాత్రమే మరణించేరు. యిప్పుడు రోజా చేరేవాళ్ళ సంఖ్య రెండునుంచి పదిదాకా వుంటుంది. 1991 సెప్టెంబర్లో 177 మంది చేరారు, 106 మంది డిశ్చార్జ్ అయేరు, 35 మంది చనిపోయేరు. యేదో గుడ్డివాటుగా ఓ ముందు యేటి పేజీ తిప్పేను. 1987 సెప్టెంబరులో 165 మంది చేరారు. 117 మంది డిశ్చార్జ్ అయేరు. 28 మంది, అంటే ఆరింట ఒకవంతు చనిపోయేరు. యివాళ ఆహారం మెరుగైంది, వసతి మెరుగైంది, మంచి బట్టలు వుంటున్నాయి. అంచేత యీ మార్పు వచ్చి వుండచ్చు. వైద్య సౌకర్యాలు కూడా బాగా మెరుగయేయి. బాగా అందుబాటులో వున్నాయి. మదర్ థెరెసా నగర అంతరాత్మను కుదిపేశారు. అందువల్లనే కామోసు యెవళ్ళూ నడి రోడ్డు మీద చనిపోయే దుర్మార్గ పరిస్థితి తప్పింది. యెవళ్ళో యెక్కడి నుంచో 102 నంబరు డయల్ చేస్తారు. ఓ అంబులెన్స్ అక్కడికి వెడుతుంది. ఆ అభాగ్యుణ్ణి హాస్పిటల్‌కి తీసుకు వెడతారు. హాస్పిటల్ చేర్చుకోకపోతే అంబులెన్స్ నిర్మల్ హృదయ్‌కి చేరుతుంది. హాస్పిటళ్ళు చేర్చుకుని వాళ్లని పోలీసులూ నిర్మల్ హృదయ్‌కి తీసుకొచ్చి చేరుస్తారు. దీనికితోడు సిస్టర్లు రోడ్డుమీద వెళ్లేటప్పుడు యిలాంటి అవసాన దశ వాళ్ళు యెవరన్నా వీధుల్లో పడివున్నారేమో నని ఓ కంట చూస్తూనేవుంటారు.

“మాకున్న చిన్న సమస్యల్లో ఒకటి, “వీధికేసులూ”, “కుటుంబ కేసులూ” యేమిటో తేడా చూడడం. వీధి కేసులంటే అనాధలు, దిక్కూ-మొక్కూ లేనివాళ్ళు, వాళ్లకి నా అన్నవాళ్ళు యెవళ్ళూ వుండరు. ఓ కుటుంబంగాని, ఓ బంధువులు గాని, ప్రేమించి ఆదరించేవాళ్ళు గాని యెవళ్ళు వుండరు. “కుటుంబకేసులు” అంటే కుటుంబాలున్న వాళ్ళు. అయితే కుటుంబంలో యెవళ్ళూ ఆదరించరు, ఆదరించే శక్తి లేకపోవచ్చు. ‘దయాగుణంతో తప్పు చెయ్యండి, ఫరవాలేదు. దయలేకుండా అద్భుతాలు సాధించే దానికంటే, జబ్బుగా వున్న వాళ్ళని యెప్పుడూ తోసిపారెయ్యకండి’ అని మదర్ మాకు చెబుతూ వుంటారు. మాకు వున్నవి 150 పడకలు మాత్రమే. ఒకోసారి 130 మంది రోగులు కూడా వుంటువుంటారు. పాపం, యెక్కువసార్లు రోగులు తమ పడకల్ని యిష్టాపత్తిగా యిస్తామంటారు. తమకంటే యెక్కువగా బాధపడుతున్నారని యెవరినన్నా చూసినప్పుడు రోగులు తమ పడకల్ని తీసుకొమ్మని అనేవారు. కొంచెం వున్నవాడు “మరి ‘కాసిని రోజులు వుంటే యేమిటట” అనుకోవచ్చు. కాని పేదవాడు మరోలా ఆలోచిస్తాడు. ‘నేను బాధపడ్డాను. నా బాధకంటే యెక్కువ బాధ అనుభవిస్తూ మనిషి అడుగో. నా దక్కిన అదృష్టంలో కొంత అతనికీ దక్కనీ’ అనుకుంటాడు. సిస్టర్లు కూడా కటిక పేదరికంలో వున్న వాళ్ళనీ, ఆకలితో వున్నవాళ్ళనీ, నకనకలాడి పోతూ వున్నవాళ్ళని లేదు పొమ్మని అనరు. వీళ్ళల్లో చాలా మంది క్షయవ్యాధి గ్రస్తులు. వీళ్ళల్లో యెక్కువ మంది రిక్షాతొక్కేవాళ్ళు, తోపుడు బళ్లవాళ్ళు, బజార్లో మూటలు మోసేవాళ్లు, యీ బాపతువాళ్లు యిక్కడికి వచ్చి ‘నాకు జబ్బు, వేరేదారిలేదు పడుకోవడానికి. బజారంతా కిక్కిరిసిపోయింది. రాత్రిపూటే యేదో యింత నడుం వాల్చే జాగా దొరుకుతుంది. యెక్కడికి వెళ్లడానికీ లేదు. నన్ను యిక్కడ కొన్ని రోజులు వుండనివ్వరా’ అని అడుగుతారు, చూశారా” అని ఓ సిస్టర్ చెప్పుకొచ్చేరు.

మృత్యువు కళ్లయెదుటే కనబడుతూవుంటే అంత ప్రశాంతంగా నిబ్బరంగా ఆ హాల్స్‌లో యెలా వుంటున్నావని సిస్టర్ సుమ అడిగేను. ఓ పక్క శుష్కించిపోయిన శరీరాలు. కాంతి లేని గాజుకళ్లు. పేదరికం, లేమి చుట్టు ముట్టిన జీవాలు. యిలాంటి వాతావరణం నుంచి మారిపోవాలని లేదా, అంటే యే పిల్లల హోమ్‌కో అని అడిగేను. తను వచ్చిన కొత్తల్లో విచారంగానే వుండేదట. ముఖ్యం పడుచువాళ్లు చనిపోయినప్పుడు గబగబా చర్చికి పరిగెత్తి వెళ్లిపోయేదట, లేకపోతే యెవళ్ళన్నా తను యేడుస్తున్నట్టు చూస్తారేమోనని రాత్రి చాలా పొద్దుపోయేదాకా ప్రార్థిస్తూ గడిపేదట, దయచూడమని దేవుణ్ణి అర్థించేదట. కొన్నినెలలు అలానే గడిచేయట. యిప్పుడు మరింత దయార్ద్ర హృదయంతో, శక్తితో పని చెయ్యగలుగుతున్నానని ఆమె అంది.

"యిప్పుడు నాకు భయం లేదు (మృత్యువు అంటే) వాళ్ళకి (మరణిస్తూ వున్నవాళ్లకి) తాము దేవుణ్ణి దర్శించబోతున్నారని చెబుతూవుంటాం. ప్రతిమనిషి పుట్టుకా దేవునిలో నుంచే, ప్రతి మానవునిలోనూ దేవుడువుంటాడు. నాకు జీసస్ దేవుడు, ఓ హిందువుకి శివుడో, విష్ణువో, బ్రహ్మో, ఓ ముస్లింకి అల్లా. యే వ్యక్తి అన్నా స్పృహలేకుండా పడివుంటే ఓ సిస్టర్నో, బ్రదర్నో, స్వచ్ఛంద సేవకుణ్ణో అపక్కన కూర్చోమని చెబుతాను. మరణిస్తూ వున్న ఆ మనిషి చేతిని పట్టుకుని తనుచేసిన పాపాలకు క్షమించమని చెప్పమంటాను. లేకపోతే దేవుని ప్రేమకోసం, విశ్వాసం కోసం యేదన్నా పని చెయ్యమని చెబుతాను. ఒక సందర్భంలో యీ మాటల్ని మృత్యువు ఆసన్నమయే వాళ్ల చెవులో గుసగుసలాడితే వాళ్ల చెక్కిళ్లమ్మట కన్నీళ్లు అలా కారిపోతూ వుంటాయి. మీరు యిక్కడ చూసే వాళ్ళల్లో చాలామందికి చావు అంటే భయం లేదు. మేం కాపాడలేక పోయిన వాళ్ల పట్ల బాధపడుతూ వుంటాం. అలా వాళ్లని మానసికంగా సన్నద్ధం చేసేటప్పుడు "యిందుకే నేను యిక్కడికి వచ్చేను" అంటూ వుంటాడతను. కిందటినెలలో ఓ ముసలావిడ తగిలింది. "సిస్టర్, చెప్పలేనంత బాధగా వుంది. నేను అనుభవిస్తూ వున్నదేమిటో ప్రభువు చూడ్డంలేదంటారా? నాకిక యే కోరికలూ లేవు, అవతలికి దాటి వెళ్లిపోతాను" అంది నాతో. కొన్ని రోజుల తర్వాత ఆమె చనిపోయింది. చనిపోవడానికి యిక్కడికంటే మంచిచోటు లేదు" అని చాలామంది అంటూ వుంటారు.

"యెవళ్లన్నా పడుచువాళ్లు పోతూవుంటే నాకు బాధ కలుగుతుంది. కిందటి ఆదివారం ఓ కుర్రాణ్ణి తీసుకువచ్చేరు. రక్తం కక్కుకుంటున్నాట్ట. వెంటనే దాన్ని కట్టించడానికి సెలైన్ యెక్కించేను. కొంచెం స్థిమిత పడేట్టు చేశాక, మరో అర్జెంట్ కేసు చూడ్డానికి హాల్లో మరో మూలకి వెళ్లేను. కొన్నిక్షణాల తర్వాత తిరిగి వచ్చిచూస్తే ఆ కుర్రాడు లేడు. యెక్కడ వెదికినా కనిపించల్లేదు. వీధిలోకి కూడా పరిగెత్తి వెళ్లేను. చివరకు టాయిలెట్ వెనక కనిపించేడు చాలా రక్తం పోయింది. కుప్పకూలిపోయేడు. యిక్కడికి రాకముందే చాలా రోజులుగా రక్తం కక్కుకుంటూ వున్నాడనుకుంటాను. మళ్లీ పడక దగ్గరకు తీసుకు వచ్చాను. పదిహేను నిముషాల్లో పోయేడు. కొంచెం ముందే వచ్చివుంటే కాపాడ గలిగే వాళ్లమేమో! నిండా యిరవై యేళ్లుండవు. నా కళ్ళల్లో నీళ్లు తిరిగేయి యెవళ్లూ చూడకుండా

ముఖం తిప్పుకున్నాను. యేమో, యీ ప్రపంచంలో యిలా పెనుగులాడేకంటే దైవ సాన్నిధ్యానికి అతను వెళ్లిపోవడమే మంచిదేమోననిపించింది మళ్లీ."

ఆ సిస్టరు నాతో మాట్లాడుతూ వుండగానే, మగవాళ్ల వార్డులో కలకలం కనిపించింది. ఒక సిస్టరూ, యిద్దరు వలంటీర్లూ ముఖాలకి ముసుగు కప్పుకున్నారు. యేదో మందు యిస్తున్నట్టున్నారు. దగ్గరకు వెళుతూ వెళుతూ అలానే ఆగిపోయేను. ఒక ముసలాయన కూర్చుని, కాలు పైకియెత్తి పట్టుకున్నాడు. పాదం అంతా పచ్చిమాంసం ముద్ద. సిస్టరూ, వలంటీర్లూ స్పిరిట్‌తో కడిగి బాగుచేస్తున్నారు. అతని ముఖం బాధతో మెలికలు తిరిగిపోతోంది. అయినా కిమ్మనడం లేదు. రోడ్డుపై యేదో ఢీకొట్టి పడిపోయేడు. యెవళ్లో యిక్కడకు తీసుకువచ్చేరు అంతదాకా అలానే పడిపోయివున్నాడు. ఓ కారు పాదం మీదనుంచి పోయింది. చూశారా, యెంత ధైర్యంగా వున్నాడో! జీవిత పోరాటాలు పేదవాళ్లని బాధల్ని భరించేటట్టు చేస్తాయి. పేదలు అంతమంచి వాళ్లుగా వుండడానికి అదో కారణం." మేము వెడుతూ వున్నాం ముందుకు. ఓ చిన్నవాడు ఆరోగ్యంగా కనిపించేడు. అతని ముఖం చూస్తూనే తెలుస్తుంది. చుట్టుపక్కల యింత జబ్బు, మృత్యువూ— అతనికి యిక్కడేం పనబ్బా అని ఆశ్చర్యపోయేను. సిస్టర్ నవ్వింది. యితను మా శిశుభవన్ కుర్రాడు. పెద్ద పిల్లల్లో బోయ్స్ టౌన్‌లో వుంటున్నాడు. యితనికి క్షయ సోకిందని ఓ రోజున తెలిసింది. అందుకని యిక్కడికి తీసుకు వచ్చేం. యింకొక్క ఇంజక్షన్ అయితే కోర్సు అయిపోతుంది. మంచంమీద పడుకొమ్మంటే పడుకోడు. కుక్కపిల్లలా మాతో కూడా కూడా తిరుగుతూవుంటాడు. కాని అతను కదలకుండా విశ్రాంతి తీసుకోవాలి. అందుచేత గట్టిగా గదమాయిస్తూ వుంటాను," అంది సిస్టర్ సుమ. నవ్వాలో, ముఖం చిట్లించుకోవాలో ముందుకు – ఆ కుర్రాడి పేరు—తోచలేదు.

సిస్టర్ సుమ నన్ను ఓ ముసలాయన దగ్గరకు తీసుకు వెళ్లింది. అతను పడక మీద కూర్చున్నాడు. ఆమె అతని జుట్టుని గోముగా నిమిరింది. "యితను జగదీష్. యెక్కడికి వెళ్లడానికీ లేకపోయింది. గుడి దగ్గర అడుక్కుంటూ వుంటాడు. యిక్కడ కొన్నిసార్లు వున్నాడు. కొన్నిసార్లు జగదీష్ వీధిలో తగుల్తూవుంటాడు. ఆ రోజు యెంత సంపాదించేడో చూపించేవాడు. భోజనానికి అది చాలకపోతే మా దగ్గరకు వచ్చేయ్యమని చెప్పేదాన్ని."

నేను సిస్టర్‌తో మాట్లాడుతూ వున్నంతసేపూ యితర సిస్టర్లూ, వలంటీర్లూ తమ పని తాము చేసుకొని పోతూనే వున్నారు. రోగుల సంరక్షణ చూస్తూనే వున్నారు. యిదంతా నేను గమనిస్తూనే వున్నాను. యిక్కడో సెలైన్ బాటిల్‌ని సరిచెయ్యడం, అక్కడో రోగి నరం వెతికి పట్టుకోవడం, నేలని అలానే తుడుస్తూవుండడం లాంటి పనులన్నీ సాగిపోతూనే వున్నాయి, ఓ బెంగాలీ యువకుడు ప్రతి వొక్క మంచం దగ్గరికీ వెడుతూ అవసరం అయినవాళ్లకి క్షవరం చేస్తూ వున్నాడు. ఆ కుర్రాడు కలకత్తా యూనివర్సిటీలో ఆ నర్స్‌కోర్స్ చదువుతున్నాట్ట. ఒట్టినే క్షవరం చెయ్యడమే కాదు— మీకేం ఫరవాలేదు, హాయిగా వున్నారు అంటూ ధైర్యం కూడా చెబుతూ వున్నాడు. పదిహేడవ నంబరు పడకమీద ఒకతను వున్నాడు. ఓ పక్కనుంచి చూస్తే యిరవై యేళ్ల వాడిలా వున్నాడు. మరోపక్కనుంచి చూస్తే

డెబ్బై యేళ్లవాడిలా వున్నాడు. అతని పక్కనే ఓ పడుచతను కూర్చున్నాడు. స్వీడన్ దేశస్థుడు. అతని జుట్టు బంగారు రంగులో వుంది. ఒత్తుగా వుంది. భుజాల మీదకు పడుతోంది. అతను మంచం మీద వున్నతని కాళ్లు మర్దనా చేస్తూవున్నాడు. ఓ అరగంట తర్వాత తిరిగి ఆ చోటుకు వెళ్ళేను. రోగి కళ్ళు మూసుకుని వున్నాడు. యువకుడు అతని చేతిని గట్టిగా అదుముకునేవాడు. రోగి ప్రాణవాయువు గాలిలో కలిసిపోయింది.

నేను కాళీఘాట్ వెళ్ళినప్పుడల్లా అక్కడ ఓ డజను మంది వలంటీర్లు పనిచేస్తూవుండడం గమనించేవాణ్ణి. మదర్ థెరెసా అన్నమాటలు గుర్తువచ్చేవి. మేం మొదటిసారి అక్కడకు వెళ్లినప్పుడు ఆవిడ అన్నమాటలు. "యిక్కడ పనిచేసే వలంటీర్లను చూడండి. ప్రపంచం నలుమూలల నుంచీ వస్తారు. (వాళ్ల వాళ్ల దేశాల్లో) డబ్బుకోసం వాళ్లు పనిచేస్తారు. అప్పుడు యిక్కడ సేవ చెయ్యడానికి వస్తారు. అన్ని ఖర్చులూ వాళ్లే పెట్టుకుంటారు. మాకుగా మేం యేమీ యివ్వం. రెండు మూడు నెలలు వుండి వెళ్ళిపోతూవుంటారు," అని చెప్పారు ఆవిడ. వొంచిన నడుం యెత్తకుండా నేల కడుగుతూనే వుంటారు, తుడుస్తూనే వుంటారు. పక్క దుప్పట్లు మారుస్తూనే వుంటారు. మూత్రంతో వాసన కొట్టే పక్కల్ని మారుస్తూనే వుంటారు. అవసాన దశలో వున్న ఆ రోగుల్ని పట్టుకుంటూ, తిండి తినిపిస్తూవుంటారు. యిలా సేవ చెయ్యడం కోసం కాకపోతే యీ నగరానికి రానే రారేమో వాళ్లు! మరి యిదంతా వాళ్ల భాగ్యమా? లేక విధికృతమా?

"నేను యిక్కడ యెందుకున్నట్టు?" ప్రశ్నలోనే జవాబు ధ్వనించేటట్టు అన్నాడు ఈమన్ బట్లర్. "ఆరు వారాలైంది. ప్రతిరోజూ యిలా నన్ను నేనే ప్రశ్నించు కుంటూ వుంటాను. ఐర్లండ్‌లో మా యింట్లో నేను సంపాదించుకునే డబ్బుతో హాయిగా బతికెయ్యచ్చు. దీన్ని యే ఒకటీ రెండు మాటల్లోనో విడమర్చి చెప్పడం కష్టం" అన్నాడు. అతనికి ముప్పై ఒక్కయేళ్ళు. వడ్రంగం పని చేసేవాడు. ఓ వృద్ధుడికి సాయం చేస్తున్నాడు. కొన్ని నిముషాలు అతన్నే గమనించేను. యితను ఆ ముసలితనానికి క్షవరం చేశాడు. పక్కబట్టలు మార్చేడు. ఆ ముసలాయనకు అన్నీ పక్కమీదే. మళ్లీ పక్క పాడు చేశాడు. బట్లర్ మళ్లీ అతన్ని కడిగి, బట్టలు మార్చి శుభ్రం చేశాడు. అంతకంటే యెవరు మాత్రం యేం చేస్తారు? "మొదటి సారి మదర్ థెరెసాని ఓ టీ.వీ. ఇంటర్వ్యూలో చూశేను. ఆవిడ్ని ఇంటర్వ్యూ చేసే అతనికి కన్నీళ్లే తక్కువ. దాంతో నాకు ప్రేరణ కలిగింది. కలకత్తాకు టికెట్ కొనుక్కున్నాను. అన్నీ సిద్ధంచేసుకున్నాను, వీసా వచ్చింది. విమానం నాల్రోజుల్లో వుందనగా బెదురుపుట్టింది. మొత్తం రద్దు చేసుకున్నాను. నాలుగేళ్ల తర్వాత యెలాగైతేనేం వచ్చేను. "నేను వచ్చేను. సిస్టర్ జోసెఫ్ నన్ను కాళీఘాట్ రమ్మన్నారు. నాకు వెన్నులో వొణుకు పుట్టింది. చనిపోయే వాళ్ల తపనా, నేనెప్పుడూ చూడలేదు. "పోనీ వెళ్లి ఓ పూట పనిచేసి చూడండి" అంది సిస్టర్.

"యిక్కడ అడుగు పెట్టేను. వెంటనే కృప నా మీద ప్రసరించింది. దానివల్లనే యీ పనిలో నెగ్గుకు రాగలుగుతున్నాను. ఓ వారంలోనే చనిపోతూ వున్న వాళ్ళని పట్టుకో గలుగుతున్నాను, మృతదేహాల్ని స్నానం చేయిస్తున్నాను. అసలిలాంటి పనుల్ని చెయ్యగలనని వూహించను కూడా వూహించలేదు. అలాంటిది యిప్పుడు

మృత్యువును వేరే కోణంలో చూడగలుగుతున్నాను– ఒక పునర్జన్మగా, తదనంతర జీవితంగా, "యింటికి వెళ్లడంగా", "ఆఖరి పని" గా చూడ గలుగుతున్నాను. దేహం పోతుంది. ఆత్మ, శాంతి మిగులుతాయి. మృత్యువుతో సమాధానపడిపోయేను. జీవితం గురించీ నాకు అద్భుతమైన విషయాలు తెలిశాయి. మనుషులు యెలా వుంటారో, వీధుల్లో వున్నవాళ్లు ఒకళ్ల కొకళ్లు యెలాసాయం చేసుకుంటారో, కాళీఘాట్ లో యెంత శ్రద్ధ చూపిస్తూ వుంటారో, సిస్టర్ల అనురాగాలు యెలాంటివో తెలిశాయి. యిక్కడున్న మా సహకార్యకర్తలు చాలా మందికి మళ్లీ ఆ ఐహిక పాదార్థిక ప్రపంచంలోకి వెళ్ళడం అంటే అసహ్యం. యీ పేదరికం అనుభవించడం, బాధని భరించడం నాలో ప్రతి నరానికీ పాకిపోవాలి. అలాగైతేనే నేను మారకుండా యిలానే వుంటాను. అదీ నా కోరిక," అన్నాడు బట్లర్.

యివే భావాలు మిగత సహకార్యకర్తలూ వెల్లడించేరు. థెరెసా అనే ఆమె ఐర్లాండ్ లో శిక్షణ పొందిన నర్సు. ముప్పైరెండు యేళ్లు వుంటాయి. పది వారాలుగా కాళీఘాట్ లో పనిచేస్తోంది. "మరో మూడు నెలల్లో నన్ను పంపించిన సొసైటీకి తిరిగి వెళ్లిపోతాను. మళ్లీ ప్రాపంచిక పరిస్థితుల్లోకి. కాని కాళీఘాట్ నా జీవితాన్ని సర్వకాల సర్వావస్థలకీ మార్చివేసింది. కాళీఘాట్ మాకు యిస్తున్న దాంతో పోలిస్తే మేం యిక్కడ చేసేది ఆవగింజంత. జీవితం, మరణం అనే వాటిలోకి లోతుగా చూడడం యిది. యిక్కడ మీకు మొదట కనిపించేది దేవుని సాక్షాత్కారం."

మేరీ కాక్స్ కి యాభై వుంటాయి. ఇంగ్లాండ్ లోని స్టాక్ బ్రోకర్ల పరిధి నుంచి వచ్చింది. కొన్ని నెలలపాటు కాళీఘాట్ లో పని చెయ్యాలని ప్రత్యేకంగా వచ్చింది. "మదర్ థెరెసాకు చాలా యిష్టమైన స్థలం యిదేననుకుంటాను. కాని యిక్కడకు వచ్చిన మొదటి రోజు పొద్దున్నంతా వికారంగానే వుంది. అసలా పని నేను చెయ్యగలనా అనిపించింది. మర్నాటికి కొంచెం సర్దుకున్నాను. కాలం గడుస్తూ వుండేకొద్దీ భగవంతుని మందహాసం మీకు తెలుస్తూ వుంటుంది. ఇంగ్లాండ్ లోనూ మాకు పేదరికం వుంది. అయితే అది ఆధ్యాత్మిక పేదరికం. ఒక ఒంటరితనం. కాళీఘాట్ లో అవి అంతలా లేవు. యిక్కడ మీకు ఓ పక్కన కటిక పేదరికం కనిపిస్తుంది. అద్భుతమైన జీవితం ప్రేమ, సంతోషం కనిపిస్తాయి. యీ మనుషుల చిరునవ్వులో కనిపిస్తాయి అవి. వీళ్లు బాధతో వున్నాసరే. వాళ్ల దగ్గర యేమీ లేదు. ఆ లేకపోవడంలో నుంచే వాళ్లు తమ సంతోషాన్ని చాలా అణుకువగా వెల్లడి చేస్తారు. మీకు యిక్కడ ప్రత్యేక పద్ధతిలో క్రీస్తు శరీరాన్ని తాకడం వుంటుంది. నేను వెనక్కి తిరిగి వెళ్లిపోయి కాలు మీద కాలు వేసుకుని బతుకుతూ గడిపేస్తే యీ దృశ్యాన్ని నా మనసులో, హృదయంలో నిలుపుకోవడం నాకు కష్టం అవుతుంది. యిది మిమ్మల్ని మార్చాలి. తప్పదు, మార్చితీరాలి. మనం జీవితంలో ఒక యాత్ర చేస్తున్నాం. అలా మారుతూనే వుండాలి మనం."

సూత్రరీత్యా చూస్తే, వాలంటీర్లు వుండవలసింది కొంత కాలమే. కాళీఘాట్ కి మూలస్తంభాలు సిస్టర్లే. నిజం చెప్పాలంటే వాళ్ళదే మహాకష్టమైన పని. వూహించలేనంత కష్టం. అసలు, మొదట శారీరకంగా శక్తీ పుష్టీ వుండాలి. యేమంటే నర్సు, పోర్టర్, డాక్టర్ అన్నీ, అన్నిపనులూ, ఒక్కళ్లే అయి చెయ్యాలి

అలా ఎనిమిదేసి గంటలు, వారంలో ఆరు రోజులు చేస్తూనే వుండాలి. మందులివ్వాలి. స్నానాలు చేయించాలి, భోజనాలు పెట్టాలి, శుభ్రం చెయ్యాలి, లేదా ఒట్టినే రోగి చెప్పేది వినడం కోసం పక్కనే కూర్చోవాలి. ఓ ప్రార్థన చెయ్యడం కావచ్చు, యేదో ఫిర్యాదు కావచ్చు. యివన్నీ అలా అడ్డూ ఆపూ లేకుండా వుంటూనే వుంటాయి. ఒంట్లో శక్తికితోడు,దయ, కొంచెం సరదా స్వభావం కూడా వుండాలి. "సెయింట్ పీటర్ దగ్గరకు వెళ్తున్నాడు, యెకాయెకీ టికెట్ దొరికింది," "చిరునవ్వు నవ్వుతూ రాజహంసలా వెళ్లిపోయిందావిడ, యెంత పుణ్యం చేసుకుంటే అలా వెళ్లిపోతాం?" యిలాంటి బాణీలో వుండాల్సిందే. పని కష్టమైందే. అయినా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వాళ్లంతా యీ అవసాన రోగుల కేంద్రంలో పనిచెయ్యవలసిందే. చిత్రం యేమిటంటే, చాలామంది కాళీఘాట్ కి పంపించమని బతిమాలతారు. అది అంత సులభం కాదు కాబట్టి అక్కడికి వెళ్ళడానికి వేరే చోట్ల పని చెయ్యాల్సి వస్తుంది.

సిస్టర్ సుమ నన్ను ఆడవాళ్ల హాల్ కి తీసుకు వెళ్లింది. అప్పటికి సాయంత్రం అవుతుంది. కిందటిసారి నేను చూసినప్పటికీ యిప్పటికీ దాదాపు యే మార్పు లేదు. కాని మరో రకంగా చూస్తే ప్రతీదీ మారిపోయింది. కిందటి సారి యిక్కడికి వచ్చినప్పుడు దాలిమ్ దాస్‌తో గడిపేను. ఆవిడ సంపన్న కుటుంబంలో పిల్లలకు పాఠాలు చెప్పేది. ఆవిడకు కాన్సర్. శరీరమంతా దానికి గురయినట్టు వుంది జుట్టంతా వూడిపోయింది. కెమోథెరపీ వల్ల కలిగే దుష్పరిణామాల్లో ఒకటై వుండచ్చు. ఒకోసారి తన బాధ యెంత తీవ్రంగా వుందంటే, చచ్చిపోతానేమోనని అరిచేది. కాని నాతో మాట్లాడుతూ వున్నంత సేపు పిసరు గుర్ మనలేదు. విచారపడలేదు, పశ్చాత్తాప పడలేదు. ఆమెకు నలత అది బహుశా యేదో తలనొప్పి కావచ్చు, త్వరలోనే తగ్గిపోనూవచ్చు. నేనా పైవాణ్ణి. తను సంస్కారవంతమైన ఉపాధ్యాయురాలు. నలుగురిలోనూ తన కష్టాలు యేకరువు పెట్టుకుంటుందా? గడిచిపోయిన సంవత్సరాల గురించి మాట్లాడింది. తను పిల్లల్తో కలిసి యూరప్ వెళ్లిన సంగతులు చెప్పింది. మేము అవసాన దశలో వున్న వాళ్ల హోమ్‌లో వున్న విషయం కాసేపు మరిచేపోయేను. మేం చౌరంగీ వీధిలోని గ్రాండ్ హోటల్‌లో కూర్చుని టీ తాగుతున్నామేమోనని పించింది. మేం మాట్లాడుకోవడం పూర్తయేటప్పుడే, మేం మళ్లీ కలుసుకోలేమని మనసుకు తోచింది. తనసొంత విషయాలు చెప్పింది. తొమ్మిదేళ్ల కేన్సర్‌తో సంకల్పంతో, ప్రార్థనలతో మాత్రమే పోరాడింది. తను హిందువు. అసంఖ్యాక హిందూ దేవుళ్లనే కాక, జీసస్‌నీ, అల్లానీ కూడా ప్రార్థించేది. తన చరమప్రార్థనగా దాలిమ్ ఒక ప్రత్యేక ప్రార్థనను కేటాయించుకుంది. దాన్ని తనే కూర్చింది. అది మదర్ థెరెసా కోసం చిన్న ప్రార్థన. ఆవిడ మోక్షం కోసం ప్రార్థించింది. సంసార చక్రం నుండి విముక్తి కావాలి. జీవితంలో యెంత దుఃఖమో వుంది. అదంతా దాటి కడకు దైవ సన్నిధి చేరుకోవాలి. ఒకోసారి యీ ప్రార్థనకు రూపం, వస్తువు కూడతాయి. మదర్ థెరెసా తనే స్వయంగా దాలిమ్ పక్కన కూర్చున్నట్టు, ఆమె చేతిని పట్టుకున్నట్టు, నుదురు నిమురుతున్నట్టు అనిపిస్తుంది.

యివాళ దాలిమ్‌దాస్ మంచం మీద స్నేహలత వుంది. ఆవిడా క్షయతో, కాన్సర్‌తో బాధ పడుతుంది. కిందటి వారంలో స్నేహలత తలగడ కింద కొన్ని

బిస్కట్లు కనిపించాయి సిస్టర్‌కి. "మా పిల్లల కోసం. మా చెల్లెలు ఆదివారం చూడ్డానికి వస్తుంది కదా, ఆమె కిచ్చి పంపిస్తాను" అని చెప్పింది. తనకి యిచ్చిన బిస్కట్లని పిల్లలకోసం దాచిపెట్టింది. యివ్వడానికి అంతకంటే యేమీ తనదగ్గరలేవు. "స్నేహలతా, మీ కిచ్చిన బిస్కట్లు మీరు తినండి. మీ చెల్లెలు వచ్చినప్పుడు, నీ పిల్లలకు నేను పంపిస్తాలే" అంది సిస్టర్ సుమ. స్నేహలత వూహూ వద్దు అన్నట్టు తల వూపింది. సిస్టర్ వొత్తిడి చెయ్యలేదు. తనదగ్గర వున్న ఆ కాస్త త్యాగం చెయ్యకపోతే ప్రేమకు పరిపూర్తి లేదని సిస్టర్‌కి అర్థమైంది. స్నేహలత చెల్లెలు వచ్చింది. స్నేహలత ఆమెకి తను దాచుకున్న యెనిమిది బిస్కట్లూ యిచ్చింది. యీసంఘటన గురించి నేను చెప్పినప్పుడు యీ సంఘటననే మదర్ థెరెసా "బాధ పెట్టేదాకా యివ్వడం" అని వర్ణించేరు. తర్వాత తెలిసింది అ పిల్లలు స్నేహలత పిల్లలు కారట. భర్త మరో ఆమెని చేర దీసి యీామెని వదిలేశాడట. యీ పిల్లలు ఆమె సంతానం.

యిరవై అరవ పడక దగ్గర్నుంచి వెడుతూవున్నాం. దానిమీద శుష్కించిపోయిన శరీరం సిస్టర్ చేతిని అందుకుని ముద్దుపెట్టుకుంది. ఆమెపేరు హసీనా. ఆమె వుండీ ఉడిగీ యేడుస్తోంది. రిపన్ వీథిలో అడుక్కుంటూ వుండేదట. ఓ చౌరస్తాలో దగ్గరలో వున్న చెట్టుకింద వుంటూ వుండేదట. అక్కడ ఉద్యోగాలకు వెళ్ళేవాళ్ళూ, ప్రయాణీకులూ బస్ యెక్కాలి. రోజూ అటువెళ్లే వాళ్లకి హసీనా పరిచయమే. ఆమె అల్యూమినియం బొచ్చె చిల్లరతో నిండిపోయేది సాయంత్రానికి. రోజు బాగుంటే పది రూపాయల దాకా పోగయేది. అప్పుడో విషాదం జరిగింది. వూళ్లో వరసగా సమ్మెలు జరిగేయి. మామూలు జీవనానికి ఆటంకం వచ్చింది. హసీనా తను రోజూ కూర్చొనే చోటుకి వెళ్లలేకపోయింది. మామూలు పరిస్థితులు యేర్పడానికి వారం రోజులు పట్టింది. హసీనా ఆదరా బాదరా అక్కడికి వెళ్లేటప్పటికి ఆ చోటంతా యెవరిదో కుటుంబం ఆక్రమించేసుకుంది. హసీనాకు చోటు లేకపోయింది. గంగ వెర్రులెత్తిపోయి మరో చోటుకోసం వెతికింది. యెక్కడా సరిపడలేదు. ఆమెకి ఆందోళన పెరిగింది. తను యివ్వాల్సిన డబ్బు కోసం తన కుటుంబం కనిపెట్టుకు వుంటుంది. ఆమె అలా యివ్వలేని స్థితి వచ్చేటప్పటికి యింట్లో నుంచి గెంటేశారు. వీథుల్లో కొనవూపిరితో పడిపోయింది. అప్పుడు సిస్టర్లు ఆమెని చూశారు. బలవంతంగా ఆహారం లోపలికి పంపితే పదిరోజులు పట్టింది కోలుకోవడానికి. ఆమె పిల్లలకు కబురు చేశారు. కాని ఒక్కళ్ళూ రాలేదు. యెవళ్లు లోపలికి వచ్చినా, వాళ్లు తనవాళ్లే అయివుంటారని ఆశగా చూసేది.

ఆ మర్నాడు మేం తితాఘర్ నుంచి తిరిగి వెనక్కి వచ్చేం. కాళీఘాట్ యెలా వుందని మదర్‌ని అడిగేను. "యిన్నేళ్లల్లోనూ వీథుల్లోపడి వుండిన వాళ్ళల్లో 54 వేల మందిని కాపాడాం. సగం మంది హాయిగా కన్ను మూశేరు" అని ఆవిడ చెప్పారు. చావు "హాయిగా"యెలా వుంటుంది? అని అడిగేను. నా అన్న వాళ్లు దగ్గరలేకపోతే ఒంటరి తనంతో బాధ పడతాం. గాని మృత్యువు అంటే "యింటికి వెళ్ళడం" అని చెప్పేరు. ఆవిడ కొంచెం సేపు ఆగేరు. "యిక్కడ చనిపోయే వాళ్లు ప్రశాంతంగా చనిపోతారు. నాకు సంబంధించి మానవ జీవితంలో కావలసింది అదే. గౌరవ ప్రదంగా ప్రశాంతంగా చనిపోవడం. అది అమృతత్వానికోసం" అని మెల్లిగా చెప్పారు.

యేదన్నా బలమైన సందర్భం, పురోహితుని మరణంలాంటిది, యేమన్నా గుర్తుందా అని అడిగేను. "ఓ రోజున ఒకతన్ని సైడు కాలవలో నుంచి కాపాడేను. అతని వొళ్ళంతా పుళ్ళు, అతన్ని హోమ్‌కి (నిర్మల్ హృదయ్‌కి) తీసుకు వచ్చేను. అతన్ని శుభ్రం చేసి స్నానం చేయించాం. పుళ్ళకి మందులు వేశాం. అతను అంతసేపూ యేమీ మాట్లాడలేదు. ముఖంలో భయమూ కనిపించలేదు. 'నేను బతుకంతా వీధుల్లో పశువులాగానే బతికేను. యిప్పుడు. దేవతలా చనిపోతున్నాను'అన్నాడు. నన్ను చూసి చిరునవ్వు నవ్వేడు. తీసుకొచ్చిన మూడు గంటల్లో పోయేడు" అని చెప్పేరు ఆవిడ.

ఓసారి మదర్ థెరెసా ఒక ఆడమనిషిని చెత్తకుండీలో చూసినట్టు చెప్పేరు. జ్వరంతో సంధి కొట్టింది. యీ సంగతి మదర్ థెరెసాయే నాతో చెప్పేరు. గుండెని పిండేసే విషయం ఆమె జ్వరమూ కాదు, చనిపోతూ వుండడమూ కాదు. కన్నకొడుకే ఆమెని అక్కడ పారేసి వెళ్లిపోవడం. మదర్ థెరెసా ఆమెని కాళీఘాట్‌కు చేర్చి, నీళ్ళుపోసి శుభ్రం చేశారు. కొడుకును క్షమించమని ఆవిడ ఆమెని అడిగేరు. బతిమాలగా బతిమాలగా ఆఖరికి కొడుకును క్షమించింది. మదర్ థెరెసా చేతుల్లో, ప్రశాంతంగా, తొలిసారి చిరునవ్వునవ్వుతూ, తనువు చాలించింది. ఆమె ఆఖరుగా మదర్ థెరెసాతో, "కృతజ్ఞురాల్ని" అంది. తను యెన్నడూ అంత చక్కని చిరునవ్వును కానుకగా అందుకోలేదని మదర్ థెరెసా అన్నారు.



# 11 "ప్రపంచంలో మహాశక్తి సంపన్నమైన మహిళ"

1981. మదర్ థెరెసా అప్పుడే ఇథియోపియా యాత్ర ముగించుకు వచ్చేరు. ఆ దేశంలో తీవ్రమైన దుర్భిక్షం సంభవించింది. వేలాది మంది క్షామం బారిన పడ్డారు. ఆవిడ కొన్ని వందల కిలోల మందులూ, ఆహారం కలకత్తా నుంచి తీసుకువెళ్ళేరు. కాని అదెంత, సముద్రంలో వర్షపు చినుకు. చాలా అంతర్జాతీయ సంస్థలు ఆపదలో చిక్కుకున్న ఇథియోపియా ప్రభుత్వానికి సహాయం అందిస్తూ వున్నాయి. అయినా గందరగోళంగా వుంది. సమన్వయం లేదు. రోడ్లు అధ్వాన్నంగా వున్నాయి. లోపలికంటావున్న వందలాది గ్రామాలకు సాయం అందించడం గగనంగా వుంది. అక్కడే సహాయం చాలా అవసరం.

కలకత్తాకు తిరిగి వచ్చేక కూడా ఆవిడ ఆందోళన తగ్గలేదు. సిస్టర్లతో కలిసి ఆవిడ ప్రార్ధనలు చేశారు. (ఉపవాసాలు కూడా చేశారు.) యిక విషాదాన్ని పెంచవద్దని. ఆఖరికి, యేదో ప్రేరణ కలిగినట్టు, అమెరికా అధ్యక్షుడికి ఉత్తరం రాశారు. ఓ వారం తర్వాత వైట్ హౌస్ నుంచి టెలిఫోన్ వచ్చింది. అధ్యక్షుడు రీగన్ స్వయంగా మాట్లాడేడు. ఆవిడ రాసిన ఉత్తరానికి కృతజ్ఞతలు చెప్పేడు. అవసరమైన సాయం అతి త్వరగా అందేటట్టు అమెరికన్ ప్రజల తరఫునా, తనతరఫునా హామీ యిస్తున్నట్టు చెప్పేడు. ఆయన మాట నిలబెట్టుకున్నాడు. అమెరికన్ ప్రభుత్వం ఆహారం మందులూ సరఫరా చెయ్యడమేకాదు, మిగిలిన సహాయక కేంద్రాల పనీ గణనీయంగా మెరుగయేటట్టు సహకరించింది. దేవుని దయవల్ల ఆ తర్వాత సరఫరాలు అందుతూ వచ్చేయి. ఆహారాన్ని హెలికాప్టర్ల ద్వారా గ్రామాలకు అందించారు. అప్పుడే నేను అన్నాను ఆవిడ ప్రపంచంలోకల్లా మహాశక్తి సంపన్నమైన మహిళ. అలా అనడంలో కొంత గిచ్చుతున్నట్టూ వుంది, అంతర్లీనంగా నిజమూ వుంది. యేమాత్రం చలించనట్టుగా చిన్నగా నవ్వుతూ, "అయితే బాగుణ్ణు. అప్పుడు యావత్ ప్రపంచంలోనూ శాంతిని స్థాపిస్తాను" అన్నారావిడ.

తనకంటూ ఒక నిర్దిష్టనియోజక వర్గంలేదు, యేరకమైన బలమూ లేదు నిరుపేదల అండ తప్ప. అలాంటి మదర్ థెరెసా మురికి వాడల్లోకి వెళ్లినంత సునాయాసంగా

అతిశక్తివంతమైన అధికార ప్రాంగణాల్లోకి వెళ్ళగలుగుతారు. కలకత్తాలో "యేవేళపుడేనా" సరే పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి ఆఫీసులోకి వెళ్లగలరు. అంతకంటే పలుకుబడి కల కార్యాలయం కలకత్తాలో లేదు. ఆయన ఆవిడ యేది అడిగినా కాదనరన్న విషయం కలకత్తాలో అందరికీ తెలుసు. ముఖ్యమంత్రి మార్క్సిస్టు, నిరీశ్వరవాది. మదర్ థెరెసాకి ఈశ్వరుడే సర్వస్వం. తనకీ, మదర్ థెరెసాకీ లక్ష్యాలలో ఉమ్మడిగా వున్నదేమిటని ఓసారి ఆయన్ని అడిగేరట. "పేదల పట్ల ప్రేమ మా యిద్దరికీ సమానంగా వుంది" అని ఆయన జవాబు చెప్పేరట. కొన్నేళ్ల కితం గుండె జబ్బువస్తే ఆయన హాస్పిటల్లో చేరారు. ఆవిడ వెళ్లి ఆయన్ని పరామర్శించేరు. ఆయన కోలుకోవాలని సిస్టర్లూ, తనూ కలిసి ప్రార్థనలు చేశారు.

ఆవిడ యెప్పుడు కావాలంటే అప్పుడు ఇందిరాగాంధీ, తర్వాత ప్రధానమంత్రి అయిన ఆవిడ కొడుకు రాజీవ్ ఆవిడను కలుసుకునేవారు. ఆవిడకు ఇందిరాగాంధీతో మరీ ఆత్మీయబంధం వుండేది. "ఆవిడ్ని కలుసుకోవడం యెంతో వినయంగా వున్న భావన కలుగుతుంది. మార్దవం, ప్రేమశక్తి యెంత ఘనమైనవోనన్న అనుభూతి కలుగుతుంది" అని ఇందిరాగాంధీ ఓ సారి రాశేరు. ఎమర్జన్సీ కాలంలో బలవంతపు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు జరిగేయి. మదర్ థెరెసా వాటిని వ్యతిరేకిస్తూ రాశేరు, మాట్లాడేరు. అప్పుడు అభిప్రాయ భేదాలు తలెత్తాయి. అయినా 1977 ఎన్నికల్లో ఇందిరాగాంధీ ఓడిపోయి, అధికారం పోగొట్టుకున్నప్పుడు మదర్ థెరెసా ఆవిడ్ని చూడ్డానికి వెళ్ళేరు. యెందుకంత శ్రమ అని యెవళ్లో అడిగితే "ఆవిడ నా స్నేహితురాలు" అని బహిరంగంగా చెప్పారు. అదే ముక్కను ఒకటికీ రెండుసార్లు మళ్లీ మళ్లీ అన్నారు. మదర్ థెరెసా ఆప్యాయతలకీ, రాజకీయాలకీ యే సంబంధమూ లేదు.

మదర్ థెరెసాని స్వాగతిస్తూ తలుపులు తెరుచుకునేది ఒక్క భారతదేశంలోనే కాదు. ఆవిడ యెక్కడకు వెళ్లినా, యే నగరపెద్దని కలవాల్సిన అవసరం పడినా, దేశాధిపతిని కలవాలనుకున్నా వెంటనే ఆవిడకు సాదర స్వాగతం లభిస్తుంది. ఆవిడ తన స్వలాభం కోసం రారని ప్రతి ఒక్కళ్లకీ తెలుసు. పేద ప్రజల సమస్యలనే తీసుకువస్తారు. సిస్టర్ల కష్టాలేమన్నా వుంటే తెలియజెయ్యడానికి వస్తారు. ఫ్రాన్స్ అధ్యక్షుడు మిట్టెరాన్, బ్రిటిష్ ప్రధానమంత్రి, అమెరికా అధ్యక్షుడిగా వున్న రీగన్, ప్రస్తుత అధ్యక్షుడు బుష్, బెల్జియం రాజు, స్పెయిన్ రాజు-యిలా చెప్పుకుంటూ పోవచ్చు. ప్రపంచాధినేతలే అంతా. మదర్ థెరెసాతో వున్నట్టు నలుగురికీ తెలియడం వాళ్లకో ప్రతిష్ట. దేశాధిపతులూ, ప్రభుత్వనేతలూ యెప్పుడన్నా చిక్కుల్లో వుంటే, ఆవిడకు చెప్పుకున్న సందర్భాలూ వున్నాయి. అగ్రభాగంలో వుండడం వల్ల యెక్కువగా ఒంటరితనం యేర్పడుతూ వుంటుంది. అగ్రాసనం మీద వున్నవాళ్లకు మనసులో మాట చెప్పుకునే మనుషులు వుండరు.

ఫాదర్ వాన్ ఎగ్జిమ్ ఓ చిత్రమైన సంఘటన గురించి చెప్పారు. మదర్ థెరెసా పాకిస్థాన్ పూర్వ అధ్యక్షుడు జనరల్ జియాఉల్ హక్‌ని కలుసుకున్న సందర్భం. అక్కడి బిషప్ వొకళ్లు రమ్మనమంటే ఆవిడ పాకిస్థాన్ వెళ్ళారు. మన భారతీయ పాస్‌పోర్టు మీద వీసా కోసం ఢిల్లీలోని పాకిస్థాన్ ఎంబసీలో అప్లికేషన్ యిచ్చేరు. వాళ్లావిడకు వీసా యివ్వడమే కాదు, దేశంలో యెక్కడికేనా

వెళ్లి సందర్శించవచ్చని జనరల్ జియా ఉల్‌హక్ స్వయంగా ఆహ్వానం యిచ్చేడు. అందుగ్గాను తన విమానాన్నే వాడుకొమ్మని అన్నాడు. యెక్కడ కావాలనుకుంటే అక్కడ కాన్వెంట్‌లు పెట్టుకొమ్మన్నాడు. ఆవిడ ప్రపంచంలోని యే మూల నుంచి అయినా నన్స్‌ని తెచ్చుకోవచ్చు, ఒక్క భారతదేశం నుంచి తప్ప. "మదర్ థెరెసా ఆ విషయం గురించి పెద్దగా పట్టించుకుందని అనుకోను. యేమంటే, పాకిస్తాన్‌లో వున్న యీ మిషన్ సంస్థల్లో చాలామంది భారతీయ నన్స్ వున్నారు" అని ఫాదర్ వాన్ ఎగ్జిమ్ చెప్పేడు.

భారతదేశం యీ పొరుగున వున్న బంగ్లాదేశ్‌లో మహావిపత్తు సంభవించింది. మదర్ థెరెసా హుటాహుటీన అక్కడకు వెళ్ళేరు. 1991 మే నెలలో నేను కలకత్తాలో వున్నాను. ఆవిడను చూద్దామని వెళ్ళేను. బంగ్లాదేశ్ తీరప్రాంతంలో పెనుతుఫాన్ అల్లకల్లోలం సృష్టించింది. ఆ విషాదం యెంతటిదంటే 3,00,000 మంది జనం చనిపోయివుంటారు. అప్పట్లో మదర్ థెరెసా గుండె జబ్బునుంచి కోలుకుంటూ వున్నారు. అప్పుడే హాస్పిటల్ నుంచి బయటకు వచ్చారు. డాక్టర్లు వారిస్తూ వున్నా వినకుండా, ఆవిడ మూట ముల్లే సర్దుకుని అత్యవసరమైన మందులతో బంగ్లాదేశ్ వెళ్లారు.

తను వస్తున్నట్టు ఢాకాలోని సిస్టర్లకి సమాచారం అందించే వ్యవధి కూడా లేకపోయింది. అసలు యెవళ్ళకీ తెలీదు ఆవిడ రాక గురించి. అయినా, ఆవిడ వచ్చిన వార్త తెలిసిందో లేదో అంతర్జాతీయ సమాచార సాధనాలన్నీ ఆనన్ తుఫాన్ తాకిడికి గురైన ప్రాంతాలను సందర్శిస్తున్న సమాచారాన్ని ప్రపంచానికి అందించేయి. ఆవిడ పర్యటించినంత కాలమూ బంగ్లాదేశ్ ప్రధానమంత్రి బేగం ఖలీదా జియా ఆవిడ కూడా వున్నారు. వాతావరణం బాగాలేక వాళ్ల హెలికాప్టరు జరూరుగా కిందకి దిగాల్సి వచ్చింది. ఆ వార్త అన్ని ప్రసార సాధనాల్లోనూ వచ్చింది. కలకత్తా తిరిగి వచ్చేక ఆవిడ నాతో అన్నారు, "నే వెళ్లేను, సంతోషంగా వుంది. యెంత దారుణం, యెంత విషాదం. యిప్పుడు చాలా చాలా ముఖ్యమైంది ఆహారం మందులు పంపించడం. మంచినీళ్లని శుభ్రం చెయ్యడానికీ యేదన్నా పంపాలి. సాయం యెక్కడ అవసరమో అక్కడ మా సిస్టర్లు వున్నారు." తృతీయ ప్రపంచంలో ప్రకృతి పరమైన విషాదాలు కలుగుతూనే వుంటాయి. పాశ్చాత్యదేశాల్లో పైపై సానుభూతులే కురుస్తూ వుంటాయి గాని అసలు తీవ్రత వాళ్ళకు అందదు. ప్రసార సాధనాలు మదర్ థెరెసా విపత్తు స్థలాల్లో వున్న సందర్భాల్ని ప్రచారం చేసేటప్పటికి వెంటనే అక్కడివాళ్లు స్పందించేరు.

మరింత ఆసక్తికరమైన సంఘటన యింకోటుంది. ఎంపరర్ హెయిలీ సెలాసీని సైనిక తిరుగుబాటులో పదవీచ్యుతుణ్ణి చేశారు. మదర్ థెరెసా 1973 లో ఇథియోపియాలో ఓ మిషన్ శాఖను ప్రారంభించేరు. అదేమంత సునాయాసంగా జరగలేదనుకోండి. కష్టం మీద హెయిలీసెలాసీ కూతుర్ని కలుసుకుని, ఆమె ద్వారా ఎంపరర్‌ని సందర్శించేరు. మరీ ఆశలు పెట్టుకోవద్దని ముందే ఆవిడ్ని హెచ్చరించేరు. యేమంటే అనేక మతపర, సాంఘిక సంస్థలు ఇథియోపియాలో పుట్టుకొచ్చేయి. కాని యే ఒక్కటీ సవ్యంగా సాగలేదు. మదర్ థెరెసాకి కొత్తా యేమున్నానా, బోలెడు

అనుభవం వుంది. ఎంపరెర్ తలుచుకుంటే చాలు, యేదన్నా జరుగుతుంది అని ఆవిడకు తెలుసు. చక్రవర్తిని కలుసుకోవడానికి ముందు ప్రాసాద దళవాయితో మాట్లాడేరు.

"ప్రభుత్వం మీకు యేంచెయ్యాలి?"

"యేమీలేదు. అవస్థలు పడుతున్న పేద ప్రజానికానికి మా సిస్టర్లు సేవలందిస్తారని చెప్పడానికి వచ్చేను" అన్నారు మదర్ థెరెసా.

"సిస్టర్లు యేంచేస్తారు?"

"నిరుపేదలకు త్రికరణ శుద్ధిగా సేవ చేస్తారు."

"వాళ్ల యోగ్యతలు యేమిటి?"

"అనాథలకు, దిక్కులేని వాళ్ళకూ ప్రేమ, జాలి అందిస్తారు."

"మీ పంథా వేరేగా వున్నట్టుంది. ప్రజలకు మతబోధ చేస్తారా, మతం మార్పిడి చేస్తారా?"

"ప్రేమాభిమానాలతో మేం చేసే పని కష్టాలు పడే పేదలకు తమపట్ల దేవునికున్న ప్రేమని తెలియచేస్తుంది."

యెలాగైతేనేం మదర్ థెరెసాని చక్రవర్తి సన్నిధిలోకి తీసుకు వెళ్లారు. ఆయన నుంచి అనూహ్యమైన స్పందన వచ్చింది. ఆయన యెక్కువగా మాట్లాడలేదు.

"మీరు చేస్తూవున్న సత్కార్యాల గురించి విన్నాను. మీరు రావడం నాకు చాలా సంతోషంగా వుంది. సరే, మీ సిస్టర్లని ఇథియోపియాకి వచ్చి పని చేసుకోనియ్యండి."

1974 సెప్టెంబరు 12 నాటికి, యీ సంఘటన జరిగి నిండా యేడాది కాలేదు. 81 యేళ్ళ వయసున్న ఆ చక్రవర్తిని సైనిక తిరుగుబాటులో పదవీచ్యుతుణ్ణి చేశేరు. ఆయన కుటుంబాన్ని ఆడిస్ అబాబాలో ఖైదు చేశారు. జైల్లో పరిస్థితులు దుర్భరంగా వున్నాయి. దాంతో సర్వత్రా నిరసనలు వెలుగెత్తాయి. ఆఫ్రికా, యూరప్, తదితరదేశాల నాయకులు రివల్యూషనరీ ప్రభుత్వాన్ని అర్థిస్తూ లేఖలు రాశారు. ఆ రాజకుటుంబాన్ని మానవత్వపూరిత దృష్టితో చూడమని. హెయిలీ సెలాసీ, నిర్బంధంలో వుండగానే చనిపోయేడు. వాళ్లు జైల్లో వుండగా చూడ్డానికి ఒక్క తనకి మాత్రమే అనుమతి యిచ్చేరని మదర్ థెరెసా నాతో చెప్పేరు. తర్వాత కుటుంబ సభ్యులు విడుదల అవడానికి సాయపడ్డారు.

కాథలిక్ మతాధిపతి జాన్ పాల్--II తో ఆవిడ సంబంధాలు చాలా సహృద్భావంగా వుండేవి. ఆవిడ ఆయన్ని గురించి యెప్పుడు ప్రస్తావించినా "హలో ఫాదర్ " అనే అంటారు. నిజంగా తండ్రిలాగే ఆయన్ని చూస్తారు. ఆయన నిరాడంబరత్వాన్ని మెచ్చుకుంటూ వుంటారు. వాటికన్‌లో ఆయన మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కోసం జాగా యిచ్చినందుకు యెంతో కృతజ్ఞంగా వుంటారు. అక్కడ మిషనరీస్ వాళ్లు రోమ్‌లోగల అనాథలకు సూప్ కిచెన్ ప్రారంభించారు. పేదలు అక్కడా వున్నారని గుర్తించడానికి అది తోడ్పడింది. అంతేకాదు, వాటికన్ మహా సంపద్వంతమైంది, వైభవం కలది అన్న భ్రమని తొలగించడానికీ దోహదపడింది. యిద్దరూ స్లావ్ అనడం – ఆయన పోలిష్, ఆవిడ యుగోస్లావ్ అల్బేనియన్ – వల్ల వాళ్లిద్దరికీ

మంచి అవగావన యేర్పడిందా అన్న విషయం వూహాగానమే. పోప్‌కి ఆవిడంటే గొప్ప గౌరవం. చర్చి సంప్రదాయ విలువల్ని నీళ్లు నమలకుండా ఆవిడ సమర్థించడం ఆయన బాగా మెచ్చుకుంటారు.

1992 జనవరి 22 న వాటికన్‌లో పోప్‌ని కలిసే అదృష్టం నాకు కలిగింది ఆ సమావేశాన్ని మదర్ థెరెసాయే స్వయంగా యేర్పాటు చేశారు. ఆయన ప్రైవేట్ ఛాంబర్‌లోకి నన్ను తీసుకు వెళ్లారు. ఒక్కణ్ణే ఆయనతో కొన్ని క్షణాలు వున్నాను. ఆ సమయంలో మదర్ థెరెసా తీవ్రంగా జబ్బుపడి కాలిఫోర్నియా హాస్పిటల్లో వున్నారు. ఆవిడ కోలుకోవాలని పోప్ ప్రార్థనలు చేశారు. వెనక్కి తిరిగి కలకత్తా వెళ్లేటప్పుడు రోమ్‌లో దిగుతారని ఆశించారు. 1986లో కలకత్తా సందర్శించిన సందర్భాన్ని గుర్తుచేసుకున్నారు. ఆయన విమానాశ్రయం నుంచి యెకాయెకీ కాళీఘాట్‌కి వెళ్లారు. ఆయన ప్రతిమనిషి దగ్గరికీ వెళ్లారు– ఆశీర్వదించేందుకు మాత్రమే కాదు, స్వయంగా భోజనం, నీళ్లు అందించేరు. ఆ సందర్భం యెంత కదిలించేదిగా వుందో గుర్తుచేసుకున్నారు.

మదర్ థెరెసాకు ఆయన వాటికన్‌లో యిచ్చిన స్థలం ప్రస్తావన వచ్చింది. మేం కూర్చున్న చోటుకి దగ్గర్లోనే అది వుంది. "మదర్ థెరెసా అడిగితే నేను కాదంటానా?" యిచ్చినందుకు ఆయనకు సంతోషంగానే వుంది. క్రిస్టమస్ సందర్భంగాను, తనకు అవకాశం దొరికినప్పుడల్లానూ వెళ్లి స్వయంగా పేదలకు ఆహారం అందిస్తారు.

మదర్ థెరెసా తన ఆరోగ్యాన్ని యేం ఖాతరు చెయ్యకుండా అలా పనిచేస్తూనే వుంటారనీ, కొంచెం తగ్గించుకొమ్మని ఆవిడకు సలహా యివ్వగల వ్యక్తి తను ఒక్కరేననీ ఆయనతో అన్నాను. ఆయన నవ్వేరు. "తన పని విషయం వచ్చేటప్పటికి నా మాట ఆవిడ వినదు. అయినా చెప్పిచూస్తాను" అన్నారు.

ఆవిడ జోక్యం చేసుకున్న సందర్భాలన్నీ ఆవిడకు విజయం తెచ్చిపెట్టలేదు. తను చాలా గట్టిగా స్పందించిన అన్ని సందర్భాల్లోనూ ఆవిడ అధికార్లతో మాట్లాడేవారు. యెన్నోసార్లు ఉత్తరాలు రాశారు. ఆవిడ పట్ల వ్యక్తిగతంగా అందరికీ యెంత మన్నన వుందంటే, వెంటనే ఆవిడకు జవాబు వచ్చేది. అయితే ఆచరణలో పని అన్ని వేళలా జరిగేదికాదు. కొన్ని సమస్యలుంటాయి. వాటికి సంబంధించి ప్రభుత్వం ఒకలా చెప్పచ్చు. స్థానిక సంస్థలు ఒకలా చెప్పచ్చు. ప్రజలనుంచి వ్యతిరేకత కూడా రావచ్చు. కొన్ని సందర్భాల్లో సమస్యలు ఆవిడక్కూడా మించినవే అయి వుండచ్చు. అప్పుడు కూడా తను గనక గట్టిగా అనుకుంటే, ఆ సమస్య రాజకీయాలూ గీజకీయాలూ పట్టించుకోకుండా ఆవిడ జోక్యం చేసుకునేవారు. ఇరాక్‌కీ అమెరికాకీ ఘర్షణ వచ్చింది. మదర్ థెరెసా 1991 జనవరి 2న ఆ దేశాధ్యక్షులిద్దరికీ కలిపే ఒక ఉత్తరం రాశేరు. "తక్షణ పర్యవసానంగా యెవళ్లో ఒకళ్లు నెగ్గచ్చు, ఓడిపోవచ్చు, యీ యుద్ధంలో. మేమంతా భయకంపితులవుతున్నాం యీయుద్ధం పట్ల, అయినా అది మీ ఆయుధాలు తెచ్చిపెట్టే బాధ, కష్టం, నష్టం జీవితానికి యెంత దారుణమైనదో దాన్ని యెంత మాత్రమూ సమర్థించలేవు" అని రాశారు.* అనుకోని ఫలితం

* ఆ ఉత్తరం పూర్తి పాఠం అనుబంధం–IIలో వుంది.

యేమిటంటే— యుద్ధం ముగిశాక ఇరాక్ ఆరోగ్య శాఖామంత్రి నుంచి ఆవిడకు ఉత్తరం రావడం. యుద్ధం వల్ల అనాధలు, వికలాంగులు అయిన వాళ్లకు సహాయం చెయ్యమని సిస్టర్లని ఆహ్వానించేరు.

ప్రతివాళ్లూ గుర్తింపుకోసం తహతహలాడిపోతూవుంటారు. చాలా మంది దాన్ని సంపాదించడానికే తదేక దీక్షగా పాటుపడుతూ వుంటారు. యీ యుగం అలాంటిది. యీ నేపథ్యంలో, యీ యుగం యెంతో ఆబగా చూసే ప్రతీ దానికీ యేం పట్టనట్టు విరుద్ధంగా ఆవిడ వుండడం చిత్రం. తనకి యెన్ని అవార్డులు వచ్చాయో ఆవిడ పట్టించుకునే పట్టించుకోదు. కొన్నేళ్ళనాడు సిస్టర్లు ఆవిడకిచ్చిన అవార్డులు లిస్టు తయారు చేద్దామనుకున్నారు. అది అసంపూర్తిగానే వుండిపోయింది. యేమైనా అది పాతబడి పోయింది. ఆ పాతబడ్డంకూడా ఆ యేడాదిలోనే. ఆ యేడాది ఆవిడకు చిన్నా పెద్దా అవార్డులన్నీ కలిపి ఓ యిరవైదాకా వుంటాయి. సిస్టర్లు ఆ ప్రయత్నం మానుకున్నారు. సిస్టర్ ప్రెసిల్లాని (సాధారణ గణాంకాలు యీమె చూస్తుంది.) తన దగ్గర వున్న శ్రమభారాన్ని అంతట్నీ నాకు యిమ్మని యిటీవలే అడిగేను. ఆమె నిట్టూర్చింది. ఆఖరికి యేదో రికార్డు అందించింది. తను శాయశక్తులా పోగు చేసిందంతా అదే అని చెప్పింది. అప్పటికే అది రెండేళ్ళ నాటిది. యిందులో భావం స్పష్టమే: అవార్డులూ, సన్మానాలు నేను అంతముఖ్యం అని అనుకుంటే, నేనే వాటి లిస్టు తయారు చేసుకోవచ్చు! అదేమన్నా అంత తేలికా? ముసాయిదా లిస్టుకూడా కొన్ని పేజీలు దాటిపోయింది. ఆఖరికి నా కనిపించింది, అసలు యీ విషయానికి సంబంధించే మదర్ థెరెసా పేరు గిన్నిస్ బుక్‌లోకి యెక్కవచ్చునేమోనని.

మదర్ థెరెసాకు యే యూనివర్సిటీ చదువూ లేదు. అయినా గొప్పగొప్ప యూనివర్సిటీలన్నీ ఆవిడకు ప్రదానం చేసిన గౌరవ డాక్టరేట్లు యెన్నో. కేంబ్రిడ్జి యూనివర్సిటీ ప్రదానం చేసిన డివినిటో గౌరవ డిగ్రీ నుంచి శాన్ డియాగో యూనివర్సిటీ యిచ్చిన హ్యూమెన్ లెటర్స్ దాకా వున్నాయి డిగ్రీలు. హార్వర్డ్ యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. మహామహులందరూ నుంచి ఒకటే కరతాళధ్వనులు చేశారు. మద్రాస్ యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్ ఆఫ్ లా ప్రదానం చేసింది. శాంతినికేతన్ విశ్వభారతి యూనివర్సిటీ కూడా గౌరవ డాక్టరేట్ డిగ్రీ యిచ్చింది. శాంతినికేతన్ వ్యవస్థాపకులు రవీంద్రనాధ్ టాగూర్. యూనివర్సిటీలు యెక్కడ ముందు వుండి పోతాయోనని చాలా అమెరికన్ నగరాలు ఆవిడకు తాళాలు యిచ్చేయి. మియామీ, స్కారన్‌టన్ (పెనిసిల్వేనియా), టోలేడ్ (ఓహియో), న్యూయార్క్, వాషింగ్టన్, నెవార్క్ (న్యూజెర్సీ), శాన్‌ఫ్రాన్‌సిస్కో, శాన్‌బోస్ నగరాలు వీటిలో వున్నాయి. అసంఖ్యాక పత్రికలు వాటి సాంవత్సరిక ఎంపికల్లో ఆవిడను “యీ మేటి మహిళ” గా యెన్నుకున్నారు. మూడు సంవత్సరాలు వరసగా “గుడ్ హౌస్ కీపింగ్” అన్న పత్రిక జాకీకెన్నడేని, మడోన్నాని, క్వీన్ ఎలిజబెత్‌ని కాదని ఆవిడ్ని “మోస్ట్ ఎడ్‌మైర్డ్ వుమన్”గా ప్రకటించింది. ముడతలు పడిన శరీరం, చీర కట్టుకున్న వృద్ధ మహిళ. ఆ చీర యింతా చేస్తే ఒక డాలరు ఖరీదు చెయ్యదు. అలాంటి ఆవిడను, దుస్తుల డిజైనర్, ఫ్యాషనబుల్ గృహాల డిజైనర్, చక్కని శరీర ఛాయ కోసం ప్రకటనలే ప్రకటనలు గుప్పించే పత్రిక పాఠకుల

నుంచి గొప్ప కానుక కదా అవిడకు! అవిడ గౌరవార్థం స్వీడన్‌లో, భారతదేశంలో అవిడ బొమ్మతో తపాలా బిళ్ళలు విడుదల చేశారు. హాలండ్ దేశం వెనక బడిపోకూడదన్నట్టు ఒక తులిప్ పుష్పానికి అవిడ పేరు పెట్టింది.

యేమైనా అవిడ కార్యకలాపాలకి శ్రీకారం చుట్టిన తర్వాత పద్నాలుగేళ్ళకు మొట్టమొదట గుర్తింపు ప్రభుత్వం నుంచి వచ్చింది. యిది అవిడ పుట్టిన దేశంకాదు, యిష్టాపత్తిగా పౌరసత్వం స్వీకరించిన దేశం. 1962 జనవరి 26న ప్రభుత్వం గౌరవపురస్కారంగా "పద్మశ్రీ" అవార్డును ప్రదానం చేసి లిస్టులో అవిడ పేరు చేర్చింది. రిపబ్లిక్ దినోత్సవ అవార్డులు అవి. "పద్మశ్రీ" బిరుదు అది భారతదేశం జన్మస్థలం కాని పై వాళ్ళకి యీ పురస్కారం యివ్వడం అదే ప్రథమం. దేశాధ్యక్షుడి నుంచి అవార్డు తీసుకుందుకు ఢిల్లీ రమ్మని ఆహ్వానం వచ్చింది. మొట్టమొదట అవిడ యిష్టపడలేదు. ఆ అవార్డుకు తగ్గ కృషి యేదీ తాను చెయ్యలేదని అవిడ భావన. దాన్ని అంగీకరించమని కలకత్తా ఆర్చ్‌బిషప్ అవిడకు సలహా యిచ్చేడు. పేదలకు గుర్తింపు అది. ఆ యేడు సెప్టెంబరు నెలలో అవిడ రాష్ట్రపతి భవన్‌కి వెళ్ళింది. శోభాయమానమైన దర్బార్ హాల్లోకి అవిడ్ని తీసుకువెళ్లారు. అంతకు ముందు కాన్వెంట్ నుంచి లైమూజిన్ కార్లో తీసుకువెడతామంటే అవిడ వద్దన్నారు. ధగద్ధగాయమానంగా మెరిసిపోయే రాష్ట్రపతి అంగరక్షక దళం, అశ్వికదళం బారులు తీరి వుండగా "అంబులెన్స్ కమ్ జనరల్ పర్పస్" వ్యాన్‌లో వెళ్ళారు.

ప్రధానమంత్రి జవహర్‌లాల్ చెల్లెలు విజయలక్ష్మి పండిట్ అప్పుడు అక్కడ వున్నారు. అవిడ బ్రిటన్‌లో భారత హైకమీషనర్‌గా పనిచేశారు. ఆ ఉత్సవం యెలా జరిగిందో అవిడ కళ్ళకు కట్టినట్లు వర్ణించేరు. "చీరకట్టుకున్న నన్ వినయం మూర్తీభవించినట్టు వుంది. వేదిక దగ్గరకు వెళ్ళింది. అవార్డు తీసుకున్నారు. ఒక రోగిష్టి శిశువునో, మృతి చెందుతూవున్న మనిషినో చేతుల్లో పట్టుకున్నట్టుగా అవిడకు అనిపించినట్టుంది. మాలో వెర్రి ఉత్సాహం చెలరేగింది. ప్రెసిడెంట్ కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. తిరిగి యింటికి వెళ్ళిపోయేటప్పుడు 'యెంత కదిలించేటట్టు వుందా సందర్భం' అని మా అన్నయ్యతో అన్నాను. 'నీకేమని పించిందో నాకు తెలీదు. కానీ నేను కళ్ళనీళ్ళు తిరక్కుండా ఉగ్గబట్టి ఆపుకున్నాను' అన్నాడాయన."

మదర్ థెరెసా కలకత్తా తిరిగి వచ్చేరు. రిబ్బన్ కట్టిన ఆ పతకాన్ని మేరీమాత విగ్రహానికి మెడలో వేశారు. ఆ చిన్న విగ్రహం నిర్మల్ హృదయంలో ఓ అద్దాల పీటికలో వుంది. తనకే అగౌరవం దక్కింది అన్న భావన యీషణ్మాత్రంగా కూడా అవిడ మనసులోకి రానివ్వలేదు. యివాళ ఆ విగ్రహానికి యెన్నో పతకాలు అలా వేసివున్నాయి. అయినా ఆ మొదటి దానికే ఆ మాత అర్హురాలు అని మదర్ థెరిసా విశ్వాసం.

ఆ తర్వాత కొన్ని నెలలకే రామన్ మెగాసెసె అవార్డు ప్రకటించారు. అది సరిగ్గా అదునులో వచ్చినట్లయింది. కలకత్తా ఆర్చ్‌బిషప్ అధికార పరిధికి బయట తన మిషనరీ శాఖలు తెరుచుకోవచ్చని 1960 లో మొదటిసారి అనుమతి వచ్చింది. అవిడ తాజ్‌మహల్ నగరం ఆగ్రాలో కుష్ఠువ్యాధి కేంద్రాన్ని స్థాపించా లనుకున్నారు. నిధులు లేక ఆ కార్యక్రమాన్ని వాయిదా వేసుకోవాల్సి వస్తోంది అని అవిడ సిస్టర్స్‌తో అన్నారు. సరిగ్గా అలా అన్న రోజునే ఆ అవార్డు యిస్తున్న ప్రకటన వచ్చింది.

దాంతో యాభైవేల రూపాయలు పారితోషికం ముడుతుంది. నిజంగా ఆ ప్రకటన పారితోషికం దైవికంగా వచ్చినవే. అంతర్జాతీయ పోప్ జాన్ XXIII బహుమతి (197) పారితోషికం యిరవై ఒక్కవేల అయిదు వందల అమెరికన్ డాలర్లు యిదేవిధంగా శాంతినగర్ కుష్టుకేంద్రానికి ఉపయోగపడ్డాయి. దీని తర్వాత వెంటనే జోసెఫ్ కెన్నడే జూనియర్ ఫౌండేషన్ అవార్డ్ వచ్చింది. మానసిక వ్యాధులు గురించి పరిశోధన చేయించడం ఆ ఫౌండేషన్ లక్ష్యం. వాషింగ్టన్‌లో ఓ ఫంక్షన్ జరిగింది. అక్కడికి కెన్నడీ కుటుంబీకులంతా హాజరయ్యారు. మదర్ థెరెసా ఆ పురస్కారం గ్రహించాలి. పారితోషిక పదిహేనువేలు అమెరికన్ డాలర్లు. ఆ డబ్బుతో ఆవిడ మానసిక వ్యాధులతో సతమతమయ్యే పిల్లల చికిత్సాకేంద్రాన్ని స్థాపించారు. అది కలకత్తా డమ్‌డమ్‌లో వుంది. దానికి ఆవిడ నిర్మలా కెన్నడీ హోమ్ అని పేరు పెట్టారు.

బ్రిటిష్ రాచరికం యిచ్చే అత్యున్నత పురస్కారం ఆర్డర్ ఆఫ్ మెరిట్ 1983 నవంబరు 24 ఎలిజబెత్ రాణీవారు మదర్ థెరెసాకు యిచ్చారు. దాన్ని 1920 లో స్థాపించారు. యిరవైనాలుగు మందికి మాత్రమే అది పరిమితం. దాన్ని ప్రదానం చెయ్యడం రాణీవారి స్వంతహక్కు. అసలు దాన్ని ప్రదానం చేసింది ఆ తర్వాతనే! 1983లో కామన్‌వెల్త్ హెడ్స్ ఆఫ్ గవర్నమెంట్ సమావేశానికి రాణీ వచ్చారు. అప్పుడు దీన్ని ప్రదానం చేశారు. రాష్ట్రపతి భవన్ రోజ్‌గార్డెన్‌లో జరిగిన సభలో అందించేరు. ప్రపంచంలో మహా మహా సంపన్నురాలైన ఒకరు మూడుచీరలు మాత్రమే తన సొంతం అని చెప్పుకునే మరొకరికి ప్రదానం చేశారు. ఆ కార్యక్రమం అయిపోయేక వాళ్ళిద్దరూ కొన్నిక్షణాలు యేకాంతంగా మాట్లాడుకున్నారు. యీ పుస్తకం రాసే ముందు నేను విషయాన్ని సేకరిస్తున్నాను గదా– ఆ వృద్ధ మదర్ థెరెసాను అడిగాను ఎవరిగురించి మాట్లాడుకున్నారని. "ఆవిడ కొడుకు గురించి," అన్నారు మదర్ థెరెసా. "కొడుకా?" అన్నాను నేను. యే కొడుకు గురించి? ఆవిడకు ముగ్గురు కొడుకులు. "ఓహ్! ఆవిడకు ఒక్కకొడుకే అనుకున్నాను నేను," అన్నారు. "ప్రిన్స్ ఛార్లెస్ గురించి మాట్లాడుకున్నాం. మనం చేస్తూవున్న పనంటే ఆయనకెంత అభిమానమో చెప్పేరు. అంతకు ముందు కొన్నేళ్ళు క్రితం ఆయన నిర్మలా శిశుభవన్ సందర్శించేరు." ఆ సమయంలో ఆయనా తనతో కలిసి ప్రార్థనల్లో పాల్గొన్నారు.

ప్రిన్సెస్ డయానాకు మదర్ థెరెసాను కలుసుకోవాలనీ, ఆవిడ చేస్తూ వున్న పని గురించి తెలుసుకోవాలనీ ఆతృతగా వుండేదట. 1992 ఫిబ్రవరిలో ఆవిడ ప్రిన్స్ ఛార్లెస్‌తో కలిసి భారతదేశంలో అధికారికంగా పర్యటించేరు. అప్పుడు ఆవిడ మదర్ థెరెసా మిషన్‌ని సందర్శించేందుకు కార్యక్రమం యేర్పాటైంది. అయితే డయానా మదర్‌ని కలవలేకపోయారు. మదర్ (మెక్సికో, తిజువానాలో మిషన్స్ సందర్శించడానికి వెళ్ళి తీవ్రమైన గుండె నొప్పికి గురయ్యేరు. అదృష్టవశాత్తూ బయటపడ్డారు) కలకత్తాకు వస్తూవస్తూ దారిలో రోమ్‌లో మళ్ళీ గుండె జబ్బుకు గురయ్యేరు. ప్రిన్సెస్ డయానా కార్యక్రమంలో లేకపోయినా, లండన్‌కి తిరిగి వెళ్ళేటప్పుడు రోమ్‌లో దిగి ఆవిడ్ని పరామర్శించేరు. ఆ రకంగా తన అభిమానాన్ని ప్రకటించేరు.

రాజ కుటుంబంలో మొదటగా మదర్ థెరెసాను కలుసుకున్నవారు ప్రిన్స్ ఫిలిప్. 1973 ఏప్రిల్ 25 న ఆవిడ లండన్ వెళ్ళేరు. టెంపుల్‌టన్ ప్రైజ్ ఫర్ ప్రోగ్రెస్ యిన్ రెలిజియన్ తొలి పురస్కారాన్ని అందుకుందుకు వెళ్ళేరు. అదీ సందర్భం. ప్రిన్స్ ఫిలిప్ ఆ అవార్డు ప్రదానం చెయ్యడానికి అంగీకరించారు. "మదర్ థెరెసాని ఆవహించిన అద్భుత శక్తి గురించి" ఆయన ఆ సందర్భంలో చెప్పారు. విశ్వాసం బలంగా వున్నప్పుడు ప్రజలు యెంతటి గొప్ప పనులు చెయ్యగలరో తన జీవితాన్నే ఉదాహరణ ప్రాయం చేసి ఆవిడ చూపించేరు అని ఆయన ప్రస్తుతించేరు. "యే ప్రమాణాల రీత్యా చూసినా ఆమె చేస్తున్నది మహత్కార్యం. ప్రపంచానికి యివాళ యిలాంటి మంచితనం యెంతైనా అవసరం. యిలాంటి కార్యరూప కరుణ అవసరం." విలువ రీత్యా టెంపుల్‌టన్ ప్రైజ్ నోబెల్ ప్రైజ్ కంటే యెక్కువే. "నలుదిశలా మానవాళికి దైవ జ్ఞానాన్ని ప్రోత్సహించడమే" దాని ఆశయం. 2000 పేర్లు ప్రతిపాదనలోకి వచ్చేయి. ఎనభైదేశాల నుంచి ప్రపంచంలోని ప్రసిద్ధ మతాల నుంచి తొమ్మిది మంది న్యాయ నిర్ణేతలు కమిటీలో వుంటారు. వాళ్ళు మదర్ థెరెసాను యెంపిక చేశారు. "భగవంతుని గురించిన జ్ఞానాన్నీ, భగవంతుని పట్ల ప్రేమనీ విస్తృతమూ, గాఢమూ చెయ్యడంలో ఆవిడ కృషి చేశారు. ఆ రకంగా దేవుని ప్రతి ఫలించే జీవన ప్రమాణ అన్వేషణను ముందుకు తీసుకు వెళ్ళారు." అని పురస్కార ప్రదాన పత్రంలో పేర్కొన్నారు. నాలుగేళ్ళ తర్వాత 1977 లో ప్రిన్స్ ఫిలిప్ ఆవిడకు కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం తరఫున గౌరవ డాక్టరేట్ ఆఫ్ డివినిటీ ప్రదానం చేశారు. అప్పుడాయన ఆ యూనివర్సిటీ ఛాన్సెలర్. రోమ్ నుంచి చర్చి ఆఫ్ ఇంగ్లాండ్ విడిపోయేక రిఫర్మేషన్‌కి మతపర కేంద్రంగా ఆ యూనివర్సిటీ పని చేసిన విషయం అందరికీ తెలిసినదే. బహుశా యీ కారణంగానే మదర్ థెరెసా పని గట్టుకుని ఆ డిగ్రీ తీసుకుందుకు ఇంగ్లాండ్ వెళ్ళేరు. అక్కడ ఆవిడ మామూలుగా చేసే ఉపన్యాసాల కంటే యెక్కువగా ప్రసంగించేరు. యూఖారిస్టు గురించి మాట్లాడేరు. "రెవరెండ్ మదర్ యిక్కడకు రావడం మా అందరికీ సంతోషదాయకంగా వుంది. తన జీవితం గురించి చెప్పమంటే, అదేమంత ముఖ్యంకాదని ఆవిడ జవాబు చెపుతారు" అని అంతకుముందు ప్రిన్స్ ఫిలిప్ తన ఉపోద్ఘాతంలో పరిహాసంగానే అన్నట్టు చెప్పారు. జనం విరగబడి చప్పట్లు కొట్టారు.

"నాకేం యోగ్యత వుంది?" యిది పురస్కారాల్లోకల్లా పరాకాష్ఠ అయిన నోబెల్ బహుమతిని ఆవిడకు ప్రకటించినప్పుడు మదర్ థెరెసా అన్న మొదటి మాటలు. తను పేదల పక్షాన ఆ బహుమతిని గ్రహిస్తానని ఆవిడ నిర్వాహకులకు కబురు చేశారు. నార్వేజియన్ నోబెల్ కమిటీ అందుకు సరేనంది. అంతకుముందు దాకా కమిటీలు యెంపికచేసిన పేర్లు చాలామందికి నిరుత్సాహం కలిగించాయి. యేమంటే, ఆ పేర్ల వాళ్ళందరూ నిజమైన శాంతిదూతలు కారు. శాంతి బహుమానాన్ని మళ్ళీ ఆల్బర్ట్ బుధిలీ, ఫ్రిడ్జ్ ఆఫ్ నాన్సెన్, ఆల్బర్ట్‌ష్వైట్జర్, మార్టిన్ లూథర్ కింగ్ (జూ) స్థాయి ప్రమాణాలకు తీసుకువెళ్ళాలి అని వాళ్లకి తోచినట్టుంది– మదర్ థెరెసా యెంపిక ఆ భరోసా యిస్తున్నట్టు అయింది. రాజకీయాలు ఒక్కటే శాంతికి మార్గం కాదని హామీ యిస్తున్నట్టు కనిపించింది. ఆ గౌరవాన్ని అందుకుందుకు అంగీకరించి ఆ బహుమాన హోదాని పెంచినవారు మదర్ థెరెసా అని చాలా వుంది భావించేరు.

సిస్టర్ ఆగ్నెస్, సిస్టర్ గెర్ట్రూడ్ వెంటరాగా ఆవిడ 1979 డిసెంబరు 9 న ఓస్లో చేరుకున్నారు. అప్పటి దాకా ఆవిడ గురించి విననివారున్నారేమో కాని ఓస్లోలో ఆవిడ వున్న నాలుగు రోజుల్లోనూ పరిస్థితి మారిపోయింది. అక్కడ దిగిం దగ్గర్నుంచి తిరుగు ప్రయాణం అయేదాకా ప్రసార సాధనాల దృష్టి అంతా ఆవిడ మీదనే లగ్నం అయిపోయింది. వందలాది ఫోటోగ్రాఫర్లు, టీ.వి. సిబ్బంది, పత్రికా విలేకర్లు ఓస్లోలో ఆవిడ ప్రతి కదలికనీ ప్రసారం చేశారు. యిది జరిగి చాలా యేళ్ళయిందికదా! అయినా యివాళ కూడా ఆవిడకు అది మనసులోకి వస్తే భయం వేస్తుంది. "అసలా ప్రచారానికే నేను యెకాయెకీ స్వర్గానికి పోయివుందును" అంటూ వుంటారు.

1979 డిసెంబరు 10. నార్వే రాజు, దౌత్యాధిపతులు, ఉన్నతస్థాయి అధికారులు, పత్రికా సామ్రాజ్య దూతలు కొన్ని వందల మంది అక్కడ చేరారు. అప్పుడు ఓస్లో యూనివర్సిటీ ఓలామాగ్నాలో నడుం వంగి, చీరకట్టుకున్న యీ మహిళకు నోబెల్ బహుమతి (90 వేల పౌండ్లు) ప్రదానం చేశారు. ప్రొఫెసర్ జాన్ సాన్స్ నార్వీజియన్ నోబెల్ కమిటీ ఛైర్మన్. ఆయన మనసుల్ని కదిలించేటట్టు ఆవిడ గురించి చెప్పారు:

"ఆవిడ చేస్తున్న కృషిలో కవికేతురాయి లాంటిది వ్యక్తి పట్ల గౌరవం, వ్యక్తుల విలువ, హోదా. పరమదౌర్భాగుల్లో అనాథలు, మరణశయ్యపై వున్న దిక్కులేనివాళ్ళు, పరిత్యక్త కుష్ఠురోగులూ ఆవిడ నుంచీ, ఆవిడ సిస్టర్ల నుంచీ సాదరంగా కరుణను అందుకున్నారు. ఆ కరుణలో యేదో అనుగ్రహపూర్వక దృష్టిలేదు. ఆ కరుణ మానవునిలో క్రీస్తును గౌరవిస్తున్న భావన మీదనే ఆధారపడింది... అంగీకృతఅర్థంలో బహుమతి గ్రహీత యిచ్చేవాడుగా యెంతో ఆనందించేవాడుగా ఆవిడ దృష్టిలో వుంటాడు. యివ్వడం – అంటే మనలో ఎంత అయినదాన్ని – అసలైన ఆనందాన్ని అందిస్తుంది. యివ్వడానికి అనుమతీ పొందిన వ్యక్తే అత్యంత విలువైన కానుకను అందుకుంటున్నట్టు. యితరులు కాతాదారులని, వాడకందారులని చూసేచోట ఆవిడ తోటి సేవకుల్ని చూస్తారు. ఆవతలివాళ్ళు కృతజ్ఞతా భావబద్ధులై వుండాలని ఆశించే సంబంధంకాక, పరస్పరం అవగాహన గౌరవం, ఆర్ద్రపూరిత మానవ సుసంపన్న కలయిక వుండే సంబంధం యిది... యిదీ మదర్ థెరెసా, సిస్టర్లు గడిపే జీవితం – పేదరికం నిండిన జీవితం. అహోరాత్రాలు శ్రమించే జీవితం. యితర సుఖసంతోషాలకు తావులేని జీవితం. అయితే అత్యంత విలువైన జీవితం."

సాన్స్ యిలా ముగించాడు: "నార్వీజియన్ నోబెల్ కమిటీ నిర్ణయానికి ప్రేరణ కలిగించిన ఉద్దేశాలను నిర్వచించడానికి వరల్డ్ బ్యాంక్ ప్రెసిడెంట్ రాబర్ట్ ఎస్. మాక్‌నమార్ చెప్పిన మాటల కంటే యెక్కువ విలువైన వాటిని చెప్పలేం. "మదర్ థెరెసా నోబెల్ శాంతి బహుమానానికి అర్హురాలు. యేమంటే ఆవిడ మానవ గౌరవాన్ని భంగపరచలేమని ధృవపరచి చాలా మౌలికంగా శాంతికి దోహదం చేస్తున్నారు" అన్నాడు ఆయన."

మదర్ థెరెసా పురస్కారాన్ని స్వీకరిస్తూ ఉపన్యసించేరు. ఆ ఉపన్యాసమూ ఆవిడ మామూలు పద్ధతిలోనే ప్రార్థనతో ఆరంభమైంది. ఆవిడ ఉపన్యాస ప్రతుల్ని

ముందుగానే ప్రతి సీట్లోనూ వుంచేరు. ఆవిడ అభ్యర్ధన మేరకు సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసి అమర శాంతిప్రార్థనలో ఎనిమిది వందల గొంతుకలు తమవంతు కలిపేయి. అక్కడ చేరిన శ్రోతలు నల్లని టైలు, లాంఛనంగా ధరించాల్సిన ఉడుపులు వేసుకున్నారు. ఆవిడ తన సాధారణ శైలిలో పేదల దృశ్యాన్ని, వాళ్ల స్వార్థరాహిత్యాన్ని, దేన్నన్నా ఎంచుకునే దృష్టిని అలాంటి శోభయమానమైన శ్రోతలకి వర్ణించి చూపించారు. వీథిలో కనిపించిన స్త్రీని రక్షించిన వైనం వివరించి చెప్పేరు. ఆ స్త్రీ జీవితం చిట్టచివరి అంచున వుంది. మదర్ థెరెసా ఆమెని కాళీఘాట్ హోమ్‌కి తీసుకెళ్ళారు. తనే ఆ స్త్రీని చూసుకుంటానని సిస్టర్స్‌కి చెప్పారు. "నా ప్రేమ చెయ్యగలిగినదంతట్నీ నేను ఆ స్త్రీకి చేశాను. ఆమెను మంచం మీద పడుకోబెట్టాను. ఆవిడ వదనం మీద యెంత చక్కని చిరునవ్వు విరిసిందని! ఆమె నా చేతిని అందుకుంది. ఒక్కటే ఒక్కమాట అంది, "కృతజ్ఞురాల్ని. చనిపోయింది" అని మదర్ చెప్పేరు.

ఆమె యింకా యిలా చెప్పేరు: "ఆమె సమక్షంలో నా అంతరాత్మను శోధించుకోకుండా వుండలేకపోయేను. నేనే ఆమె స్థానంలో వుండి వుంటే యేమని వుండేదాన్ని? నా జవాబు చాలా సరళం. కొంచెం నా పట్లనే శ్రద్ధ పట్టి వుండేందుకు ప్రయత్నం చేసి వుండేదాన్ని. 'నాకు ఆకలిగా వుంది, చనిపోతూ వున్నాను, చలిగా వుంది, బాధగా వుంది' అనో, మరి అలాంటి మాటల్నో అని వుండేదాన్ని. కాని ఆమె కృతజ్ఞతాపూర్వక ప్రేమను నాకు యిచ్చింది."

పాశ్చాత్య దేశాల్లో వున్న పేదరికం గురించి ఆమె చెప్పేరు. "ప్రపంచవ్యాప్తంగా, పేదదేశాల్లోనేకాదు, పాశ్చాత్యదేశాల్లోవున్న పేదరికాన్ని తొలగించడం నాకు కష్టతరం అనిపించింది. వీథిలో నుంచి యెవరినన్నా కాపాడతాననుకోండి అతనికి ఆకలిగా వుండచ్చు. అన్నం పెడతాను, ఓ రొట్టె యిస్తాను. తృప్తి పరచాననే భావన కలుగుతుంది. ఆ ఆకలి తొలగించేను కదా! యెవళ్ళన్నా నిరాదరణకు గురైతే, తను యెవళ్ళకీ అక్కర్లేదు అన్న భావన వాళ్ళకి కలిగితే, తనని యెవరూ ప్రేమించడం లేదు, తను భీతావహుడై పోయేడు, సమాజం నుంచి బహిష్కృతుడయిపోయేడు అన్న భావన కలిగితే ఆ లేమి అంతగా మరేదీ గాయపరచదు. అలాంటిదాన్ని తొలగించడం నాకు చాలా కష్టం అవుతుంది. మా మిషన్ సిస్టర్లు పాశ్చాత్య దేశాల్లో అలాంటి వాళ్ళ మధ్యనే కృషిచేస్తున్నారు."

నోబెల్ కమిటీ అవార్డుల ప్రదానం సందర్భంగా ఘనమైన విందు యివ్వడం ఆచారం. దాన్ని రద్దు చెయ్యమని మదర్ థెరెసా నోబెల్ కమిటీని కోరేరు. అందుకు బదులు అలా మిగిల్చిన డబ్బును నిజంగా ఆ కడుపుకు నాలుగు మెతుకులు అవసరమైన వాళ్ళకు ఖర్చుపెట్టమని అడిగేరు. యీ ప్రతిపాదన దాదాపు బహుమాన ప్రదానం అంతగా ప్రజల మనసుల్ని దోచుకుంది. ప్రేమానురాగాలు కట్టలు తెంచుకుని పారేయి. దాంతో విందు రద్దు ద్వారా మిగిలిన మొత్తాన్ని మించి వచ్చింది. స్వీడన్‌లో, నార్వేలో, యూరప్‌లో యితరచోట్లా సాధారణ పౌరులందరూ, చిన్నపిల్లల్తో సహా – వాళ్ళు దాచుకున్న పాకెట్‌మనీని వాళ్ళు యిచ్చేరు – 36వేల పౌండ్లు పోగుచేసి యిచ్చారు. దీనికి విందు ఖర్చు మూడువేలు చేరిస్తే దగ్గరదగ్గర అవార్డు మొత్తంలో

సగందాకా కూడినట్టు అయ్యింది. బహుమతి డబ్బును యెలా ఖర్చు చెస్తారు అని ఆవిడ్ని అడిగేరు. "నా మనసులో అది యిప్పటికే ఖర్చయిపోయింది" అన్నారావిడ నవ్వుతూ.

ఆవిడ కలకత్తా తిరిగి వచ్చారు. మేళతాళాలతో స్వాగత సన్నాహాలు తయారుగా వున్నాయి. భారతదేశంలో మొదటిసారి నోబెల్ బహుమతి రవీంద్రనాథ్ ఠాగూర్‌కి వచ్చింది. తర్వాత ప్రొఫెసర్ సి.వి. రామన్‌కి వచ్చింది. నోబెల్ బహుమతి అందుకున్న మూడవ వారు మదర్ థెరెసా. "సంతోషసాగరంలో కలకత్తా" అని "స్టేట్స్‌మన్" పత్రిక పతాక శీర్షిక పెట్టింది. ఆ పత్రిక అది నుంచి ఆవిడ కార్యకలాపాలని గురించి రాస్తూనే వుంది. ఉత్తరాలు కుప్పలుతెప్పలుగా వస్తున్నాయి. టెలెగ్రామ్‌లు వరదలా వస్తున్నాయి. టెలెఫోన్ కాల్స్‌కి విరామమే లేదు. యిక పత్రికలు, టీ.వి. వాళ్ళు సరేసరి. మదర్ హౌస్ దగ్గరే కాపువేశారు. వీటన్నిటికీ ఆవిడ జవాబు ఆవిడ సహజ ధోరణిలోనే వుంది. ఒక నెల దాకా యివతలికి రానే రాలేదు. ఆవిడ వచ్చేటప్పటికి ఓపికలేని ఫోటోగ్రాఫర్లు, పత్రికలవాళ్ళు మాయమైపోయేరు.

ఆవిడ మళ్ళీ నలుగురిలోకీ వచ్చేటప్పటికి ఆవిడకు భారతదేశ అత్యున్నత పురస్కారం "భారతరత్న" యిస్తున్నట్లు ప్రకటన వచ్చింది. అప్పటిదాకా పదిహేడుమంది అత్యుత్తమ మహనీయులకే ఆ గౌరవాన్ని ప్రదానం చేశారు. 1962లో ఆవిడకు పద్మశ్రీ వచ్చింది. అలాగే జన్మతః భారతీయులు కాని పైవాళ్ళకి యీ పురస్కారం అందజేయడం అదే ప్రథమం.

కొన్నియేళ్ళు ఆవిడ పురస్కార సభలకి వాటికీ నేను హాజరవుతూనే వున్నాను. ఆవిడ అలాంటి సందర్భాల్లో యిబ్బందిగా వుండేవారు. అలసటవల్ల నేమోలే అనుకున్నాను మొదట్లో. తర్వాత తెలియవచ్చింది. ఆవిడకు అవి సరిపడక యిబ్బందిగా బాధపడుతున్నారని. ఆవిడను అలాంటప్పుడు కార్లో తీసుకువెళ్ళేవాణ్ణి. ముందు ఆవిడ చర్చిలో ప్రార్థన చేసేవారు. కార్లో యేదో జపించేవారు. చర్చివాళ్ళ నుంచి వచ్చే ఆహ్వానాలతో ఆవిడ అలసిపోయేవారని ఫాదర్ వాన్ ఎగ్జిమ్ నాతో అన్నారు. "హోలీఫాదర్, బిషప్పులు, కార్డినల్స్ నన్ను సభలకు రమ్మంటారు. మాట్లాడమంటారు. నేను మాట్లాడలేను. నాకు మించిన పని అది. మా సిస్టర్లతో, కూటమితోనే నాకు తీరిక వుండదు. యిప్పుడు ప్రపంచ వ్యాప్తం వున్నాయని. అలసిపోతున్నాను. వార్థక్యం. ఓ బిషప్‌గాని, కార్డినల్‌గాని వస్తే హోలీఫాదర్ నన్ను వెళ్ళవద్దన్నారు అని చెప్పగలిగే ఆర్డర్ అనేది యివ్వండి" అని పోప్‌తో అన్నారు. పోప్ చిరునవ్వు నవ్వి "అలాగే, చూద్దాం" అన్నారట. "ఆయన యింకా చూస్తూనేవున్నారు" అన్నాడు ఫాదర్ వాన్ ఎగ్జిమ్.

ఆవిడ అలాంటి యిబ్బందికి గురవుతూ వుంటారు. ఆడిటోరియం కిటకిట లాడిపోతూ వుంది. మరో అవార్డు యివ్వబోతున్నారు. భారత ప్రధాని నరసింహారావు దాన్ని అందజేస్తారు. ఆవిడ హాలంతా కలియజూశారు. "యీ దీపాలు, ప్రచారం యిదీ ఓ రకమైన అవమానమే. దీన్ని నోబెల్ బహుమతి లాగానే అందుకుంటున్నాను— పేదలని గుర్తించిన దానికి సంకేతంగా" అన్నారు. మామూలుగా చేసే ఉపన్యాసాలు సాగుతూ వున్నాయి. మధ్యలో ఆవిడ మన్నించండని అడిగేరు. కలకత్తా వెళ్ళే

విమానం అందుకోవాల్సివుంది. ఎయిర్‌పోర్టుకు వెళ్ళేదారిలో ఆవిడకు గుర్తువచ్చింది, బహుమతిని వేదిక మీదనే వదిలేసినట్టు. దాన్ని తీసుకొమ్మని నాతో చెప్పారు. దాంతో యేం చేద్దామనుకుంటున్నారని అడిగేను. "అమ్మేస్తా" అన్నారు చాలా సాదాగా. "వాళ్ళే మనుకోరు కదా. పదివేలు వస్తాయనుకుంటున్నాను. తితాఘర్ కుష్ఠురోగులకు మందులు కొనచ్చు" అన్నారు.

తితాఘర్‌లోవున్న కుష్ఠుకేంద్రానికి మదర్‌థెరెసా "గాంధీజీ ప్రేమ్ నివాస్" అని పేరు పెట్టారు. అది యాదృచ్ఛికమేమి కాదు. మహాత్ముడిపేరు. ఆవిడ మహాత్మాగాంధీని యెప్పుడూ కలవలేదు. కాని ఆయనతో ఆత్మీయ బంధం వుందని భావించారు. యిద్దరూ త్యాగాన్నీ కరుణనీ ఆదరించిన వాళ్ళే. ఆయన భారతమౌలిక విలువలనీ, సాంస్కృతిక వైశిష్ట్యాన్నీ పటుతరం చెయ్యచూసిన హిందువు. అలా చెయ్యడంలో సకల విశ్వాసాలనీ పొదువు కున్నాడు. మదర్ థెరెసా జీవితమూ, కృషీ ఆవిడ విశాలదృక్పధం యెంతటిదో తెలియచేశేయి. పాతకాలపు మత ప్రచారకులకు పూర్తిగా భిన్నమైంది యిది. మహాత్ముడికి రాజకీయాతీతమైన ప్రేరణలు ప్రోత్సాహకం అయితే మదర్ థెరెసాకి రాజకీయాలు అనేవే లేవు. అయినా యిద్దరూ ప్రతీక ప్రాశస్త్యాన్ని గుర్తించినవారే. ఆవిడ కాన్వెంట్ అలవాట్లని వదిలి ముతక చీరను, కుష్ఠుచేతులు నేసిన చీరను కట్టుకునేవారు. ఆయన చేత్తో నేసిన ధోవతీ కట్టుకునేవాడు. కాళ్ళకింద దాకా వచ్చేటట్టు షోగ్గా కాదు, మోకాళ్ళ దాకా వుండే కొల్లాయి గుడ్డ. యిద్దరి లక్ష్యమూ ఒకటే. తామూ సాధ్యమైనంత పేదలుగా వుంటూ నిరుపేదలతో సారూప్యం చెందడం.

చర్చి సంప్రదాయ చరిత్రలో అంతకుముందు యే నన్ కూడా యింత సంప్రదాయేతరంగా వుండలేదు. యెన్ని కష్టాలున్నా గానీ, ఆవిడ తన పేదరికాన్ని స్వేచ్ఛగా మలుచుకున్నారు. తన శూన్యం నుంచి ఒక శక్తివంతమైన మతపర, సాంఘిక కార్యకలాప సంస్థ సాధనం సృష్టించుకున్నారు. గాంధీజీ "సత్యాగ్రహ" సృష్టించారు. అహింసాయుత సత్యాన్వేషణా మార్గం. బాధపడే సాధనంగా దాన్ని పిలిచారు. ఐచ్ఛికంగానే దాన్ని అనుభవించాలి. సాంప్రదాయిక మార్గాల్లో మహాశక్తివంతమైన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని యెదిరించడం కష్టమని ఆయనకు తెలుసు. "అహింస"నే ఆయుధంగా మలిచేడు. దాంతో, యే ప్రతిఘటనా లేకుండా శారీరక హింసని భరించేటట్టు తన అనుయాయుల్ని ఆయన తయారు చేశాడు. ఆఖరికి ప్రత్యర్థులు సిగ్గుపడి విరమించుకోవాల్సి వచ్చింది. అమాయకంగా బాధ భరించడానికి వున్న శక్తి గాంధీజీ, మదర్ థెరెసాలిద్దరూ గుర్తించేరు.

భౌతిక సాహసం యిద్దరికీ వుంది. పరమ దుర్మార్గమైన మతకల్లోలాలు చెలరేగిన చోటుకు ఆ హత్యాకాండని ఆపించడానికి గాంధీ, హుటాహుటీ వెళ్ళేరు. తన ఆదర్శంతో పోలీసు లాఠీలని, ఖైదు నిర్బంధాన్ని నైతిక, ఆధ్యాత్మిక నిబద్ధత చిహ్నాలుగా మార్చాడాయన. మదర్ థెరెసాక్కూడా తన జీవితం అంత ముఖ్యమైంది కాదు. ఓ తుఫాను, ఓ భూకంపం, వరదలు, యుద్ధాలు సంభవించిన చోటుకు వెళ్ళే ప్రధముల్లో వుంటారావిడ. బీరూట్‌లో ఘర్షణలు తారస్థాయిలో వున్నప్పుడు 1982లో ఆవిడ అక్కడకు చేరారు. పశ్చిమ బీరూట్‌లో చాలామంది మానసిక రుగ్మతవున్న పిల్లలు తిండీ నీళ్ళూ లేక చిక్కుకు పోయారని ఆవిడకు తెలిసింది.

స్థానిక అధికార్లు వారించారు. చర్చి నాయకులు కూడా వారించారు. వెడితే ఆత్మహత్యా సదృశమేనని చెప్పారు. ఆ హెచ్చరికలను లక్ష్యపెట్టకుండా వెళ్ళారు. ఆశ్చర్యకరంగా శత్రువులు కాల్పులు ఆపేరు. మదర్ పిల్లల్ని కాపాడారు.

అవిడ అవసాన దశలోవున్నవారికోసం గృహాన్ని ప్రారంభించేటప్పుడు చాలా యేళ్ళ క్రితం కాళీఘాట్ పురోహితుల నుంచీ స్థానిక ప్రజల నుంచీ పెద్ద ఆందోళన వచ్చింది. ఓ విదేశీవనిత క్రైస్తవ మతంలోకి మార్చేస్తోంది జనాల్ని అని పోలీసులకు ఫిర్యాదు చేశారు. బెదిరింపులు వచ్చాయి. కోపోద్రిక్తులైన జనం నిర్మల్ హృదయ్ మీద రాళ్ళు రువ్వేరు. ఓ రోజున రాళ్ళవర్షం కురిసింది. కిటికీలో నుంచి దూసుకువెళ్ళాయి. ఆ సమయంలో మదర్ థెరెసా ఆ మూకతో ముఖాముఖీ తలపడ్డానికి బయటకు వచ్చారు. చేతులు ముందుకు చాచి గుంపు దగ్గరకు వెళ్ళేరు. "కావాలనుకుంటే నన్ను చంపండి. కాని లోపల వున్నవాళ్లకి యిబ్బంది కలిగించకండి. మనశ్శాంతిగా తనువు చాలించనివ్వండి" అన్నారు. కొన్ని క్షణాలు ఉద్రిక్తతగా వుంది. అప్పుడు నిశ్శబ్దం చోటుచేసుకుంది. ఆందోళనకారులు వెళ్ళిపోయేరు.

గాంధీలోనూ, మదర్ థెరెసాలోనూ ఒక మత ఛాందసత్వం, మౌలిక కార్యాచరణ శీలత మిళితమై వున్నాయి. గాంధీజీ హృదయ స్థితంగా చాలా ఛాందసులు. మదర్ థెరెసా కూడా కాథలిక్ సిద్ధాంత అధికారిక వ్యాఖ్యానానికి విధేయురాలై వున్నారు. ముఖ్యంగా గర్భస్రావాలకి సంబంధించీ, కుటుంబ నియంత్రణకి సంబంధించీ, అవిడ "చర్చికి కడపటి విధేయురాలు" అని యెక్కువగా విమర్శలు వచ్చేయి. ఉదారవాద నేపథ్యంలో యిదొక కాలదోషం. కొన్నియేళ్ళ క్రితం ఒక ప్రసిద్ధ ఫెమినిస్టు మదర్ థెరెసాను "మతపర సామ్రాజ్యవాది" అంది. ఆ కథనానికి ప్రపంచవ్యాప్తంగా పతాక శీర్షికలు వచ్చాయి. ఆ ఫెమినిస్టు మదర్ థెరెసా గురించి సన్నిహితంగా తెలుసుకోకపోవడం విచారకరం. యేమంటే, తన విశ్వాసాల్ని పలచబరచకుండానే మదర్ థెరెసా మత అవరోధాలని అధిగమించేటట్టు వాటిని మలచారు. భారతీయ విద్యాభవన్ ప్రసిద్ధ భారతీయ సంస్థ. భారత సంస్కృతి పునరుద్ధరణకుగాను దాన్ని స్థాపించారు. ఆ సంస్థ మదర్ థెరెసాకు వాళ్ళ అత్యున్నత పురస్కారాన్ని యిచ్చింది. "మదర్ థెరెసా" నిబ్బరమైన, సాహసపూరిత యోధురాలు. ఈశ్వరచోదిత ప్రేరణతో దయ కృపారసాల మిషన్ స్థాపించారు. ప్రపంచవ్యాప్తంగా వున్న అనామకులు, నోరు లేనివాళ్ళు, యిల్లూ వాకిలీ లేనివాళ్ళు, అణగారిన ఆర్తులు, నిరుపేదలు పడే బాధల్ని తగ్గించాలన్నది ఆశయం. మహాత్మాగాంధీ యీ ప్రజలనే దారిద్రనారాయణులని పిలిచారు." ఆ సందర్భంలో అవిడ గురించి చెప్పారు. "జాతి, మత, విశ్వాస, దేశ పరిధుల్ని అధిగమించిన అరుదైన మహాత్ముల్లో అవిడ ఒకరు. అవిడ ఒక రాజ్యాన్నిగాని, గౌరవాన్నిగాని, ఆఖరికి మోక్షాన్నిగాని ఆశించరు. అవిడ సిసలైన వైష్ణవ జన – దేవుని దూత – పరాయి వాళ్ళ బాధలని తొలగించడానికే అంకితమైన మహనీయురాలు, మహాత్మాగాంధీలాగా" అని ఆ సంస్థ అధ్యక్షులు శ్లాఘించారు.

❋ ❋ ❋

# 12 భరతవాక్యం

తన గురించీ, తన కృషి గురించీ రాసిన పుస్తకం ఒక్కటీ తను చదవలేదని మదర్ థెరెసా నాతో చాలాసార్లు అన్నారు. యెందుకని అడిగే అవసరం నాకు లేకపోయింది. ఒకవేళ చదవాలని అనుకున్నా "అసలైనపని" నుంచి తనని తప్పించే భాగాన్ని ఆవిడ కోరరు, కొన్నిగంటల సేపు అయినా సరే. నేను అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పడానికి, తను నమ్మినదాన్ని వివరించడానికి, ఒకోసారి గంటసేపుదాకా, ఆవిడ యెంత సమయం వెచ్చించారో నాకు తెలుసు. అలా నష్టపోయిన సమయాన్ని రాత్రిళ్ళు పొద్దుపోయేదాకా పనిచేసి భర్తీ చేసుకుంటారు. మా సంభాషణలను వీలైనంత క్లుప్తంగా ముగించేందుకే నేను ప్రయత్నం చేసేవాణ్ణి, హాయిగా మాట్లాడుకోగల వ్యవధి దొరికేది కలిసి ప్రయాణం చేసినప్పుడే. అందుకని వీలైనన్నిసార్లు ఆవిడతో కలిసి ప్రయాణం చేసేవాణ్ణి.

ఓ రోజు మధ్యాహ్నం మదర్ హౌస్ హాల్లో కూర్చున్నాం. ఉపోద్ఘాతం రాసేననీ ఒకటి రెండు పేరాగ్రాఫులు ఆవిడ చదివితే బాగుంటుందనీ అన్నాను. ఆవిడ "వద్దు" అనకముందే మొదలు పెట్టాను. ఆవిడలో వున్న గొప్ప సుగుణం యేమిటంటే ఓ పని అందుకున్నా, యెవళ్ళతోనైనా మాట్లాడుతున్నా, యిక ఆ పనిపట్లా, వ్యక్తిపట్లా మనస్ఫూర్తిగా శ్రద్ధ చూపించడం. నేను చదివేదాన్ని ఆవిడ మహాశ్రద్ధగా వింటున్నారు. ఆఁ, బాగుంది అంటున్నట్టు కొన్నిసార్లు తల వూపేరు. ఆఖరికి తన సాదా ధోరణిలో "చాలా బాగుంది, చాలా బాగుంది. అన్నిచోట్లా వెలువడేటట్టు చూడండి" అన్నారు.

యిక మిగతా దాంతో ఆవిడ్ని కష్టపెట్టడం యిష్టం లేదనీ, నాకు సమాచారం యివ్వడానికి యెవళ్ళనన్నా చూపిస్తే బాగుంటుందనీ ఆ సమయంలోనే ఆవిడతో అన్నాను. ఆవిడ అందుబాటులో లేనప్పుడు నా సందేహాలు తీరడానికి యీ యేర్పాటు బాగుంటుంది. ఆవిడ సంస్థ శాఖోపశాఖలుగా విస్తరిస్తోంది. అంచేత యిక్కడ ఎన్నో గణంకాలు తప్పకావచ్చు, అక్కడ ఓ పేరు పొరపాటు కావచ్చు, ఓ చోటు యెక్కడ వుందో సరిగ్గా తెలియకపోవచ్చు. అదీగాక యెప్పటికప్పుడు నాకు తెలిసిన విషయం పాతబడి పోవచ్చు. దీనికి తోడు నేను హిందువునైనందువల్ల ఆవిడ మత విశ్వాసాల విషయంలో తగినంత అవగాహనా లుప్తం అవవచ్చు. మదర్ థెరెసా

మళ్ళీ తల వూపేరు, ఓ క్షణం ఆలోచించేరు. సిస్టర్ జోసెఫ్ మైఖేల్ పేరు సూచించేరు. అయితే ఆవిడకున్న సమయాన్ని దృష్టిలో వుంచుకొమ్మనీ, మరీ యెక్కువ వ్యవధి తీసుకుంటూ వుండవద్దనీ అన్నారు. యేమంటే సిస్టర్ జోసెఫ్ మైఖేల్ నలుగురు కౌన్సిలర్స్ జనరల్‌లోనూ ఒకరు. చేతినిండా పని వుంటుంది. గత పద్దెనిమిది నెలల్లోనూ యీ సిస్టర్ మందహాసంతో వ్యవధి కల్పించుకునేవారు. కొన్నిసార్లు అప్పటికప్పుడు కలుసుకున్నా ఖాళీ లేదు అనేవారు కాదు. మిషన్ హౌస్‌లలో వున్న సుపీరియర్లకి నాకోసం పరిచయ పత్రాలు రాసి యిచ్చేవారు. అవి లేనట్టయితే వాళ్ళు నేనడిగినవాటికి జవాబులే యిచ్చేవారు కాదు.

ఫాదర్ వాన్ ఎగ్జిమ్‌ని కలిశేరా అని సిస్టర్ జోసెఫ్ మైఖేల్ అడిగేరు. ఆయన పేరే వినలేదని చెప్పాను. అయన్ని కలిసే యేర్పాటు ఆవిడ చేశారు. ఫాదర్ వాన్ ఎగ్జిమ్ తప్ప మరెవరూ మదర్ థెరెసా తొలిరోజుల్లో సాయం అందించలేదు – ముఖ్యంగా మిషన్ ఆవిడ కళ్లల్లో మెరుస్తూ వున్నప్పుడు. అది అంత స్పష్టంగా రూపు తీసుకుంది. ఆయనతో దీర్ఘంగా సంభాషించకుండా నా కలకత్తా యాత్ర ఒక్కటీ సాగలేదు. ఆయన ధారణా శక్తి అమోఘం. ఆయన నడవడిక చాలా మృదువు. హాస్యచతురత వుంది. ఆ ఆకర్షణ శక్తి నన్ను ఆకట్టుకుంది. “ఆ, ఆవేళ మధ్యాహ్నం యేం జరిగిందో తెలుసా” అనడంతో యెక్కువగా మా సంభాషణ మొదలయేది. యెప్పుడో నలభై యాభై యేళ్ళక్రితం జరిగిన విషయాన్ని అదేదో అంతకు ముందు వారంలో జరిగినట్టు చెప్పేవాడాయన. మదర్ థెరెసా గురించి, ఆవిడ కృషి గురించీ కొత్త విషయాలు చెప్పడం మొదలుపెట్టేవాడు. లేకపోతే కలకత్తాలో తను ప్రీస్ట్‌గా వున్నప్పటి ముచ్చట యేదో చెప్పేవాడు. మా సంభాషణల క్రమంలో ఫాదర్ వాన్ ఎగ్జిమ్ మదర్ థెరెసా జీవితంలోని మైలు రాళ్లని గురించి చెప్పేవాడు. ఆయన చెప్పక పోయివుంటే అవి నాకు తెలిసి వుండేవి కాదు. ఒకోసారి కొంతమందిని కలుసుకొమ్మని సూచించేవాడు. వాళ్లను కలుసుకుంటే నాకు లాభం.

1992 మే 2న యీ పుస్తకాన్ని పబ్లిషర్‌కి అచ్చుకు యిచ్చేను. అంతకు ముందు ఆవిడ్ని కలుసుకున్నాను. అదే ఆఖరు సారి. ఆవేళ రీజనల్ సుపీరియర్స్‌తో ఆవిడకు మీటింగు వుండి యే మాత్రం తీరిక లేకుండా వున్నారు. యావద్భారతదేశం నుంచీ వాళ్ళు వచ్చేరు. మీటింగు నుంచి కొంచెం సేపు యువతలకు వచ్చేరు. సాయంత్రం ప్రార్థనలయాక కలుసుకుందామని అన్నారు. అందుకు బదులుగా నేనే ప్రార్థనలకు హాజరవుదామనుకున్నాను. దగ్గర దగ్గర గంటసేపు నన్ను నేనే నమ్మలేక పోయాను. ఆవిడ యిటీవలే కాలిఫోర్నియా హాస్పిటల్‌లో తీవ్రంగా జబ్బుచేసి పడిపోయారా? తన పని మొదలు పెట్టేంతర్వాత కొంతకాలానికే యెలా తీవ్రంగా జ్వర పడిందీ ఓసారి నాతో చెప్పారు. ఒంటిమీద స్పృహలేని స్థితిలో సెయింట్ పీటర్ దగ్గరకు వెళ్ళేరట. ‘వెనక్కిపో, స్వర్గంలో మురికివాడలు లేవు’ అని ఆయన అన్నాట్ట. ఆవిడకు కోపం వచ్చి స్వర్గమంతటినీ మురికివాడల పేదలతో నింపేస్తానని అన్నారట. అందుకనే కాళీఘాట్‌లో యెవరన్నా “చక్కగా” చనిపోతే “యితను చిరునవ్వు నవ్వుతూ పోయేడు. యెకా యెకీ సెయింట్ పీటర్ దగ్గరకు వెడతాడు” అని సిస్టర్లు అంటారు.

ప్రార్థన చేస్తూవున్న మదర్ థెరెసాను గమనించడం దివ్యమైన అనుభవం అని చెప్పాలి. ఈశ్వరునితో మమేకం అయిపోతారు. ఆ సమయంలో మరింక యేదీ లేనట్టే, యెవరూ లేనట్టే, చేతఃప్రకృతి రపారా నాస్తితో అన్నట్టు. ప్రణమిల్లుతూ నేల మీద అన్ని వొంగితే ఆవిడ సంపూర్తిగా తనని అర్పించుకున్నట్టేనని పిస్తుంది. రోజువారీ ప్రమాణాల్లో ఆవిడ్ని యెవరన్నా యెలా అర్థం చేసుకోవడం అని అనుకోకుండా వుండలేను. అప్పటికి అలా లక్షసార్లు అనుకున్నాకూడా. ఆవిడ మేధావి కాదు. మంచి మనసు వుంది. చాలా విధాలుగా చాలా సాదాగా వుంటారు. సరే, ఆవిడ యెంతో కష్టపడి పని చేస్తారు. కార్యకర్త్రి, ఫలవంతమైన పని. ఆవిడకి యే విశ్వవిద్యాలయ విద్యాభ్యాసమూ లేదు. బాగా చదవడానికి వ్యవధీ లేదు. చదివే వల్లా మత గ్రంథాలే. అలాంటి నేపథ్యంలో తను సాధించిన మహత్తర విజయాలని యెలా సాధించి నట్టు? మిషనరీల సంఖ్యకీ, వాటి సామర్థ్య ప్రభావాలకీ ప్రత్యక్ష సంబంధం లేదు. యీావిడ భవిష్యత్ దృష్టి వల్ల యివాళ బతికి బట్టకడుతున్న వారి సంఖ్య వేలల్లో, యింకా చెపితే లక్షల్లో వుంటుంది. క్షుధార్తులు, రోగులు, అనాథలు, కరువు పీడితులు, ఉపద్రవదష్టలు లాంటి వాళ్లెందరి బాధల్నో ఆవిడ ప్రత్యక్షంగా తగ్గించ గలిగేరు. ఆ ఉపద్రవ దష్టల్లో మానవకృత బాధితులూ వున్నారు, దైవిక ఘటనల బాధితులూ వున్నారు. ఆవిడ వల్ల ప్రేరణ పొందిన వాళ్ల సంఖ్య దీనికి జత చేసుకోవాలి మదర్ థెరెసాని యెన్నడూ కలవనివాళ్లు, ఆవిడ గురించి ఓ పుస్తకంలోనో, పత్రికలోనో చదివి తెలుసుకున్న వాళ్లు తామూ యేదో చెయ్యాలి అన్న ప్రేరణ పొందారు. ఆవిడ బలి వితర్ది ముందు మోకరిల్లుతూ వుంటే యేం చెప్పను, అవగాహనకు అందని ఈశ్వర, దైవిక అంశం అని చెప్పనా? నా మనసులో దోబూచులాడే శంకలకు సమాధానంగానా అన్నట్టు, ఓ సారి ఆవిడ నాతో అన్నారు, "నేను నిమిత్త మాత్రురాల్ని. ఆ ప్రభువు చేతిలో చిన్న పెన్సిల్ ముక్కని. యివాళ కూడా భగవంతుడు మనలాంటి దుర్బల, అపరిణతుల్ని తన సాధనాలుగా చేసుకుంటున్నాడు." వూరికే ఆవిడ నాలుక చివరి నుంచి వచ్చే మాటలు కావవి, త్రికరణ శుద్ధిగా నమ్మి అంటున్న మాటలు. అంతేనేమో, లేకపోతే ఆవిడ సాధించిన మేరునగ సమాన విజయాల రహస్యాన్ని అర్థం చేసుకోవడం యెలాగ?

ప్రార్థనలు పూర్తయేయి. భక్తులందరూ వెళ్లిపోయేరు. మసక సంధ్యాసమయం. చర్చిబయట బెంచీమీద నేను కూర్చున్నాను. ఆవిడ అక్కడకు వచ్చి పక్కన కూర్చున్నారు. తను కోరి చేరిన యీా నగరం ప్రజల జీవితంలో తన కృషి వల్ల యే మార్పులు వచ్చేయని అనుకుంటున్నారు తను అడిగేను. "చాలా, చాలా. కలకత్తా ప్రజలు పేదలంటే యెవరో తెలుసుకుంటున్నారు. వాళ్లను ప్రేమిస్తున్నారు. యెవళ్లూ నడిరోడ్డుమీద చనిపోయే పరిస్థితి లేదు. యెవళ్లో, యెక్కడి నుంచో అలాంటి దీనుల్ని చూసి మా దగ్గరకు తీసుకు వస్తారు. పిల్లలు కూడా అలా తీసుకువచ్చిన సందర్భాలు వున్నాయి. కాళీఘాట్ వీధుల్లో వున్న వృద్ధుల్ని వాళ్లు తీసుకు వస్తూ వుంటారు. అన్ని మత విశ్వాసాల వాళ్లూ తమ వంతు సాయం చేస్తూవున్నారు. "మదర్ థెరెసా, మేం సాయం చేస్తాం" అంటూ వుంటారు వాళ్ళు, పేదల్ని తాకుతున్నారా, లేదా? అదీ యీా సేవలో వున్న ఆనందం. అన్నిచోట్లా యిలాంటి పరిస్థితే వుంది," అన్నారావిడ.

ఆవిడ కృషి ప్రపంచ వ్యాప్తంగా విస్తరించింది. అయినా ఆవిడ కలకత్తాకి చెందిన మనిషిగానే వున్నారు. మరే తావుకేనా చెందుతున్నట్టు భావిస్తొన్నారా అంటే లేదు అనే చెప్పాలి. ఆవిడ జీవితం నగరంలో ముడివేసుకు పోయింది. ఒకదాని కొకటి ప్రోద్బలకరం. ఆవిడ జీవితంకాని, కలకత్తాకాని ఒకటి లేకపోతే రెండవది అసంపూర్తిగా వున్నట్టే. ఆవిడ ప్రపంచ వ్యాప్తంగా లక్షలాది కోట్లాది మందికి "కలకత్తా మదర్ థెరెసా" గానే తెలుసు. యించుమించు అదొక బిరుదు అయిపోయింది. కలకత్తా వాసులకు ఆవిడో కులదైవం, అంతరాత్మ సంరక్షకురాలు. పశ్చిమ బెంగాల్ గవర్నర్ ఓసారి నాతో అన్నారు, తను మదర్ థెరెసాను దర్శించినప్పుడల్లా "నేను మానవాళికి యేంచేశాను" అని ప్రశ్నించుకుంటూ వుంటారట. లక్షలాది మందికి లాగానే అయన ఆవిడ సన్నిధిలో వినమ్రుడైపోతాడు.

> "ఈశ్వర ప్రేమ సంతోషాన్ని హృదయంలో పదిలపరుచుకోండి. ఆ సంతోషాన్ని మీ వాళ్లందరితో పంచుకోండి - ముఖ్యంగా మీ కుటుంబంతో.
>
> భగవదాశీస్సులతో
>
> ఎమ్.థెరెసా ఎమ్.సి."

ఆ రాష్ట్రప్రజలు ఆవిడ్ని "బెంగాల్ మాత" అని పిలుచుకుంటారు. మరి అందులో వింత యేం వుంది?

"అమ్మా, అమ్మా" అంటూ కింద మెట్ల దగ్గర యెవరో అరిచేరు. ఓ ముష్టివాడు మదర్ థెరెసా యే రావాలని గోల చేస్తున్నాడట. ఓ సిస్టర్ వచ్చి చెప్పింది. తను మదర్ థెరెసాతోనే మాట్లాడతాడట. ఆవిడ వెళ్లింది. నేను వెనకాలే వెళ్లాను. ఆ ముష్టివాడు అన్నం కోసమో, దానం కోసమో రాలేదు. ఆ పూట తనకి వచ్చిన దాన్ని కానుకగా యిద్దామని వచ్చేడు. తగరం బొచ్చెలో కొద్దిగా చిల్లర వుంది. మహా అయితే ఓ రూపాయి వుంటుందేమో. ఓ క్షణం సేపు మదర్ థెరెసా షస్తాయించారు. తను తీసుకుంటే ఆ మనిషికి ఆ పూట కడుపు ఖాళీ. తీసుకోకపోతే అతను నొచ్చుకుంటాడు. తీసుకుందాం అని నిర్ణయించుకున్నారు. అతను ఆనందంతో ఆవిడ చేతిని చుంబించాడు, మేం తిరిగి బెంచీ దగ్గరకు వెళ్లేం. ఆవిడ నాకేసి చూశారు. "తనకున్నదంతా నాకు యిచ్చేశాడు. పాపం, యీ రాత్రి పూట అతనికి అన్నం వుండదు. నాకు యీ కానుక నోబెల్ బహుమతి కంటే, నాకు వచ్చిన అన్ని కానుకలకంటే గొప్పది," అన్నారు.

నేను సెలవు తీసుకుందామని లేచేను. రాత ప్రతి తయారైంది. యీ పుస్తకం రాయడానికి నాకు అయిదేళ్ళు పట్టింది. ఒక్కసారి కూడా ఆవిడ నేనడిగిన దేన్ని కాదనలేదు. ఆవిడ దేన్ని నియంత్రించలేదు. ఫలానాది కావాలనలేదు. కనీసం రేఖామాత్రంగా సూచన అయినా చెయ్యలేదు. ఆవిడ యిచ్చేరంతే. అదొక అనుభవ పారమ్యం. నన్ను సంపన్నం చేసింది. శక్తివంతం చేసింది. యేమంటే, ఆవిడ సలహాల అమూల్యమైన విలువ నాకు దక్కింది. ఆవిడ ప్రార్థనలు, ఆశీస్సులు దక్కేయి. మేం

ఆఖరుసారి కలుసుకున్నప్పుడు ఆవిడ అన్నారు, "యెవళ్ళకీ యిలాంటి అవకాశాన్ని యెప్పుడూ యివ్వలేదు. మీరు యేంచేసినా భగవంతుని కోసం చెయ్యండి, ప్రజల మేలు కోసం చెయ్యండి. అచ్ఛా, మీ గురించి, మీ యిల్లాలి గురించీ, కూతుళ్ళ గురించీ చూసుకోకండి. ఆం, మర్చిపోతానేమో ముందే చెపుతున్నా, మీ అమ్మాయిలకు నా ప్రార్ధనలు అందచెయ్యండి."



1992 లో మంజీత్ బావా గీసిన చిత్రం, మదర్ థెరెసా హస్తం.

# 13 ముగింపు అధ్యాయం

1997 సెప్టెంబరు 5. ఆవిడకు అంతకు కొద్దిరోజుల ముందే 87వ జన్మదినం జరిగింది. ఆ రోజున మదర్ థెరెసా భగవంతుని సన్నిధికి, తన యింటికి వెళ్లారు. కొన్నేళ్ల కితం ఒకసారి ఆవిడకు తను చనిపోయినట్టు కల వచ్చింది. స్వర్గద్వారం చేరుకున్నారు. సెయింట్ పీటర్ ఆవిడ్ని లోపలికి రానివ్వలేదు, స్వర్గంలో పేదలు లేరు కాబట్టి రానక్కర్లేదు, తిరిగి వెనక్కి వెళ్లిపో అన్నాడు. అప్పుడావిడకు కోపం వచ్చింది. అందుకు బదులాగా స్వర్గమంతట్నీ తన జనంతో నింపేస్తానని చెప్పారు. కొన్ని నెలల కితం ఆ కలని గుర్తు చేసుకుని, తను 54,000 మందిని తన ప్రత్యేక నియోజక వర్గం నుంచి సెయింట్ పీటర్ దగ్గరకు పంపేనని అన్నారు. పేదల్లో నిరుపేదలు వాళ్ళు. ఆఖరికి దేవుడు ఆవిడ చేసిన కృషిని నమ్మేడు. అది పరిపూర్ణమైంది. శుష్కించి, అలిసి పోయిన భౌతిక కాయాన్ని వెనక వదిలేసి శాశ్వత విశ్రాంతి కోసం రమ్మని ఆవిడ్ని పిలిచేడు.

ఆవిడ భౌతికయాత్ర చాలించడానికి ప్రపంచం సన్నద్ధమై లేదు. గత కొన్ని యేళ్ళల్లో ఆవిడ మృత్యువుకు చాలా సన్నిహితంగా వెళ్ళేరు. కొండ శిఖరం అంచు దాకా వెళ్ళేరు. లక్షలాది ప్రజల ప్రార్థనలతో మళ్ళీ కోలుకునేవారు, స్వాస్థ్యం చిక్కేది. అలా జరిగిన ప్రతిసందర్భంలోనూ నేను ఆవిడ మంచం దగ్గరకు వెళ్ళేవాణ్ణి. ఆవిడ తన కార్యక్రమం పూర్తయింది అని అనుకున్నప్పుడే వెడతారు అన్న నమ్మకం యేదో నాకు వుండేది. పూర్తి చెయ్యవలసిన పనులు వున్నాయి. 1950లో స్థాపించిన యీ మఠ నిర్వహణా భారాన్ని మరొకళ్ళకి అందచెయ్యాలి. 1996 అక్టోబరులో వారసత్వం కోసం యెన్నిక జరపడానికి జనరల్ ఛాప్టర్‌ని సమావేశపరచవలసి వుంది కాని వరస వరసగా హాస్పిటల్లో చేరవలసి రావడం వల్ల అది వాయిదా పడుతూ వచ్చింది. ఆఖరికి 1997 మార్చి 13న మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సమష్టిగా సిస్టర్ నిర్మలను సుపీరియర్ జనరల్‌గా యెన్నుకుంది. ఆ తర్వాత కొన్ని నెలల్లో మదర్ థెరెసా క్షీణించిపోతూవున్న తన శక్తి నంతటినీ కూడగట్టుకుని మఠం విలువల్ని దృఢతరం చెయ్యడానికీ, తన వారసురాలికి తన విశ్వాసపు మారుమూల పొరలనుంచి కూడ గట్టిన యుక్తిని అందించడానికీ కృషి చేశారు. శరీరం బాధలు పడుతున్నా ఆఖరిసారి విదేశీ యాత్ర చేశారు. తన వారసురాల్ని వాటికన్‌లో పరిచయం చేశారు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ మతపర శాసితమైన కూటమి కదా! అమెరికా సంయుక్త రాష్ట్రాలకు ~రు. అంతకు ముందు కొద్దినెలల క్రితమే ఆ దేశం ఆవిడకు గౌరవ పౌరసత్వం

యిచ్చింది. అలాంటి గౌరవం దక్కిన నాల్గవ వ్యక్తి ఆవిడే. తిరుగు ప్రయాణంలో ఢిల్లీలో ఒక్క రోజే ఆగేరు. ఆ సమయంలో కొన్ని గంటలు ఆవిడ సమక్షంలోనే గడిపేను. ఆ గంటలు, వెనక్కి తిరిగి చూసుకుంటే, ఆవిడను మొదటి సారి నేను కలుసుకున్నప్పటి సమావేశంలాంటివే. ఆ మొదటిసారి యిరవై రెండు యేళ్ళనాటిది. ఆవిడ అదే సాదా విషయాల గురించి మాట్లాడేరు. విశ్వాసం గురించీ ప్రేమ గురించీ మాట్లాడేరు. ప్రార్ధన యెంతటి శక్తివంతమైందోననే మళ్లీ చెప్పారు. ఒక కుటుంబంగా మాకు ప్రార్ధన చెయ్యవలసిన అవసరం గురించి చెప్పారు. "కలిసి ప్రార్థించే కుటుంబం కలిసే వుంటుంది" అని రెట్టించారు. సివిల్ సర్వీస్‌లో నేను చేస్తూవున్న ఉద్యోగం వదిలేసి, వేరే పనులకి అంకిత మవుతానని ఆవిడతో అన్నాను. అప్పుడావిడ నన్ను సున్నితంగా మందలించేరు. నేను యధాస్థానంలోనే వుండి సాయం చెయ్యగల శక్తి నాకు వుండేందుకు గాను తను ప్రతిరోజూ పొద్దుటా, సాయంత్రం నాకోసం ప్రార్ధనలు చేస్తున్నానని అన్నారు. అప్పుడు నా చేతిని తనచేతిలోకి తీసుకున్నారు. "మీరు సర్వదా పేదల కోసం పని చెయ్యాలి, అందరి సంక్షేమం కోసం పని చెయ్యాలి. పేదలని స్పృశిస్తూనే వుండాలి" అన్నారు మృదువుగా. తన ఆదరాభిమానాలకు చిహ్నంగా నా కోసం చిన్న నోట్ రాసి యిచ్చేరు. నేను వూహించలేదు. తను నన్ను మళ్లీ కలవలేరు అన్న విషయం ఆవిడకు తెలిసినట్టేవుంది.

అవసాన సమయం సమీపించినప్పుడు ఆ ఆర్డర్ సిస్టర్లతో, బ్రదర్స్‌తో వుండాలని మా కుటుంబంతో సహా కలకత్తా వెళ్ళాను. ఒక శూన్యం యేర్పడింది. దాన్ని అనుభవిస్తూ వున్నవాళ్ళతో కలిసి వున్నప్పుడు ఒక చిత్రమైన శాంతి కలిగింది నాకు. ఆవిడ హాస్పిటల్లో యిహలోక యాత్ర చాలించనందుకు సంతోషం కలిగింది. యేమంటే, ఆవిడకు ఆదర్శవంతమైన రోగి అని ఓ అవార్డు యిచ్చేసే వాళ్ళు, అరుదుగానే అనుకోండి. (1991 లో శోషవచ్చి పడిపోయినందుకు ఆవిడ్ని కాలిఫోర్నియాలో ఓ హాస్పిటల్‌లో చేర్చారు. ఆ వైద్యం ఖర్చు తెలిసి బెంగపట్టుకుని ఆవిడ తప్పించుకుపోవాలని ప్రయత్నించేరట. అర్ధరాత్రి ఒంటిగంట దాటాక ఆవిడ మునిగాళ్ళమీద నడిచిపోతూ వుంటే మాట్రన్ చూసి అవాక్కయి పోయిందట. ఆవిడ్ని యెత్తుకెళ్లి మళ్లీ మంచం మీద కూలేసిందట. అప్పట్నుంచీ ఆవిడ్ని యిక బయటికి జారుకోకుండా ఓ కంట కనిపెట్టి వుండేందుకు ఓ నర్సుని కాపలా పెట్టేరుట. యీ సంఘటన విని నాకు నవ్వొచ్చింది.) అందుకు బదులుగా ఆవిడ నిష్క్రమణ తను కోరుకున్నట్టే జరిగింది. సిస్టర్లు మదర్ హౌస్‌లో ఆవిడ చుట్టూతా వున్నారు. తను యెంతగానో ప్రేమించిన నగరం. జపమాల మీద శిలువను చేతిలో పట్టుకునే వున్నారు– తను ప్రత్యేక తరహా కరుణతో లాలించిన అసంఖ్యాక జనావళికి అభిన్నమైన జీసస్.

కలకత్తా చర్చిలో గాజుపేటికలో ఆవిడ భౌతిక కాయాన్ని వుంచేరు. భారత జాతీయ పతాకాన్ని మృతదేహం మీద కప్పేరు. అదొక సాటిలేని గౌరవం. కడపటి వీడ్కోలు చెబుతూ వేలాదిమంది ఆవిడని సందర్శించేరు. లక్షలాది జనాభా వున్న ఆ నగరం ఆమూలం చలించిపోయింది. కలకత్తాలో ఒకళ్ల కష్టసుఖాలు ఒకళ్ళు పంచుకోవడం వున్నట్టుగా ప్రపంచంలో మరెక్కడా లేదని ఆవిడ చాలాసార్లు నాతో అన్నారు. కలకత్తా పేదలు తమ పేదరికాన్ని పంచుకోవడమేకాదు, మరీ ముఖ్యంగా పొరుగువాళ్ల అవసరాలు యేమిటో తెలిసినవాళ్లుకూడా. ఆ భావననే ఆ వారం

కలకత్తాలో చూశాను. వేలాదిమంది ఆవిడకు కడపటి వీడ్కోలు చెప్పడానికి వచ్చారు. కాని సంఖ్య మాత్రమే అంత ముఖ్యం కాదు. ముఖ్యమైంది తమ ఆత్మీయులు పోయేరన్న బాధ. చాలా గంటలసేపు వేలాది మందిని చూస్తూనేవున్నాను. వాళ్ళంతా కడపటి వీడ్కోలు చెప్పడానికి వస్తూవున్నవాళ్ళే. చిన్నపిల్లలున్నారు. తల్లిదండ్రులు వాళ్ళని తీసుకువచ్చారు. వాళ్ళు నుదురు నేలతాకేటట్టు శిరసులు వంచి నమస్కారం చేశారు. ఆ సంఘటన వాళ్ళకు యావజ్జీవితం స్మృతిలో వుండిపోతుంది నిరుపేదలు వున్నారు, ఆమె ప్రేమను ప్రత్యక్షంగా అందుకున్నవాళ్ళు. వాళ్ళు గాజుపేటికను తాకజూశేరు, ఆవిడ చీర అంచుని ఒకప్పుడు తాకినట్టు. బడి పిల్లలు వున్నారు. బెంగాలీ కీర్తనలను ఆలాపిస్తూ మరి కొంచెం సేపు నుంచుండి పోయారు. తెల్ల కలువల గుత్తుల్ని ప్రత్యేకంగా తయారు చేయించి తీసుకువచ్చారు చాలామంది. మౌన శోకంలో పాలు పంచుకుంటూ అన్ని మతాల వాళ్ళూ వచ్చారు. మదర్ థెరెసా తనకు తటస్థపడి ప్రతి వాళ్ళల్లోనూ దర్శించిన సారభూత మంచితనాన్ని అది వెల్లడి చేసింది.

భారత ప్రభుత్వం ఆవిడకు ప్రభుత్వ లాంఛనాలతో అంతిమ సంస్కారం జరిపించింది. ఆవిడ భౌతిక కాయాన్ని సైనిక వాహనం గన్ కేరేజ్ మీద తీసుకు వెళ్ళారు. ఒకప్పుడు మహాత్మాగాంధి, జవహర్‌లాల్ నెహ్రూల భౌతిక కాయాల్ని ఆ శకటం మీదనే తీసుకువెళ్ళారు. అంతిమ సంస్కారం కలకత్తాలో వున్న అతి పెద్ద ఇండోర్ స్టేడియంలో జరిగింది. వర్షాకాలం కాబట్టి ఆ యేర్పాటే ఉచితంగా వుంది. భారతదేశం, అత్యున్నత పురస్కారాన్ని ఆవిడకు యిచ్చి గౌరవించిన భారతదేశం తరఫున దేశాధ్యక్షుడూ, ప్రధానమంత్రీ హాజరయేరు. పోప్ తరఫున కార్డినల్స్ హాజరయేరు. సగం ప్రపంచం నుంచి అధ్యక్షులు, ప్రధానమంత్రులు, రాణులు, ప్రత్యేకదూతలు ఆ మహిళకు నివాళు లర్పించడానికి వచ్చారు. ఆవిడ వాళ్ళనందరినీ సందర్శించిన వారే. తనకు వాళ్ళిచ్చే గౌరవాలు యేవో యిస్తారని కాదు, వాళ్ళ మధ్యలో పేదసాదలకు యేదన్నా అవసరం అయినందువల్లే వెళ్లారు. లాంఛనంగానూ ఆ కార్యక్రమం జరిగింది, నిరాడంబరంగానూ జరిగింది. భారతసైన్యం తు.చ.తప్పకుండా కార్యక్రమాన్ని జరిపించింది. వేదిక కింద కార్డినల్స్ ధగద్ధగాయమాన ఉడుపులు ధరించి కూర్చున్నారు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సిస్టర్లు సాదా నేత చీరలు కట్టుకుని కూర్చున్నారు. వేదిక మీద భౌతికాయం వున్న పేటిక వుంది. సామూహిక ప్రార్థన ముందు జరిగింది. తరవాత బెంగాలీ కీర్తనలు, హిందీ, ఇంగ్లీషు కీర్తనలు జరిగేయి. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సిస్టర్లు పాడేరు. ఆ తర్వాత భారతదేశంలో వున్న ప్రధాన మతవిశ్వాసాల ప్రతినిధులు ఆయా మతాల గ్రంథాలనుంచి పఠనం కావించారు. వాళ్ళంతా నివాళి ఆరోహణగా, ఉచితరీతిలో కూడేరు. వీటికి ఆవిడ కృషి చిహ్నాలని జోడించేరు, చిన్నవే అయినా స్పందింపచేసేవి. ఓ సహకార్యకర్త ఒక కొవ్వొత్తిని యిచ్చేడు. ఓ అనాథ పుష్ప గుచ్ఛం తెచ్చేడు. సామూహిక ప్రార్థన నిమిత్తం వాడిన నీళ్ళు, ద్రాక్షసారాయి, రొట్టె– వీటిని పునరావాసం పొందిన ఒక ఖైదీ, ఓ కుష్ఠువ్యాధిగ్రస్తుడూ, శారీరక అవకరం వున్నవ్యక్తీ క్రమంగా సమకూర్చేరు, సిస్టర్ నిర్మల ఒక ఖాళీ పాత్రను సమర్పించారు. మదర్ థెరెసా వెళ్లిపోవడంతో తమ హృదయాల్లో యేర్పడ్డ శూన్యానికి అది ప్రతీక. సిస్టర్ మోనికా ఒక పెన్సిల్

యిచ్చారు. ఆవిడ పశ్చిమ బెంగాల్ రీజనల్ సుపీరియర్. భగవంతుని చేతిలో తనో నిమిత్త మాత్రురాలినని మదర్ థెరెసా యెప్పుడూ అంటూ వుండే మాటలకు ఆ పెన్సిల్ ప్రతీక.

స్టేడియం నుంచి అంతిమయాత్ర ఊరేగింపుగా కలకత్తా వీధుల్లో సాగింది. చిరుచినుకులు పడ్డాయి. అయినా వేలాదిమంది కడపటి వీడ్కోలు చెప్పడానికి బారులు తీరినుంచున్నారు. ఓ చోట తితాఘర్ నుంచి వచ్చిన కుష్ఠురోగుల బృందం కనిపించింది. వాళ్ళకళ్లమ్మట కన్నీళ్ళు ధారాపాతంగా కారుతూనే వున్నాయి. మరోచోట కలకత్తా వాద్యబృందం "ప్రభువు మా గొర్రెలకాపరి" ఆలాపించింది. అన్నితరగతుల ప్రజలు, మతాల వాళ్ళు, కులాల వాళ్ళు, సంపన్నులు, పేదలు, నిరుపేదలు దుఃఖ సమయంలో ఐక్యంగా కలిశారు. ఆవిడ అంతిమ విశ్రాంతి స్థానాన్ని సిస్టర్లు యెంపిక చేశారు. మదర్ థెరెసా కోరివున్నట్టయితే ఆవిడ్ని వాటికన్‌లోనే ఖననం చేసివుండేవారు, అదికాదు. తన జన్మస్థానం అయిన అల్బేనియాలో తల్లిదండ్రుల, అక్కచెల్లెళ్ళ, అన్నదమ్ముల సమాధుల పక్కనా కాదు. మదర్ హౌస్ దగ్గర్లోనే వున్న సెయింట్ జాన్ చర్చి శ్మశానమూ కాదు. అక్కడ కొంతమంది సిస్టర్లని ఖననం చేశారు. ఆ తావు మదర్ హౌస్ ప్రాంగణంలోనే వుంది.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ బ్రదర్స్, సిస్టర్ శవపేటికను సమాధిలోకి దించేరు. వాళ్ళు అలా దించేటప్పుడు భారత సైన్యం తుతారా వాయించింది. కడపటి సివాలిగా తుపాకులు పేల్చింది. కళ్లమ్మట నీళ్ళు కారుతూ వుండగా సిస్టర్లు మదర్‌కి యిష్టమైన కీర్తనలు పాడేరు. కలకత్తా ఆర్చిబిషప్ మెల్లిగా కడపటి ఆశీస్సులు అందచేశాడు. ఆ తర్వాత మనసును కదిలించి వేసేటట్టు అక్కడ చేరిన ప్రతివాళ్లూ తలా పిడికెడు మట్టినీ సమాధిలో వేశారు. ఆవిడ చిట్టచివరి విశ్రాంతి స్థానం ఆవిడ కోరుకునేటట్టే కుదిరింది. సిమెంట్ చపటా చేసిన, నిరాడంబర సమాధి, దీనికి వున్న అలంకారం అల్లా పాలరాయి ఫలకం. దాని మీద పేరూ, ఐతిహ్యం నమోదై వున్నాయి. "నేను మిమ్మల్ని ప్రేమించినట్టే మీరూ ఒకళ్ల నొకళ్లు ప్రేమించండి."

ఆవిడ చనిపోయేక నన్ను అస్తమానం అడిగేవారు. "ఆమెను రోమన్ కాథలిక్ సంప్రదాయానుసారం అంశభూతురాలిగా ప్రకటిస్తారా?" (సెయింట్‌ని చెయ్యడం) అని అడిగేవాళ్ళు. అయితే యెప్పుడు అని అడిగేవాళ్ళు. నావరకైతే అదేమంత ముఖ్యమైంది కాదని చెప్పేవాణ్ణి. యేమంటే జాతీయత, మతం ప్రమేయం లేకుండా ప్రతివాళ్ళూ ఆవిడ్ని దైవాంశసంభూతిరాలిగానే చూశేరు. ఆవిడను దేవతగా భావించే రీతి మొదలవుతుందన్నది ముందే వూహించిందే. అయితే మదర్ థెరెసా తన యావజ్జీవితం వినయం మూర్తీభవించిన ఫ్రెంచి నన్ లీసోవాసి సెయింట్ థెరెసె సామాన్య మార్గాన్ని అనుసరించారు. ఆవిడే చిన్నతనంలో ఆగ్నెస్‌కి ప్రేరణ. ఆ పేరునే యీావిడ లోరేట్ నన్‌గా చేరినప్పుడు గ్రహించేరు.

యావజ్జీవితం మదర్ థెరెసా సామాన్యంగానే బతికేరు. నిరాడంబరంగా, సాదా మహిళలుగా అయినా యీ శతాబ్దంలో అత్యంత ఘనమైన మహనీయుల్లాగా జీవించేరు. ఆవిడ పండితురాలేమీకాదు. అయితేనేం వడపోసిన తెలివితేటలు యే వేదాంతి–రుషికీ తీసిపోనట్టు వుండేవి. ఒకసారి ఒక చిన్న అడుగే వేసేవారు. అయినా అనేక సంక్లిష్ట కార్యక్రమాల్ని ఒకసారే ఆరంభించేవారు. అదీ ప్రపంచవ్యాప్తంగా. లక్షలాది

రూపాయల్ని దానంగా కృతజ్ఞతా పూర్వకంగా పరిగ్రహించేవారు. ఆ దానాల వల్ల ఆవిడ పని సానుకూలపడేది. అయినా "త్యాగం" చేసిన సొమ్మని మరిచిపోయేవారుకాదు, ఆ కలకత్తాకుర్రాడి త్యాగం లాగా. ఆవిడకు ఉడుతా భక్తి దానం చెయ్యాలని ఆ కుర్రాడు మూడురోజులు చక్కర తినకుండా సొమ్ము జాగ్రత్తచేసి ఆవిడకు యిచ్చేడు—ఒక్కరూపాయి! ఆవిడ ప్రధానంగా హిందూ భారతదేశంలో పనిచేశారు. అయినా మతాల మార్పిడికోసం యెన్నడూ చూడలేదు. మార్చడం దేవుని పని అనేవారు, తనదికాదు. యీ పరిస్థితిని ప్రతిఫలింపచేస్తూ ఆవిడ తన పరిసరాలతో నియమ బద్ధంగా వుండేవారు. అయితే జీసస్‌కి విధేయురాలిగా వుండేవారు. తను సేవలు చేస్తూవున్న ప్రతివాళ్ళల్లోనూ ఆవిడ ప్రభువును దర్శించేవారు.

ఆవిడ్ని గురించీ, ఆవిడ చేస్తూవున్న కృషి గురించీ వస్తూవున్న కటువైన విమర్శల గురించి ఆమధ్య ఓసారి ఆవిడ్ని అడిగేను. రాజకీయంగా మితవాదులతో సన్నిహితంగా వుండేవారని ఒక విమర్శ. తన పనికి కొన్ని అనుమానాస్పద వర్గాల నుంచి సొమ్ము స్వీకరించేరని మరో విమర్శ. ఆవిడ వెంటనే క్లుప్తంగా జవాబు చెప్పారు. "నేను యెవళ్లనీ డబ్బు అడగలేదు. దేవుడి దయమీదే నేను ఆధారపడ్డాను. నేను జీతం యేమీ తీసుకోను. ప్రభుత్వనిధులు యేమీ తీసుకోను. చర్చిసాయం తీసుకోను. యేమీకూడా. యెవళ్ళైనా నాకు డబ్బు యిస్తామని వస్తే దాతృత్వంగా పరిగణించి తీసుకోవడం నా ధర్మం. ఆ దాతృత్వం వల్ల ( దాతకు) మానసిక శాంతి లభిస్తుంది. పేదవాళ్ళకు అన్నదానం చేస్తామని వేలాది సామాన్యులు వస్తూవుంటారు. దీనికీ దానికీ తేడా యేమిటి? యెవరినీ న్యాయవిచారణ చేసే హక్కు మనకి లేదు" అన్నారు. తన దగ్గర నిధులు సుమారుగా వున్నా కలకత్తాలో ఓ హాస్పిటల్ కట్టడానికి వాటిని వినియోగించడం లేదని ఆవిడను తప్పుపడుతున్నారని చెప్పాను. తన సిస్టర్లని హాస్పిటల్‌కి కట్టిపడేస్తే దారి పక్క పడివున్న అనాథలని యెవరు చూస్తారు అన్నారావిడ. ఆవిడ జనాలని తన విశ్వాసాలకు మారుస్తోంది అంటున్నారు కదా అన్నాను. అవును, జనం మరింత మంచి హిందువులు, మంచి ముస్లిమ్‌లు, మంచి క్రైస్తవులు అయేట్టు మారుస్తున్నాను అన్నారు. ముఖ్యమైంది దేవుణ్ణి దర్శించడం. తాము కోరుకున్నట్టు ఆయన కోసం పని చెయ్యడం వాళ్ళ యిష్టం.

యీ మఠం భవిష్యత్ యేమిటి? సమ్మోహక శక్తి వున్న నాయకత్వం మరుగున పడ్డాక యిదీ వెలిసిపోతుందా? నిధులు తరిగిపోతాయా? మిషనరీస్ ఆఫ్ చారిటీ కార్యకలాపాలు తగ్గిపోతాయా? యీ ప్రశ్నలని అడిగేను. ఆఖరుసారిగా ఆవిడ పోవడానికి ముందు కొన్ని నెలలప్పుడు అడిగేను. "నిన్న గురించి నేను బెంగపడను, అది గడిచిపోయింది. రేపటి గురించీ బెంగపడను, అది యింకా రాలేదు," అన్నారు. "యిదంతా ఆయన చలవ. ఆయన సంకల్పం యెలావుంటే అలా జరుగుతుంది. మన ప్రమాణాలకి మనం బద్ధులమై వుండాలి. యిప్పుడు మా సంస్థకు యాభైయేళ్ళు, తెలుసుకదా! యింతకాలమూ ప్రపంచంలో యిలాంటి సంస్థ యిదొక్కటే. నిరుపేదలకు తమ సర్వస్వం ఫలాపేక్షలేకుండా అర్పించడమే దీని లక్ష్యం. యీ ప్రమాణానికి కట్టుబడి వున్నంతకాలం మేం మాకుగా పేదలుగా వున్నంతకాలం యీ కృషి సాగుతూనే వుంటుంది" అని ఆవిడ అన్నారు.

* * *

# అనుబంధం–I

# మదర్ థెరెసాతో సంభాషణ

ప్రశ్న: మీ జీవితం గురించి ఒక సింహావలోకనం చేసుకుంటే ఆనందంగా గడిచిందనే భావిస్తున్నారా, మదర్?

మదర్ థెరెసా: నానుంచి యెవరూ తీసివేసుకోలేని ఆనందం. యెన్నడు లేశ మాత్రంగానేనా శంక లేదు, బాధ లేదు.

ప్రశ్న: సిస్టర్లు దేశం నలుమూలల నుంచీ వచ్చిన వాళ్లేనా? వాళ్ళని కన్నవాళ్లు సంతోషిస్తున్నారా?

మదర్ థెరెసా: సిస్టర్స్ యావద్భారతం నుంచీ వచ్చినవాళ్ళే. తను కన్నబిడ్డల్ని దేవుడికి అర్పించడానికి తల్లిదండ్రులు చాలా సంతోషంగా వున్నారు. యిది చాలా గొప్ప విషయం. అదొక త్యాగం కూడా. గొప్పత్యాగం. విచారం యెంత మాత్రమూ లేదు. యిదొక త్యాగం. త్యాగం వల్ల విచారం రాదు. ముఖ్యంగా దేవునికి అర్పితమైనప్పుడు.

ప్రశ్న: కాని త్యాగం చెయ్యడం చాలా కష్టంకదా?

మదర్ థెరెసా: కాదు. దేవునికి త్యాగం చేసినప్పుడు, మరింత యెక్కువ ప్రేమ వుంటుంది. యిక్కడి అమ్మాయిలు తన సర్వశక్తుల్ని అర్పిస్తున్నారు. దేవునికి సర్వాత్మణా అర్పితం అవుతున్నారు. వాళ్ళహోదా, యిల్లు, తల్లిదండ్రులు, భవిష్యత్తు అన్నీ దేవునికి అర్పించు కుంటున్నారు, నిరుపేదలకు

ప్రశ్న: మీరు కుటుంబం నుంచి వచ్చేసి దూరంగా యింతకాలం————

మదర్ థెరెసా: యెక్కడ? వాళ్ళంతా స్వర్గానికి పోయేరు. భూమ్మీద యెవళ్లూ లేరు.

ప్రశ్న: అయినా యిన్నేళ్లుగా, త్యాగం వున్నాగానీ మానవ బంధాలు అనేవి వుంటాయి కదా?

మదర్ థెరెసా: అవును. సహజంగానే. యెవళ్లూ విడిపోరు. ముచ్చటైన దేమంటే మీరు భగవంతునికి యిస్తున్నారు. అదీ ముఖ్యం. "నువ్వు యివ్వదలచుకుంటే,

శిష్యా, శిలువను అందుకో" అంటాడు జీసస్. చాలా సులభం. యిందులో కష్టం యేమీ లేదు.

ప్రశ్న: మీ మతం పరిపూర్ణ విధేయతను కోరుతుందా?

మదర్ థెరెసా: పరిపూర్ణ విధేయత, మనఃపూర్వక సేవ, సంపూర్తి పేదరికం, వ్యక్తిపట్ల అభిన్నమైన ప్రేమ. సిస్టర్లు ప్రమాణ బద్ధులు కాబట్టి వీటి అర్థం యేమిటో తెలుసుకోవాలి. విధేయతా దీక్ష అంటే ప్రతి విషయంలోనూ భగవంతుని సంకల్పం నెరవేర్చడం. పేదరిక ప్రమాణం మా కూటమిలో చాలా నిక్కచ్చిగా వుంటుంది. పరిశుద్ధతా ప్రమాణం వల్ల మా హృదయాలు క్రీస్తుకు అంకితం అయేయి. కడపటిది, నాల్గవది, సాటిలేనిది అయిన ప్రమాణం వుంది పేదలకు త్రికరణ శుద్ధిగా ఉచిత సేవ చెయ్యడం. మేం సంపన్నుల కోసం పని చెయ్యం, మేం చేసే పనికి సొమ్ము తీసుకోం.

ప్రశ్న: సిస్టర్లు అందరూ యెంతో సంతోషంగా వుంటారు, యెలా సాధ్యం?

మదర్ థెరెసా: పేదలు తమను ప్రేమిస్తున్నారని భావించుకోవాలి. యేడుపు ముఖాలతో వాళ్ళదగ్గరకు వెళ్ళలేం. దేవుడు సంతోషంగా యిచ్చేవాళ్ళనే ఆదరిస్తాడు. సంతోషంగా యిచ్చేవాళ్ళనే ఆయన అభిమానిస్తాడు.

ప్రశ్న: యే సిస్టరేనా (చేరడం వల్ల) తప్పుచేశానని భావిస్తే యేమవుతుంది?

మదర్ థెరెసా: నిరభ్యంతరంగా వెళ్లిపోవచ్చు. ప్రమాణాలు చేశాక వెళ్లిపోవాలనుకుంటే అనుమతి పొందాలి. చాలా తక్కువ మంది వెళ్లిపోయేరు. మా సిస్టర్లలో అత్యధికులు విధేయంగానే వున్నారు. గొప్ప విషయం.

ప్రశ్న: రోజు వారీ పనుల్లో సందేహాలు వస్తే? ఉదాహరణకు పనిని యెలా యేర్పాటు చేసుకోవాలి అని వాళ్లు మీ దగ్గరకు వస్తారా?

మదర్ థెరెసా: మాది ఒక మామూలు కుటుంబం. కాదా అంటే మంది యెక్కువ. అన్నీ కలిసే చూసుకుంటాం. అదే కీలకం అనుకుంటాను.

ప్రశ్న: మహావిశ్వాసం వున్న చోట శంకలూ వుండచ్చు, ఉదాహరణకు ఓ పని చెయ్యడంలో.

మదర్ థెరెసా: యెవళ్లకోసం పనిచేస్తున్నాం అన్నదానిమీద అది ఆధారపడి వుంటుంది. తన బిడ్డను సాకేటప్పుడు తల్లికి శంకలు రావు, ప్రేమిస్తుంది గనక. ప్రేమ ఆవిడ జీవితాన్నే మార్చివేస్తుంది. అదే మా విషయంలోనూ జరుగుతుంది. నిజంగా క్రీస్తును ప్రేమిస్తే సందేహం అనేదే రాదు. యింకా బాగా చెయ్యాలి అన్న తపన రావచ్చు. సందేహం రాదు. దాన్ని శంక అనను శంక కలతపరుస్తుంది.

ప్రశ్న: మనలో చాలామందికి శంకలు వుంటాయి, మనం చేసేది సరైనదేనా అని.

మదర్ థెరెసా: కాదు, అది సందేహం కాదు. మీరు బిడ్డకు మంచి చెయ్యాలనే అనుకుంటారు. యింకా మంచిదాన్ని చెయ్యాలనుకుంటారు. శంక స్వేచ్ఛను హరింపచేస్తుంది.

ప్రశ్న: శారీరకంగా అవయవాలు లేకుండా, కుష్ఠుతో బాధపడుతూ, పురుగులు పట్టివున్నవాళ్ళని తాకాలంటే శంక రాదా?

**మదర్ థెరెసా:** అది భయం. శంకకాదు.

ప్రశ్న: దాన్ని జయించడం యెలా?

**మదర్ థెరెసా:** ప్రార్థనతో. కాని మీకు నిజంగా ఆ వ్యక్తిపట్ల ప్రేమ వుంటే మీరు ఆ మనిషిని స్వీకరిస్తారు. అది ప్రేమతో దయతో వుంటుంది. భగవంతుని సజీవ ఆచరణలో ప్రేమించడం అవుతుంది. ప్రేమ మనతోనే మొదలవుతుంది. మన మతగ్రంథాల్లో స్పష్టంగానేవుందీ విషయం. "మన సోదరులలో అట్టడుగున వున్నవాళ్లకు మీరు చేసేదంతా నాకు చేస్తున్నట్టే" అన్నాడు క్రీస్తు. నాపేరు మీద ఓ గ్లాసు నీళ్లు యిస్తే నాకు యిచ్చినట్టే. నాకు ఆకలిగా వుంది. వొంటి మీద బట్టలు లేవు. ఒంటరిగా వున్నాను. విశ్వాసం దేవుని వరం. ప్రార్థన ద్వారా అది వస్తుంది. మౌన ఫలం ప్రార్థన, ప్రార్థన ఫలం విశ్వాసం, విశ్వాస ఫలం ప్రేమ, ప్రేమ ఫలం సేవ, సేవ ఫలం శాంతి. అంచేత మొత్తం సంబంధంతో వున్నవే.

ప్రశ్న: మీకు యింత శక్తి యెక్కడినుంచి వస్తుంది?

**మదర్ థెరెసా:** నన్ను యిలా వుంచేది సామూహిక ఆరాధన అనే ఆధ్యాత్మిక ఆహారం. అదిలేకుండా ఒక్కరోజు, గంటకూడా బతకలేను. యూకారిస్టులో క్రీస్తును రొట్టెరూపంలో దర్శిస్తాను. మురికి వాడల్లో క్రీస్తు నాకు పేదల రూపంలో కనిపిస్తాడు. శిథిలమైన శరీరాలలో, పిల్లల్లో, మరణించేవాళ్ళల్లో. అంచేతనే యీ పని సాధ్యమవుతుంది.

ప్రశ్న: మిమ్మల్ని ఓ ప్రశ్న అడగాలనుకుంటున్నాను. మీతో కలిసి యేదో ఉడతాభక్తిగా పనిచేశానని తెలిసినవాళ్ళు నన్ను అడుగుతూవుంటారీ ప్రశ్నను. మీరు శాంతి కోసం నిలబడతారు అనీ, మీరు ఒప్పుకోకపోయినా ఒప్పుకున్నా ప్రపంచంలో మహాశక్తి సంపన్నురాలైన మహిళ అని మిమ్మల్ని భావిస్తారు.

**మదర్ థెరెసా:** (అడ్డువస్తూ) అలా భావిస్తారా? అలా అయివుంటే బాగుండును. ప్రపంచమంతా శాంతిని స్థాపిస్తాను. (నవ్వుతూ)

ప్రశ్న: మీరు యిలా టెలిఫోన్‌లో ఓ ప్రెసిడెంట్‌తోనో, ప్రధానమంత్రితోనో మాట్లాడగలరు, శాంతి కోసం మీరు పాటుపడుతున్నారు కనక.

**మదర్ థెరెసా:** క్రీస్తుపేరు మీద. ఆయనలేకుండా యేమీ చెయ్యలేను.

ప్రశ్న: మీరు శాంతికోసం ప్రయత్నిస్తూవుంటారు గనక యుద్ధం తగ్గించడానికి మీరేమీ చెయ్యలేరా అంటారు వాళ్ళు.

**మదర్ థెరెసా:** మీరు శాంతికోసం కృషి చేస్తూవుంటే ఆ శాంతే యుద్ధాన్ని తగ్గిస్తుంది. అయితే నేను రాజకీయాల్లో తల దూర్చను. రాజకీయాల ఫలితమే యుద్ధం. అందుకని రాజకీయాల్లో కలిగించుకోను – అంతే. రాజకీయాల్లో దూరేనూ అంటే నేను ప్రేమించడం మానుకుంటాను. నేను యెవళ్లో ఒకళ్ల పక్షాన్నే వుండాలి, అందరి పక్షాన్నా కాదు. అదే తేడా.

ప్రశ్న: అల్లర్లు జరిగే తావులకు వెడుతూవుంటారు కదా, మీకు భయం వెయ్యదా?

మదర్ థెరెసా: భయం దేనికి?

ప్రశ్న: భయం దేనికి అంటే...(అనుమానం)

మదర్ థెరెసా: భగవంతుని దగ్గరకు వెడుతున్నామన్న భయమా? (నవ్వు)

ప్రశ్న: మీ సిస్టర్లకు యేమవుతుందోనన్న భయం.

మదర్ థెరెసా: అబ్బే, లేదు. మా జీవితాల్ని దేవునికి అర్పించేం. (ఆగేరు) ఓ సారి మేం ఆహారం తీసుకుని సూడాన్ వెడుతున్నాం. దక్షిణ సూడాన్. మా సిస్టర్లు ఉత్తర సూడాన్‌లో వున్నారు. కాల్పులు జరిగే ప్రమాదం వుంది. ప్రభుత్వం మమ్మల్ని వెళ్లద్దంది. అయిదుగురం సంతకాలు (పత్రం మీద) చేశాం. మేం వెళ్ళడానికి తయారుగా వున్నామని, విమానాన్ని కూల్చివేస్తే చనిపోవడానికీ తయారై వున్నాం అని రాశేం. ఆ మర్నాడు మేం బయల్దేరబోతున్నాం (తిరుగుబాటుదార్లు) అన్నారు. "మేం విమానాన్ని కూల్చివేస్తాం." పైలట్ వెళ్ళడం కుదరదన్నాడు. లేకపోతే ఖాయంగా వెళ్లివుండేవాళ్ళం.

ప్రశ్న: మొదటి రోజుల్లో మీకు ఆటంకాలు యెదురవలేదా? తితాఘర్‌లో మీరు కుష్ఠుకేంద్రం స్థాపించాలనుకున్నప్పుడు స్థానికులు అడ్డుకున్నారట కదా, ప్రజలకు కుష్ఠు అంటే అసహ్యం కదా?

మదర్ థెరెసా: చూశాక వాళ్లకి బోధపడింది. యిక్కడేకాదు, భారతదేశం బయటా ప్రతిఘటనలు వుంటూ వుంటాయి. కాని మేం చేస్తూవున్నపని చూశేక అర్థం చేసుకుంటారు. ప్రజలకి పేదలతో సంబంధాలు యేర్పడినప్పుడే బోధపడుతుంది వాళ్లు యెంత బాగుంటారోనని.

ప్రశ్న: యిన్ని దేశాల్లో యిన్ని శాఖలు స్థాపించడంవల్ల పలచబడిపోవడం లేదంటారా?

మదర్ థెరెసా: మేం మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వాళ్లం. మిషనరీ అంటే నాలుగుచోట్లకీ వెళ్లి సువార్తని వ్యాపింపచేసేవాడు అని. అంచేత యేం తేడా రాదు. యివాళ ఇండియాలో, రేపు యూరప్‌లో, యెక్కడేనా దైవవాణి పిలుస్తోంది నిన్ను. ఈశ్వరుని ప్రేమ వాహికగానే మిషనరీ వుంటాడు. అందుకనే మేం మిషనరీ ఆఫ్ ఛారిటీ అయేం. ఉభయం. యెవరో నాతో అన్నట్టు, "అన్నీయిచ్చి పేదల్ని పాడుచేస్తున్నారు మీరు" అని. "భగవంతుని కంటే యెక్కువగా యెవరూ మనల్ని పాడు చెయ్యలేదు" అని చెప్పాను. యేమంటే ఆయనే యిస్తున్నాడు కూడా. మరో కాయన అన్నాడు,"తిండానికి చేపలు పెడుతున్నారు వాళ్లకి. దానికి బదులుగా చేపని పట్టుకోవడానికి గాలం యివ్వండి" అని. అప్పుడు నేను అన్నాను, "వాళ్లని చేరదీసేటప్పుడు వాళ్ళు గట్టిగా రెండు కాళ్లమీద నిలబడలేని స్థితిలో వుంటారు. జబ్బుగానో ఆకలితోనో వుంటారు. అందుకని చేరదీస్తాను. ఒకసారి బాగుపడ్డాక, మళ్లీ నా దగ్గరకు రారు. వాళ్ళంతట వాళ్లే గడుపు కుంటారు."

ప్రశ్న: బాధపడే సహకార్యకర్తలు విషయయేమిటి?

మదర్ థెరెసా: అవును, బాధలు పడే సహకార్యకర్తలు రోగులు, మా సిస్టర్లలో

ఒకళ్ళని దత్తు తీసుకుంటారు. మీకు జబ్బుచేసిందనుకోండి, నేను మీకోసం అనుకోండి, మీ బాధని, వేదనను నాకోసం భరిస్తున్నా రన్న మాట, దాన్ని దేవుని కిస్తున్నారన్న మాట నాకోసం. నేను చేస్తూవున్న పనికి. నేను పనినీ, దేవునిపట్ల నా ప్రేమనీ అర్పిస్తాను. నేను మీకు సాయం చేస్తున్నాను. మీరు నాకు సాయం చేస్తున్నారు. మనం ఒకళ్ల కొకళ్లు ప్రతిబింబాలవుతాం. అదొక అద్భుతమైన కానుక. మీరు పని చెయ్యలేరు కాబట్టి నేను చేస్తాను, మీరు బాధపడతారు. నాకు ఒకావిడవుంది అలా, ఆవిడకు యెన్నో ఆపరేషన్లు జరిగేయి. ప్రతి ఆపరేషన్‌నీ నాకు అర్పిస్తుంది. నేను ఆవిడ తరఫున పనులు జరిపిస్తూ వుంటాను. ఆవిడ దుర్భరమైన బాధ అనుభవిస్తోంది కాని ప్రతిదీ నాకు అర్పిస్తుంది. యిద్దరం కలిసే అన్నిటినీ పంచుకోవాలని. మా యిద్దరిమధ్యా అవగాహన. అదే ఒక బంధం. బాధ పడుతూ ఆవిడ, ప్రార్థనలు చేస్తూ నేను. బాగుందికదూ? ప్రతి సిస్టర్‌కీ తమ కోసం ప్రార్థన చేసే రోగి వున్నాడు.

**ప్రశ్న:** అంటే మీకు అదనంగా శక్తి వస్తుంది, దాన్ని పనికి వినియోగిస్తారు అన్నమాట?

**మదర్ థెరెసా:** అవునవును. మా ప్రార్థనలవల్ల వాళ్లకీ అదనంగా శక్తి వస్తుంది. మేం చేసే పని వల్ల, త్యాగాల వల్ల. బాగుంది.

**ప్రశ్న:** మిగతా సహకార్యకర్తల సంగతి?

**మదర్ థెరెసా:** మాకు ప్రపంచవ్యాప్తంగా 4,00,000 మంది సహకార్యకర్తలు వున్నారు. సిస్టర్లతో కలిసి పనిచేస్తారు. పేదల్ని, ఒంటరివాళ్లనీ కలుసుకునే అవకాశం వస్తోంది వాళ్ళకు. ఒంటరితనం భౌతిక దారిద్ర్యం కంటే యెక్కువ దుర్భరం. అన్నిరకాల మత విశ్వాసాలవాళ్లూ నా దగ్గరకు వస్తారు. యేదన్నా దానం యివ్వడానికి మాత్రమే కాదు, చెయ్యిఆసరా వుండడానికి. మాకు డాక్టర్లు వున్నారు. వైద్యసహకార్యకర్తలు వున్నారు. వాళ్లు డిస్పెన్సరీలకు వచ్చి రోగుల సంరక్షణ చూసుకుంటారు. మన సహ కార్యకర్తలు పడుచువాళ్ళల్లో పేదల పట్ల ప్రేమ చూపిస్తారు. పరిశుద్ధతను ప్రేమిస్తారు, ప్రార్థనను ప్రేమిస్తారు. వాళ్ళు యువకుల్తో పంచుకుంటారు. యువకులు సాహసపూరిత కార్యాలు చేస్తారు. కొన్ని సందర్భాల్లో వాళ్ళు పక్కదారి పడతారు. చాలా మంది దేవుని కోసం ఆర్తితో వున్నారు. ప్రపంచంనలుమూలలా వున్న వలంటీర్లని చూడండి. రెండు మూడు నెలలు యిక్కడ సేవ చెయ్యడానికి వస్తారు. సంవత్సరం అంతా డబ్బు సంపాదించడానికి పని చేస్తారు. యేమంటే మేం వాళ్లకు యేమీ యివ్వంకదా. వాళ్లే అన్ని ఖర్చులూ భరించుకోవాలి.

**ప్రశ్న:** కాళీఘాట్ ఒకటి నాకు చిత్రంగా కనిపిస్తూవుంది. అక్కడ చాలామంది వున్నారు కదా, వంద మందికి పైబడే వుండవచ్చు. కొంతమంది మృత్యువు గుమ్మంలో వుంటారు. కాని యెవళ్ళకీ మృత్యువు అంటే భయం వున్నట్టులేదే?

**మదర్ థెరెసా:** అక్కడ మీకు దేవుని సాన్నిధ్యం వుంటుంది. వాళ్ళకి ప్రేమ అందుతోందన్న భావం కలుగుతుంది. "నేను వీథిలో కుక్కలాగా బతికేను, దేవదూతగా తనువు చాలిస్తున్నాను" అని ఒకతను అన్నాడు. ఆదరాభిమానాలతో

అన్నాడు. తృప్తిగా తనువు చాలిస్తారు. యిరవైమూడు వేలమంది అక్కడ చనిపోయేరు.

ప్రశ్న: వాళ్ల పరమ శత్రువు యేది? తిరస్కృతా?

మదర్ థెరెసా: పేదరికం. వాళ్ల దగ్గర యేమీలేదు. యెవరూ లేరు. బజారు బతుకులు. మేం రోగుల్ని, దిక్కులేనివాళ్లనీ కాక మరెవళ్లనీ తీసుకోం. గృహసంబంధి అయిన వారిని చేర్చుకోం. ప్రేమ్ దాన్ మురికి వాడల కేసులు కొన్ని వుండచ్చేమోకాని, కాళీఘాట్‌లో ఒక్క కేసు కూడా అలాంటిది వుండదు. ప్రేమ్ దాన్ చూశేరా? ఒక్కసారైనా చూడండి.

ప్రశ్న: అవమానం అనేదే అన్నిటికంటే మనిషి యెదుర్కొనే పెద్దభయం అని ఓసారి మీరు అన్నట్టు గుర్తు?

మదర్ థెరెసా: భగవంతునితో యేకం కావడానికి కచ్చితమైన దారి అవమానాన్ని భరించడం.

ప్రశ్న: మీరెప్పుడైనా భరించారా?

మదర్ థెరెసా: ఒక్కసారా? అమ్మో, బోలెడుసార్లు. యీ ప్రచార పటాటోపం అవమానం కాదా?

ప్రశ్న: యిది అవమానమా? లేకపోతే పేదలకు మీరు చేస్తూవున్న సేవకు బదులా?

మదర్ థెరెసా: అవమానమే. యేమంటే మాకుగా మేము యేమీ చెయ్యలేదు. దేవుడు చేసిన దాన్ని చూడండి. ఆ భావాన్ని ఆసరా చేసుకుని దేవుడు ఆయన మహత్యాన్ని చూపించదలచుకున్నాడు.

ప్రశ్న: అయితే మీరు అందుకున్న యీ అవార్డులు? నోబెల్ బహుమతితో సహా.

మదర్ థెరెసా: అవెన్నో కూడా నాకు గుర్తులేదు. వాటిదేముంది? నోబెల్ బహుమతి అంటారా, నేను చెప్పనే చెప్పాను. భగవంతుని స్తుతికోసం మీరు యిస్తేనే దాన్ని గ్రహిస్తాను అని. నేను అవార్డుల్ని నా పేరుమీద తీసుకోను. నేనెవత్తెని?

ప్రశ్న: నోబెల్ బహుమతీ ప్రదానం జరిగినప్పుడు సంప్రదాయానుసారం యిచ్చే విందును మీరు వద్దన్నారు కదా?

మదర్ థెరెసా: వద్దన్నాను. వాళ్లు దానిబదులు ఆ డబ్బు నాకు యిచ్చేరు. ఆ డబ్బుతో క్రిస్టమస్ రోజున రెండువేలమందికి భోజనాలు పెట్టగలిగేం. అది యింకా బాగుందికదా? ఢిల్లీలో నాకు సన్మానం చేశారు. భోజనాలు యేర్పాటు చేశారు. నిర్మల్ హృదయ్‌కి వాళ్ళందర్నీ పంపించేను. అక్కడి వాళ్లకు భోజనం పెట్టారు. మంత్రులు, పెద్దవాళ్ళు అందరూ వెళ్లి మా వాళ్లకు భోజనాలు పెట్టారు.

ప్రశ్న: కుష్ఠు రోగుల్నే యెక్కువగా దూరం వుంచుతారా, వాళ్ళే యెక్కువ నిరాదరణకు గురవుతారా?

మదర్ థెరెసా: యిప్పుడు కాదు. మందులున్నాయిగా. అదనులో వస్తే నయం చెయ్యగలం. యెవళ్ళకీ అక్కర్లేని వాళ్ళం అన్న భావనే భయంకరమైన వ్యాధి. దీనికి మందు ఆత్మీయంగా ఆదరించడం.

ప్రశ్న: వాళ్లు మళ్లీ సమాజంలో కలుస్తున్నారా?

**మదర్ థెరెసా:** ఆ, ఆ. సరైన వ్యవధిలో వస్తే. వాళ్ళకు పునరావాసం కల్పించడానికి మాకు అన్ని చోట్లా కేంద్రాలున్నాయి. భారతదేశంలోనూ కొన్ని వున్నాయి. ఢిల్లీ, లక్నో, రాంచి, అసన్‌సోల్, కలకత్తా, యింకా చాలా చోట్ల. ప్రభుత్వం చాలా విస్తీర్ణంవున్న భూముల్ని యిచ్చింది. వాళ్లే వాళ్ళ యిళ్లు కట్టుకుంటూ వుంటారు. చాలా దేశాల్లో ప్రజలు భూమినో, యింటినో యిస్తారు. మాటకు, నికారుగ్వాలో యిల్లు యిచ్చేరు. బుడాపెస్ట్‌లోనూనూ.

ప్రశ్న: మీరు కలకత్తాలో యెన్నో యేళ్లుగా పనిచేస్తున్నారు. మీ పని వల్ల ప్రజల దృక్పథాల్లో మార్పు యేమన్నా వచ్చిందా?

మదర్ థెరెసా: ప్రజలు ఒకళ్ళనొకళ్లు అభిమానించు కోవడం వచ్చింది. అదేకదా ముఖ్యం?

ప్రశ్న: మీరు మీ కార్యకలాపాలు మొదలుపెట్టినప్పటికంటే యిప్పుడు దిక్కులేని వాళ్ళ సంఖ్య తగ్గిందంటారా?

మదర్ థెరెసా: యేమో తెలీదు. (నవ్వు) చెప్పలేను. మాదగ్గర చనిపోయేవాళ్లు ప్రశాంతంగా చనిపోతున్నారు. నాకైతే అది చాలా గొప్ప అనిపిస్తోంది. ప్రశాంతంగా చనిపోవడం గౌరవంగా, అమృతత్వానికి.

ప్రశ్న: ఓ కష్టమైన ప్రశ్న. మీరో భారీ సముదాయం తయారు చేశారు. అది మీకు సంబంధించిందే.

మదర్ థెరెసా: (అడ్డువస్తూ) యెలా? మొత్తం సమాజానికి సంబంధించింది, మొత్తం కూటమికి సంబందించింది.

ప్రశ్న: అవుననుకోండి. కాని మీరు కదా వ్యవస్థాపకులు? అంచేత మీరంటేనే మిషనరీస్ ఆఫ్ ఛారిటీ.

మదర్ థెరెసా: అదిసరే. కాని కలిసి మాత్రమే, సిస్టర్లతో కలిసి.

ప్రశ్న: మీరు అగ్రస్థానంలో పరిపాలనా హెడ్‌గా?

మదర్ థెరెసా: కావచ్చు. అలానే వుంటుంది. మీ కుటుంబంలో మీకులాగా. గుర్తింపు యివ్వవలసింది అలాగ. లేకపోతే గజిబిజిగా వుంటుంది.

ప్రశ్న: అయితే మదర్, మీ తదనంతరం...

మదర్ థెరెసా: ముందు నన్ను పోనివ్వండి. (నవ్వు) దేవుడు నన్ను చూసినట్టే మరొకళ్లనీ చూస్తాడు. యిది దేవుని పని. ఆయనే చూసుకుంటాడు.

ప్రశ్న: మదర్, యెందుకలా అస్తమానూ పైకి కిందికీ మెట్లు యెక్కిదిగుతూవుంటారు? (ఆవిడకు గుండె జబ్బు వుంది) డాక్టర్లు వద్దన్నారు కదా?

మదర్ థెరెసా: (నవ్వుతూ) ఆ విషయం గురించి ఆలోచించే వ్యవధే లేదు.

ప్రశ్న: పత్రికల్లో మీ బొమ్మ ఒకటి చూశాను. వాషింగ్టన్‌లో వైట్‌హౌస్‌ను మీకు చూపిస్తున్నారు. మీరు ముగ్ధులైనట్టు వుంది.

మదర్ థెరెసా: యెంత ఖాళీ వుంది అనుకుంటూ వున్నాను. పేదవాళ్ళందర్నీ తీసుకు వెళ్లి అక్కడ చేర్పిద్దా మనిపించింది అం, ఆ భవనం నింపెయ్యాలి. (నవ్వు)

ప్రశ్న: యింత పని ఒత్తిడిలో కూడా మీ హాస్యచాతుర్యం పోలేదే?

మదర్ థెరెసా: ఆ పని యెంత శోభాయమానంగా వుంటుందో తెలుసా? మేం విచారంగా వుండడానికి కారణం లేదు. మే మీ పనిని జీసస్‌తో, జీసస్ కోసం చేస్తున్నాం. ప్రపంచ హృదయంలో మేం సన్యాసులం. మీరు మీతోటి వాళ్ళకు యే పిసరు పని చేసిపెట్టినా అది నాకు చేసినట్టే అని జీసస్ అన్నాడు. ఒక చిన్నపిల్లవాడ్ని నా పేరు మీద తీసుకుంటే, నన్ను తీసుకున్నట్టే. అందుకనే యీ పుట్టవలసిన శిశువులందర్నీ నేను తీసుకుంటాను. భగవంతుని ప్రతిరూపమే ప్రతి శిశువులోనూ వుంది. శిశువు అవకరంగా వున్నా, అందంగా వున్నా వికారంగా వున్నా. భగవంతుని సౌందర్యరూపమే సృష్టిలో అన్నిటిలోనూ. ప్రేమించడం, ప్రేమను పొందడం. అందుకనే మనందరం దేవుని కానుకను కాపాడుకోవాలి. యేమంటే అది అందమైంది. ప్రేమకు నోచుకోక, యెవరికీ అక్కర్లేక, పుట్టేటప్పటికే యెవరి ఆదరణకూ నోచుకోక ఓ పసిగుడ్డు వుండడం యెంత దారుణం! యెవళ్ళకీ అక్కర్లేక పోవడం, యెవరి ప్రేమా దక్కక పోవడం, ఒంటరిగా మిగిలిపోవడం, సమాజ తిరస్కృతంగా వుండడం – యివాళ యిదే పెద్దజబ్బు.

ప్రశ్న: మదర్! మీరోసారి నాకో సంఘటన గురించి చెప్పారు, అన్నం పంచి యిచ్చిన స్త్రీగురించి–

మదర్ థెరెసా: అవును, గుర్తువుంది. ఆమె యివ్వడం నాకు ఆశ్చర్యం కలిగించలేదు. పేద ప్రజలు ఒకళ్లనొకళ్లు పంచుకుంటూ వుంటారు. తన పొరుగు వాళ్ళు ఆకలితో వున్నారని ఆమె తెలుసుకో గలగడం చిత్రం. మనుషులు గోప్యంగా వుంచుకుంటారు. ముఖ్యం బాగా ఒకప్పుడు బతికిన వాళ్ళు. యిక్కడికి ఓసారి వచ్చిన మనిషిలాగా. ముందు బాగా బతికినవాడే. చితికిపోయేడు. ఓ రోజున యిక్కడికి వచ్చేడు. "అక్కడ పెట్టే భోజనం తినలేక పోతున్నాను, మదర్" అన్నాడు. "నేను తింటున్నానుగా" అన్నాను. అతను నాకేసి చూసి ఆశ్చర్యంగా, "మీరు యిక్కడ భోజనమే తింటున్నారా?" అన్నాడు. "అయితే నేనూ తింటాను," అన్నాడు. నేను తినడం అతనికి ధైర్యాన్నిచ్చింది. ఆ పరిస్థితిని అంగీకరించడు. నేనా మాట అనక పోయి నట్టయితే, మాతో లోపలే వుంటూ గొణుక్కుంటూ మూలుగుతూ వుండేవాడు. దేన్నీ తీసుకుని వుండేవాడు కాదు. నేను తనతో వున్నాననుకుంటే ప్రోత్సాహం వచ్చింది– – –

ప్రశ్న: పేదరికం మీకు శక్తిగా వుంటుందా?

**మదర్ థెరెసా:** మేం దేన్నీ అంగీకరించం. చర్చిపోషణనుగాని, జీతాన్నిగాని, దేన్నీ మేం చేసేపనికి తీసుకోం. ప్రపంచమంతా యింతే. మిషనరీ ఆఫ్ ఛారిటిలోవున్న ప్రతి ఒక్కరూ పేదల్లో నిరుపేదలు. అందుకనే మేం యేదన్నా చెయ్యగలం. పేదలకి యిచ్చేది యేది అయినా మాకు ఒకటే. వాళ్లు వేసుకునే బట్టల్లాంటివే మేమూ వేసుకుంటాం. అయితే మాది కోరుకున్నటువంటిది. ఆ రకంగానే కోరుకుంటాం. పేదలని అర్థం చేసుకోవాలీ అంటే పేదరికం అంటే యేమిటో తెలుసుకోవాలి. లేకపోతే మనం చేరే భాష మాట్లాడతాం కదా? బిడ్డపట్ల ఆందోళనగావుండే ఆ తల్లిని చేరుకోలేం. మేం ఈశ్వరుని మీదే అంతా ఆధారపడతాం. మేం చెట్లలాంటివాళ్ళం, పువ్వులలాంటివాళ్ళం. కాని మేం ఆయనకు పువ్వులకన్నా, గడ్డికన్నా మరింత ముఖ్యం. ఆయనే వాటి గురించి చూసుకుంటాడు. మా గురించి మరింత యెక్కువ చూసుకుంటాడు. అదే కూటమిలో సొగసైన భాగం.

ప్రశ్న: మీకు విచారం కలిగించేది యేది?

**మదర్ థెరెసా:** ప్రజలు బాధలు పడుతూవుండడం. అదే నాకు విచారం. భౌతికమైన బాధ.

ప్రశ్న: మీరు సాధించిన విజయాలని యెలా పరిగణిస్తారు?

**మదర్ థెరెసా:** దానికి జవాబు లేదు. దేవుని సృష్టిని మనం పాడు చెయ్యకూడదు. మేం ఖ్యాతికోసం, డబ్బుకోసం పని చెయ్యడం లేదు. సిస్టర్లు పవిత్రులు. యిది పవిత్రప్రేమ. యిదంతా జీసస్ కోసమే. దేవునికోసం మేం పని చేస్తాం. అచ్చా, మరింక నేను వెళ్ళాలి.

* * *

# అనుబంధం–II

## 1991 లో జార్జి బుష్, సద్దాం హుసేన్‌లకు మదర్ థెరెసా రాసిన లేఖ

54 ఎ, జె. సి. బోస్ రోడ్,
కలకత్తా–16.

2 జనవరి, 1991.

ప్రియమైన అధ్యక్షులు జార్జి బుష్, అధ్యక్షులు సద్దాం హుసేన్,

ఈశ్వరుని పట్ల నా హృదయంలో వున్న ప్రేమతో, కన్నీళ్ళతో మీ దగ్గరకు వస్తున్నాను. పేదల తరఫున, మనందరం భయపడి భీతిల్లే యుద్ధం సంభవిస్తే పేదలు అయేవారి తరఫునా అభ్యర్థనతో వస్తున్నాను. భగవంతుని కృపాభరిత శాంతికోసం కృషి చెయ్యమని మనఃపూర్వకంగా అర్థిస్తున్నాను. ఒకళ్ళతో ఒకళ్లు రాజీపడమని వేడుకుంటున్నాను.

మీ మీ వాదనలు మీకు వున్నాయి. మీరు పట్టించుకోవాల్సిన ప్రజలు వున్నారు. కాని మనకు శాంతి ఉపదేశించడానికి వచ్చిన ఆ ఒక్కరి మాటా వినమంటున్నాను. భగవంతుని ఉనికిని, మూర్తిని విధ్వంసం చేసే శక్తి, అధికారం మీకు వున్నాయి. ఆయన పురుషులు, ఆయన స్త్రీలు, ఆయన పిల్లలు ఆ మూర్తి. దేవుని సంకల్పం యేమిటో వినండి. దేవుడు మనల్ని సృష్టించింది ఆయన ప్రేమను అనుభవించడానికేగాని మన విద్వేషం వల్ల వినాశనం పొందడానికి కాదు.

యీ యుద్ధంలో తక్షణ ఫలితంగా విజేతలు, పరాజితులు వుండచ్చు. మనం అందరం భయపడే యీ యుద్ధంలో. కాని మీ ఆయుధాల వల్ల కలిగే బాధ, దుఃఖం, ప్రాణ నష్టం యేవిధంగానూ సమర్థనీయం కావు. భగవంతుని పేరు మీద మీ దగ్గరకు వస్తున్నాను. మన అందరం ప్రేమించి, ఉమ్మడిగా భావించే దేవుని పేరుమీద. అమాయక జీవుల కోసం, ప్రపంచ పేదలకోసం, యుద్ధం వల్ల పేదలు అయే వారికోసం మిమ్మల్ని అర్థిస్తున్నాను. వాళ్లే అమితంగా బాధపడేవాళ్లు, యేమంటే, తప్పించుకునే దారి వాళ్ళకు లేదు. వాళ్ల తరఫున పాదాక్రాంతమై అర్థిస్తున్నాను. వాళ్లే బాధపడతారు. వాళ్ళు బాధ పడినప్పుడు మనందరం దోషులవుతాం, యేమంటే – వాళ్ళని కాపాడానికి, ప్రేమించడానికి మన

శక్తి యుక్తులు వేటినీ మనం వినియోగించుకోలేదు కాబట్టి. తల్లిదండ్రులు, భర్తలు, తోబుట్టువులు, పిల్లలు చనిపోవడం వల్ల అనాథలు అయేవాళ్ల తరఫున, వితంతువులు అయేవాళ్ల తరఫున, ఒంటరులయే వాళ్ళ తరఫున మిమ్మల్ని అర్థిస్తున్నాను. వాళ్ళని కాపాడండి అని వేడుకుంటున్నాను. శారీరక అవకరంతో, వికారులయే వాళ్ళ తరఫున అర్థిస్తున్నాను. వాళ్ళంతా దేవుని పిల్లలు. యిల్లూ వాకిలీ, తిండీ, గుడ్డా, తోడూ ప్రేమా పోగొట్టుకునే వాళ్ళ తరఫున మిమ్మల్ని అర్థిస్తున్నాను. వాళ్లు మీ పిల్లలే అని భావించిన విలువైన కానుక, జీవితం, తరఫున అర్థిస్తున్నాను. అది వాళ్లు కోల్పోతారు. మన అక్కచెల్లెళ్ళని, అన్నదమ్ముల్ని మీ వాళ్ళని, మా వాళ్ళని కాపాడమని కోరుతున్నాను. యేమంటే, ప్రేమించి ఆదరించమని దేవుడు వాళ్ళని మనకి యిచ్చేడు. దేవుడు మనకి యిచ్చినదాన్ని విధ్వంసం చెయ్యడం మనకు తగదు. మీ మనసూ, సంకల్పం ఈశ్వరుని మనసూ, సంకల్పం అయేటట్టు చూడండి దయచేసి, దయచేసి. ప్రపంచంలో యుద్ధాన్ని గాని, శాంతిని గాని తీసుకువచ్చే అధికారం మీకు వుంది. **దయచేసి శాంతి మార్గం ఎన్నుకోండి.**

మా సిస్టర్లు, నేను, మా పేదలు మీకోసం యెంతగానో ప్రార్థిస్తున్నాం. భగవంతుని పట్ల ప్రేమతో మీ హృదయద్వారాలు మీరు తెరుస్తారని యావత్ ప్రపంచం ప్రార్థిస్తోంది. మీరు యుద్ధం నెగ్గచ్చు. కాని శిథిలమైన, అవిటివాళ్లై, నష్టపోయిన ప్రజల విలువ యెంతటిది?

మీకు, మీ ప్రేమకు, దేవుని పట్ల మీ ప్రేమకు, మీతోటి వాళ్ళకు అభ్యర్థన చేస్తున్నాను. భగవంతుని కోసం, పేదలయే వాళ్ళ తరఫున జీవితానీ శాంతినీ నాశనం చెయ్యవద్దని కోరుతున్నాను. ప్రేమ, శాంతి జయించేటట్టు చూడండి. మీరు చేసిన మంచి పనికి మిమ్మల్ని గుర్తుంచు కునేటట్టు చెయ్యండి. మీరు విస్తరింప చేసిన సంతోషానికి, మీరు కలిసి అనుభవించే ప్రేమకుగాను మిమ్మల్ని గుర్తుంచు కొనేటట్టు చెయ్యండి.

నాకోసం, మా సిస్టర్ల కోసం ప్రార్థించండి. యేమంటే, మేం పేదల్ని ప్రేమించి వాళ్ళకు సేవ చెయ్యాలనుకుంటున్నాం. వాళ్ళంతా దేవుని సంతానం. ఆయన దృష్టిలో ప్రేమకు నోచుకున్నవాళ్లు. మేమందరం, పేదలం మిమ్మల్ని అర్థిస్తున్నాం. భగవంతుడు యెంతో ప్రేమగా మీ సంరక్షణకు అప్పగించినదాన్ని మీరు ప్రేమించి, కాపాడతారని మేం ప్రార్థిస్తున్నాం.

సర్వదా మిమ్మల్ని దేవుడు ఆశీర్వదించుగాక!